శ్రీ ఫిరోజి ఋషి గ్రంథావళిని దమకంపెనిపేరఁ బ్రకటించుటకు సమ్మతించి మా ప్రయత్నమునకుఁ దోడ్పడిన గుంటూరు, వేంకటేశ్వర అండ్ కో., వారికిని; తప్పులు లేకుండఁ జక్కఁగా ముద్రించి సకాలమునకు గ్రంథముల నందిచ్చిన గుంటూరు చంద్రికాముద్రాక్షరశాలాధికారులకును, నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

శ్రీ ఫిరోజిఋషీంద్రులవారి యనంతకృపాబల మెల్లరకు సమకూఱుఁ గాక! శుభములఁ గూర్చుఁగాక!!

సత్తెనపల్లి,<br>
తారణ: మాఘము,<br>
16-1-1945.

విధేయుఁడు,<br>
పులహరి ఫిరోజిబాబు,<br>
శ్రీఫిరోజిమతాధిపతి.



పుట్టితివి ల్లగుభారత - భూమియందు
సిరులు నిండినగుంటూరు - సీమలోని
సత్యభామాపురంబున - జనన మంది
మహిమఁ గన్నావు ఫీరోజి - మౌనిచంద్ర!

తల్లిగర్భంబులో - తనువు దాల్చిననాఁడె
సకలార్థసారంబు - చదివినావు
పురటింట సావిక - బొడ్డు గోసిననాఁడె
కోర్కెల మొదలంటఁ - గోసినావు
కలినీటి చిలుకుతోఁ - గన్ను విచ్చిననాఁడె
జగము కల్లఁగఁ జూచి - చాటినావు
పాలిచ్చి చిచికొట్టి - జోలపాడిననాఁడె
నిర్వికల్పసమాధి - నెగడినావు

ముందువెనుకలసంగతి - మొదలెఱింగి
చిఱుతకూకటినాఁడె భా - షించినావు
నిన్నుఁ గీర్తింప మఱి మాకు - నేర్పు గలదె?
తెనుఁగుయోగీంద్ర! ఫీరోజి - దేశికేంద్ర!

ఇల్లు వాకిలి గల్గి - యిల్లాలితో నుండి
యింద్రియంబుల నిగ్ర - హించినావు
లోకు లందఱివలె - లోకంబులో నుండి
యీషణత్రయము జ - యించినావు

కులపద్ధతులమధ్య - మెలఁగుచునే యుండి
విషయసుఖాపేక్ష - విడిచినావు
బహుపురాణాగమ - పఠనంబు లేకుండి
పరమార్థలాభంబు - వడసినావు

శీలసంపద యున్నఁ జం - డాలునైన
శిష్యవాత్సల్య మొప్ప ర - క్షించినావు
నీ సమానులు లేరు మా - నేలమీఁదఁ
వెలుఁగు యోగీంద్ర! ఫీరోజి - దేశికేంద్ర!

నిన్ను నక్కునఁ జేర్చి - చన్నిచ్చి పెంచిన
నరసాంబ యేమి పు - ణ్యంబు చేసె
అన్న! రారా! యని - నిన్ను ముద్దాడిన
నర్సోజి యెంత ధ - న్యత్వ మందె
ప్రాణేశుగా నిన్నుఁ - బడయఁగల్గినసాధ్వి
వీరమాంబిక యెట్టి - వేల్పు గొలిచె
తత్వజ్ఞుఁ డగునిన్నుఁ - దనశిష్యుఁ డని చెప్ప
జమిలిశేషార్యుఁ డే - చదువు చదివె

నీ సదుపదేశములు విన - నేర్చినట్టి
శిష్యకోటి యేసుకృతంబు - చేయఁగలిగె
నీభవంబున మా తెన్గు - నేల యెల్ల
దీప్తి గనె నయ్య! ఫీరోజి - దేశికేంద్ర!

పసుల బందెను బెట్టఁ - బరుగెత్తునోబయ్య
మరణంబు నీ కెట్టు - లెఱుఁగనయ్యె?

నీలిమందుకోటూరు - నిప్పునం బడువార్త
విని పింప నీ కెట్లు - విశదమయ్యె ?
అడవిలో దూరాన - నావులపైఁ బడ్డ
పులిజాడ నీ కెట్లు - బోధపడియె ?
పరిచయమే లేని - పరులమర్మము లెల్లఁ
దెలుపంగ నీ కెట్లు - తెల్లమయ్యె ?

ఆగతానాగతజ్ఞుండ - వైననీకు
నెఱుఁగరానిది కనరాని - దేమి గలదు ?
నీప్రభావంబు గుఱుతింప - నేర్తు రెవరు ?
తెనుఁగుమునిచంద్ర ! ఫీరోజి - దేశికేంద్ర !

మూర్ఖుఁడై నీతోడ - మొండివాదము సేసి
వెఱ్ఱియై కోటప్ప - వినతుఁడయ్యె
క్రూరవర్తను లైన - దారిదోపిడిగాండ్రు
నీ దర్శనంబున - సాదులైరి
మోహాంధు రా లైన - శ్రీహరి మతి మాఱె
నీప్రసంగముఁ నఁ బు - నీత యయ్యె
మతభేద మనుమాట - మఱచి కుంకలగుంట
లాలు నీయుపదేశ - లాభ మంది

భక్తిభావంబుతో నీవు - పాటఁ బాడ
నూరిలోనిగత్తరబాధ - యుపశమించె
నీమహిమ లెట్టివో చెప్ప - లేము తెలిసి
తెనుఁగుమునిచంద్ర ! ఫీరోజి - దేశికేంద్ర !

మాయావర్తనచాతురీ మహిమతో
మాయామనుష్యుండవై
కాయంబుం గని దారిఁజూపితివి మో
క్షప్రాప్తికిన్; నీయుపా
ధ్యాయత్వంబున శిష్యలోకము పునీ
తంబయ్యె నాంధ్రావనిన్
నీయాధ్యాత్మికచింతనప్రభలు నిం
డెన్ దేశికేంద్రప్రభూ !

నాఁటికినాఁటికిం దెనుఁగు
నాఁటను నీప్రభ నిండిపోయె; నే
టేఁటను నీ సమర్చనము
నేమఱ కేఁబదియేండ్లనుండి యీ
నాఁటికిఁ జేయుచుండిరి ఘ
నంబుగ శిష్యులు వేలకొద్ది యి
చ్చోటికి వచ్చినారు దయఁ
జూడుము వీరి ఫిరోజి సాధుజీ !

* * *

పొలుపు మివులు తెలుఁగు - పూఁదోఁటలో నేరి
కూర్చినట్టి క్రొత్త - కుసుమమాల
దీనితావి తెనుఁగు - దేశమం దెల్లెడ
నిండుఁగాక ! తఱుగ - కుండుఁగాక !



ఓమ్

* శ్రీ ఫిరోజి ఋషి

# జీవిత సంగ్రహము



శ్రీమంతం బగుభరతఖండము మహాపురుషులకు జన్మస్థానము. వేదయుగమునం దేమి, పురాణయుగమునం దేమి, చరిత్రయుగమునం దేమి, ఆధునికయుగమునం దేమి, యెంద రెందరో మహాపురుషులు మనదేశమున నవతరించి మానవలోకమును బెక్కుగతుల నుద్ధరించిరి. ఇట్టిమహాత్ములను బురాణపురుషు లనియు, నవతారమూర్తు లనియుఁ, గారణజన్ము లనియు, నమ్మి వారి కాలయములను, మఠములను, గట్టించి, సదా పూజించునాచారము మనదేశములో సర్వత్ర గలదు. ఈయాచారము మనమతమునందే, మనదేశమునందే గాక, యన్నిమతములందును, అన్నిదేశములందును, సమానముగాఁ గలదు. మహాపురుషసమారాధనము మానవలోకమునకు నిత్యశుభదాయకము.

ఆధునికయుగమునం దవతరించినమహాపురుషులలో శ్రీరామకృష్ణపరమహంస, స్వామి వివేకానంద, స్వామి రామతీర్థ,

* శ్రీ ఏటుకూరు సీతారామయ్యగారు రచించిన "శ్రీఫిరోజిఋషి జీవితచరిత్రము" ననుసరించి యిది వ్రాయఁబడినది. విశేషములు దెలియఁగోరువారా గ్రంథమును జదువవలెను.

మున్నగువారు ఖండాంతరప్రసిద్ధిఁ గాంచిరి. నేఁడు వారిపేర మఠములు నిర్మింపఁబడినవి. వారి సదుపదేశములు గ్రంథరూప మునఁ బ్రకటింపఁబడినవి. వారియారాధనములు మహావైభవ ముతోఁ గొనసాగుచున్నవి. వారు మృతజీవులు.

ఇట్టిమహాపురుషులలోఁ గొందఱు గృహస్థులయ్యు సంసార పంకమునం గూఱుకొనిపోక నిమిత్తమాత్రముఁగ మెలంగుచు మోహాపేతులతోఁ గేవలాధ్యాత్మికచింతాపరులై కాలము గడ పుచుఁ దమజీవయాత్ర ముగించుచుందురు. సామాన్యమానవు లకు వీరినిగుఱించి తెలిసికొనునవకాశములే యుండవు. ఒక వేళ నట్టియవకాశము లున్నను సామాన్యులు వీరిని గుర్తింపఁ జాలరు. జయదేవుఁడు, రామానందుఁడు, కబీరు, తుకారాం, రామదాసు, మున్నగుమహాపురుషు లందఱీతెగలోనివారు. వీరియనంతరము వీరిశిష్యప్రశిష్యులు వీరిమహిమలగుఱించియు, వీరియాధ్యాత్మికజీవితమునుగుఱించియు, లోకమునకు వెల్ల డించినప్పుడు "ఆహా! వీ రింతటిమహాపురుషులా?" యని లోకము వీరినిఁ దెలిసికొనఁగలిగినది. వీరే సాధుపుంగవులు. మహాయోగులు. ఋషులు.

ఇట్టిమహాత్ములలో శ్రీషిరోజిఋషీంద్రులవారొకరు. వీరిమహా త్త్వమును లోక మీనాఁటికిని గుర్తింపఁజాలకుండుట మిగుల శోచనీయము. ఏకొలఁదిమందికిమాత్రమో వీరినిగుఱించి తెలి యును. అడవిలో వికసించినదివ్యసుగంధికుసుమమును లోక మెఱుంగనట్లు వీరిపవిత్రచరిత్రమునుగూడ లోక మెఱుంగఁ జాలకున్నది. ఇందులకుఁ దగినంతశిష్యప్రచారముగాని, గ్రంథ ప్రచారముగాని, లేకపోవుటయే ముఖ్యకారణము.

గుంటూరుమండలములోని సత్తెనపల్లిపురము శ్రీ షిరోజీగారి జన్మస్థలము. వీరు మహారాష్ట్రదేశపుక్షత్రియులు. శ్రీశివాజీ మహారాజువంశస్థులు. వీరిపితామహులైన పాపాజీగారును, శివాజీమహారాజుమనుమలైన షాహూజీగారును, సమకాలికు లగుటయేగాక బంధుమిత్రులుగూడ నైయుండిరి. శివాజీమను మఁడు షాహూజీకిని, రాజారాంకుమారుఁడు శివాజీకిని, క్రీ. శ. ౧౭౦౭లో జరిగిన రాజ్యకలహమునందుఁ బాల్గొని పాపాజీ గారు షాహూజీపక్షము వహించి చాలపని చేసి వారికి సఖ్యముఁ గుదిరించిరి. తరువాత షాహూజీపంపున హైదరాబాదు దేశ మునకుఁ బోయి కొంతకాల మక్కడఁ బనిచేసిరి. కాని యంత లోనే మహారాష్ట్రప్రభువులప్రభ లస్తమించుటంజేసి పాపాజీగా రచ్చట నిలువలేక తమయనుచరులతో బయలుదేఱి పశ్చి మాంధ్రద్వారమున మనదేశమునకు వచ్చిరి. వీరియనుచరు లలోఁ గొంద ఱచ్చటచ్చట స్థిరనివాసము లేర్పఱచుకొనిరి. పాపాజీగారుమాత్రము నరసరావుపేటజమీందారువారియొద్ద గొప్పసైనికోద్యోగమును బొంది యాతాలూకాలోని నెకరి కల్లుగ్రామమునందు నివసించిరి. అచ్చట వీరికి నరోన్సీజి యను నొకపుత్రరత్న ముదయించెను.

నరోన్సీజిగారు యుక్తవయస్సు వచ్చినతరువాత నరూన్సాబాయి అను సుదతీతిలకమును బెండ్లియాడి సత్తెనపల్లిజమీందారులగు శ్రీరాజా మానూరు వేంకటగోపాలరాయనింగారికొలువులో సుబేదారుగాఁ బ్రవేశించి యాపురమునందే స్థిరనివాస మేర్ప ఱచుకొనిరి. జమీందారుగారివలన వీరికిఁ దగినయిల్లు, భూములు, మున్నగుసమస్తసౌకర్యములు లభించెను. వీరిజీవ

యాత్ర కేలోపమును లేకుండెను. కాని సంతానభాగ్యము మాత్రము కొఱవడెను. సంతానమును గోరి వీరనేకదాన ధర్మములు చేసిరి. తీర్థయాత్రలు గావించిరి. ఎన్నిసుకృతము లొనర్చినను వీరికోర్కె ఫలింపలేదు.

ఇట్లు చాలకాలము గడచినమీఁదట నొకప్పుడు చిదంబర యోగి యనునొకసాధుపుంగవుఁడు సత్తైనపల్లికి వచ్చెను. నర్సోజిగా రతనిని దమయింటికిఁ గొనివచ్చి వినయపూర్వకముగ సత్కరించి తా మనపత్యు లనియు, సంతానప్రాప్తి గలుగున ట్లనుగ్రహింపవలయుననియుఁ బ్రార్థించిరి. ఆయోగిపుంగవుఁ డును బుణ్యమూర్తులగు నాదంపతులయెడఁ గరుణగలవాఁడై వారికి ఆదిత్యమంత్రము నుపదేశించి యామంత్రమును శ్రద్ధా భక్తులతో జపించుచు నాదివారమునాఁ డుపవసించి సూర్యా రాధన మొనర్పవలసినదనియు, నిట్లాఱు నెలలు నిండునప్పటికి వారికి సంతానము గల్గుననియు, నందుఁ బ్రథమసంతానము సుజ్ఞానియై దీపించుననియుఁ జెప్పి వెళ్ళిపోయెను.

చిదంబరయోగి యానతిచ్చినప్రకారము నర్సోజి భార్యాసహి తుఁడై షణ్మాసములు సూర్యారాధన మొనర్చెను. అనంతర మీపుణ్యదంపతులకుఁ ద్రిమూర్తులు జన్మించినట్లు మువ్వురు కుమారులు గల్గిరి. వారిలో జ్యేష్ఠులు శ్రీఫిరోజిగారు. మధ్యములు వెంకోజిగారు. కనిష్ఠులు గోవిందరావుగారు. శ్రీఫిరోజి గారు సంతతము తారకమంత్రోపాసకులగుటంజేసి శివాంశసం భూతు లనియు, వెంకోజిగారు నిరంతరమౌనవ్రతపరాయణు లగుటంజేసి బ్రహ్మాంశసంభూతు లనియు, గోవిందరావుగారు పుట్టినతరువాత నింట నెన్నఁడులేని గోసంపద మిక్కిలి యభి

వృద్ధియగుటంజేసి విష్ణ్వంశసంభూతు లనియుఁ, బ్రసిద్ధిఁగాం చిరి. ఈసుతత్రయపవిత్రోదయమునంజేసి నర్సోజీదంపతులు అత్రిమహర్షిదంపతు లన నొప్పిరి.

ఈకుమారులలోఁ గనిష్ఠు లైనగోవిందరావుగారు పదునెనిమిది సంవత్సరములు పెరిగి అవివాహితులుగనే చనిపోయిరి. రెం డవవా రైన వెంకోజీగారు డెబ్బదిసంవత్సరములు జీవించి శ్రీ ఫిరోజిగారు సిద్ధిపొందిన తరువాతఁ గొంతకాలమునకుఁ జని పోయిరి. వీరికి వెంకుబాయియందుఁ బెదగోవిందరావు అను నొకకుమారుఁడును, గోవిందమ్మ యనునొక కొమార్తెయును, గల్గిరి. పెదగోవిందరావుగారికి నర్సూబాయియందు నాగోజీ, వెంకోజి, ఫీరోజీ, ప్రసాదరావు, లక్ష్మోజి, అను నైదుగురు కుమారులును, వెంకుబాయి అనునొక కూఁతురును గలిగిరి.

శ్రీఫిరోజిగారు క్రీ. శ. ౧౮౨౯ సంవత్సరమునకు సరియైనవిరోధి సంవత్సర ఆషాఢశుద్ధ ఏకాదశినాఁడు జన్మించినట్లు నిర్ణయింపఁ బడినది. వీరు బాల్యమునుండియుఁ బ్రతివస్తువును బరమార్థ దృష్టితోఁ దిలకించుచుండెడివారు. ఐహికవిషయాసక్తి వీరి జీవితమునం దెచ్చటను గానరాదు. బాల్యమునుండి వీరికి బైరాగు లన్నను, గోసాయీ లన్నను, భగవద్భక్తు లన్నను, మిక్కిలియభిమానము. ఇట్టివా రెవ్వ రైన గ్రామములోనికి వచ్చిరేని ఆఁకలిదప్పు లెఱుంగక వారిని సేవించుచుండెడివారు. ఒక్కొకప్పుడు పరమార్థసంభాషణములతో వారి కాశ్చర్య మును గలిగించుచుండెడివారు. భగవంతునిగుఱించి తెలిసి కొనుటయే వీరి కాబాల్యసిద్ధ మైనకాంక్ష.

ఈపరమకాంక్ష వీరివిద్యాభ్యాసమునందును వ్యక్త మగుచున్నది. వీరికిఁ బదియేండ్లు నిండునప్పటికే మిక్కిలి భాషాజ్ఞానము గలిగినది. ఆంధ్రమునందే గాక సంస్కృతమునందును దగినపాండిత్య మేర్పడినది. వీరు పండ్రెండవయేఁటనే చిన్న చిన్నకీర్తనలు, మంగళహారతులు, తత్వగేయములు, రచించినట్లు వీరిచాటువులంబట్టి రూఢి యగుచున్నది. వీరు స్వయంకృషిచేతనే యుభయభాషాపాండిత్యమును గడించినట్లు చెప్పుదురు. ఒకానొకప్పుడు సంస్కృతపండితుఁ డొకఁడు వీరిపాండిత్యమున కాశ్చర్యపడి "నాయనా! నాయొద్ద సంస్కృతమును బ్రత్యేకముగ నభ్యసింతువా?" యని బాలుఁడైన శ్రీఫిరోజినిఁ బ్రశ్నించెనఁట. అందులకు వారు ప్రహ్లాదచరిత్రములోని "చెప్పఁడొకచదువు మంచిది" అనుపద్యమును జదివి "అయ్యా! ఈ చదువులతోను, శాస్త్రములతోను, నాకు నిమిత్తము లేదు. భగవంతునిఁగూర్చి చెప్పఁగలిగినచదువు తమయొద్దఁగలదేని దప్పక యభ్యసించెద" నని పల్కెనఁట! ఈబాలునిపరమార్థకాంక్ష కాపండితుఁడు నివ్వెఱపడి నిరుత్తరుఁ డయ్యెనఁట.

ఒకనాఁడు చిదానందుఁ డనునొకయోగి వీరిగ్రామమునకు వచ్చి వీరియింటికి దగ్గఱనే యున్న యొకచెట్టుక్రిందఁ గృష్ణాజినాసీనుఁడై సదా ధ్యానయోగమున నుండెను. బాలుఁడైన ఫిరోజీ యాతనియెడ భక్తిశ్రద్ధలు గలవాఁడై పాలు, పండ్లు, దెచ్చి సమర్పించి యాతని కెదురుగాఁ జేతులు గట్టుకొనియుండెను. ఆయోగిపుంగవుఁడును దన్ను దర్శింపవచ్చినతదితరులఁ బల్కరించి యనుగ్రహించి పంపుచుండెనే కాని బాలుఁడైన ఫిరోజిని మాత్రము ప్రశ్నింపలేదు. తుదకుఁ గన్నెత్తియైనను జూడ

లేదు. అయినప్పటికి ఫిరోజి యతని నెడఁబాయక, ఆఁకలిదప్పులఁగూడఁ బాటింపక, యచ్చటనే స్థిరమతితో నుండెను. అంతలోఁ బ్రొద్దుగ్రుంకుసమయ మయ్యెను. అప్పు డాయోగి ఫిరోజిపైఁ గృపావలోకనములఁ బఱపుచు "నాయనా! నీ వెవరవు? ప్రొద్దు గ్రుంకుచున్నను నిం దేల యుంటివి? నీ కామిత మేమి?" యని ప్రశ్నింప శ్రీఫిరోజి తద్దయు భక్తితో నతనియడుగుఁదమ్ముల పై వ్రాలి "మహాత్మా! నా కీప్రపంచ మంతయుఁ దమోమయముగాఁ దోఁచుచున్నది. ఏమి చేయుటకును, నెటు పోవుటకును, నాకు దిక్కు దెలియుట లేదు. ఈ చీఁకటిని భేదించుదివ్యప్రకాశము ననుగ్రహింపు" మని ప్రార్థించెను. ఆబాలుని పరమార్థకాంక్ష కాపరమయోగి పరమానందభరితుఁడై లేవనెత్తి "వత్సా! నీవు ధన్యుఁడవు. నీమూలమున నెందఱెందఱో తరింపనున్నారు. సంసారపంకమునం గూఱుకొనక సావధానుఁడవుగ" మ్మని భవతారకమగు తారకమహామంత్రము నతని కుపదేశించెను. శ్రీఫిరోజియుఁ దన్మంత్రజపపరాయణుఁడై కొలఁదిసేపు బాహ్యప్రపంచమును మఱచెను. తరువాతఁ గన్నులు దెఱచి చూచునప్పటి కాయోగిపుంగవుఁ డదృశ్యుఁడయ్యెను. శ్రీరామచంద్రమూర్తియే చిదానందరూపమున సాక్షాత్కరించి తనకుఁ దారకమంత్రోపదేశ మొనర్చెనని శ్రీఫిరోజిఋషీంద్రులవారు తరువాతఁ జెప్పిరి. ఈపవిత్రాశయముతోడనే వీరు "ఆచార్యశతకము" ను రచించిరి.

శ్రీఫిరోజిగారు యుక్తవయస్కులైనతరువాతఁ దమ బంధువులును, నూజివీడుగ్రామవాస్తవ్యులును, నగుశ్రీఘటకాల వెం

కోజీగారి కుమారీమణి వీరాబాయి యనుసాధ్వీశిరోమణినిఁ బెండ్లాడిరి. పూజ్యురాలైనవీరమాంబ సంతతపతిసేవాపరాయణ. పతిభక్తిరూప. పరమసుశీల. ఉత్తమసతీచారిత్ర. అన్నివిధములఁ బతికిఁ దగినపుణ్యసతి. ఈపుణ్యదంపతులకు లక్ష్మోజీ, నరోస్బజీ, చినగోవిందరావు, అనుముప్పురుకుమారులును, లక్ష్మిబాయి, వీరాబాయి, పెదగోవిందమ్మ, చినగోవిందమ్మ, యను నల్వురు కొమార్తలును, సప్తసంతానములోయన జన్మించిరి. రెండవకుమారుఁడైననరోస్బజీ బాల్యముననే చనిపోయెను. మూఁడవకుమారుఁడైనచినగోవిందరావు లక్ష్మిబాయి యను కులవధూతిలకమును బెండ్లాడి యామెయందు రామాబాయి యనునొకపుత్త్రికారత్నమునుమాత్రము గాంచెను. జ్యేష్ఠకుమారులైనశ్రీలక్ష్మోజీగారు వెంకుబాయి యనుపతివ్రతాశిరోమణిని బరిణయమాడి శ్రీశిరోజీబాబు అనునొకపుత్త్రరత్నమును, నర్సూబాయి, జ్ఞానాబాయి, అనునిర్వురుపుత్త్రికామణులను గాంచిరి.

శ్రీశిరోజీబుషీంద్రులవా రింతపెద్దకుటుంబముగలవారయ్యుఁ దాపత్రయపీడితులు గాక, విషయసుఖలోలురుగాక, తామరాకుమీఁది నీటిబొట్టువలెఁ గేవలాధ్యాత్మిక చింతనముతోఁ దమగృహస్థధర్మమును నిర్వర్తించిరి. వీరికివయస్సు మీఁజినకొలఁది నాత్మదర్శనాభిలాష హెచ్చెను. నిరంతరతారకమంత్రోపాసనాపరులై, నిశ్చలధ్యానసమాధి నిష్ఠాగరిష్ఠులై, జితేంద్రియులై, యెట్టకేలకు నాత్మసాక్షాత్కారమును బొంది తమయాబాల్యపరమార్థతృష్ణ నపనయించుకొనిరి. తరువాత సీతారామాంజనేయము, పంచదశి, జ్ఞాన

వాసిష్ఠము, రామస్తవరాజము, వాసుదేవమననము, భగః ద్గీత, ఉపనిషత్తులు, అద్వైతసుధాలహరి, భాగవతము, మొద లగునుద్గ్రంథములఁ జదివి విశేషజ్ఞానసంపన్నులై పండితులతోఁ దత్వచర్చలు గావించుచు వేదాంతప్రతిపాదకములగు ననేక గేయగ్రంథములు, శతకములు, పద్యకావ్యములు, దండక ములు, వచనగ్రంథములు, తత్వములు, పెక్కులు రచించిరి. శ్రీభద్రాచలయాత్ర గావించి తమయిష్టదైవమగు శ్రీరామచంద్ర మూర్తిని దర్శించిరి. "పరమానందసుధాలహరి" లో భద్ర గిరియాత్ర వర్ణింపఁబడినది.

ఆబాల్యసిద్ధముగ నప్పుడప్పుడు వీరు చూపినమహిమలం బట్టియు, నిరంతరసాధువర్తనముంబట్టియుఁ, దత్వజ్ఞానముం బట్టియు, వేదాంతప్రసంగములంబట్టియు, వీరి కప్పుడే పెక్కు మందిశిష్యు లేర్పడిరి. వీరు కేవలాద్వైతు లగుటంజేసి జాతి మతభేదములను బాటింపక, యన్నిమతములవారిని, అన్ని వర్ణములవారినిఁ, గడకుఁ బంచములనుగూడ గుణమునే ప్రధా నముగఁ గైకొని తమశిష్యకోటిలోఁ జేర్చుకొనిరి. మతాంతరుఁ డైనకుంకలగుంట లాలుసాహెబు వీరిప్రియశిష్యుఁడు. ఎల్ల ప్పుడు నీడవోలె వెన్నంటి దిరుగువాఁడు. పంచములలో రామ దాసు, అప్పలస్వామి, ముఖ్యశిష్యులు.

ఈవిధముగా శిష్యకోటి ప్రబలినకొలంది వీరిప్రభలు చాలవఱకు వ్యాపించెను. దీనితో వీరి శిష్యలోకసంచార మెక్కువయ్యెను. వీరి మహిమలు సర్వత్ర సుప్రకటితము లయ్యెను. సత్తెనపల్లి జమీందారువారును వీరిమహిమలను ప్రత్యక్షప్రమాణముల

తోఁ దెలిసికొని వీరిని సత్కరించిరి. హైదరాబాదురాజ్యము లోని హుమ్నాబాదులో నున్న మాణిక్యప్రభువులవారును వీరిమహిమను గుర్తించి వీరివలన సదుపదేశమును బొంది తరించిరి.

ఈతీరునఁ బ్రసిద్ధిగన్న మహాపురుషులు శ్రీ ఫిరోజి ఋషీంద్రుల వారు తమయఋవదవసంవత్సరము నిండిననాఁడు- అనఁగా క్రీ. శ. ౧౮౮౯ సం॥ జూలై ౯ వ తేదికి సరియైన విరోధినామ సంవత్సర ఆషాఢశుద్ధఏకాదశి మంగళవారము రాత్రి లింగో ద్భవకాలమునందు "హర! హర! హర!" యని మువ్మా రుచ్చరించి పరబ్రహ్మంబునం దైక్యమునొందిరి. వీరు పరమప దించినతరువాత వీరిప్రియశిష్యులైన వనమా సుబ్బారాయుఁడు గారును, పాటిబండ్ల వీరయ్యగారును, సంకా ఉపేంద్రరావు గారును, వీరిపేర నొకమఠమును గట్టించిరి. వీరిజ్యేష్ఠకుమారు లైన శ్రీలక్ష్మోజిగారు మఠాధిపతులై ప్రతిసంవత్సరము వీరి యారాధనమహోత్సవమును మహావైభవముతో జరుపుచు, మఠాభివృద్ధికై నిరంతరము కృషిచేసి పెక్కుఘనకార్యముల నిర్వహించి యన్నింటను దండ్రికిం దగినకుమారు లనిపించు కొని కొలఁది యేండ్లక్రిందటనే పరబ్రహ్మసాయుజ్యముం బొందిరి.

వీరియనంతరము వీరికుమారులైన శ్రీ ఫిరోజిబాబుగారు ప్రకృతము మఠాధిపతులైయున్నారు. వీరును దండ్రికిఁ దగినకుమా రులు. తాతగారికిఁ దగినమనుమలు. గుణవర్తనాదికములందుఁ బెద్దలు. పరమశాంతస్వభావులు. వీరు పుణ్యశీల యగురామా

బాయి యనుకాంతాలలామను బెండ్లాడి గృహస్థధర్మమును జక్కగా నిర్వర్తించుచు, లక్ష్మోజిబాబు, గోవిందరావు, వెంకోజి యనుముగ్వురు పుత్రరత్నములను - సరోజిని, రాజ్యలక్ష్మీబాయి, వీరాబాయి యనుముగ్వురు పుత్రికామణులను - గాంచిరి. బహుకుటుంబభారము గలవారయ్యు వీరు ప్రాలుమాలక మఠకార్యనిర్వహణమునం దత్యంతశ్రద్ధ గలవారై యేతదభివృద్ధికిఁ బెక్కుగతులఁ బాటుపడుచున్నారు. ఉత్తమగుణవతి యగు శ్రీమతి త్రిపురనేని సాధువమ్మగారి యనూనాదరాభిమానములం జేసి మఠప్రాకారనిర్మాణమును బూర్తి గావించిరి. శ్రీ దూపగుంట్ల లక్ష్మయ్యగారి ప్రోత్సాహమునను, శ్రీ కూరపాటి రాఘవయ్యగారియభిమానముననను, దదితరప్రముఖుల యనూనసాహాయ్యముననను, జిరకాలాపేక్షితమగు "శ్రీ ఫిరోజి ఋషి గ్రంథావళి" ముద్రణమును బూర్తి గావింపఁ గల్గిరి. వీరిహయాములో శ్రీ ఫిరోజిమఠ మెల్లగతుల నున్నతసంస్థగాఁ బెంపుగనుసూచనలు గన్పించుచున్నవి. ఇవి త్వరలోనే ఫలించుఁగాక!

శ్రీ ఫిరోజిమహర్షిశిష్యపరంపరకును, దత్పౌత్రులగు శ్రీ ఫిరోజి బాబుగారికిని, నేతత్కుటుంబమునకును, బరాత్పరుఁడు చిరాయురారోగ్యశుభయశశ్శ్రీల ననుగ్రహించుఁగాక!

ఓం శాంతిః

సత్తెనపల్లి,
16-1-1945.

— పరిష్కర్త

ఓమ్

# శ్రీ ఫిరోజి ఋషి మహిమలు



## ౧. ఓబయ్య మరణము :

శ్రీఫిరోజిఋషీంద్రులవారు చిన్నతనమునుండియుఁ బ్రతివ్యక్తి యొక్క ముఖలక్షణములఁ బరిశీలించి యతఁ డెట్టివాఁడో, యతనిభూతభవిష్యద్వర్తమానస్థితు లెట్టివో, చూచినట్లు చెప్పఁగలిగెడివారు. వీరు తొమ్మిదేండ్ల ప్రాయమప్పు డొక నాఁడు తమయింటి కావలవీధికి సమీపమున నున్నయొకఱోటి యొద్దఁ దల్లియు, నితరస్త్రీలును, గలిసి పిండి గొట్టుచుండఁ జిన్నతన మగుటం జేసి యచ్చటికిఁబోయి కూర్చుండిరి. అంతలో భవిరిశెట్టి ఓబయ్య యనునొకవైశ్యుఁడు తనపొలములో మేసినయావులను బందెఁబెట్టునిమిత్త మావీధినే తోలుకొని పోవుచుండెను. ఆలకాపరి యతనిని వెంబడించి విడిచిపెట్టుమని ప్రతిమాలుచుండెను. కాని ఓబయ్య కోపముచే నొడలు దెలియక యతనిని దిట్టుచుఁ, బసులఁ గొట్టుచుఁ, గేకలు వేయుచుఁ, జనుచుండెను. ఆదృశ్యమును ఫిరోజిగారు చూచి "ఆహా! ఇతఁ డెంతమూర్ఖుఁడు! తనకుఁ గలుగఁబోవునాపదను గుర్తింపలేక పసుల బందెఁబెట్టఁబోవుచుండెనే? ఇతనిముఖలక్షణములంబట్టి యితఁ డీనాఁడు ప్రొద్దు గ్రుంకులోపల మరణించునని తోఁచుచున్న" దనెను. ఆమాటలకుఁ దల్లియు, నచ్చట నున్న

స్త్రీలును, జాల నబ్బురపడిరి. వారు చెప్పినప్రకార మానాఁటి సాయంకాలమున ఓబయ్య యేదోమాటమీఁద భార్యతోఁ గలహించి, యామెను బయటికి గెంటి, తలుపుబిగించి ప్రొద్దు గ్రుంకునప్పటి కురివేసికొని చచ్చెను. దీనితో ఫిరోజిగారి మహిమ యూరిలో గుప్పుమనెను. ఈసంగతి విన్న వా రెల్లరు బాలఫిరోజిగారినిఁ బెక్కు తెఱఁగులఁ గొనియాడిరి.

౨. మాదల శ్రీహరి :

శ్రీఫిరోజిగారు గృహస్థు లైనతరువాత నొకనాఁ డేదోపని మీఁద మాదల శ్రీహరి యను వేశ్య యున్న బజారునఁ బోవు చుండిరి. వారు తనయింటిదగ్గఱకు రాఁగానే యావేశ్య యెదురుగాఁబోయి నమస్కరించి లోనికి దయచేయుఁడని ప్రార్థించెను. వేశ్యాగృహమని వా రేమాత్రమును సంకోచింపక యామెవెంట లోనికిఁ జనిరి. శ్రీహరియు వీరినిఁ దగినరీతి సత్కరించి "అయ్యా! తాము రసికులు. కవీశ్వరులు. చక్కని కీర్తనలు వ్రాయఁగలరఁట. నాకు నాలుగు జావళీలు వ్రాసి పెట్టుఁడు. నేను మీదాననను. నా యీ శరీరము మీయధీన" మని కామవికారమునకు లోనై నర్మగర్భంబుగాఁ బల్కెను, ఫిరోజిగా రామెహృదయము నెఱింగినవారై జితేంద్రియులు గావున నేమాత్రమును జలింపక పుత్రీభావముతో నామెకు జ్ఞానోపదేశము గావించిరి. వారిసదుపదేశప్రభావమువలన శ్రీహరి మతిమాలి పరమయోగినియై తరించెను. ఇది తెలిసిన వా రెల్లరు ఫిరోజిగారిజితేంద్రియత్వమున కబ్బురపడి వారిని వేనోళ్ళఁ గొనియాడిరి.

వారి కనుపమభక్తిశ్రద్ధలు గలిగెను. పురజనులయందు భక్తి ప్రపత్తులు మఱింత హెచ్చెను.

౮. నీలిమందు కొటారు:

ఒకప్పుడు శ్రీ ఫిరోజిగారు సత్తెనపల్లికి సమీపమునఁ గల పాకాలపాడు గ్రామమునకు వెళ్ళిరి. వా రచ్చట బసచేసియుండఁగాఁ గోట అచ్చయ్య అను నూతలపాటివర్తకుఁడు వారిని దర్శించి "స్వామీ! మే మీసంవత్సరము నీలిమందు నెక్కువగాఁ గొని సత్తెనపల్లిలో నిలువయుంచినాము. మా కేమైన లాభించునది లేనిది చెప్పవలసిన" దని వేడెను. వెంటనే వారు "లాభముమాట దేవుఁ డెఱుఁగును. ఆయింటికి గొప్పముప్పు రానున్నది. మఱం దాయిల్లు ఖాళీచేసి మీనీలిమందును మఱొకయింటఁ జేర్పుఁ" డని చెప్ప నావర్తకుఁడు గుండెలు బాదుకొనుచుఁ బోయి నీలిమం దంతయు మఱొకయింటఁ జేర్చెను. మఱునాఁడే ఆయిల్లును, మఱికొన్ని యిండ్లును, దగులఁబడెను. ఆవర్తకుఁడు ఫిరోజిగారి మహాత్వమునకుఁ జాల యద్భుతపడి యాసంగతిఁ బురజను లందఱకుఁ జాటి చెప్పెను.

౯. కోటప్ప పిచ్చి:

ఒకనాఁ డెట్టిగుంట్లపాడువాస్తవ్యుఁడైన వంధ్యా కోటప్ప యను తెలగకులమువాఁ డొకఁడు ఫిరోజిగారిని దర్శింపవచ్చి తానొక మహావిద్వాంసునిఁబోలె "భగవంతునిఁ జూపింపఁ గలరా స్వామీ!" యని ప్రశ్నించెను. "చూపింపఁగల" నని

వారు బదులుచెప్పి యతని కీశ్వరసాక్షాత్కారమునుగుఱించి చక్కగా బోధించిరి. అది యంతయు విని కోటప్ప కొంత విచారించి, తలయూపి, క్రిందుమీఁదులు చూచి, చాల నిరాదరణబుద్ధితో "స్వామీ! నాకుఁ దెలిసినదానికంటె మీరెక్కుడు చెప్పిన దేమి గలదు? ఈమాత్ర మిదివఱకు నే నెఱుంగనా? మీ రేమో గొప్పవారని భ్రమపడితి" నని తిరస్కారసూచకముగఁ బలికెను. అందులకు వా రేమాత్రము నుఁ గోపింపక మెల్లనిమాటలతో "అయ్యా! నాకింతకంటె మఱేమియుఁ దెలియదు. నీ కీశ్వరునిఁ జూడవలెనని పెద్దపిచ్చిగా నున్నది. నీపిచ్చి నేఁ గుదుర్పఁజాల" నని పలికిరి. వీరిమాట ప్రకారము కోటప్ప మనస్సు చెడినవాఁడై పిచ్చివాఁ డయ్యెను. తరువాత వీని బంధువులు ప్రార్థింపఁగా ఫిరోజిగారు కరుణించి యతనిపిచ్చి భగవద్భక్తిగా మాఱునట్లు సెలవిచ్చిరి. తదాది కోటప్ప పిచ్చికుదిరి నిశ్చలభక్తిపరుఁ డయ్యెను.

## ౬. దారి దోపిడిగాండ్రు :

ఒకప్పుడు ఫిరోజిగారు శిష్యసంచారార్థము చిలకలూరుపేటకు వెళ్ళిరి. వారు వెళ్ళినతరువాతఁ బచ్చిబాలెంత యయినవారి సతీమణికిఁ గలరా తగిలి ప్రాణముమీఁదికి వచ్చెను. శీఘ్రముగా రావలసినదని బంధువులు వారికిఁ గబురుపంపిరి. ఆ వార్త వారికిఁ జేరునప్పటికిఁ బ్రొద్దుగ్రుంకెను. చీఁకటిరేయియైనను ఫిరోజిగారు సంకోచింపక వెంటనే బయలుదేరి ప్రయాణము సాగించిరి. వారివెంట రామిశెట్టి సీతారామయ్య యను నొకశిష్యుఁడుమాత్ర ముండెను. వా రా కటికిచీఁకటిలో వచ్చు

చుండ మధ్యేమార్గమున నలువురు దారిదోపిడిగాండ్రు వారి పైఁ బడిరి. సీతారామయ్య చాలభయపడి చెట్టుచాటుకు జారెను. ఫిరోజిగారుమాత్రము నిశ్చలచిత్తులై యానలువురు దొంగలను శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులుగా భావించి యారూపమున సాక్షాత్కరించిన ట్లెప్పొంగి "* ఎంతో బ్రహ్మానందమాయెనే - మన - చింత లన్నియుఁ దీరిపోయెనే-" అనుకీర్తనము నాశువుగాఁ బాడిరి. ఆకీర్తనము నాలించినంతనే యాదొంగలు వారిని గుర్తించి వారియెడ భక్తిభావము గల వారై తెల్లవాఱువఱకు వారిని వెంబడించి సాగనంపిరి.

### ౨. కలరా వ్యాధి :

అట్లు బయలుదేరి వీరు గ్రామములోనికి రాఁగానే ప్రజలు గుంపులుగట్టి వచ్చి "స్వామీ! ఈ గత్తరబాధ నుపశమింప జేయుఁ" డని ప్రార్థించిరి. ఇంట భార్య మరణశయ్యమీఁద నున్నదనియుఁ, బురిటింటి బిడ్డఁడు పాలులేక యల్లాడుచున్నాఁ డనియు, వారికిఁ దెలియవచ్చెను. వెంటనే గృహమునకైనను బోవక వారు చెఱువులో స్నానమొనర్చి వార్చి మహాలక్ష్మీ వృక్షముకడ నాసీనులై యాతల్లిమీఁద ననేక మంగళహారతు లాశువుగాఁ జెప్ప మొదలిడిరి. తరువాతఁ దమకుటుంబక్షేమ మును గోరి "బాలు నేలు పసి - బాలుని దల్లిని - రక్షించు మమ్మ - రక్షించు మహాలక్ష్మీ! రక్షించు మమ్మ!" యని దేవిని స్తుతించిరి. ప్రొద్దుగ్రుంకువఱకు వారచ్చటనే దేవీ పూజారతులై యుండిరి. అంతలో వారిభార్యకు వ్యాధి తిరుగు

* చూడు - పుట ౧౪౮. పరమానందసుధాలహరి.

మొగముపట్టెనని కొందఱు వచ్చి చెప్పిరి. తరువాత నూరి లోనిగ త్తరబాధ యంతయుఁ జేతులతోఁ దీసివేసిన ట్లుపశ మించెను.

౮. భద్రాచలయాత్ర :

శ్రీస్వభానునామసంవత్సర చైత్రశుద్ధనవమికి ఫిరోజిగారు కుటుంబసహితముగాఁ బెక్కుమందిశిష్యులతో భద్రగిరియాత్రకు బయలుదేరి బండ్లమీఁదఁ గొన్ని దినములు ప్రయాణము చేసిన పిమ్మట భద్రగిరికి రెండుమకాములదూరములో నొకనాఁటి రాత్రి యొకచిన్నపల్లెయందు మకాముచేసిరి. అదివఱకే య చ్చట విడిసియున్న యాత్రాపరులు గొందఱు వంటలు చేసికొను చుండిరి. మఱికొందఱు భుజించుచుండిరి. మన యాత్రికులు వంట చేసికొనుటకై బియ్యపుమూటను వెదకఁగా నది యేబండి లోనను గన్పడలేదు. చాలసేపు వెదకి యెందునుగానక యెచ్చ టనో దారిలో జారి పడిపోయి యుండునని భావించిరి. కాని యంతమందికి నన్నమెట్లు? ఆచీఁకటిలో నెచ్చటికిఁ బోఁగలరు? అందఱికు నాఁకలిబాధ మిక్కుటముగా నుండెను. పిల్లలు మొదలు పెద్దలవఱకు నన్నమో యన్నమోయని మొఱ పెట్టసాగిరి. కొంద ఱాఁకలిబాధకుఁ దాళలేక పడిపోయిరి. కొందఱు శోష వచ్చి కన్నులు తేలవైచిరి. ఈదృశ్యమునుగాంచి ఫీరోజిగారు చాల విచారపడి యెంతయు భక్తిభావముతో శరీరము మఱచి యా శ్రీరామచంద్రునిఁగూర్చి-

* ఎంత నిర్దయ మానసుఁడవు - రామ నే -
నెంత వేడినఁ గనులఁ బడవు -

అని పాడిరి. ఆపాట ముగియునప్పటికి బండ్లవారిలో నొకఁడు శ్రీ ఫిరోజిగారికడకు బియ్యపుమూటతో వచ్చి "అయ్యా! ఇదిగో బియ్యపుమూట. దారిలోఁ బడియున్నదని యెవ్వఁడో యొకఁడు నాకిచ్చి తెచ్చి తమ కిమ్మనినాఁ" డని చెప్పెను. బియ్యమని విన్నంతనే యందఱిప్రాణములు లేచివచ్చెను. తెచ్చినవానికై వెదకిరిగాని యతఁ డెందును గన్పడలేదు. తరువాత నందఱు సుఖముగా భుజించి శ్రీ ఫిరోజిగారిమహాత్త్వమును బెక్కుగతులఁ గీర్తించిరి.

శ్రీ ఫిరోజిబుషీంద్రులవారిమహిమలఁ దెల్పునిట్టికథ లింకను బెక్కు గలవు. గ్రంథవిస్తరభీతిచే వానినన్నింటి నిందుఁ జేర్పమానితిని. వీరిమహిమ లన్నియు నచిరకాలములోనే ప్రత్యేక గ్రంథముగాఁ బ్రకటింపఁ బడఁగల వని మనవి.

ఓం శాంతిః

సత్తెనపల్లి,
16-1-1945.

— పరిష్కర్త.

---

* చూడు. పుట ౫౦. పరమానందసుధాలహరి.

ఓమ్

# గ్రంథరచనము - పరిష్కరణము



శ్రీ ఫిరోజిబుషీంద్రులవారు బహుళగ్రంథకర్త లనుటలో సందియము లేదు. సంస్కృతాంధ్రములందు వీరికిఁ దగినపాండిత్యము గలదని వీరికృతులే నిరూపించుచున్నవి. ఆంధ్రమునం దనర్గళముగాఁ గవిత్వము చెప్పనేర్పు వీరికిఁ గలదు. ఆశువుగను వీరు కవిత్వము చెప్పఁగలరు. "పరమానంద సుధాలహరి" లోఁ గలకీర్తనములలోఁ జాలభాగ మాశువుగాఁ జెప్పఁబడినవే! వీరియాశువు లింకను గ్రంథస్థములు గానివి చాలఁగలవు. వీని నన్నింటినిఁ గూర్చి పరిష్కరించి ప్రత్యేకసంపుటముగాఁ బ్రకటింపవలెనని మాతలంపు.

శ్రీ ఫిరోజిగారు తమ పంద్రెండవయేటనుండియే కవిత్వము చెప్పఁ బ్రారంభించినట్లు వారిచాటువులు నిరూపించుచున్నవి. ఏ గురువునొద్దను వీరు కవితాభ్యాసము గావింపలేదు. కేవలము శ్రీరామచంద్రునికృపవలననే తమకుఁ గవితాసామర్థ్యము గలిగినట్లు వారు తమకృతులందుఁ బేర్కొనినారు. దీనినిఁబట్టి బమ్మెరపోతనవలె వీరును సహజపాండిత్యులని రూఢి యగుచున్నది. వీరికవితాధార యేరకముగు వృత్తమునందైనను గుంటుపడక సరళమార్గమున జాలువాఱినది. భాషాపటిమ యెందును గొఱవడలేదు. కాని లక్షణపరిజ్ఞానముమాత్రము కొంత వఱకుఁ

గొఱవడినదని చెప్పకతప్పదు. ఇందుకు వీరు లక్షణగ్రంథములం బరిశీలింపకపోవుటయే ముఖ్యకారణమై యుండవచ్చును. ముఖ్యముగా సమాసదోషములు, సంధిదోషములు, చాలచోట్ల గానవచ్చుచున్నవి. వానిలో సాధ్యములైనవానినిమాత్రము సవరించితిని. తక్కినవానినింగూడ సరిచేయుదమన్న మొదటికే మోసము వచ్చి యెత్తివ్రాయవలసినపరిస్థితి యేర్పడినది. ఇట్టి ఘట్టములందుమాత్రము యథాస్థితముగనే యుంచితిని.

వీరికి భాగవతమన్న మిక్కిలియిష్టము. ఎల్లప్పుడు దానిని బఠించుచుండువారంట! అందుననేకాంబోలు వారికవిత్వము గూడం జాలవఱకు భాగవతకవితారీతి ననుసరించియున్నది. మొత్తముమీఁద వీరు పోతనయడుగుజాడల నడచిరనియే చెప్పవచ్చును. ద్రుతముమీఁద అచ్చుసంధి నిలుపుట, వ్యతిరేకక్త్వార్థకములను ద్రుతాంతములుగాఁ బ్రయోగించుట, క్త్వార్థకక్రియలపై అచ్చుసంధిచేయుట, మున్నగునవి వీరికృతులందును గానవచ్చుచున్నవి. "రాకఁ - లేకఁ - కాకఁ - పోకఁ" మున్నగుప్రయోగములకు వీరు భాగవతమునే ప్రమాణముగాఁ గైకొనిరి. ఇట్టిస్వల్పదోషములను బాటింప కున్న వీరికవిత్వము చాలరసవంతమని చెప్పకతప్పదు. వారు బుద్ధిపూర్వకముగాఁ బ్రయోగించిన వగుటంజేసి నేనిట్టిప్రయోగములను సవరింపలేదు.

వీరిగ్రంథములను బరిశీలించునప్పుడు నెఱసులను సేకరించుటయే ప్రధానముగా భావింపక యివి యెందుకొఱకు రచింపఁబడినవో, ఆయాశయమున కివి యెంతవఱకుఁ దగియున్నవో, విచారిం



పరిష్కర్త :

శ్రీ మహావాది వేంకటరత్నముగారు

చుట మంచిది. నిజము విచారింప నివి లక్షణగ్రంథములు గావు. భాషాప్రమాణముకొఱకు రచియింపఁబడినవియుఁ గావు. కేవలము తత్త్వప్రచారముకొఱకే యివి యుద్దేశింపఁబడినవి. ఈ దృష్టితోఁ బరిశీలించిన నివి యన్నివిధములఁ దగియున్నవనియే చెప్పవచ్చును. ఈ తెగకుఁ జెందినగ్రంథసముదాయమునందు వీనికిఁ బ్రత్యేకస్థాన మీయక తప్పదు. పూర్వకవివిరచితములైన గేయగ్రంథములు, స్త్రీజనోపయుక్తము లగుపాటలు, యక్షగానములు, జంగముకథలు, దేశీయకథలు, వీరచరిత్రములు, పదములు, తత్త్వములు, మున్నగునవి యన్నియు నొక ప్రత్యేకోపయోగముకొఱకు రచింపఁబడినవి. వానికి లక్షణముతో నిమిత్తము లేదు. అంతమాత్రమున నవి విసర్జనీయములు గాఁజాలవు. తెనుఁగుసారస్వతములో వానికిఁ దగిన స్థాన మీయక తప్పదు. ఈభావముతో వీరిగ్రంథములను బరిశీలింపవలెనని మనవి.

ఇంక వీరు రచించినగ్రంథములలో "శ్రీ రామ శతకము" మొట్టమొదటిదేమోయని యేతద్రచనముంబట్టి యూహింపనగుచున్నది.

'పన్నగాచలనాయక శతకము' చాలప్రౌఢముగా నుండుటచే నిది ప్రౌఢవయఃపరిపాకమున రచింపఁబడి యుండనోపు. ఇందు భక్తిభావమే ప్రధానవస్తువు. శ్రీషిరోజిబుషీంద్రులవారి భాషాపటిమకుఁ, బ్రౌఢకవిత్వమునకు, నిదియే నిదర్శనము.

'పంచీకరణము - తత్వసంగ్రహము - శ్రీశేషగురుశతకము' ఈమూడును వీరు వేదాంతతత్వవిదు లైనతరువాత వ్రాయఁబడినవి. 'శ్రీశేషగురు శతకము' వారి గురుపుంగవు లైన జమిలిశేషయార్యునిపేర గురుదక్షిణగా రచింపఁబడిన శతక రాజము.

'స్వప్రకాశము' అనునది అచలసిద్ధాంత గ్రంథము. భాగవతుల కృష్ణయ్య గారు రచించిన 'శుద్ధనిర్గుణతత్వకందార్థములు' అనుగ్రంథము ననుసరించి వ్రాయఁబడినది. ఇది వీరి గ్రంథ రాజము. తమగురునిగురువు లైనచిట్టెంశెట్టి లక్ష్మణార్యునకు దీని నంకిత మొనర్చిరి.

'పరమానందసుధాలహరి' ముముక్షుజనోపయోగార్థము రచింపఁబడిన యుత్తమగేయగ్రంథము. ఇందులో వీరిచాటువులు చాలఁగలవు. వీరిభద్రగిరియాత్ర యిందుఁ జేర్పఁబడినది.

"నమశ్శివాయ గేయము" పాటగాఁ బాడుకొనునట్లు రచింపఁబడిన తత్వగేయము. ఇది యెక్కువగా స్త్రీల కుపయోగించును. ఇది యెల్లవిధముల 'నారాయణశతకము' ను బోలియున్నది.

'దశావతారదండకము' నందుఁ బదియవతారముల కథలు చక్కగా వర్ణింపఁబడినవి. వామనావతారకథమాత్రము భాగవతకథ ననుసరించి విపులముగా వ్రాయఁబడినది. ఇది దండకమైనను జక్కనిశైలిలో నడచినది. నృసింహావతారకథ సంగ్రహింపఁబడుటకుఁ గారణము ప్రత్యేకముగాఁ బ్రహ్లాదచరిత్ర వ్రాయుటయే!

" గజేంద్రమోక్షము - పారిజాతీయము - ప్రహ్లాదచరిత్ర "- ఈమూఁడును భాగవతకథల ననుసరించి వ్రాయఁబడినవి. గజేంద్రమోక్షము, ప్రహ్లాదచరిత్రము, గేయములు. పారిజాతీయము యక్షగానము. ఈమూఁటియందును భాగవతము సమస్తగతులఁ బ్రతిఫలించినది. వీనినిఁబట్టి వీరికిఁ గలభాగవత గ్రంథపరిచయ మెట్టిదో చక్కఁగాఁ దెలిసికొనవచ్చును.

" ఆచార్యశతకము " వీరిచరమదశలో రచింపఁబడినట్లు చెప్పఁబడుచున్నది. తమకుఁ దారకమంత్రోపదేశ మొనర్చినది శ్రీరామచంద్రుఁడే యని వీరు నమ్మియుండుటంజేసి శ్రీరాముని నాచార్యునిఁగా భావించి యాదేవునిపేర నీశతకమును రచించిరి. ఇది యెల్లవిధములఁ దత్త్వగ్రంథము.

ఈగ్రంథములనన్నింటిని ఆఱునెలలు కష్టించి, నానేర్చినకొలంది పరిష్కరించి, భగవంతునికృపవలన నేఁటికిఁ బాఠకలోకమున కందింపఁ గలిగితిని. నా యొనర్చినకృషి భక్తబృందమున కుపయోగపడునేని నే నెంతయు ధన్యుఁడను.

సత్తెనపల్లి,
16-1-1945.

విధేయుఁడు,
**మహావాది వేంకటరత్నము,**
పరిష్కర్త.

ఓమ్

ఈ గ్రంథావళిముద్రణమునకు

ద్రవ్య సాహాయ్య మొనర్చిన

# దాతల వంశావళి



రచయిత : శ్రీ మహావాది వేంకటరత్నము

## ౧. శ్రీ దూపగుంట్ల లక్ష్మయ్యగారి వంశావళి

శ్రీరమణీయభద్రగిరి - శృంగమునన్ నెలకొన్న చిత్రప్రభా
పూరము పీరుదాసగురు - పుంగవసేవ్యము విశ్వమానవో
త్తారక మైనదాశరథి - తత్వము నిచ్చలుఁ బ్రేమభావ మొ
ప్పారఁగ దూపగుంట్లకుల - వర్ధను లక్ష్మయ నేలుఁగావుతన్.

వితతధనధాన్యసాహితీ - విభవములకుఁ
గాఁపురం బగుసత్యభా - మాపురంబు
నందు విలసిల్లునార్యులై - శ్యాన్వయముల
నతులమై యొప్పె దూపగుం - ట్లాన్వయంబు.

సకలైశ్వర్యనిధానమై శ్రుతిహితా - చారప్రయుక్తంబునై
యకలంకోత్తమదానధర్మచరితం - బై పండితానేకయా
చకవాంఛాపరిపూర్తి కాశ్రయమునై - సద్గ్రంథసాహిత్యపో
షకమై యొప్పెను దూపగుంట్లకుల మాచంద్రార్కసంస్తుత్యమై.

వన్నె వాసియుఁ గన్న యీ - వంశమునకు
మూలపురుషుండు లక్ష్మయ్య - పుణ్యమూర్తి
యతనిభార్య మహాలక్ష్మి - యమలచరిత
వినుతగుణసీమ ! పరమసా - ధ్వీలలామ !

లక్ష్మయామనీషి లక్ష్మీక - శ్రితుఁ డగుట
వివిధలక్ష్మీనివాసమై - వెలసె గృహము
వాని కేమిటఁ గొఱఁత ర - వ్వంత లేదు
కాని కొఱవడెఁ బుత్రసం - తానలక్ష్మి.

ఈ మహి నొప్పువైభవము - లెల్లను బిడ్డలు లేనియింట శో
భామహనీయతం గనవు - వాసిగఁ జంద్రుఁడు లేనియామినీ
కామినివోలె నంచు గుణగణ్యుఁడు లక్ష్మయ కోరికోరి శ్రీ
రాముల దత్తుఁగాఁ గొనియె - రమ్యగుణోత్తరు వంశవర్ధనున్.

శ్రీరాములు శ్రీరాముని
తీరునఁ బితృమాతృదైవ - దివ్యచరణసే
వారతుఁడై నిజవంశా
చారుండై ధర్మబద్ధ - చరితుం డయ్యెన్.

పరమశాంతగుణంబుఁ - బరహితాచరణంబు
సకలాగమాంత వి - చారణంబు
సుజనసాంగత్యంబు - సూనృతనియమంబు
భూసురదైవత - పూజనంబు

నతిథిసత్కారంబు - నన్నప్రదానంబుఁ
బోడు వైనయాచక - పోషణంబు
సహానస్వభావంబు - శాస్త్రవిజ్ఞానంబు
నీతిపరత్వంబు - భూతదయయు

నాదిగాఁ గలసుగుణంబు - లన్ని కూడి
ప్రాకటంబుగ నొప్పె శ్రీ - రాములందుఁ
దనకుఁ బెట్టినపేరు సా - ర్థకము గాఁగఁ
దనరె నాతఁడు చిరయశో - ధనుఁడు ఘనుఁడు.

ప్రకటముగ నిడుముక్కల - గ్రామమందు
భవ్య మైనట్టివేణుగో - పాలదేవు
నాలయంబును గట్టించె - నధికభక్తి
నతనికీరితి వర్ణింప - నలవి యగునె?

అనిశం బేకమనంబుతో నతనియి - ల్లాలైనయాదెమ్మ యే
పనికైనన్ మఱుమాట చెప్పక సదా - ప్రాణేశుపాదాబ్జపూ
జనభాగ్యంబుననొప్పు నుత్తమసతీ - చారిత్ర శ్రీరాము ల
వ్వనితం గూడి గృహస్థధర్మమును ని-ర్వర్తించె సౌఖ్యంబులన్.

వారియనుకూలదాంపత్య - భూరుహంబు
పెంపుఁగాంచి ఫలించి శో - భించె ననఁగఁ
బుత్రుఁ డొక్కఁడు మువ్వురు - పుత్రికలును
వారికిం గల్గిరి కులంబు - వర్ధిలంగ.

తొలికాన్పు సుబ్బమ్మ - కులవధూతిలకంబు
మలికాన్పు లక్ష్మయ్య - మహితయశుఁడు
కడమపుత్రికలు నా - గమ్మ లక్ష్మ్యమ్మ
లనువారు విమలగు - ణాఢ్య లెందుఁ
దనయుఁడు లక్ష్మయ్య - తండ్రికీర్తికిఁ జాల
వన్నె దెచ్చినపుణ్య - వర్తనుండు
శ్రీఫిరోజిమహర్షి - శిష్యుఁడై తత్కృప
దేశంబు నొందిన - ధీయుతుండు.

నీతిఁ దప్పనిసాధువ - ణిగ్వరుండు
ప్రతిఫలాపేక్ష లేనిధ - ర్మప్రభుండు
స్వార్థ మెఱుఁగనిపరహితా - చరణరతుఁడు
దూపగుంట్లకులాబ్ధిచం - ద్రుం డతండు.

వానియిల్లాలు సుగుణసం - పదల చాలు
చక్కనిసుశీల పతిమది - కెక్కినట్టి
రమణి వనితాశిరోమణి - గ్రంధి సుబ్బు
పున్నయతనూజ సుబ్బమ్మ - పుణ్యరూప.

మామ సుబ్బుపున్నయ చాల - మంచివాఁడు
పీరుదాసుని శిష్యుఁడు - దారచరితుఁ
డతనియర్ధాంగి వెంకుబా - యమ్మ సాధ్వి
గోడఁ గట్టించె ఫీరోజి - గుడికిఁ జుట్టు.

క్షీరసాగరమున నొప్పు - శ్రీశుపోలె
నిల్లటంబున నత్తవా - రింట నుండి
లక్ష్మయార్యుఁడు దనగృహ - లక్ష్మిఁ గూడి
హాయి మీఱంగఁ గీర్తిసం - ధాయి యయ్యె.

తన కన్నింటను దోడునీడ యగుకాం- తారత్నముం గూడి క్ర
న్నన రామేశ్వరకాశికానగరనా - నాపుణ్యభూమీనదీ
వనయాత్రాచణశీలిరై భవమహా - పాపాటవీకీలిగ్నై
తనరెఁ నిస్తులదానధర్మగుణబ - ద్ధస్వాంతుఁడై నిచ్చలున్.

ధర్మరతు లైనయీపుణ్య - దంపతులకుఁ
గలిగె నేకైకపుత్రిక - కులము నిలుపు
కొడుకు లేనట్టికొఱఁత చే - కూఱె నింట
నెన్నిసంపద లెసఁగిన - నేమి ఫలము ?

తనయుల్ లేనికొఱంత దీఱఁ గులవి - ద్యారూపలావణ్యయా
వనసౌజన్యగుణాఢ్యుఁడై తనరు సు - బ్బారావునిన్ దత్తపు
త్రునిఁగా లక్ష్మయ కాంచి కూర్మిసుత సం-తోషింపఁ దత్పుత్రికా
మణినిం బ్రీతి గ్రహించెఁ గోడలిగ రా-మారత్న బాలామణిన్.

అనుపమగురుభక్తియుతుం
డన గురుమఠపోషణమున - నగ్రేసరుఁడై
వెనుదీయక యేపనికై
నను గుడిభుజమై తనర్చు - నానాగతులన్.

అతిభక్తిఁ గురుపీరుదాసకృతకా - వ్యశ్రేణి ముద్రింప స
న్నుతరీతిం దగ రెండునూర్లొసఁగె ధ-న్యుం డంతెగాకుండ స్నే
హితులం బెద్దలఁ బ్రోత్సహించి ధన మెం-తేఁగూర్చెఁ జాలంగ నీ
మతిమంతుం గొనియాడ మాకుఁ దగ దే-మర్యాద పెంపారఁగన్.

సుగుణములదొంతి నీయింతి - సుఖముఁ గూర్పఁ
గొడుకుఁగోడలు నీపంపు - గోరి సేయఁ
బీరుదాసకృపాప్రాప్తి - వెలయఁ జిరము
మనుమ మనుమలతోడ ల - క్ష్మయవరేణ్య!

౨. శ్రీకూరపాటి రాఘవసోదరుల వంశావళి

శ్రీరమణీయభద్రగిరి - సీమ వెలుంగుచు విశ్వమానవో
ద్ధారక మైనదాశరథి - తత్త్వము నిచ్చలుఁ బుణ్యకీర్తివి
స్తారులఁ గూరపాటికుల - చంద్రుల రాఘవలక్ష్మికోటులన్
గూరిమి నొప్పుసోదరులఁ - గూరిమిచూపుల నోముఁగావుతన్.

బహుళధనధాన్యలక్ష్మిని - వాస మనఁగ
వెలయుసత్తెనపల్లిలో - నెలవుకొన్న
యార్యవైశ్యకులంబులం - దన్నిగతుల
మేటియై పెంపుఁగనెఁ గూర - పాటికులము.

వినుతశిష్టాచార - విభవసంపన్నులై
వాసిఁగాంచిరి కూర - పాటివారు
సతతధర్మక్రియా - చరణప్రవీణులై
ప్రథితి కెక్కిరి కూర - పాటివారు

భూదేవగురుదేవ - పూజాగరిష్ఠులై
పరిఢవిల్లిరి కూర - పాటివారు
సలలితవ్యాపార - చతురులై ధనధాన్య
కోటి నొప్పిరి కూర - పాటివారు

చల్లగుండ్ల పాములపాడు - జనపదములఁ
జెఱువుగుంటలు నిర్మించి - చెట్లు నాటి
తఱుగనియశంబుఁ గాంచిరి - ధరణియందు
వైశ్యకులదీపకులు కూర - పాటివారు.

వన్నె మీఱిన శ్రీ కూర - పాటివంశ
మునకు నాగయార్యుఁడు మూల - పురుషుఁ డతని
పడఁతి వెంకమ్మ వారికిఁ - గొడుకు లిర్వు
రరయ లక్ష్మయ్య శేషయ్య - లనెడువారు.

జ్యేష్ఠుఁ డైనట్టిలక్ష్మయ్య - చిన్ననాఁడె
వినుతగుణగణజ్యేష్ఠుఁడై - పేరు గాంచె
వానియిల్లాలు కోటమ్మ - పరమసాధ్వి
తనయు లార్వురు పుట్టి రీ - దంపతులకు.

తోరపుఁగల్మితో సుతుల - తో గృహిణీమణితోఁ గరంబు సం
సారసుఖంబులం గనుచు - శాంతదయాగుణభూషణుండునై
పేరుప్రతిష్ఠలం గనియెఁ - బెంపున లక్ష్మయ దానధర్మవి
స్తారత నొప్పి తత్సుతులు - దండ్రిని మించినవార లన్నిటన్.

నందనులఁ ద్వితీయుఁడగు - నాగయ సన్నుతవ ర్తనుండు దై
నందినచర్యలందు సుగు - ణంబులప్రోవు మనీషి వర్తకం
బందు యథార్థలాభసము - పార్జనతుష్టుఁడు వైశ్యకోటిలో
మందునకైన నాతనిస - మానులఁ గానము మాననీయతన్.

సిరుల మెఱసిననాగయ్య - చిన్ననాఁడె
పెంపుతోడ మహాలక్ష్మిఁ - బెండ్లియాడి
ఘనతరాష్టవిభూతులఁ - గన్నయట్లు
సుతుల నిర్వుర నార్వురు - సుతలఁ గనియె.

రమ్యగుణరాశి జ్యేష్ఠుండు - రాఘవుండు
లచ్చిబిడ్డ ద్వితీయుఁడు - లక్ష్మికోటి
యిరువురుఁ బరస్పరప్రేమ - భరితు లేక
మతులు సుమతులు రామల - క్ష్మణులె తలఁప.

తమ్ముఁడు భక్తితో వినయ - తత్పరుఁడై తనుఁ గొల్చుచుండ బా
పమ్మను బెండ్లియాడిసుగు-ణాఢ్యుఁడు రాఘవుఁడున్ గుటుంబభా
రమ్ము వహించెఁ దమ్మునను - రక్తి గృహస్థునిఁజేసె వైశ్యబృం
దమ్మునఁ బేరుగాంచె గురు - దైవతభూసురపూజనంబులన్.

శ్రీఫిరోజిమహర్షి - శిష్యప్రశిష్యుఁడై
శర మొప్పు భక్తిమా - ర్గంబు నెఱిఁగె
నిజగురునాలయ - నిర్మాణమున కెన్నొ
రీతులఁ దగినచే - యూత యిచ్చెఁ

చిన్మయలింగాభి - షేకంబునకు మాని
తముగ ధారాపాత్ర - దాన మిచ్చె
గురుమూర్తిపుణ్యమం - దిరమునఁ గట్టించె
మహనీయరుద్రాక్ష - మంటపంబు

విదితముగ గురునిత్యసే - వేద్యమునకు
నారికేళం బొకండు పెం - పారుభక్తి
నిచ్చుచుండెను నలుబది - యేండ్లనుండి
రాఘవుని పుణ్యచరితంబు - వ్రాయ వశమె?

ఊర్ధ్వపుండ్రంబు మొగమున - నొప్పుచుండఁ
దులసిపేరులు చిఱుబొజ్జఁ - గులుకుచుండ
భక్తి పుంభావ మైనట్లు - పరఁగువాని
నిరుపమానప్రపత్తి వ - ర్ణింపలేము.

అరయ ననపత్యుఁడై మేన - యల్లు సుగుణ
రాశిఁ బెరుమాళ్ళ సత్యనా - రాయణాఖ్యు
దగ్గఱకుఁ దీసి తమ్మని - తనయ నిచ్చి
పరిణయ మొనర్చెఁ దనయాస్తి - పంచి యిచ్చె.

తనగురుభక్తి లోకవిది - తం బగునట్లు ఫిరోజిమానికా
వ్యనిచయముద్రణంబున క - పారముదంబున రెండునూర్లు గై
కొనుఁడని యిచ్చె వంశమున-కుం జిరకీర్తినిఁ గూర్చెఁ బుణ్యవ
ర్తనుఁడగు రాఘవుండు సుకృ - తంబు లప్రోవుగదా మహీస్థలిన్.

పరమసాధ్వి బాపమ్మ నిత్య - భక్తిఁ గొలువ
మేనయల్లుఁడు నీయాజ్ఞ - మెలఁగుచుండ
రాఘవవరేణ్య! గురుకృపా - ప్రాప్తి నొప్పి
చిరము మనుమోయి సుఖయశ - శ్శ్రీలతోడ.

* * *

అనుజుఁ డగులక్ష్మికోటి య - ర్ధాంగి యైన
శ్రీమహాలక్ష్మి సాధ్వీల - లామఁ గూడి
సిరులు నిండార గుణగుణ - శ్రేష్ఠుఁ డగుచు
సుతుని నొక్కని నిర్వురు - సుతలఁ గాంచె.

అన్నకు మాఱుసెప్పనిగు - ణాఢ్యుఁడు వర్తకసంఘమందుఁ బే
రెన్నికఁగన్న బేహారి ధ - నేశుఁడు సంతతదానధర్మసం
పన్నుఁడు పేరుదాసగురు - భక్తశిఖామణి యొప్పినంతలో
నెన్నఁడుఁగూడ నాస్తి యనఁ - డీతనికీర్తి వచింప శక్యమే?

ఆరయఁ దాను గాజుల బే- హారియుఁ గావున రంగురంగు సిం
గారము గాజుగాజులను - గల్మి పడంతినిఁ దన్పెనో యనఁగా
వారక లక్ష్మి వానిభవ - నంబునఁ గాఁపురముండె నిట్టిబే
హారి గలండె? పీనిదగు - నాసిక నానుడి మాటిపోయెఁగా!

అమితోత్సాహముతో ఫిరోజిగురుకా - వ్యశ్రేణి ముద్రింప ను
త్తమదానం బని రెండునూర్లొసఁగె నీ-తం డున్నతిన్ వైశ్యస
త్రముఁ గట్టించెద నంచు నొప్పగను వా-గ్దానంబు గావించె నీ
ప్రముఖుం బేర్కొనమాకుఁజెల్లదెయశో-భాగ్యంబు దైవాఱఁగన్.

పరమగుణశీల రెండవ - భార్యతోడఁ
గొడుకు గూతులతోడ నీ - పుడమిఁ జిరము
సంతతైశ్వర్యసంతాన - సౌఖ్యములను
లక్షణంబుగ మనుమోయి - లక్ష్మికోటి !

3. శ్రీ పొట్టి వీరేశముగారి వంశావళి

శ్రీ వైదేహికరాబ్జయుగ్మ మెవనిన్ - సేవించునో నిత్యమో
దావేశంబు దలంప నెవ్వనిపద - ధ్యానంబునం గల్గునో
యేవానిం గొలువన్ భవంబడఁగు నా-యీశుండు రాముండురా
జీవాత్ముం దనిశంబుఁ బ్రోచుఁ గృపతో-శ్రీ పొట్టి వీరేశమున్.

పరమపావన మైన - భరతఖండంబులో
వాసి గాంచినయాంధ్ర - దేశమందు
వెలుఁగొందు శ్రీకొండ - వీటిసీమను మహా
లక్ష్మీవిలాస మె - లర్ప మిగులు
మాదలపురిలోను - మామహేశ్వరకృపా
పాంగవిస్ఫూర్తిచేఁ - బరఁగుచున్న
వంశంబులను గుబే - రాంశమై నాయక
మణి యనం దగి రాజ - మాన్యముగను

వన్నె వాసి గాంచినయార్య - వైశ్యకులము
నందు భద్రగుణోపేతుఁ - డై చెలంగు
సుమతి పొట్టి రామస్వామి - సుగుణశీలుఁ
డతనిసతి లక్ష్మిబాయమ్మ - యమలచరిత.

ఇతనితొలిభార్య మాణిక్య - మతిసుశీల
గుణపరాధీన భర్తకుఁ - గూర్చుచాన
యీమెకడుపునఁ బుట్టిరి - యెలమిమీఁకుఁ
బుత్రకుం డొక్కఁడిర్వురు - పుత్రికలును.

అరయ రెండవభార్య రో - శమ్మ యసమ
శీల పత్యనుకూల గు - ణాలవాల
పడఁతిమిన్న వీరేశ మీ - భార్యయందు
సుతుల నిర్వర నిర్వురు - సుతలఁ గనియె.

కొడుకులయం దగ్ర - జుఁడు రామకోటి
బుద్ధిమంతుఁడు చాల - పుణ్యవర్తనుఁడు
తండ్రికిం దగినయు - త్తమధార్మికుండు
సత్క్రియాచరణుండు - సజ్జనప్రియుఁడు.
పరఁగ రెండవవాఁడు - గురునాథుఁ డరయ
నన్నకుం దగినట్టి - యతినీతిపరుఁడు
సన్నుతగుణశీల - సంపద నొప్పు
నయవర్తనుఁడు సత్య - నారాయణుండు
గొడుకులందఱిలోనఁ - గడగొట్టువాఁడు
గురునాథునకుఁ గూర్పు - కూర్మిసోదరుఁడు.

ముదమున ఫిరోజిబుషికావ్య - ముద్రణమున
కొప్పుగా శతద్వయ మిచ్చె - నుదితయశుఁడు
ఘనుఁడు వీరేశము వదాన్య - మణి యనంగ
నెగడు వీనిధార్మికత వ - ర్ణింపలేము.

కొడుకు లెల్లరు నీపంపు - గోరి సేయఁ
గూర్మి కోడండ్రు నిను భక్తిఁ - గొలుచుచుండ .
మనుమ మనుమలఁ గూడి యి - మ్మహిని జిరము
హాయి మీఱంగ వీరేశ - మార్యవర్య !

౪. శ్రీ వేంపాటి లింగయ్యగారి వంశావళి

శ్రీమంతం బగుభద్రభూధరముపై - జేజేలు సేవింపఁగా
భూమీజాతను గూడి సర్వభువనం - బుల్ లీలఁ బాలింపుచున్
రామాఖ్యం దనరారునిర్గుణపర - బ్రహ్మం బజస్రంబునుం
బ్రేమం బ్రోచుఁ గృపావిలోకనముతో-వేంపాటి లింగార్యునిన్.

ఆరయ నెల్లూరుమండల - మందు నొప్పు
మెట్లవారిపాలెంబులో - మేటి కెక్కు
కులము లన్నింట వేంపాటి - కులము మెఱయుఁ
జుక్కలగమిమధ్య దీపించు - సోముపగిది.

వాసి కెక్కినవేంపాటి - వంశమునకు
మూలపురుషుండు కొండయ్య - పుణ్యచరితుఁ
డుత్తముఁ డతండు కర్షక - వృత్తితోడఁ
ధర్మగతి నొప్పి బ్రతికె స్వ - తంత్రజీవి .

వానివంశంబు చిరవర్ధ - మాన మగుచు
వృక్షరాజంబుకైవడి - విస్తరింప
నైదవతరంబునం బుట్టె - నతులయశుఁడు
పెద్దకోటయ్య గుణములఁ - బెద్ద యనఁగ.

కమ్మఁదనాల కిక్కు యగు - కమ్మకొలంబున వన్నెవాసితో
గుమ్మము దాటకుండఁ బెద - కోటయ మేటిగ మేఁడి పట్టిపె
ద్దమ్మను దూరుపెత్తి ధన - ధాన్యసమృద్ధిని గాఁపురంబు సౌ
ఖ్యమ్మున నుండె నాతనికిఁ - గల్గిరి నందను లిర్వు రొప్పుగన్.

కొడుకు లుదయించినట్టి యా - గడియబలమొ
కడవఁగారాని తొలిజన్మ - కర్మఫలమొ
విధివిలాసమొ కోటయ్య - విభవ మెల్లఁ
దారుమారయ్యె దైవంబు - తప్పఁజూచె.

వాన కురియదయ్యెఁ - బంటలు పాడయ్యె
బ్రదుకు భారమయ్యెఁ - దుద కతండు
బ్రదుకుఁ గోర మెట్ట - వారిపాలెమునుండి
వలసవచ్చె నిరుకు - పాలెమునకు.

ముదుకం డగుకోటయ్యకు
బ్రదుకుసుఖం బింత గూర్ప - వాసికుమారుల్
పెదలింగయ్య, చినలింగయ
వదలక చెమటూడ్చి పొలము - పండించి రొగిన్.

పెద్దలింగయ్య పేరుకుఁ - బెద్ద గాక
పెద్దగొనములపెద్దయై - పేరు గాంచి
లలితమర్యాదుఁడై భాగ్య - లక్ష్మితోడ
లక్ష్మిఁ బెండ్లాడె గృహ మెల్ల - లక్ష్మి యయ్యె.

పరిణయ మైనదాని బహు - భంగులఁ గాఁపుర మెక్కి వచ్చె సో
దరునకుఁ బెండ్లియయ్యెను య - థాస్థితి యేర్పడెఁ బంటభూములన్
గరిమ లభించె సంతతియుఁ - గల్గెను బేదఱికంబు దవ్వులం
బరుగిడెఁ బెద్దలింగనకు - భాగ్యము పండె సమస్తరీతులన్.

ఇరువురు కొడుకులతో మఱి
యిరువురు కూతుండ్రతోడ - ని ల్లెప్పుడు సుం
దరమై లక్ష్మీకరమై
కరము విరాజిల్లుచుండుఁ - గన్నులవిందై.

కొడుకు లిర్వురు వెంకయ - కోటయాఖ్యు
లన్నిటం జంద్రికంటె గు - ణాఢ్యు లగుటఁ
బెద్దలింగయ్యకీరితి - పెంపుగాంచెఁ
జంద్రునిం గన్న జలధియ - శస్సువోలె.

అన్న వెంకయకంటె - నన్నింటఁ గోటయ్య
మిన్నయై సుగుణసం - పన్నుఁ డగుచు
నాదెమ్మ యనుకాంత - నతిప్రేమఁ బెండ్లాడి
దాంపత్యధర్మంబు - దవిలి సప్త
సంతానములరీతి - సప్తసంతానంబుఁ
గాంచెఁ దొల్లిఁటిభాగ్య - గరిమవలన
నిరువురు పుత్రిక - లేవురు పుత్రులు
జ్యేష్ఠురా లన్నమ్మ - చిన్నకూఁతు

రరయ సౌభాగ్యము తనూజు - లందుఁ బెద్ద
వాఁడు వేంకటప్పయ్య త - ద్భ్రాత లెన్న
నెల్లమందయ్య లింగయ్య - లింపుమీఱ
నగుదు రాదెయ్య వెంకయ్య - లనెడువారు.

వీరిలోన లింగయ్య వి - వేకశాలి
తాతపేరు నిల్పినయట్టి - నీతిపరుఁడు
వాసుదాసునిశిష్యుండు - భాగవతుఁడు
దానధర్మరతుండు వి - ద్యాప్రియుండు.

ఇంపుగ రామకోటి రచి - యించినసువ్రతుఁ డున్న యంతలోఁ
దెంపుగ నిచ్చుదాత వెను - దీయఁడు సత్క్రియలన్న మీఱి భా
షింపఁడు పెద్దలం గనినఁ - జేతులు మోడ్చుగుణంబులన్నియున్
గుంపుగ వచ్చి యేకముగఁ - గోరి వరించెను లింగయార్యునిన్.

అనయంబున్ హాలజీవియై వినుతవం - శాచారసంపన్నుఁడై
గుణవిద్యాచతురుండునై యశము ది-క్కుల్ నిండ నన్నింట మిం
చినవాఁడై ఋషిపీరుదాసకవితా - క్షేత్రంబు పండింపఁజే
సిన మా లింగయపైడినాగలిని జే - జేలైన వర్ణింపరే?

వెలఁది, అక్కమ్మ భక్తి సే - వింపుచుండఁ
గూఁతుకొడుకులు ముద్దులు - గూర్చుచుండఁ
గవుల కాశ్రయ మిచ్చి లిం - గయవరేణ్య!
చిరము మనుమోయి! సుఖయశః - శ్రీలతోడ.

౫౧. శ్రీ ఇంటూరి సీతయ్యగారి వంశావళి

శ్రీరమణీప్రియుండు సర - సీరుహనేత్రుఁడు భక్తలోకసం
చారుఁడు విశ్వరూపకుఁడు - శాశ్వతుఁ డెంతయుఁగూర్మి పెంపుసొం
పారఁగ నిత్యవైభవచి - రాయురుపేతునిఁ జేసి నిచ్చ లిం
టూరికులాబ్ధిచంద్రు సుగు - ణున్ ఘను సీతయ నోముఁగావుతన్.

ప్రథితిఁ గన్నట్టియింటూరి - వంశమునకు
మూలపురుషుండు నరసయ్య - మొట్టమొదట
నతనికాఁపుర మొప్పె స - న్నుతికి నెక్క
మానితం బైననెల్లూరు - మండలమున.

కలిమికిఁ దక్కవయ్య గుణ - గౌరవవృత్తులఁ బేరు కెక్కెఁ దాఁ
గలిగినయంతలోఁ దినుచుఁ - గర్షకుఁడై యతఁ డొప్పె; వానికిం
గలిగిరి పుత్రు లిర్వురెస - కంబుగ బాలయ వెంకయాఖ్యల
త్యలఘుచరిత్రు లుత్తమగు - ణాఢ్యులు కమ్మకులప్రదీపకుల్.

పెద్దవాఁ డైనబాలయ్య - పిన్ననాఁడె
పొలముపనులందు గడిదేఱి - హలముఁ బట్టి
చాలుగొట్టుటలోఁ దన - సాటి లేక
కొంద్ర కైదువుజోదని - గొప్ప కెక్కె.

ఇమ్మగఁ బేరుగాంచి యతఁ - డెంతయుఁగూరిమిఁ దన్నుఁగోరుసీ
తమ్మను బెండ్లియాడి తన - తమ్మునిఁగూడ గృహస్థుఁజేసె వం
శమ్ము ప్రవర్ధిలం బరమ - సాధ్వి నిజాంగనయందుఁ బూర్వపు
ణ్యమ్మున మువ్వురాత్మజుల - నర్మిలిఁగాంచెఁ ద్రిమూర్తులో యనన్.

కులము వి_స్తరిల్లు - కొలఁదిఁ బంటలు తగ్గఁ
గూడుగుడ్డలకును - గొఱత గలిగె
బ్రదుకు కష్ట మగుట - బాలయ్య చివరకు
వలసవచ్చె నిరుకు - పాలెమునకు.

ఇల్లున్ వాకిలి యేర్పడన్ కులములో - నేలోటు గాకుండ నా
పల్లెం బంటపొలంబు-లొప్పుగను సం - పాదించి సౌఖ్యంబుతో
నిల్లాలుం గొడుకుల్ మనంగ సుఖమై - యిచ్చోట బాలయ్యవ
ర్ధిల్లెన్ సంతతభాగ్యవైభవయశః - శ్రీభోగసంపన్నుఁడై.

ఆరయ వెంకయ కోటయ
వీరయ లనునందనులకు - విభవము మీఱన్
గోరినకన్యామణులను
గూరిచి పెండ్లిండ్లు సేసె - గొప్పదలిర్పన్.

సుతులు మువ్వురుఁ దమతమ - సతులతోడఁ
బొరుపు లేకుండఁగూడి కాఁ - పురము దిద్ద
ముదుక బాలయ్య విశ్రాంతి - సదనమందుఁ
బ్రమదతల్పంబునం జేరి - బ్రదుకు గడిపె.

అన్న లిర్వురికంటె - నన్నింట నధికుఁడై
పెంపుతో వీరయ్య - పేరుగాంచె
నతనియిల్లాలు మ - హాసాధ్వి లింగమ్మ
కులసతీగుణముల - గొప్పకెక్కె

ననుకూలదాంపత్య - మునకు నాదర్శమై
వారిసంసారంబు - వాసిమీఱె
నతిథిసత్కారంబు - నన్నప్రదానంబు
వారిశీలమునకు - వన్నెదెచ్చెఁ

గలము మొనలపగిది - వెలుఁగునీడలపోల్కి
లలితవాక్యభావ - ములతెఱంగు
తగ నభేదవృత్తి - తన్మిథునం బొప్పు
నింట నాట్యమాడె - నెల్లసిరులు.

ఇంట నెలకొన్న సిరులు ఫ - లించె ననఁగ
ధర్మరతు లైనవీరయ్య - దంపతులకు
సుతులు మువ్వురు, మువ్వురు - సుతలు గలిగి
రన్వయం బెల్లగతులఁ బెం - పారునట్లు.

అరయ సీతయ్య సుతులయం - దగ్రజుండు
మధ్యముం డెన్న బాలయ్య - మఱి కనిష్ఠుఁ
డగును రోశయ్య మువ్వురు - సుగుణయుతులు
తండ్రికిం దీసిపోనియు - దారమతులు.

అనుజులకంటె మిక్కిలి గుణాఢ్యుఁడు సీతయ పాటివారిలో
ఘనుఁడు నిగర్వి కర్షక శి- ఖామణి జానపదుండు వేషభా
షణములఁ జాలినట్టిసిరి - సంపద లున్నను దప్పుత్రోవలఁ
జనని వివేకి వీనిగుణ - సంపద వాకొన మాకుఁ జెల్లదే!

దేశసేవాపరుండయి - వాసిగన్న
రమ్యచరితుఁడు బత్తుల - రామదాసు
సుతను వేంకటసత్యాంబ - సుగుణశీలఁ
బరిణయంబాడి తత్కీర్తి - పంచుకొనియె.

ఘనుఁ డగుపీరుదాసకృత - కావ్యములం బ్రకటించు మాతలం
పనువుగఁ జెప్పి సాయ మని-నంతనె రొక్కము రెండునూర్లుగాఁ
గొనుఁ డని యిచ్చె వంశమున- కుం జిరకీర్తినిఁ దెచ్చె నొద్దవ
ర్తనుఁ డగుసీతయార్యుఁడు వ-దాన్యశిరోమణి గాక యన్యుఁడే!

ప్రణయసామ్రాజ్యలక్ష్మి నీ - పడఁతిఁ గూడి
వంశవర్ధను లగుపుత్ర - వరులఁ గాంచి
పీరుదాసకృపాప్రాప్తి - పెంపు మీఱఁ
జిరము మనునోయి సిరులతో - సీతయార్య!

•

౭. శ్రీ ఆత్మకూరి బాపయ్యగారి వంశావళి

శ్రీరమణీయుభద్రగిరి - శృంగమునం నెలకొన్న చిత్ప్రభా
పూరము వాసుదాసబుషి _ పుంగవసేవ్యము విశ్వమానవో
ద్ధారక మైనదాశరథి - తత్త్వము నిచ్చలుఁ బ్రేమభావ మొ
ప్పారఁగ నాత్మకూరికుల - వర్ధను బాపయ నేలుఁగావుతం.

సకలసంపదలకు సదా _ శ్రయ మనంగఁ
గ్రాలుసత్తైనపల్లిపు - రంబునందు
నతులమై యొప్పునార్యవై - శ్యాన్వయముల
నాత్మకూరివంశంబు ప్ర - ఖ్యాతి కెక్కె.

భవ్య మగు వాత్మకూరి స - ద్వంశమునకు
మూలపురుషుండు బాపయ్య - పుణ్యచరితుఁ
డతని యర్ధాంగి యాదెమ్మ - యమలశీల
పతియె దైవం బని భజించు - పడఁతిమిన్న.

భవ్యగుణరాశి యైనబా - పయ్యశ్రేష్ఠి
కలిమి దీపింప బహుధర్మ - గతుల నొప్పి
కులము వర్ధిల్ల నిజసతీ - తిలకమందు
సుతుల నల్వుర నిర్వుర - సుతలఁ గనియె.

అరయఁ గనిష్ఠుఁ డైనగుర - వయ్య గుణంబులఁ బెద్దయై నిరం
తరము ధరామరేంద్రగురు - దైవతసాధుసమర్చనంబులం
బరఁగుచుఁ బుణ్యవర్తనవి - భాసితుఁడై కులవర్ధనుండునై
కరము వెలింగె నగ్రజుల _ కంటె యశోవిభవాభిరాముఁడై.

సిరులఁ దూగుచు గురవయ్య - చిన్ననాఁడె
కులవధూతిలకం బనఁ - గొమరుమిగులు
సీతమాంబను బెండ్లాడి - నీతిపరుల
సుతుల మువ్వుర, నిర్వుర - సుతలఁ గనియె.

సజ్జనహితుండు జ్యేష్ఠుఁడు - సత్తిరాజు,
మధ్యముం డెన్న బాపయ్య- మహితయశుఁడు,
మఱి కనిష్ఠుఁడు వేంకటే - శ్వరులు సుమతి,
తనయ లాదెమ్మ బుల్లెమ్మ - లనెడివారు.

గుణరాశి-రెండవ - కొమరుండు బాపయ్య
పరమశాంతుఁడు సత్య - భాషణుండు
వాసుదాసునిశిష్య - వరుఁడు సుశీలుండు
దీనదయాగుణ - మానసుండు
భూదేవగురుదేవ - పూజారతుఁ డుదార
భావుండు నీతి ద - ప్పనిబేహారి
భద్రశైలానేక - పరమపావనతీర్థ
యాత్రాపరుండు దే - శాభిమాని

ప్రాకటంబుగఁ గోదండ - రామునకును
బైడిసొమ్ములు గూర్చిన - భాగవతుఁడు
మోస మెఱుఁగని పరమవి - శ్వాసజీవి
యితనిఁ బోలినబేహారు - లెచట లేరు.

గుణవతి రత్తమాంబ తన - కుం బనులన్నిటఁ దోడునీడయై
యనిశము సంచరింప నన - ఘాత్ముఁడు బాపయ స్వీయగోత్రవ
ర్థను లగుపుత్రులన్నలువు-రన్, సుతలిర్వురఁగాంచియెంతయున్
ఘనతరకీర్తివైభవని - కాయముతో మహిఁ నొప్పె మేటియై.

సదయుం డడుగుటె తడవుగ
ముదమున ఫీరోజిగ్రంథ - ముద్రణమున కొ
ప్పిదముగ నొకశత మిచ్చెను
విదితయశుం డితనిఁబోలు - వితరణి గలఁడే?

ఆతనినల్వురు కొడుకులం - దగ్రజుండు
గోటయాఖ్యుఁడు సకలస - ద్గుణములందుఁ
దండ్రికిం దీసిపోనియు - త్తమచరిత్రుఁ
డితఁడు చిరజీవియై కీర్తి - నెనయుఁగాత!

వెలఁది రత్తమ్మ నిను భక్తిఁ - గొలుచుచుండ
సుతులు నల్వురు నీకీర్తి - లతను బెనుప
బాపయనరేణ్య! శ్రీరామ - భద్రుకృపను
మనుమ మనుమలఁ గూడి యి - మ్మహిని జిరము.

౭. శ్రీ అన్నము వేంకటనారాయణ సోదరుల వంశావళి

శ్రీరుక్మిణీపతి - శ్రితజనావనుఁడు
వేణుగోపాలుండు - విశ్వప్రభుండు
పరఁగ నన్నమువంశ - వార్ధిచంద్రులను
ధీరుని వేంకట - నారాయణాఖ్యు
బుధసన్నుతునిఁ గృష్ణ - మూర్తి సచ్చరితుఁ
గమనీయగుణుని వేం - కటసుబ్బరావుఁ
జిరయశోధనుల ము - వ్వురు సోదరులను
నిరతంబు సత్కృపా - గరిమ మీఱంగఁ
బ్రకట యశశ్శ్రీల - రక్షించుఁగాత!

దానధర్మయశోధన - ధాన్యములను
భవన మనఁ జెల్లుసత్తెన - పల్లిలోన
నలఘుగతి నొప్పువార్యవై - శ్యాన్వయముల
వాసికెక్కెను నన్నము - వంశ మిలను.

వన్నె మీరఁజేసినయన్నము - వంశమునకు
మూలపురుషుండు లక్ష్మయ్య - పుణ్యమూర్తి
యతనియిల్లాలు ముత్తమ్మ - యలఘుశీల
పృథుగుణస్తోమ మహిత సా - ధ్వీలలామ.

లలితవర్తనుఁ డైన - లక్ష్మయ్యశ్రేష్ఠి
పొలుపొందు బహుభాగ్య - భోగంబు లొప్ప
దానధర్మక్రియా - తత్పరుం డగుచు
సాటివారలలోన - మేటి నాఁ బరఁగి
ప్రాకటంబుగ వంశ - వర్ధను లైన
కొడుకుల నల్వురఁ - గూఁతు నొక్కతెను
గాంచెను ముత్తమ్మ - కడుపుచల్లఁగను.

నందనులం బెద్ద - నాగభూషణము
పరికింప రెండవ - వాఁడు రాజయ్య
పుణ్యుఁడు క్రిష్టమ్మ - మూఁడవకొడుకు
కులవర్ధనుఁడు వైశ్య - కులదీపకుండు
నాల్గవకొమరుఁ డె - న్నఁగ బాపనయ్య
కూఁతురు లక్ష్మమ్మ - గుణములదొంతి
కొడుకులు గోడండ్రు - కూఁతు రల్లుఁడును
ముద్దుముచ్చటలఁ గాఁ - పురములు సేయ
లలితసంపదలతో - లక్ష్మయ్యగృహము
కన్నులవిందుగాఁ - గళకళలాడె.

అరయఁ గ్రిష్టమ్మ కూర్మి యి - ల్లాలు మేలు
పున్నెములచాలు పున్నమ్మ - పోలఁతిమిన్న
యామెకడుపుచల్లగఁ బుట్టి - రలఘుమతులు
మువ్వురు కుమారవరులు త్రి - మూర్తులట్లు.

చిరయశుఁ డగ్రజుండు నర-సింహాము;వెంకయమధ్యముండు; స
త్పురుషుఁడు వేంక టేశ్వరులు-మూఁడవవాఁడు; వణిక్కులంబులో
సురుచిరదానధర్మగుణ - శోభితుఁడై సుచరిత్రుఁడై సదా
స్థిరమతియై వెలింగె నర - సింహాము నిక్కము వైశ్యసింహామై.

అతనిభార్య మహాలక్ష్మి - యనుపమాన
శీలవతి వాసుదాసుని - శిష్యురాలు
వారికిం బుట్టిరి కుమార-వరులు మువ్వు
రొక్క-కూఁతురు గుణవతి - యుజ్జ్వలాంగి.

మువ్వురిలో జ్యేష్ఠ - పుత్రుఁడు వేంకట
నారాయణుఁడు మహో-దారగుణుఁడు
దానధర్మపరుండు - తగ వైశ్యకోటిలోఁ
బేరుపెంపును గన్న - 'పెద్దమనిషి'
సత్తెనపల్లి పం - చాయతిపరిపాల
కమహాసభాపతి - కలిమిపట్టి
గుంటూరుమండల - గురుతరాంధ్రమహాస
భావాఙ్వనసమితి క - ధ్యక్షుఁడయ్యె

నడిగినంత నేపుణ్యకా - ర్యమునకైనఁ
గాదనక యిచ్చునెఱదాత - కలిమికొలఁది
వీనియిల్లాలు పుల్లమ్మ - వెలఁదిమిన్న
పతికిఁ దగినట్టిసతి గుణ - వతి సుశీల.

చెలఁగి రెండవవాఁడు - శ్రీకృష్ణమూర్తి
యన్నకుం దగినట్టి - యనుజుఁ డన్నిఁటను
మతిమంతుఁ డొందు స - న్మతవర్తనుండు
ధర్మకార్యరతుండు - దానకర్ణుండు
గురుదేవసాధుభూ - సురభక్తిపరుఁడు
వినయవంతుం డర్థి - జనపోషకుండు
పరులని యాత్మీయ - వరులని భేద
మెన్నని సమవర్తి - యేపుణ్యకార్య
మునకైన నెవరైనఁ - దనసాయ మింత
గోరినంతనె యిచ్చు - మాఱుమా టనక
శ్రీశాలి చిరయశ - శ్శ్రీశాలి శీలి
యితనిభార్య గురమ్మ - మతిమంతురాలు
పతిమది కెక్కిన - వనితాలలామ.

కడగొట్టువాఁడు వేం - కటసుబ్బరావు
చిఱుతప్రాయమువాఁడు - జ్యేష్ఠసోదరుల
మాట మీఱనివాఁడు - మంచివాఁ డెందుఁ
బైకి రాఁగలవాఁడు - ప్రజ్ఞాయుతుండు
వీనికూర్మిపడంతి - వినయసంపన్న
వేంకటరత్నాంబ - విమలచారిత్ర
సౌభాగ్య సౌందర్య - సామ్రాజ్యలక్ష్మి.

చిరయశులు వీరు మువ్వురు - గురుఫిరోజి
గ్రంథముద్రణమునకు ధ - ర్మమని మేము
గోరినంతనె నూటప - దాఱు లిచ్చి
రుత్తములు వీరెఁ గీర్తింప - నొప్పుఁగాదె!

వీరు మువ్వురుఁ జిరయశో - విభవ మొప్ప
దానధర్మక్రియాపర - తంత్రు లగుచు
సుతసతీహితభాగ్యసం - తతులతోడఁ
జిరము వర్ధిల్లుదురుగాత! శ్రీశుకృపను.

రా॥ శ్రీ కనుమూరి రామస్వామిగారి వంశావళి

శ్రీఫిరోజిఋషీంద్ర - సేవ్యుండు భద్ర
శైలాధివాసుఁడు - జానకీప్రియుఁడు
ముల్లోకముల నేత - ముక్తిప్రదాత
శ్రీరామచంద్రుఁడు - సేవితామరుఁడు
కనుమూరిసత్కుల - కలశాబ్ధిచంద్రు
శ్రీఫిరోజిమహర్షి - శిష్యప్రశిష్య
భూదేవగురుదేవ - పూజనాసక్తుఁ
గమ్మకులస్వామి - ఘనమోక్షకామిఁ
బరఁగ రామస్వామి - భక్తునిం గృపను
వీక్షించి సతతంబు - రక్షించుఁగాత!

శ్రీసత్యభామాపు - రీసీమయందుఁ
బ్రాకటం బగునార్నె - పాడుగ్రామమున
వాసికెక్కినదొడ్డ - వంశంబులందుఁ

గనుమూరి వంశంబు - ఘనకీర్తి నొప్ప
సిరులతోఁ జిరపుణ్య - పురుషులతోను.

ఆవంశమున కెన్న - నార్యసన్నుతుఁడు
పుణ్యాత్ముఁ డబ్బయ్య - మూలపూరుషుఁడు
వానిసతీమణి - జానమ్మ వినుత
గుణజాల పత్యను - కూల సుశీల.

ఆదంపతులకీర్తి - యతిశయింపంగ
విలసిల్లుగనుమూరి - కులము వర్ధిల్లఁ
దొలినోము లన్నియుఁ - దోడ్తో ఫలింపఁ
బంచపాండవులట్లు - పంచాగ్నులట్లు
పుట్టిరి యేవురు - పుత్రులు; వరుస
వెంకయ్య, అప్పయ్య - వేంకటస్వామి,
చలమయ్య, కోటయ్య - కులభూషణములు.

వెలయ మూఁడవవాఁడు - వేంకటస్వామి
యాదెమ్మ యన నొప్పు - నర్ధాంగియందు
దశరథక్ష్మాపాలు - తనయులం బోలెను
బుద్ధిమంతులఁ బుణ్య - పురుషపుంగవులఁ
గనియెను నలువురు - తనయుల; నందు
ఘనుఁ డగ్రజుండు వేం - కటరాయఁ డతని
యనుఁగుసోదరులు ల - క్ష్మయ్య వెంకయ్య
నరసింహాలనువారు - నల్వురు సుతులు

గురుదైవసాధుభూ - సురభక్తిపరులు
సదమలచిత్తులు - సజ్జనప్రియులు.

వేంకటరాయుఁడు - విభవ మొప్పంగఁ
బడఁతి లక్ష్మీదేవిఁ - బరిణయం బాడి
దానధర్మంబులఁ - దగఁ బెద్ద యగుచుఁ
జీమలమఱ్ఱిలోఁ - జింతలతోఁపు
వేయించె బావి త్ర - వ్వించె గొప్పగను
వెలయించె వంశంబు - పేరు పెం పెసఁగ
నతనికిఁ బుట్టిరి - యనఘాత్ము లైన
కొడుకు లిర్వురు కమ్మ - కులశిరోమణులు
మహనీయగుణుఁడు రా - మస్వామి జ్యేష్ఠ
సుతుఁడు ద్వితీయుండు - సుబ్బయ్య ఘనుఁడు.

మహితయశుండు రా - మస్వామి పుడమి
రామదా సను పేర - రాణించువాఁడు
దైవభక్తిపరుండు - ధర్మప్రభుండు
పుణ్యకార్యరతుండు - భూసురప్రియుఁడు
రమ్యవర్తనుఁడు ని - రాడంబరుండు
శ్రీషిరిడీమహర్షి - శిష్యపుంగవుఁడు
పొలుపొందు గుడిమఠ - భోజనశాలఁ
గట్టింపఁ దొడ్డపెఁ గల్మికొలందిఁ
జిన్నరథంబును - జేయించి యిచ్చెఁ
దగ నగారా యొండు - దానంబు చేసె

గ్రామంబులో నొప్పు - రామాలయమున
శాశ్వతంబుగ ధ్వజ - స్తంభ మెత్తించె
భక్తితో భద్రాద్రి- వాసు దర్శించె
శ్రీజగన్నాథుని - సేవించి వచ్చె
నొంటిమిట్టకుఁ బోయె - యోగి వేమన్న
మఠము బ్రహ్మము వారి - మఠము దర్శించె
నితనికిఁ దగినట్టి - సతి యీశ్వరమ్మ
సకలగుణోద్దామ - సార్థకనామ
పరమపతివ్రత - బహుపుణ్యచరిత.

ముదముతో గురుకావ్య - ముద్రణంబునకుఁ
గోరినంతనె యిచ్చె - నూఱురూప్యములు
మతిమంతుఁ డైనయీ - మహనీయుకీర్తి
విభవంబు జగతికి - వినిపింపఁ దగదె ?

మాన్యుఁడ వోయి రా - మస్వామి ! నీవు
గుణవతి యైన నీ - వనితతోఁ గూడి
చిరకీర్తిపరుఁడవై శ్రీఫిరోజిబుషి
శిష్యపుంగవుఁడవై - శ్రీరామపాద
సేవాపరుండవై - చిరము సంపదల
రామచంద్రస్వామి - రక్షింపఁ బడమి
రామదాసనువేర - రాణింపు మయ్య !

* * *

## ౯. శ్రీ జంగా బుచ్చిరెడ్డిగారి వంశావళి

శ్రీమంతం బగుభద్రభూధరముపై - జేజేలు సేవింపఁగా
భూమీజాతను గూడి సర్వభువనం - బుల్ లీలఁ బాలింపుచున్
రామాఖ్యం దనరారునిర్గుణపర - బ్రహ్మంబు నిత్యంబు స
త్యామార్థంబు లొసంగి ప్రోచు ఘను జం-గా బుచ్చిరెడ్డిన్ గృపన్.

శ్రీల మెఱయుసత్తెనపల్లి - సీమలోని
కొమిరెపూడిగ్రామంబులోఁ-గొమరు మిగిలి
సతతసత్క్రియాచరణప్ర - శస్తి గాంచి
యతులమై యొప్పెఁ బుడమి జం - గాన్వయంబు.

ఇమ్మహనీయవంశమున - కేలికనాఁ దగి రామిరెడ్డి భా
గ్యమ్మునఁ బెద్దయై సుమతి-యై సుఖియై బహుధార్మికుండునై
నెమ్మది బంగరమ్మ గృహి - ణీమణి సాధ్వి సుశీల తన్ను ని
త్యమ్ము భజింప సద్యశముఁ-దద్దయుఁగాంచె స్వతంత్రజీవియై.

ఈదంపతులకుఁ జిరపు
ణ్యోదయుఁ డనఁ బుట్టెఁ బుత్రుఁ-డొక్కఁడు ఘనుఁ డి
మ్మేదిని భద్రయశస్సం
పాదకుఁ డగుబుచ్చిరెడ్డి - వంశాగ్రణియై.

నిరుపమ శుభగుణసంప
ద్భరితుం డగుబుచ్చిరెడ్డి - తనయుం డగుటన్
ధర రామిరెడ్డికీరితి
తిరమై దశదిశల నిండె - దివిజస్తుతమై.

స్వగ్రామమున రామ - భక్తుఁడై కట్టించె
వేలు గుప్పించి రా - మాలయంబు
స్థిరయశుం డమరావ - తీక్షేత్రవిద్యాల
యమునకు వేలిచ్చె - నడిగినంత
రమణ సత్తెనపల్లి - రైతుజాతీయక
శాశాల కిచ్చెఁ జా - లఁగ ధనంబు
శ్రీశిరోజిమహర్షి - కృతకావ్యముద్రణ
మున కిచ్చెఁ దండ్రివే - రున శతంబు

యశముఁ గోరక ధర్మకా - ర్యంబు లన్న
నడుగకుండనె యిచ్చుపు - ణ్యాత్మకుండు
రెడ్డికులదీపకుఁడు చాల - దొడ్డవాఁడు
నిరుపమము వీనికీర్తి వ - ర్ణింపఁదరమె ?

మహితజాతీయ విద్యాభి - మాని వగుచుఁ
భక్తి తోలఁకాడ రామసే - వకుఁడ వగుచుఁ
దాత్యాగివై భోగివై శీలి - వై చిరంబు
పుడమి మనుమోయి సిరులతో - బుచ్చిరెడ్డి !

ఓం శాంతిః – సమాప్తము



## శ్రీ మన్నవ లింగయ్యగారి వంశావళి

శ్రీరమణీయభద్రగిరి - శృంగము నక్క నెలకొన్న చిత్రప్రభా
పూరము పేరు దాసఋషి - పుంగవసేవ్యము విశ్వమానవో
ద్ధారక మైనదాశరథి - తత్త్వము భద్రయశస్సుఖంబు లో
ప్పారఁగఁ బ్రోచుఁగావుత దయామతిమన్నవలింగయార్యునిన్.

మానితం బగుగుంటూరు - మండలమునఁ
పేరుగాంచినమేడికొం - డూరునందు
దానధర్మయశశ్శ్రీని - ధాన మగుచు
ఖ్యాతి కెక్కెను మన్నవ - కమ్మకులము.

ధనధాన్యంబుల కిక్కలై యచేత - త్త్వజ్ఞానవేదాంతసా
ధనసంపత్తికి మూలమై చిరయశో - ధర్మక్రియానేకధీ
జనవాంఛాపరిపూర్తి కాశ్రయమునై - సత్పుణ్యశీలైకభా
జనమై మన్నవవంశ మొప్పె నిల నా-చంద్రార్కసంస్తుత్యమై.

వన్నె మీఱినమన్నవ - వంశమునకు
మూలపూరుషుఁ డక్కయ్య - పుణ్యయశుఁడు
వానియిల్లాలు వెంకమ్మ - పడఁతిమిన్న
విమలగుణసీమ పరమసా - ధ్వీలలామ.

ధర్మరతులైన అక్కయ్య - దంపతులకుఁ
బుత్రరూపంబు గైకొని - పూర్వపుణ్య
సంచయము లెల్ల సాక్షాత్క - రించె ననఁగఁ
గలిగెఁ జినలింగయసుతుండు - కులఘనుండు.

కమ్మకులావతంసుఁ డనఁ - గాఁ జినలింగయ పెంపుగాంచి భా
గ్యమ్ములఁ బెద్దయై యపర-కర్ణుఁడునై గృహలక్ష్మి గౌరమా
దెమ్మను గూడి విప్రగురు - దేవసమర్చకుఁడై యయోధ్యగో
త్రమ్ము ప్రవర్ధిలన్ సుగుణ-ధాముల మువ్వురుపుత్రులంగనెన్.

అరయఁగుమారులందుసుగు-ణాఢ్యుఁడు 'క్రిష్టయ' పెద్దవాఁడు;సు
స్థిరయశుఁడెందుమధ్యముఁడు- శేషయ; అక్కయ చిన్నవాఁడు; స
త్పురుషులు వీరుమువ్వురుఁ త్రి-మూర్తులకైవడి నొప్పమీఱ అశే
షరుచులతో వెలింగెఁ జిన-లింగయ అత్రిమహర్షియో యనన్.

స్థిరసంకల్పుఁడు క్రిష్టయాహ్వయుఁడు ల-క్ష్మీనాథుఁడై పుణ్యకా
ర్యరతుండై నిరతాన్నదానపరుఁడై - యాచంద్రతారార్కకీ
ర్తిరమాశోభితుఁడై నిజాన్వయము వ - ర్థిల్లంగ రాకానిశా
కరునిం బోలుసుపుత్రు నొక్కనిఁ గనెన్-గల్యాణచారిత్రునిన్.

అక్కుమారుఁడు లింగయా - హ్వయుఁడు ఘనుఁడు
మన్నవకులంబు వెలయించు - మహితయశుఁడు
పుట్టినప్పుడె తన్ముఖ - ముకురమందు
సత్పురుషలక్షణంబులు - చాలఁ దోఁచె.

చిన్నతనంబునుండి గుణ - శీలవచోవినయప్రవర్తనా
భ్యున్నతితోనెసంగుచుఁ గు-లోత్తముఁడై పితృమాతృభక్తిసం
పన్నత నొప్పి విప్రగురు - బంధుజనప్రియుఁడై తనర్చుమా
మన్నవలింగయార్యుని స-మానులఁ గానము పుణ్యసంపదన్.

స్వగ్రామమున హరి - జనులకు వసతిగా
నిర్మించె మఱి మంచి - నీళ్ళబావి
*అన్నగారిమఠంబు - నావరణం బెల్ల
మించువేడుకఁ బఱ - పించె రాయి
కోరివంత షిరోజి గురుకావ్యముప్రణం
బున కిచ్చె నిన్నూఱు - ముదముతోడఁ
కూరిమితోఁ •చిన - గోవిందరాయుల
మఠమున కేఁబది - మాడ లిచ్చె

నింటి కరుదెంచుయాచక - బృందములకు
దానధర్మంబు లిచ్చుఁ బా - త్రతకొలందిఁ
చేసి గోరని ప్రతిఫలా - పేక్ష లేని
వానివితరణ మేమని - వ్రాయవచ్చు ?

తుల లేనిసిరులు గృహమున
విలసిల్లిన నేమి ? యతఁడు - విషయంబులకుఁ
వలనుపడక, పరిపూర్ణా
చలతత్వనిగూఢవిషయ - సక్తుం డయ్యెఁ.

---

* అప్పైనగుంటపాలెములో నిర్మింపఁబడినమఠము.

• శ్రీషిరోజీబుషీంద్రులవారి రెండవకుమారులు - ప్రస్తుతము వారి మఠము పత్తేనపల్లిలో నిర్మింపఁబడుచున్నది.

పరమార్థగ్రహణాభిలాషి యగుచున్-బాటించి తత్త్వార్థమున్
గఱచెన్ గొప్పగ వావిలెర్ల హనుమేం-ద్రస్వామిశుశ్రూషన్
బరగన్ దారణమాఘకృష్ణదశమిన్-బ్రాజ్ఞుల్ గనన్ మెచ్చఁగ
సురపీఠాధిపుఁడయ్యెఁ; నీనియశమున్ గొండాడ మా కొప్పదే!

అనుపమకీర్తిశాలి యగు - నాతనికిం దగినట్టిభార్యలై
గొనములదొంతిరై కొలము - గొమ్మలకెల్లను మేలుబంతులై
తనరినరత్తమాంబ గురు - దైవతవిప్రహితార్థికోటులన్
దనుపుచు నన్నపూర్ణ యనఁ - దా నుతికెక్కెను బుణ్యశీలయై.

అనిశంబున్ రఘురామచంద్రపదసే - వాసక్తుఁడై యొక్కప్రోలిం
గనఘన్ భూమిజతోడ రాఘవుఁడు మే-ల్గావింప సాక్షాత్కరిం
చె ననన్ దత్సతి రత్తమాంబ కనియెన్ - జిన్నారిపోన్నాహ్వయం
బనునిన్ మన్నవగోత్రవర్ధనుని సీ - తారామునిన్ ధీమణిన్.

ఇమ్ముగ సీతారామయ
యెమ్మెయిఁ దనతండ్రిఁ బోలి - యెసఁగుచు, సొబగుం
గొమ్మను లక్ష్మీసంపూ
ర్ణమ్మను బెండ్లాడి బుధజ - నాగ్రణి యయ్యెన్.

ఈరీతి ఘనతతోఁ బెం
పాఱిన మన్నవకులంబు - బహుభద్రములన్
ధారుణి నాశశిదినకర
తారకముగఁ బెంపుఁగనుత - తరతరములకున్.



ఓమ్

# శ్రీ గురు పీఠిక

సీ. శ్రీధరపాద రా - జీవ చిన్మయ భృంగ
భృంగార వాగ్రని - ర్భిన్నపూర్ణ
పూర్ణిమాచంద్రి కాం - భోధిసుధాభాను
భానుకోటిప్రభా - భాసమాన
మానసాంత ర్వేది - మధ్యతత్పరహంస
హంసతూలిక తల్ప - శా నన్నైక
యేకాంతఖేల మో - క్షేంది రైక్యాకార
కారణగురుమూర్తి - సూరికల్ప

గీ. కల్పనాతీత పర విద్వ - కల్పముక్త
ముక్తసంగ సమస్తార్తి - రిక్త సత్య
సత్యపుర మందిరాత్మ ని - శ్చల దశేష
శేషగురు రాజయోగి చి - త్తోషభోగి.

సీ. ద్వాదశప్రదేశ ప్ర - దీప్తసహస్రార
సారసాంతస్సార - సప్రభావ
భావేతరాత్మ స - ద్భావ సంభావితా
నంద కందళిత ధ - న్యదివ్యకాస
కాసారసంగమ - కాంచన సౌధాంత
రాంతరారామ త - త్త్వైకరత్న
రత్నసింహాసనా - గ్రాసీన గురుదేవ
దేవతా స్తవశార - దీయచంద్ర

గీ. చంద్రికా సాంద్రరేఖ వ - చ్చాంత సంత
సాంతరంగ దయాపర - సదయ సత్య
సత్యపుర మందిరాత్మ ని - శ్చల దశేష
శేషగురు రాజయోగి చి - త్తోషభోగి.

సీ. దుర్భవాపార పా - థోధి సముత్తార
తారకబ్రహ్మ వే - దార్థసార
సారస సత్ఫుల్ల - సత్పరాత్మాకార
కారణకార్య వి - స్తారమూర్తి
మూర్తిత్రయాత్మక - ముక్తికాంతా వర
స్థావర జంగ మా - ద్యఖిలలోక
లోకితసాక్షి ని - ర్లోకా నహంకార
కారణతను మహా - కారణాది

గీ. ఆదిమధ్యాంతలీన ద - యాంతరంగ
రంగ దకలంక దేశిక - రాయ సత్య
సత్యపుర మందిరాత్మ ని - శ్చల దశేష
శేషగురు రాజయోగి చి - త్తోషభోగి ! ౩

సీ. ఏకీభవద్గురు - లోకాంత లోకేశ
లోకేశ దృగ్మనో - లోకనిత్య
నిత్య నిర్నిత్య ని - ర్హాత్య ప్రత్యగభిన్న
భిన్నమాయాగుణ - భేద్యభేద
భేదవిచ్ఛేద స - న్మోద నిరింద్రియ
యింద్రియ చక్షుర్ని - రీక్ష్యమాణ
మానసప్రాణ వి - జ్ఞానాధిక క్రమ
క్రమనివృత్తిమ విహీన - కల్మషహారి

గీ. హరిహరాంతగప్రకాశ స - ర్వాంతరాత్మ
ఆత్మలక్షిత బుధపాల - నైక సత్య
సత్యపుర మందిరాత్మ ని - శ్చల దశేష
శేషగురు రాజయోగి చి - త్తోషభోగి ! ౪

సీ. దీక్షాకరోక్ష ప్ర - త్యక్ష దీక్షాధ్యక్ష
అక్షయు గాప రూ - పాక్షలింగ
లింగాంగ చిదపాంగ - మంగళేంగిత సంగ
సంగభంగాసంగ - సాంగయోగ
యోగనిద్రామోఘ - భోగధుర్యానురాగ
రాగరోగాఘ సం - త్యాగమార్గ
మార్గణాసర్గళ - భర్గవద్వర్గ వి
సర్గ సద్వర్గాప - వర్గదాత

గీ. ధాత సంత్రాత సద్గుణ - వ్రాతచేత
చేతనాతీత నిర్మల - పూతసత్య
సత్యపుర మందిరాత్మ ని - శ్చల దశేష
శేషగురు రాజయోగి చి - త్తోషభోగి !

సీ. పరమ పావనమైన - గురుసంప్రదాయంబు
విరచింపఁగాఁ జాల - వేడుకయ్యె
పరిపూర్ణ కేవల - బ్రహ్మైక్య సిష్టాగ
రిష్ఠస్వభావుఁడై - సృష్టియందు
నఖిలయోగములందు - నతిగుహ్య మగురాజ
యోగ మీలా గని - బాగుమీర
నోమి సాంఖ్యముఁ దార - కామనస్కంబులు
తత్త్వమస్యాది తా - త్పర్యమెల్ల

గీ. సాంగముగఁ దెల్పి సత్కృపా - పాంగదృష్టి
తోడ రక్షించి కడతేర్చెఁ - దోర మెసఁగ
నట్టి గురుసంప్రదాయ పూ - ర్వక్రమంబు
తెలిసినంతకు వివరింతుఁ - దేటపడఁగ.

సీ. శ్రీరాజయోగ వి - చారసంపత్పరి
పూర్ణబ్రహ్మ ప్రమో - దార్ణవంబు
స్వాభావి కాంచిత - సచ్చిదానంద త
త్వాఖండ కేవ లా - త్మైక్యఘనుఁడు
ఘన సుషుమ్నాగ్ర ప్ర - కాశస్వయంజ్యోతి
కాంతికలాప వి - క్రాంతిగురుఁడు
చిన్మయజ్ఞాత మ - నోన్మన్యతీత జీ
వన్ముక్తినేత సం - విన్మయుండు

గీ. సగుణ నిర్గుణములు గాని - సత్యధనుఁడు
ఆదిమధ్యాంతములు లేని - యాదిపురుషుఁ
డార్యవంశాబ్ధి చంద్రుఁడై - యన్నిగతుల
నుపనిష ద్బ్రహ్మ మనఁగఁ జె - న్నొందె భువిని.

సీ. తదుపనిష ద్బ్రహ్మ - తత్వరూపుఁడు పూర్ణ
కరుణాకటాక్ష వీ - క్షణ యుండు
మహాపమాంకార త - న్మాత్ర విలక్షణా
తీంద్రియాత్మకుఁడు జి - తేంద్రియుండు
త్రిగుణవిధ్వంసి సం - దీప్త తత్వదఖండ
పరత త్త్వసార సౌ - ఖ్యారతవిభుఁడు
నిగమపురాణోప - నిషదంత చింతనా
వ్యయ సుధా స్వాదుపా - నైకహృదయ

గీ. శాంతమూర్తి మనోజయా - నంతకీర్తి
శ్రీకరుండు ద్వితీయ దే - శికవిభుండు
గురుకులాంభోధి పీయూష - కిరణుఁడైన
రంగరాజాఖ్య గురుఁడు నె - లంగె భువిని.

సీ. ఆరంగరాజ స - దాచార్య కరుణా క
టాక్ష వీక్షణయుక్తుఁ - డాత్మవిదుఁడు
సర్వదా త్యక్త వా - సన మాన నిష్ఠాగ
రిష్ఠనిర్వాణ సం - తుష్టిమయుఁడు
వాక్యచతుస్సార - వాహ సౌఖ్యాపరో
క్షాద్వితీయ స్వప్ర - కాశమయుఁడు
కరణనిగ్రహ నిరా - కాశ నిశ్శబ్ద బ్ర
హ్మాత్మైక్యరసా స్వాది - తాంతరంగుఁ

గీ. డవ్యయానాశేష పర శక్తుఁ - డచలపూర్ణ
శ్రీమదాత్మ తృతీయ దే - శికవరేణ్యుఁ
డైన చిట్టెము శెట్టి వం - శాబ్ధిచంద్రుఁ
డతఁడు లక్ష్మయనామ స - దార్యుఁడలరె.

సీ. ఆలక్ష్మణార్య స - త్యానుకంప సదపాంగ
వీక్షణాలంకృత - విమలచరితుఁ
డవ్యక్తుఁ డవ్యయుం - డప్రమేయుం డనాద్యుఁ
డకలంకుఁ డక్షరుఁ - డద్వితీయుఁ
డగుణుం డసంగుఁ డ - నాకాశుఁ డద్వయుం
డవిషయుం డమలినుఁ - డప్రతర్క్యుఁ
డగు పరబ్రహ్మ చ - తైక్య సుఖానంద
పూర్ణుఁడు సహజకం - పార్ణవుండు

గీ. శ్రీమదాత్మ చతుర్థ దే - శిక విభుండు
జమిలివంశ పయోనిధి - చంద్రుఁడైన
శేషగురువర్యుఁ డెలమి భా - సిల్లె భువిని
తద్గురూత్తము సత్సంప్ర - దాయ మిదియ.

సీ. ఆనదాచార్య శి - ఖావతంసుఁడు మాకు
త్రిగుణాత్మక ప్రాకృ - తిని హరించి
యరిషడ్గణంబుల - నంటనీక మనో వి
కారంబు లన్ని ని - ర్గతముఁజేసి
పరమగోప్యంబైన - పరమాత్మతత్త్వ మి
ట్లని కటాక్షించి భ - యంబుఁ బాపి
మముఁ గృతార్థులఁజేసి - మాయావిదూరుఁడై
సదమలరౌద్రి వ - త్సరమునందుఁ

గీ. పరగ శ్రావణ మందున - బహుళతదియ
భానువాసరయుక్త శు - భ ప్రదంపు
దివసమందున బ్రహ్మైక్య - ధీరుఁడయ్యె
శ్రీమదాత్మానుభవుఁడు శ్రీ - శేషగురుఁడు. ౧౧

సీ. కుంద మందా రార - విం దోత్పల సుగంధ
మల్లికా మాలతీ - మహితతులసి
దళ పుష్పచయములఁ - దద్గురు పాదప
ద్మంబులఁ బూజించి - తాల్మిమీర
చందనాగరు ఘన - సార కస్తూరికా
న్వితత యక్షకర్ద మా - క్షతలతోడ
ధూపనైవేద్య ప్ర - దీప దధిక్షీర
ఘృతమధు శర్కరాం - చిత ఫలములు

గీ. దక్షిణలతోడ గురుతులా - ధ్యక్షయతికి,
విమల కర్పూర తాంబూల - వితతితోడఁ
జేరి యర్పించి నిర్మల - శేష మంది
పంచుకొని మెక్కరయ్య స - ద్భక్తులార! ౧౨

సీ. శ్రీశేషగురునకు - శిష్యుఁడ నగుపీరు
దాసుఁడ నే శౌరి - దాసులకును
దాసుఁడ బుధజన - తాపవిధ్వంస స
ద్భావు శ్రీవనమాలి - భక్తియుతుఁడ
నై గురుపీఠిక - నత్యంతభక్తితో
వర్ణించినాఁడ దు - ర్వారమహిమఁ
జదివిన వ్రాసిన - శ్రద్ధతో విన్నను
జనులకు నిష్టార్థ - సంపదలును

గీ. వృద్ధియుం గల్గు మోక్షార్థ - సిద్ధి గలుగుఁ
గ్రాలు నిది యాచంద్ర తా - రకము పుడమి
చల్లనగు దయ మమ్మేలు - మెల్లయెడల
నార్త జనపోష రామ భ - ద్రాద్రిరామ !

శ్రీ గురుపీఠిక సంపూర్ణము





శ్రీ దూపగుంట్ల లక్ష్మయ్య దంపతులు

ఓమ్

# పన్నగాచలనాయకశతకము



## మత్తకోకిలవృత్తము

శ్రీరమారమణీ మనోహర - చిన్మయాత్మక పాండుర
స్మేర శోభితరాజమండల - స్నిగ్ధ సద్వదనాంబుజా
వారిజాసన సోమశేఖర - వందితాంఘ్రి సరోరుహా
పారమోక్ష శుభప్రదాయక - పన్నగాచలనాయకా! ౧

పంకజాయత సత్కృపోద్యద - పాంగశోభితలోచనా
వేంకటేశ్వర భక్తవత్సల - వేదతత్త్వవిచారణా
సంకటౌఘతమోవిదారక - సత్ప్రకాశిత భాస్కరా
పంకజోదర భాగ్యదాయక - పన్నగాచలనాయకా! ౨

మండితాండజరాజవాహన - మారకోటి సుమోహనా
జాండభాండ సమస్తపోషణ - చారుమౌక్తిక భూషణో
ద్దండఖండన ఘోరభీషణ - దానవాంబుధిశోషణా
పండితావన భద్రదాయక - పన్నగాచలనాయకా! 3

శ్రేయసీయలమేలుమంగ వ - శీకరా శ్రితపోషణా
త్ర్మియ మాయవికారభంజన - ధీరమానసరంజనా
మేయతోయదకీలవాహ స - మేధ్ధ విక్రమసాహసా
పాయసాయుత మోక్షదాయక - పన్నగాచలనాయకా! ౪

దీనమానసవీధిఖేలన - దివ్యసంయమి పాలనా
జ్ఞానలీన స్వయంప్రకాశక - సాధుచిత్త నివేశకా
ధ్యానమౌన నిధానరూపక - తత్వకాంతికలాపకా
జ్ఞానదానఘ భద్రదాయక - పన్నగాచలనాయకా !

అంబుజాంబక దేవదేవ క - దంబపోషణ శీల పీ
తాంబరాంబర నిమ్నగాది ప - దాంబుజద్వయ కారణా
జాంబికప్రియవంద్య భక్తజ - నౌఘకల్పమహీజ భూ
పాంబుజోదర భద్రదాయక - పన్నగాచలనాయకా!

సారపారితుషారశారద - చంద్రికా ఘనసారమం
దారహార సుధాంబుధీ రజ - తావనీధర హీరపా
కారివారణ తుల్యసర్వది - గంతపూర్ణయశస్తతా
పారవీర విశేషసాయక - పన్నగాచలనాయకా !

కాలకాల ధనుస్త్రుటత్తిల - కాంచితోన్మృగనాభిస
త్కాలకూలదశాస్య భంజన - పాపవారిధరౌఘవా
తూల నీలపయోధరద్యుతి - తుల్యదేహమహానుకం
పాలవాల సుభద్రదాయక - పన్నగాచలనాయకా !

గోపభూప యశోదబాలక - గోపికాతి మనోహరో
ద్దీపరూప వికుంఠమందిర - దివ్యశక్తి సమస్తలో
కాపరూప మయూరపింఛ వి - కాస కంసవిరోధి సి
ష్వాప శ్రీపతి మోక్షదాయక - పన్నగాచలనాయకా !

కామకోమల దేహమండిత - కామితార్థఫలైక చిం
తామణీ మధుసూదనావ్యయ - తత్వరూప నిశాటసం
గ్రామ భీమ విశాలకాల వి - కాసవహ్ని శిఖాభ కో
పామితామల భద్రదాయక - పన్నగాచలనాయకా! ౧౦

యాగయోగఫలాదికారణ - యక్షగాన వినోద సం
భోగ సాగరకన్యమానస - పూర్ణకామ లసద్దయా
సాగ రాగమశాస్త్రవాక్య ర - సార్థ సార పరాత్మ స
ద్భాగధేయ శుభప్రదాయక - పన్నగాచలనాయకా! ౧౧

నాకలోకదివౌకసాది స - నాథ మాధవ సద్గుణా
నీక రాకసుధాఘృణీ నవ - నీత సద్విమలాననా
స్తోక భీకర దానవద్విష - తోయజాంబక స్వస్వరూ
పా కళాకర భద్రదాయక - పన్నగాచలనాయకా! ౧౨

భూతనేతృ వధూస్తుతాహ్వయ - భూరివైభవదాత కం
జాతజాతసదావనాస్పద - జన్మపుంజవిఘాత ని
ర్నేత శీతకరార్కలోచన - నిత్య నిర్మల పూత ని
ష్పాతకా తత భద్రదాయక - పన్నగాచలనాయకా! ౧3

మేదినీసురనాగలోక స - మీరవహ్ని జలాదిభూ
తాధినాథ యజాండ గర్భని - కాంతగర్విత భూధర
ప్రోదినీ దితిసంభవౌఘ మ - హాహవాంగణ భేది భూ
పాదివేది శుభప్రదాయక - పన్నగాచలనాయకా! ౧౪

వాదభేద వికారదోష ని - వారణైక విషాద వి
చ్ఛేద వేదపురాణశాస్త్ర వి - శేష తత్త్వవిభేద ప్ర
హ్లాదమోద ముకుంద దివ్య వి - లాస దాసవినోద సం
పాద శ్రీద సుభద్రదాయక - పన్నగాచలనాయకా! ౧౫

జానకీ నవమోహనా సదృ - శ్యామలాత్మ పథాను సం
ధాన సూనశరాతికోమల - తత్త్వబోధనిధాన ప్ర
జ్ఞాన దీనశరణ్య పన్నగ - శాయి సంవిదఖండ చి
ద్భాను భానుసహస్రదీపక - పన్నగాచలనాయకా ! ౧౬

ద్వేషభీషణవేష సాత్యవ - తేయ హృత్పరిపోషణా
శేష శేషఫణీంద్ర శాయి వి - శేష శ్రీకః ఘోష దు
ర్దోషశోష మహాసుధారస - తుల్యమంజులమాధురీ
భాషభూషణ భద్రదాయక - పన్నగాచలనాయకా ! ౧౭

దేవదేవ త్రిలోకపాలన - ధీ జనావన తన్మహా
దేవసేవితపాద మేరు ధృ - తీ భవాంబుధిపోత యిం
దీవరావనిభృద్వినీల స - దృక్శరీరప్రభా లస
ద్భావ కేవలమోక్షదాయక - పన్నగాచలనాయకా ! ౧౮

రామ కోమలమూర్తి నిత్య ని - రామయాత్మ చిదంతరా
రామ తామరసాసనస్తుత - రాక్షసాంతకభీమ స
త్కామ సామజరాజకష్టవి - దార పావననామ భూ
పా మహామహితార్థదాయక - పన్నగాచలనాయకా ! ౧౯

శ్రీశ కేశవ భక్తవత్సల - చిన్మయాత్మ పరేశ దో
షాశపాశవిదూర సాధు మ - నోరవింద నివేశనా
శాశకేశ విధిస్తుతాహ్వాయ - కంబుకంఠ రమేశ ని
ష్పాశ క్లేశవిశేషనాశక - పన్నగాచలనాయకా! ౨౦

రాజరాజ విరాజపూజిత - రాజబింబ నిభాన నాం
భోజతేజ విశాలలోచన - భూజనాశ్రయ రాజ ని
ర్వ్యాజభూజమనోబ్జభృంగ యి - నాన్వయాంబుధిరాజ భూ
పాజరాజిత భూరిసాయక - పన్నగాచలనాయకా! ౨౧

రేఖమేఘరుచి ప్రవాహ శ - రీరతీర్మణిరేఖ చి
ద్రేఖశేఖర కౌస్తుభాఢ్య మ - రీచి శోద్యదమోఘ స
న్మేఖలా ఘటనావలగ్న ర - మేశ హేమదుకూల శో
భా ఖనీ ఖరశోషసాయక - పన్నగాచలనాయకా! ౨౨

శోభితాభర ణాంచదంగ యు - శోధిగత్తముకుంద స
ల్లాభవైభవ శ్యామవర్ణ వి - దారితార్తి పయోభవత్
క్షోభితేభరమైకమానస - చోర నీరజనాభ సం
ప్రాభవాభయ మోక్షదాయక - పన్నగాచలనాయకా! ౨3

దాసభాస దఖండసౌఖ్య ప - దప్రదానవిలాస కై
లాసవాస ధనుర్వినాశ కు - లాద్రిధారి దయాకరో
ల్లాసకేసరి రాజరాడవ - లగ్నలోక నివాస భూ
పాసదాసమ భద్రదాయక - పన్నగాచలనాయకా! ౨౪

ద్రోహా మోహా వికార భంజన - దుర్భవాటవిదాహా ని
ర్దేహా దేహా హృషీకలక్ష్య ద - తీంద్రియాత్మ సిరీహా హాం
స్తోహా మోహావిగోచరా పరి - శుద్ధ మోక్ష ప్రవాహా సం
భావావాహవ ఘోరసాయక - పన్నగాచలనాయకా! ౨౫

కోటికోటి తటిద్వికాస త్రి - కూటభాగలలాట శృం
గాటకాటదఖండ చిన్మయ - కైటభారినిశాట మా
యాటతాటకి వంశభేదన - వాటకోజ్జ్వలశాటి గో
పాట పాటలిగంధ దీపక - పన్నగాచలనాయకా! ౨౬

ఖేచరీచరమూర్ధ వైఖరి - ఖేల కిల్బిషమోచ మా
రీచనీచమృగప్రహార మ - రీచిశౌనక కాచ స
ద్గోచరాచల శశ్వదాత్మ సు - గోప్యదీప్యమనోజరూ
పా చరాచరలోకనాయక - పన్నగాచలనాయకా ! ౨౭

నాథనాథ సరోజపాద య - నాథబాధవిరోధ ధా
రాధరాధిక కృష్ణవర్ణ వి - రాధశోధన సాధుసే
వ్యా ధరాధరధారి బ్రహ్మశి - వాధవార్చిత బోధదీ
పా ధరాధవ భద్రదాయక - పన్నగాచలనాయకా! ౨౮

కంజరంజిత దీర్ఘనేత్రయు - గైక పండితబృంద హృ
త్కంజరంజితకంజబాంధవ - కంజనాభ విపల్లతా
కుంజపుంజత్రుటల్లవిత్రక - కుంజరస్తుత దైత్యగా
డ్ఖంజనాంజన మోక్షదాయక - పన్నగాచలనాయకా! ౨౯

రాక్షసక్షయ దేవసంయమి - రక్షకృత్య పరోక్ష ప్ర
త్యక్షమోక్ష రమామనోహర - ధర్మమార్గకటాక్షదృ
గ్వీక్షణాక్ష మురార్యధోక్షజ - విశ్వసాక్షి సురాధిరా
ట్పక్ష పక్షితురంగదీపక - పన్నగాచలనాయకా! 3౦

వేణువీణానినాదలోల క - వీంద్రరంజనవాణ గీ
ర్వాణ త్రాణ రణాళిదారుణ - వహ్నికీలసదృగ్స్ఫురా
ద్బాణతూణ ధనుష్కళాది ప్ర - భాధురీణ సుధీ సదా
ప్రాణ పణాధరాన్న దీపక - పన్నగాచలనాయకా! 3౧

సంకళంక భవాబ్ధి నావ ల - సత్ప్రభావ నదంక ని
శ్శంక శంఖగదా సుదర్శన - శార్ఙ్గపాణి సహస్రమీ
నాంక మోహనరూప దానవ - నాశ శౌరి సుధీమనః
పంక సంకట సన్నివారక - పన్నగాచలనాయకా! 3౨

మంగళాంగ దనంగ సుందర - మంజులాంగ రమాంగనో
త్సంగ సంగరరంగభీమ కు - సంగతాంధపతంగ సా
రంగ పుంగవపాల పక్షితు - రంగ సాధుజనాంగణా
పాంగరంగ సుభద్రదాయక - పన్నగాచలనాయకా! 33

నందనందన వందిబృంద స - నందనాది సుచందనా
నందకందళితేందు సన్నిభ - నవ్యవక్త్ర ముకుంద గో
వింద మందరధారి శార్ఙ్గర - విందనాభ సహేందిరా
స్పంద సుందర భద్రదాయక - పన్నగాచలనాయకా! 3౪

సంతతాంతర బాహ్యదీపక - సార్వభౌమ మహాంత వే
దాంతచింతన సూరిపాల ని - తాంతనిర్మలస్వాంత వి
శ్రాంత దాంత నిరంజనా వ్యయ - శాంత సత్య నిరంత ని
ర్భ్రాంత సాంత సుమోక్ష దాయక - పన్నగాచలనాయకా! ౩౫

చింతతంతువిరామ సద్గుణ - శేముషీవర కాంత శ్రీ
కాంతకాంత సహస్రకోమల - కౌస్తుభోజ్జ్వలకాంతి స
ర్వాంత సంతస సంప్రసాదక - వైరిసంతతిహంత ద్వీ
పాంతరాంత సుభద్రదాయక - పన్నగాచలనాయకా! ౩౬

చిత్రచిత్రమహాప్రభావ వి - శేష భక్తపవిత్ర చా
రిత్ర మిత్రకులాబ్ధిచంద్ర ధ - రిత్రిపుత్రికళత్ర గా
యత్రి సూత్రకర ప్రదీప వ - హ త్రినేత్రసుమిత్ర స
త్పాత్ర గోత్రధరేశ నాయక - పన్నగాచలనాయకా! ౩౭

దివ్యకావ్యరసానుకూల ఋ - ధేంద్ర సేవ్యచరవ్య క
ర్తవ్య నవ్యతరావ్యయాద్వయ - తత్వరూప రసవ్య భూ
భవ్యపావ్య సుభావ్య కవ్య వి - పక్ష సద్వినుతవ్య సం
భావ్యదివ్య సుభద్రదాయక - పన్నగాచలనాయకా! ౩౮

చంద్రచంద్రిక సాంద్రరేఖ య - శః ప్రభాసదుపేంద్ర మా
నీంద్రచంద్ర ధరేంద్రపూజిత - నిశ్చలాత్మ నిరింద్రియా
యింద్రియేంద్ర రిపుప్రహార న - రేంద్రచంద్ర మహేంద్ర భూ
పేంద్రవారణ భద్రదాయక - పన్నగాచలనాయకా! ౩౯

భద్ర భద్రకరాభ బాహు సు - భద్రసోదర రుద్ర వే
ధాత్రిజిదృషిపుంజ హృద్గత - దైత్యభీత్త్యధిఛిద్ర భా
స్వద్రుచీ ధృతకౌస్తుభాంచిత - సత్కృపైకసముద్ర సం
పద్రసాద్రి సుభద్రదాయక - పన్నగాచలనాయకా! ౪౦

అర్కరాజవిశాలనేత్ర సు - ధాబ్ధితల్ప జనార్దనా
తర్కవాద విభేదభంజన - తత్వరూప నిరంజనా
మర్కటోత్తమ బృందసేవిత - మందలేశ కటాక్షసం
పర్కశాశ్వత భద్రదాయక - పన్నగాచలనాయకా ! ౪౧

చండకాండశరాసనాంచిత - చారుసద్భుజదండ వే
దండమండనపాలశీల స - దండజధ్వజమండితో
ద్దండఖండన వీరనిశ్చల - దైత్యభేది యజాండరా
ట్పండితావన భద్రదాయక - పన్నగాచలనాయకా! ౪౨

పద్మబాంధవ వంశసాగర - పద్మవైరి నవస్ఫుర
త్పద్మలోచన పద్మవల్లభ - పద్మనాభ దయానిధే
పద్మగర్భశివాదిపూజిత - పద్మపాద సుధీమనః
పద్మసద్మ సుభద్రదాయక - పన్నగాచలనాయకా ! ౪౩

దుర్గసన్నుతనామ పల్లవ - తుల్యపాదసరోజ ష
డ్వర్గనిర్గత దైత్యభే ద్యప - వర్గనాథశిరోమణీ
స్వర్గరాజ్యసదావనాకర - స్వర్ణభూధరధీర త
ద్భర్గమిత్ర సుభద్రదాయక - పన్నగాచలనాయకా! ౪౪

శక్రనీలపయోధరాంగ శ - శాంక మండలవక్త్ర ని
ర్వక్రవిక్రమ శక్రవందిత - వారణోత్తమపాలనా
వక్రశోషక చక్రహస్తక - సద్గదాధర శౌరి భూ
పక్రతుక్రియహేతుదీపక - పన్నగాచలనాయకా! ౪౫

కర్ణయుగ్మ సువర్ణరత్న వి - కాసమండలరేఖ వి
స్ఫూర్ణసన్మణి వజ్రకీలిత - భూరితేజకిరీట మ
స్తార్ణవాంతరశాయి పద్మభ - వాండగర్భ మహాసుకం
పార్ణవోజ్జ్వల భద్రదాయక - పన్నగాచలనాయకా! ౪౬

దుర్భవార్ణవపోత దుర్దశ - దూర వీర పునఃపునా
విర్భవోజ్జ్వల దుష్టనిగ్రహ - విశ్వశిష్టదనుగ్రహ
నిర్భరాద్వయ కేవలాత్మక - నిర్భయైక నృసింహ రూ
పార్భకార్చిత భద్రదాయక - పన్నగాచలనాయకా! ౪౭

అభ్రకేశ విధిస్తుతాహ్వయ - హాటకాంబరధారి మ
ధ్యాభ్రగాన్వయరాట్తురంగ శు - భాంగ వేంకటనాథ స
చ్ఛుభ్రభాను రుచిప్రభాస య - శోదిగంత త్రిలోక భూ
పాభ్రవాహ సుభద్రదాయక - పన్నగాచలనాయకా! ౪౮

సప్తసాగర సంచరద్విల - సత్ప్రకాశ జగజ్జగ
ద్దుప్తరూప మురాసురద్విష - కుందకుట్మలదంత సం
తప్త హేమ మణిప్రభా సము - దంచితాభరణౌఘ సం
ప్రాప్తసౌఖ్య సుభద్రదాయక - పన్నగాచలనాయకా! ౪౯

సప్తకీల శిఖాసదృగ్విల - సత్ప్రకాండ శరాసనో
ద్దీప్తమాన విరోధిభంజన - దేవమందిరగోత్ర ప్రో
క్షిప్త భక్తజనార్తి సత్తుల - సీదళాన్వితదామ సం
ప్రాప్త దివ్యఫలప్రదాయక - పన్నగాచలనాయకా! ౫౦

అగ్ని నేత్ర సఖాంబరీషగు - ణాఢ్య పాలనశీల కా
లాగ్నికీల సమానరోష య - ఘాఘుకానన ఘోరదా
వాగ్ని కైటభదానవాంతక - వారిజోదర దుర్దశో
ద్భగ్న సౌఖ్యసుభద్రదాయక - పన్నగాచలనాయకా! ౫౧

భక్తవత్సల కర్మపాశవి - భక్త సద్భవదంఘ్రి సం
సక్తచేతన యుక్తరంజన - శ్రీరమారమణీశ స
న్ముక్తరూప సమస్తపాపవి - ముక్త శశ్వదఖండ స
ద్భక్తలోల సుభద్రదాయక - పన్నగాచలనాయకా! ౫౨

రత్నసానుసమానధీర వి - రాధశోధన సూత్ర స
ద్రత్నకీలిత హేమధామ స్ఫు - రత్కిరీట విరాట్ఛిరో
రత్న సూనృతమంజుభాషణ - రావణాంతక భార్గవీ
పత్నిలాంఛన భద్రదాయక - పన్నగాచలనాయకా! ౫3

రాజమండల సన్నిభానన - రాజరాజవతంస భూ
రాజమండల ముఖ్యపూజిత - రాజయోగిహృదుజ్జ్వలా
రాజశేఖరవంద్య సన్మృగ - రాజరాజితమధ్య భూ
పాజిభీషణ భద్రదాయక - పన్నగాచలనాయకా! ౫౪

సింధురేంద్రశరణ్య భక్తవ - శీకరామృత సద్దయా
సింధు సైంధవరామకామ వి - శేషసన్మృదులాకృతీ
సింధుబంధన సూరిచందన - సింధుతల్ప మహావిప
ద్బంధఖండన భద్రదాయక - పన్నగాచలనాయకా! ౫౫

ఉన్మనీసువిలాసపూర్ణ మ - నోన్మనీయుతభాసురా
చిన్మయాత్మ స్వయంప్రకాశ య - చింత్య నిర్మలతత్వ సం
విన్మయా చల సార్వభౌమ క - వీంద్రమానసకంజశుం
భన్మనోహర భద్రదాయక - పన్నగాచలనాయకా! ౫౬

సర్వతోముఖ సర్వరూపక - సర్వదీపకలాపకా
సర్వపాలన సర్వఖేలన - సర్వలోక విచారణా
సర్వకారణ సర్వధారణ - సర్వకార్యధురంధరా
పర్వతోద్ధర భద్రదాయక - పన్నగాచలనాయకా! ౫౭

హల్యశాపవిముక్తి శశ్వద - హార్నిశైకనివాస కా
సల్యతోషరస ప్రవర్ధన - సత్ప్రసాద పరాత్మ సా
కల్యభావ సమస్తరా ద్ధశ - కంఠజి న్మమజన్మసా
ఫల్యకారణ భద్రదాయక - పన్నగాచలనాయకా! ౫౮

ఆర్యకార్యఫలప్రసిద్ధి మ - హాప్రచార సుధైక మా
ధుర్యధుర్య సుఖైకవాక్య వి - దోష తోషకర స్వయం
తుర్యధుర్య నిరంజనా వ్యయ - దోర్బలాఢ్య పరార్థతా
త్పర్యధీర సుభద్రదాయక - పన్నగాచలనాయకా! ౫౯

విశ్వరూపక విశ్వపాలక - విశ్వమోహన విశ్వసృ
డ్విశ్వపాలన విశ్వజీవన - విశ్వకర్త పరాత్పరా
విశ్వనాటక శశ్వదాత్మక - విశ్వగర్భ విహంగభూ
పాశ్వ శాశ్వత భద్రదాయక - పన్నగాచలనాయకా! ౮౦

వందనం బిదె వేంకటేశ్వర - వైభవప్రకరేశ్వరా
డెందమం దలరఁగ వసింపుము - ఠీవి బూని ముకుంద గో
విందనీచరణారవిందము - వీడ నీయెడ కోర్కె లిం
పందఁజేయుము జాగుసేయక - పన్నగాచలనాయకా! ౮౧

తల్లి దండ్రివి నీవె మాకును - దాత దైవము నీవె మా
కెల్లకాల మభీష్టభాగ్యము - లిచ్చు మా యిలువేల్పవే
కల్లగాదు ముకుంద మాకును - కల్పవల్లివి గాన మీ
పల్లవాంఘ్రులు గొల్తుఁ బాయక - పన్నగాచలనాయకా! ౮౨

అన్యు లెందరినైనఁగోరి యు - పాశ్రయించిన నేమి రా
జన్యమాన్యుడ వీవు మాకు ప్ర - సన్నమై కరుణించి సౌ
జన్యసౌఖ్యము లీయరా కడు - జాలమేటికి సర్వరూ
పాన్యశోభిత భద్రదాయక - పన్నగాచలనాయకా! ౮౩

తప్పులేమి యెరుంగరా భవ - దంఘ్రులే నెరనమ్మితిన్
తప్పు లెన్నక బ్రోవవే పర - దైవ నీతనయుండ నో
యప్ప నీకృప గల్గినంత న - నంతసౌఖ్యశుభాదికం
బప్పుడే సమకూడుఁ బాయక - పన్నగాచలనాయకా! ౮౪

నీదుసత్కరుణా కటాక్షము - నిక్కమెంతయొ లేక మో
హోదధిన్ గడువంగ శక్యమె - యుర్వి నెంతటివారికిన్
నీదయారసభాగ్యమున్ గన - నేఁ దలంచెద నయ్య నీ
పాదపద్మయుగంబుఁ బాయక - పన్నగాచలనాయకా ! ౬౫

ఎంతగా నిను నమ్మి వేడిన - నేల నీదయ రాదు మీ
చెంతఁ జేరినవార లన్యుల - చెంత గోరుట న్యాయమా
యింతమాత్ర పుధర్మమానస - మేల పుట్టదు నాపయిన్
బంతమేలర భద్రదాయక - పన్నగాచలనాయకా ! ౬౬

మీరలీక్రియ నిర్దయామతి - మించి ముంచిన దాతలిం
కేరి నన్నెవ రాదరింతురు - నీవెగాక భరింప నె
వ్వారు లేరు చరాచరౌఘుని - వాస ప్రోవుము సద్దయా
పారదృష్టిని జాగుసేయక - పన్నగాచలనాయకా ! ౬౭

దండిభూమివిభుండ వంచును - దండఁ జేరినవాఁడ స
త్పుండరీకావన నీదయాసద - పొంగదర్శన మెప్పుడో
మండలేశ్వర సర్వకాలము - మమ్ముఁ బ్రోవఁగదయ్య భూ
పాండజధ్వజ భద్రదాయక - పన్నగాచలనాయకా ! ౬౮

నీపదాంబుజ యుగ్మముం గని - నీయ నిశ్చలభక్తితో
రేపుమాపు మనంబులోన స్మ - రించు వారలకెల్ల సం
తాప పాపనివారణంబగు - దంతిపుంగవపాల నీ
ప్రాపు దాపగు భద్రదాయక - పన్నగాచలనాయకా ! ౬౯

నీవె సర్వచరాచరంబులు - నీవె సర్వజగంబులున్
నీవె మానవతిర్యగాదులు - నీవె సప్తసముద్రముల్
నీవెగా కితరంబు లేదని - నిర్ణయించి భజించితిన్
భావమందున నిన్నుఁ బాయక - పన్నగాచలనాయకా! ౭౦

దేవ నీకృప యెట్టిదో గణు - తింప శక్యము గాదు నీ
సేవకుల్ బహు విత్తమత్తుల - చెంతఁ జేరి యజస్రమున్
సేవ నాదుల లోన నుండగఁ - జేసితో యిది గొప్పయా
భావమండన భద్రవాయక - పన్నగాచలనాయకా! ౭౧

ఎంతనిర్దయ మానసుండవా - యేవిధంబున నిన్ను సే
వింతు మజ్జగదంబయౌ నలి - వేలుమంగయుఁ గూడ నీ
చెంత నుండ సహింపదే మఱి - చేరువందునఁ జేర్చ నీ
పంత మేమి శుభప్రదాయక - పన్నగాచలనాయకా! ౭౨

దాసులన్ దయఁ బ్రోవలేకయొ - ధారుణీజనులందు నీ
వాసఁబెట్టుక వారిచేఁగొను - వడ్డికాసులచేతనే
గ్రాసమున్ దినుచున్నవాఁడవు - గాని మమ్ములఁ బ్రోవవో
భాసమానవిలాస రమ్మిఁక - పన్నగాచలనాయకా! ౭౩

ఎల్లకాలము నీవె దీనుల - నేలునట్టి విభుండవై
యుల్లసిల్లుదటంచు శాస్త్రవి - ధోక్తులన్ దగవింటి నా
యుల్లమం దెడఁబాయ కెప్పుడు - నోపికన్ నినుఁ గొల్తు నీ
పల్లవాంఘ్రులఁ జూపవా యిఁక - పన్నగాచలనాయకా! ౭౪

ఎట్టిదో హరి నీమనం బిటు - లెంతవేడినఁగాని యే
మట్టుకున్ బెనుపట్టుగా సణు - మాత్రమైనఁ గరుంగ దీ
పట్టునే విడనాడకుండిన - పాడిగాదిక నన్ను చే
పట్టుకొమ్ము శుభప్రదాయక - పన్నగాచలనాయకా! ౭౫

ఎక్కువైన విభుండవై ధర - నెల్లభక్తజనాళి నీ
వక్కజంబుగ నెల్లకాలము - నాపదల్ విదళించి బల్
చక్కగా దయమీర నేలెదు - స్వామి నిన్ విడనాడి నే
బక్కవేల్పులఁ గొల్తునా యిఁక - పన్నగాచలనాయకా! ౭౬

ఇంతగా నిను వేడినందు క - దేల నీదయరాదు ర
వ్వంతయైనను నాపయిన్ మధు - వైరి నాహృదయంబులో
చింతసేయుదు శ్రీహరే దయ - చేయరా తడవేలరా
పంతగించిన నోర్తునా యిఁక - పన్నగాచలనాయకా! ౭౭

నిన్ను సన్నుతిఁజేయువారల - నేరముల్ క్షమియించవా
పన్నరక్షణ నాదుదీనతఁ - బాపవా కరుణించవా
యెన్నెరుంగక చేసినన్ నెప - మెన్నకే ననుఁ బ్రోవరా
పన్నుగా వినుతింతుఁ బాయక - పన్నగాచలనాయకా! ౭౮

నేరమేమి యొనర్చినాడను - నీరజోదర నీపదాం
భోరుహంబులఁ బట్టినాడను - బ్రోవకే విడనాడదో
శౌరి నాహృదయాబ్జమం దని - శంబు స్థాపనసేతు నా
భారమంతయు నీదిరా యిఁక - పన్నగాచలనాయకా! ౭౯

ఏది నీదయ జూపరా చల - మేలరా కరుణించు నీ
పాదముల్ నెరనమ్మితిన్ పొర - పాటు సేయఁగఁబోకురా
సాదరంబుగ మమ్ము నేలెడు - స్వామి వీవని నామదిన్
బాదుగా నిడుకొంటిఁ బాయక - పన్నగాచలనాయకా! ౮౦

పన్నగాధిపశాయి నీపద - పద్మముల్ మదిలోపలన్
సన్నుతింతును నీవె దిక్కని - సర్వకాలము ధీయుతుల్
వన్నెకెక్కిన దండిభూపతి - వంచు నిన్ను భజించు నా
పన్నులన్ దయబ్రోవుమీ యిఁక - పన్నగాచలనాయకా! ౮౧

నిన్నుగాక మరెవ్వరిం గరు - ణించి ప్రోవుమటంచు నే
నెన్నడైననుగాని వారల - నెంచి స్తోత్రముఁజేయ నా
పన్నరక్షక నీట ముంచిన - పాల ముంచిన నీవె సం
పన్నమూర్తి సుభద్రదాయక - పన్నగాచలనాయకా! ౮౨

సారసోదర నీస్వరూపము - సన్నుతించినవారి దు
ర్వారఘోరభవవ్రజంబు ని - వారణం బగునంత చి
త్స్ఫారితంబగు మోక్షసౌఖ్యము - పొందుచుందురు శాశ్వతా
పారనిర్మల భద్రదాయక - పన్నగాచలనాయకా! ౮౩

ఆదిమూలవిరాట్టువై యఖి - లాండకోటి యజాండమున్
బాదుగా సృజియించినాడవు - భార మేమియు లేకయే
వేదవేద్య సమస్తకారణ - వేంకటేశ్వర కీర్తి సం
పాది శాశ్వత భద్రదాయక - పన్నగాచలనాయకా! ౮౪

ఒక్కరీతిని సంచరించక - యుత్తమోత్తమ నీవు పెన్
దిక్కుదిక్కుల బిక్కటిల్లుచు - దీప్తిచేత వెలుంగు ని
న్నెక్కడంచు భజింతు నీక్రియ - లెట్టివో కనఁజాల వెం
పక్కజంబుగఁ గొల్తుఁ బాయక - పన్నగాచలనాయకా! ౮౫

ఏలరా తడవేలరా చల - మేలరా యిఁక నాయెడన్
ఫాలలోచనవంద్య నీపద - పంకజంబులు నమ్మి నీ
మ్రోల నిల్చి యజస్రమున్ మఱి- మ్రొక్కి సన్నుతిఁజేతు మా
పాలిదేవ సుభద్రదాయక - పన్నగాచలనాయకా! ౮౬

ఇమ్ముగా భవదీయభక్తికి - నేదియున్ సరిరాదురా
తమ్మికంటి మహాప్రభో దయ - దాచకే నను బ్రోవరా
నమ్మివేడిన వారలన్ విడ - నాడుటేలొకో నీదురా
పమ్మి నాకును జూపరా యిఁక - పన్నగాచలనాయకా! ౮౭

ఏకమై పరిపూర్ణమై సక - లేంద్రియ ప్రకరాంత మ
స్తోకమై నిరవద్యమై కడు - సూక్ష్మమై యెడలేక ని
ర్వ్యాకులం బకలంకమై యప - వర్గమైన పరాత్మ రూ
పాకరంబగు భద్రదాయక - పన్నగాచలనాయకా! ౮౮

రెండురేకుల తమ్మిపై పది - రెండురేకులు చేర్చి యా
రెండు ద్రోసియు రెండు బాసియు - రెండు డాసియు రెంటిపై
రెండు నొక్కటిజేసి వేఱొక - రెండు నొండను లేకయే
పండియుండిన భావమీవెక - పన్నగాచలనాయకా! ౮౯

మూటిమించియు మూటిగాంచియు - మూటిచోటువరించి యా
మూటినిం బదుమూటి గెల్చియు - మూటిపై గమకించి ము

మ్మ్రాటికవ్వాల సూటిదప్పక - మ్రోయుచుండెడి నాదమే
బాటగాఁ గనుగొందుఁ బాయక - పన్నగాచలనాయకా! ౯౦

నాలుగింటిని జేర్చియున్ మఱి - నాలుగింటిని గూర్చియున్
నాలుగింటి నతిక్రమించియు - నాలుగింటి వహించియున్
యాలవాలం బేమి లేకయె - యంతటన్ విలసిల్లు భూ
పాల నిన్ గొనియాడు దేనిఁక - పన్నగాచలనాయకా! ౯౧

పంచభూతములన్ జయించియు - పంచభూతగుణాంతమై
పంచశక్తి విలక్షణంబయి - పంచకోశాతీతమై
పంచముద్రల కందరాక న - పారమై విలసిల్లి ప్రా
పంచమెల్లను మించి తీవెక - పన్నగాచలనాయకా! ౯౨

ఆరిటిన్ వధియించియున్ బది - యారిటిన్ బరిమార్చియున్
ఆరుజేర్చియు నారుగూర్చియు - నారిటిన్ బోకార్చియున్
ఆరుపువ్వులమీఁదుగాఁ బది - యారుకాంతుల పూర్ణమిం
పార రంజిలు దీవె పాయక - పన్నగాచలనాయకా! ౯3

ఏడుకోట్లపదార్థమున్ గొని - యేమికష్టము లేకయే
యేడువార్ధుల దాటనీదియు - నేడుకొండల వాడ యీ
రేడులోకము లెల్లనేలెడు - ఱేడ నిన్ మది గొల్తు కా
పాడవే మము భద్రదాయక - పన్నగాచల నాయకా! ౯౪

ఎన్నశక్యము గాక నిత్యము - నేకమయ్యు ననంతమై
యన్నిలోకము లందు నిండి స్వ - యం ప్రకాశ విశేషమై
మిన్నుమన్నునుగాక వెల్గు న - మేయదేశికరాయ యా
పన్నులను రక్షించు పాయక - పన్నగాచలనాయకా! ౯౫

చారునీల పయోధరంబుల - సార గేరు శరీరముఁ
మారకోటి వికాసమౌ సుకు - మారముఁ అసమానశృం
గారమోహనరూపముఁ గల - కైటభాసురశిక్ష యిం
పారఁగాఁ గనుపించవే యిఁక - పన్నగాచలనాయకా! ౯౬

ఘోరకిల్బిషదూర సద్గుణ - కోవిదాళి హృదబ్జ సం
చార జన్మవితండవారణ - సర్వలోకశరణ్య వి
స్తార భారనివారణాఖిల - తత్వరూప పరమేశ యిం
పారఁ బ్రోవఁగదయ్య నన్నిఁక - పన్నగాచలనాయకా ? ౯౭

దాసదోషనివారణాసుర - దర్పశిక్షణ శౌరి ని
రాసవాఖిల దీనరక్షణ - భాసమానవిలాస వి
ద్యాసమేత సుధీమణీ వర - ధర్మమార్గ విశారదా
ధ్యాసవశ్య కిరాతశోషక - పన్నగాచలనాయకా! ౯౮

మత్తకోకిల వృత్తముల్ సుమ - మాలగా జతకూర్చితిఁ
చిత్తగింపుము వేంకటేశ్వర - శ్రీకరంబుగ సత్కృతిఁ
ఇత్తరిఁ సకలార్థసౌఖ్యము - లీయవే పరమేశ్వరా
పత్తమోర్క సుభద్రదాయక - పన్నగాచల నాయకా! ౯౯

శ్రీపులారికులాబ్ధి చంద్రుడ - శేషయార్యవరేణ్య సే
వాపరుండ బుధాళి సంగమ - వాంఛనీయుడ సత్యభా
మాపురిఁ నివసించువాడ న - మస్కృతుల్గాను పీరుబాస్
ప్రాపుమీరఁగఁ జేసి వారక - పన్నగాచల నాయకా! ౧౦౦

సంపూర్ణము

ఓమ్

# శ్రీ గజేంద్ర మోక్షము, కీర్తన

ఆనందభైరవి - అటతాళము

నరనాథ వినుము భూ - సురవైన సామజే -
శ్వరుని మోక్షణచరితము-

నిర్ధరితము - పరమమోదభరితము - పరగుసుధార్ణవాం-
తర త్రికూటము భూ - ధరము యోజనాయు - తం బున్న
తత్వము - నురుతరం బగుహాటకంబు న - యోాపయంబుల
రాజతం బనమెరయు మణి ధాతువులతో త్రికి - ఖరము లతు
లములై చెలంగెను॥ నరనాథ॥

వరమాతులుంగ ల-వంగ లుంగ కే-పర జంబు జంబీర-
హింతాల కుం-ద రసాలఖర్జూర - నారికేళ - సరళ కోవిదార-
కదళికా బ-దరి బిల్వ కరవీరా -ద్యవనీరుహా - సరసానంత వ-సంత
సమన్విత - భరిత సమంతసా - భాగ్యభవాంచితాం - కురిత
నవకిసలయిత పుష్పిత - గురు ఫలిత లలితోద్భవిత మా- ధురిత
మకరందానుభూతి - స్ఫురణ పరమానందమై తగు॥ నరనాథ॥

హరి ఖడ్గ వ్యాఘ్ర సూ - కరశల్య భల్లూక-కురుర సార
మేయ గోకర్ణక - సరవృక గోమాయు - గండభేరుండ - కరికరిణీ
నికాయ - ముఖ్య మృగభీ - కరఘోరారవ భూము - మరా

ళము - ఖరఖగస్తోమ భా- స్వరమై గంధర్వ కిం- పురుషకిన్నర
విద్యా - ధర సిద్ధసాధ్యాది - సరస విభ్రమసద్విలాసా - కర
సదాగీర్వాణ - గణ సం-చర సమన్విత సకల దుష్కృత - నిరస
నంబై యలరుచుండెను॥ నర॥

వనితలు దనకుంభ - ఘనత కోడి పయ్యె- దను చన్నవను
గూర్పగ నడకోడి పా - దము లందియలు జేర్పగ - కేల్కోడి
జ-ఘనము మేఖల జేర్పగ - పలు కోడి న - గవుమోము విధు
దార్పగ - వెతనార్పగ - దనకోమ లాకృతి - గని యంజనాది
యంగనలు వెన్దగిలి తో - డనె రాఁ గరీంద్రుఁడు - దనకరిణీ
గణంబు దా నం - తను పిపాసా దీనమనముఁలఁ - దనివి దీరగ
నొకమహానది - యెనసి గ్రోలి చరింపుచుండెను॥ నర॥

అమిత గళాగళా - యాతము బుద్బుద తరం - గము
లంబరము గప్పగా - ఘీంకార ప్రౌ-ఢిమ గ్రహములు విప్పగ-
పృచ్ఛము వీవఁ-గ మహానిలము గుప్పగఁ బదఘట్టన సుమహీజ
ములు గూల్పగఁ జల మొప్పగ - కొమరు మించి పొంచి-కుప్పించి
సత్వద-ర్పముల హుంకరించి - పట్టుగ లంఘించి - కమలహితు
గబళింప నతి వై-రమునఁ జెలగెడు నుగ్రరాహు - క్రమము న
య్యెడ నొడిసి కరిస - త్తముని బట్టెను నక్ర మొక్కటి ॥నర॥

గిరియును గిరియుఁ గే - సరియుఁ గేసరి యరి - మురి
పెనొబ్భరును బెంపగ - గరాగరి బెరసి మహి చలింపగ- బరాబరి-
నొరసి రుధిర మింపుగఁ - ద్రావుచుఁ బగ - నొరసి యొడలు నొం
పగ - నదలింపగ - నురుముచు నూచుచు - గఱచుచు గనలుచు
దరుముచు దాకుచు - పిఱచుచు బఱచుచు - జరుచు నఱచుచు-

గరియు మకరియు మఱిమఱి నొక్కి వెయ్యిసంవ - త్సరము
లీక్రియఁ బెనగి దూలియు-కరియు మొరలిడె హరిని దలఁచి॥నర॥

ఇవ్వేళ నిడిపింప - నెవ్వరు వచ్చెద రడ్డ - మెవ్వాఁడు
నాకాప్తుఁడు పరాత్పరుఁ - డెవ్వాఁడు సర్వాత్ముఁడు - సర్వా
ధారుఁ డెవ్వాఁ డాత్మా రాముఁడు- నిత్యుఁడు సత్యు-డెవ్వాఁడు
పరమాత్ముఁడు-చిదానందు డెవ్వాఁడు సృజియించు- నెవ్వాఁడు
పోషించు నెవ్వానిలో నణఁగి లోక మెల్లను - నెవ్వఁ డీభువ
నంబులును భువ-నేశ్వరులు భువనస్థు లాలసిన - నవ్వలను
కార్చికటిని నే- కాత్మ రూపకుఁ డలఁగు ననుఁగొనె ॥నర॥

జనన నాశా కృతి - యును కర్మ నామంబు-లును వికా
రము లేకయె - యెవ్వఁడు తననేర్పున విశ్వమును జేకొను -
హృద్వాక్కుల - గనుఁగొనగా రాకయె- యేప్రభు మహిమ -
మనుపమమై జోకను-నెడలేకయె - తనర ననేకవర్ణముల దోఁచు
పా-వనునకు సద్బ్రహ్మ-మున కిద్ధరూపున - కును గవికి సాక్షి
కిని బరమాత్మున కనంతున కమితశక్తికి - మొనసి నారాయ
ణున కభివం-దనము లిదిగో చేతుఁగొనుమనె ॥నర॥

లలి కామార్థధర్మ - ములు నిరసించు శాం - తులు
నెవ్వాని నుతింతురు - ననఘాత్ము లే- జలజాక్షు నీక్షింతురు -
యోగీంద్రులే-యలఘు నుపాసింతురు పండితు లే య - చలుని
బ్రశంసింతురు। ధ్యానింతురు - తలప తథ్యముగ (ప్ర) - ధాన
పురుషుఁడయ్యు- వెలిగెడు ననుకంపా - జలధి నతింద్రి-యు -
కలుషవిగతు మునీంద్ర గమ్యుని - మలినదూరు ముకుంను

పూర్ణుని - తులరహితు మహాత్ము నణువు న - ధోక్షజుని సేవింతు ననె కరి ॥నర॥

మును వైకుంఠాంతర-మున నగర్యంతర - మున మూల హార్మ్యంబులో- నట పారిజా- త నవీనారామంబులో-సుధారస స్తతచంద్ర కాంతోపలో-త్పలశయ్యా రం-జన కమలాకేళిలో- వినోదాయ-త్త నిజస్వాంత శాలియై - వ ర్తింపగ- సనయుండా పన్నత్ర-సన్నుండు విహ్వలతను గజేంద్రము పాహి - యనగ మొరాలించి వనధిజకుఁ జెప్పకయె సుద-ర్శనము శంఖము దాల్ప కయె యావినతభవు నెక్కకయె యెబలఁ-మును దలంపకె దుమికె శ్రీపతి ॥నర॥

సిరి దనవెంట నా - సిరితో నవరోధ మ - ప్పరివారము వెంటను విహగేంద్రుఁ డా - గరుడముఖ్యుని వెంటను - శంఖ చక్ర-శర చాపములు వెంటను-నారద తుం - బురు లాదిగ మిం టను-మహాఋషి-వరులు కదలిరి వెంటను-గ్రక్కున నేతెంచిరి శ్రీవైకుంఠ పురమునందు మెలంగు-సరసు లప్పుడు మూడ-శరధి కన్య దనలోఁ బరమపురుషుడు దాఁ జనియెడు-తెరగుఁ జెప్పడె యొవరి శాప-త్కారము లేయని వాడమెనో యని - యరయు చును దలఁచుచును నడచెను ॥నర॥

చలిత తాటంక యు-గళముతో స్కంధాట - దళివేణి బంధంబుతో-చేలా వి-గళిత కుచయుగళంబుతో - చంచన్మణి కలితమేఖలకాంతితో-శీర్ణఫాల లలిత మృగమదంబుతో - హరి కరాబ్జలలిత దుకూలంబుతో - మహనీయ-జలజాప్త కోటిసు -

జ్వాలతతో నిందిర- వెలయుచు రాఁగ ని-మ్ముల బిడౌజాదిగ -
నలరు నిర్జరవరులు దేవ - ర్షులును గుములుంగూడి శ్రీహరి -
జలజనాభ నమోయటంచును-వలగొనిరి శౌరిని సిరి న్మరి॥నర॥

పరమాదయాళుఁడు-హరి మకరీంద్రుని - బరిహరింప నవ
క్రము నాకంపిత గిరియుత క్ష్మాచక్రము - లీలావృతాం - బర
ప్రజ్వలిత శుక్రము - సంరక్షితా - మర మునీశ్వరచక్రము -
చక్రము నంప నరుణసాహస్ర భా-స్వరమై గుప్పున సరో - వర
మున దుమికి మ - కరి శిరమును ద్రుంచె - హరియు నొత్తెను
పాంచజన్యము విరివిగా సుర భేరి మొరసెను - వరసుమంబులు
మింట గురిసెను- కరివరునికళ శౌరి నొందెను ॥నరనాథ॥

మును దేవలశాప- మును బాసి తానంత - టను గ్రహ
గతి దొలఁగి గంధర్వుఁడ -య్యెను హూహూఁడనఁ జెలగి-తన
పూర్వ మో - హనదేహమున వెలిగి - శ్రీహరి వేడుకొన నెన
రున మెలగి నిజపురి కరిగె- జననాథ గజరాజు - మును ద్రవిడే
శుఁడు- గననింద్రద్యుమ్నుఁడు-నెనసి మౌనము దాల్చి - వనజ
నాభుని మది నుతించగ ముని యగస్త్యుం డటకు రాఁగను,
గొనకయుండిన కుంజరము గమ్మని శపించెను దాల్మి లేకయె ॥నర॥

చెడు గజాశ్వంబులు- చెడును విత్తంబులు- చెడు పాత్ర
క్షేత్రంబులు- లోకము లందు- చెడు సంసార సుఖంబులు-
నొకొక్కకయెడ చెడు కర్మధర్మంబులు- వేలొకసారి చెడును
లోకౌఘుంబులు నొకపట్టున-చెడు చరాచరంబులు సమస్తము-
చెడు పామరుల కివి- చెడనిసజ్జనులకు- చెడనిపదవి శౌరి- చింత
నామృతమగు - నుడివినంతనె తత్పరోజా-తుడు మరియునన్న

డుగు క్షేమన- నెడపకను నినుగొలుచు టిదియు ప- రేశ నాపని యనె రమాపతి ॥నరనాథ॥

కరిరాజ మోక్షణ- చరితము వినువారి- దురితము వారించును సంకటములు - దొరగి శ్రేయము మించును - కష్టము బాయు సిరియు విస్తారించును - పరసౌఖ్య ము - ఉరముయ్యు ప్రాప్తించును- ఋతమిది గాక- నరులెవ్వ రేనియు- ధరణి వేకువ లేచి- హరి విధి శ్రీసుధా- కరనిధి ప్రద్యుమ్న- సరస శ్వేతద్వీప నారద- యురగరా డ్గరుడధ్వ జానల - తరణి ధ్రువముఖ్యులఁ దలంచిన - తిరపదం బిత్తు ననె శ్రీహరి ॥నరనాథ॥

అమరుగ పాంచజ- న్యమును పూరించియు - ప్రమదంబు నిండారను- ఖగారోహ- ణము జేసియును జేరెను - వైకుంఠమున - కమరేంద్రాదులు దారును, నానందింప కమలతో జిగిమీరను శ్రీహరి యథా- క్రమలీల తమిదీరను- సుఖంబుండి రిమహాత్మకు లీవి - ధమునను శుకుఁడు - నెయ్యముతో పరీక్షిన్మహారాజు కెఱిఁగించె-విమలమగు గోదావర ప్రాం-తమున భద్రగిరీశ్వరుండై-కొమరు రామ ప్రభుఁడు పురుషోత్తముఁడు పీర్గా పావితుండగు ॥నరనాథ వినుము ॥

సంపూర్ణము

ఓమ్

# పూజా విధానము

భూపాలరాగము — ఆదితాళము

పూజ గావింతు గొనుమూ - గోపాలమూర్తి ॥పూజ॥

పూజ గావింతు గొనుము - రాజాధిరాజ మహాతేజాంబు జాప్తకోటి - రాజిత సత్యమూర్తి ॥పూజ॥

శ్రీరమణీమన - శ్చోర నిర్మల నిర్వి - కారా నిశ్శబ్ద నిర్విచారాత్మ షోడశోప - చారము లివె గొనుమూ-హరి షోడ శోపచారము లివె గొనుమూ ॥పూజ॥

కేవలానందపూర్ణ - భావాఖిలోపాద్యంత-ర్భావాతిరిక్త సుప్రభావ మహానుభావ - యావాహనంబు గొనుమూ-నిర్వా సన పూర్ణ - యావాహనంబు గొనుమూ ॥పూజ॥

వాసుదేవ స్వయంప్ర - భా సాతీంద్రియ సదా-భ్యాసా బుధేంద్ర హృన్నివాసా మురారి సిం-హాసన మిదె గొనుమూ-దామోదర సిం - హాసన మిదె గొనుమూ ॥పూజ॥

ఆద్యంతరహితా - భేద్యా వేదోపనిష-ద్వేద్య నిరోధ్య నిర్బాధ్య పరేశ నీకు - పాద్య మిదియె గొనుమూ - గోపాల బాల పాద్య మిదియె గొనుమూ ॥పూజ॥

వాచామగోచర చ-రాచర దోషపుంజ-మోచ నోత్ఫుల్ల కమల - లోచన నీకు నిర్మ-లాచమనంబు గొనుమూ - గోవింద శు - ద్ధాచమనంబు గొనుమూ ॥పూజ॥

పంచతన్మాత్రలు _ పంచభూతంబులు - పంచకోశంబులు పంచేంద్రియములనె-పంచామృతంబు గొనుమూ కృష్ణపరాత్మ-పంచామృతంబు గొనుమూ ॥పూజ॥

నానాకర్మజ వాస - నానీక వికార వి - తాన విలీన బ్ర-హ్మానందజలపూర్ణ - స్నాన మిదియె గొనుమూ-వారిజోదర - స్నాన మిదియె గొనుమూ ॥పూజ॥

విస్తృత భద్రయశో - నిస్త్రైగుణ్య పరేశ - శస్త్రాస్త్ర ధారణ గభస్తి ధామ కులేశ - వస్త్ర మిదియె గొనుమూ - రాధాకృష్ణ వస్త్ర మిదియె గొనుమూ ॥పూజ॥

అజ్ఞానతిమిరార్క - ప్రజ్ఞానాతీత స - త్యజ్ఞాన మనంత సర్వజ్ఞాన దీప నీకు - యజ్ఞోపవీత మిదిగో- చేకొను సామీ యజ్ఞోపవీత మిదిగో ॥పూజ॥

శోభితాఖండపూర్ణ-వైభవ నిష్కామ ని-రాభాస నిర్లోభ నిరాభ నిర్లేప శౌరి - ఆభరణంబు గొనుమూ-చిదాత్మ రత్నా భరణంబు గొనుమూ ॥పూజ॥

బంధమోక్ష విరా - మాం ధకార్య జేంద్రామృ-తాంధ సార్చిత రక్షో-గంధాపహార కృష్ణా-గంధ మిదియె గొనుమూ-కర్పూరాగరు - గంధ మిదియె గొనుమూ ॥పూజ॥

లలిత బిందుసునాద-కళలన్మించి యఖండ-విలస దనంత వినిర్మలభావ మృగమద - తిలక మిదియె గొనుమూ- గోవింద కృష్ణా - తిలక మిదియె గొనుమూ ॥పూజ॥

అక్షయ కరుణా క-టాక్షవీక్షణ విశ్వ-రక్షణ దాక్షిణ్య విలక్షణ సల్లక్షణ-అక్షింత లివియె గొనుమూ- సాక్షాత్పరాత్మ యక్షింత లివియె గొనుమూ ॥పూజ॥

నిష్పార నిష్ప్రతీత నిష్పక్ష నిష్ప్రతీత - నిష్పాప నిష్ప్రపంచ నిష్పాంచభౌతికాత్మ - పుష్పమిదియె గొనుమూ- పరమాత్మ హేమ - పుష్ప మిదియె గొనుమూ ॥పూజ॥

రూప గుణ వికారా - వ్యాపక నానావిషయా-రోపణ మణిచిదగ్ని - చే పరిపక్వాగరు - ధూపమిదియె గొనుమూ- గోవింద కృష్ణా - ధూప మిదియె గొనుమూ ॥పూజ॥

కోపతాపములను - నేపణగించి సంవి - దాపోజ్యోతిని సర్వదా పూర్ణ కేవలాత్మ - దీపమిదియె గొనుమూ- గోపాల చిత్ప్రదీప మిదియె గొనుమూ ॥ పూజ ॥

నీవారశూకాగ్ర - పావన సచ్చిదాత్మ-భావాంతుడైన వాసుదేవున కఖిలార్థ - నైవేద్య మిదియె గొనుమూ- కేశవ కృష్ణ- నైవేద్య మిదియె గొనుమూ ॥ పూజ ॥

అంబుజోదర నవీ-నాంబుజ కంధర నీ-లాంబుద రోచిష్ణు పీతాంబరధర పూర్ణ - తాంబూల మిదె గొనుమూ - గోవింద విమల - తాంబూల మిదె గొనుమూ ॥ పూజ ॥

సాక్షా దద్వైతాప-రోక్ష క్షరాక్షరవి-లక్షణ లక్ష్యాంతర దీక్ష నిధాన నీకు - దక్షిణ యిదె గొనుమూ - మాచిన్ని కృష్ణా దక్షిణ యిదె గొనుమూ ॥ పూజ ॥

చారు శ్రీ వత్సమణి - హార రత్న కిరీట _ స్ఫార స్మరదన సుకుమార శృంగారాకార- నీరాజనంబు గొనుమూ- సచ్చిన్మ దాత్మా - నీరాజనంబు గొనుమూ ॥ పూజ ॥

మంత్ర మంత్రార్థసార - యంత్ర తంత్రోద్ధార-మంత్రాధి దేశ మూల-మంత్రస్వరూప వేద-మంత్రపుష్పము గొనుమూ- గోకులతిలక-మంత్రపుష్పము గొనుమూ ॥ పూజ ॥

వ్యష్టిసమష్టి భూత - సృష్టి వర్ధిష్ణు హరి - స్రష్టాండా ద్యఖిలాధిష్ఠాన కేవలాత్మ - సాష్టాంగ మిదె గొనుమూ-వృష్ణి కులేశ - సాష్టాంగ మిదె గొనుమూ ॥ పూజ ॥

శ్రీసత్యభామపుర _ వాస గోపాల పీరు - దాసపోషణ మందహాసాస్య శ్రీనివాస - పూజగావింతు గొనుమూ- శ్రీకృష్ణ దేవ - పూజ గావింతు గొనుమూ ॥ పూజ ॥

## మంగళ హారతి

అసావేరి - జుల్వా

దేశికేంద్రాయ తే మంగళం - మాణిక్య సద్గు - రో సనాథ తే సుమంగళం - నాశజననరహిత స్వప్ర - కాశ సుధీ హృదంబుజ ని - వేశ నిరింద్రియ నిరఘ ని - రాశయ నిష్ప్రాశ పరమ ॥ దే ॥

సతతగుణత్రయవివర్జితా - నిరీహ మహా - ద్భుతవిరోధ షట్క_నిర్జిత- యుత శమాదిషట్క_ నిరం - చిత నిరాకాశ నిర్మ- మతనిరామయ నిరవయ - వతులిత మహత్ప్రభావ ॥ దే ॥

ఘనసహస్రారమందిర - నిర్వికల్ప నిర్వా - సనోపేత కైవ ల్యేందిర - దినకరాబ్జనాడీకాంచ - దనిలలీన తద్విభాస - దనఘ నిరాకార నిరం - జనాతీంద్రియాప్రమేయ ॥ దే ॥

త్రివేణి త్రిమండలాంతర - శృంగాటకాధి-నివేశ ప్రభా దురంతరా - దివాకరసహస్రకోటిసువిస్ఫురత్పరంజ్యోతి- భవా ర్ణవోత్తీర్ణ పూర్ణ - శివంకర విభూతి దాయక ॥ దే ॥

సులభార్థసౌఖ్యవర్ధనా - బ్రహ్మేశ్వరాఖ - డలముఖ త్రిదశప్రార్థనా - చలాచలాంతిరిక్తకే - వలాఖండ సత్య నిర్వి - కలానంత నిర్విశేష - విలక్షణ పరాత్పరాత్మ ॥ దే ॥

ప్రపంచాంతర్బహిర్వ్యాపకా-సనాతన ని - ష్ప్రపంచ నిర్మల నిర్లేపకా - అపారసత్కృపాపరాశి - త పుంజపుంవినుపాయ స- న్నిపుణ బాహ్యాంతరాంతర - త్రిపుటిహారణ విశ్వభరణ ॥ దే॥

రోగతాప దుఃఖభంజనా - భక్తార్తిహారణ - యోగ భావిత విజ్ఞానాంజనా - రాగయుక్తైహికాముష్మి - కాగ సుక ర్మాది ఫలత్యాగ నిత్యసత్యభోగ-నూగమాంతార్థ లలిత ॥ దే॥

ఆరవ వృషత్కళాత్మకా - బాహ్యాంతర వి - స్ఫూర సమస్తాంతరాత్మకా - ధారుణీజలానల స - మీర నభోభూతా తీత - సారాసార నిర్విచార - ధీరవినుత సత్ప్రభావ ॥ దే ॥

ధరణి హుమ్నాబాదనివాసా - మాణిక్య విభో-గరిమ మహాన్మహిమవిలాసా-సరస శేషగురుకృపాన్వి- తరహి మీరుదాస వినుత - చరణ లాలాదాసరచిత - చరిత విదిత వాసుదేవ ॥ దే॥

సంపూర్ణము

ఓమ్

# పరమానంద సుధాలహరి



## శ్రీ గురుస్తోత్రమ్

గురు ర్బ్రహ్మా గురు ర్విష్ణు - గ్గురు ర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్పరం బ్రహ్మ - తస్మై శ్రీగురవే నమః.

అజ్ఞానతిమిరాంధస్య - జ్ఞానాంజనశలాకయా
చక్షు రున్మీలితం యేన - తస్మై శ్రీగురవే నమః.

మన్నాథ శ్రీజగన్నాథః - మద్గురు శ్రీ జగద్గురుః
మమాత్మా సర్వభూతాత్మా - తస్మై శ్రీగురవే నమః.

అఖండమండలాకారం - వ్యాప్తం యేన చరాచరం
తత్పదం దర్శితం యేన - తస్మై శ్రీగురవే నమః.

చైతన్యం శాశ్వతం శాంతం - వ్యోమాతీతం నిరంజనం
నాదబిందుకళాతీతం - తస్మై శ్రీగురవే నమః.

## విశ్వనాథ ప్రార్థనము

శ్రీమ ద్భూధరజాహృదబ్జమధుపా - శ్రీకంఠ దోషాచర
స్తోమోపద్రవ తోయదాలి పవనా - సోమార్ధమౌలీ లస
ద్వ్యోమాతీత పరాత్పరుండ వగు దీ - వు న్మన్మనఃశ్రేణి సు
స్థేమ న్నిల్పి యభీష్ట మీయఁగదె కా - శీవాస విశ్వేశ్వరా!

## అన్నపూర్ణ ప్రార్థనము

పరశివమూర్తికి నృదన - పాయినియై తను వర్ధభాగమున్
పరసత నావహించి యని - శంబు జగంబుల కెల్లఁ దల్లియై
పరగెడి విశ్వసృష్ట్యవన - భంజనహేతుపరాదిశక్తి శాం
కరి నగజాత యిచ్చు నధి - కం బగుసంపద లిష్టసిద్ధులున్.

## శ్రీమహావిష్ణు ప్రార్థనము

నిరతంబు న్భయభక్తియుక్తముగ హృ - న్నీరేజమధ్యంబునన్
చరణాబ్జంబులు నిల్పి సన్మునులు స్వే - చ్ఛం గొల్తురెవ్వాని నా
సరసీజాక్షు సుపాశ్రయింతు మదభీ - ష్టార్థంబు చేకూర వా
క్సరసత్వంబును హృద్విశుద్ధి యొదవ-న్సన్మోద మింపొందఁగన్.

## శ్రీ లక్ష్మీదేవి ప్రార్థనము

జలరుహనాభు వక్షమున - సన్నుతిమీర వసించి కౌస్తుభో
జ్జ్వలమణితుల్యమై సరస - భాసిలి సంతతలోకమాతయై
చెలువుగ సర్వసంపదలు - చేకుర సత్కరుణాప్తిఁ బ్రోచునా
జలనిధికన్య మా కిడుత - చారుతరేష్టపదార్థసౌఖ్యముల్.

## బ్రహ్మాదిదేవతా ప్రార్థనము

సరసిజాసనుఁడు భా - స్వత్కృపాలోకన
పరత నాయుష్యసం - పదల నొసఁగు
భారతీదేవి వి - స్ఫారవాక్ప్రౌఢి సు
శబ్దజృంభణము దే - జరిలఁ జేయు
తారకాసురుని వి - దారించు సత్కుమా
రుండు సౌఖ్యోన్నతా - రోగ్య మిచ్చు

దక్షాధ్వరంబు వి - ధ్వంసంబుఁ జేసిన
వీరభద్రుఁడు వంశ - వృద్ధిఁజేయు
విఘ్నముల కెల్ల నాథుఁడై - వెలయునట్టి
దంతివక్త్రుఁ డవిఘ్నభ - ద్రం బెసంగ
నేయుఁగాత తదంఘ్రిరా - జీవయుగము
నధికభక్తిని సేవింతు - ననుదినంబు.

హనుమత్ప్రార్థనము

వనరాశి దాటి ధరణీ
తనయను బొడగాంచి ఘోర - దానవులను భం
జనమునఁ ద్రుంచి విరాజిలు
హనుమంతుని పాదయుగళ - మర్థి నుతింతున్.

వసుధ నాదికవుల - వ్యాసవాల్మీకాది
మునులను భక్తితో - మ్రొక్కి వేడి
దండి భారవి కాళి - దాసాది సంస్కృత
కవులను మనములోఁ - గాంచి తలఁచి
బమ్మెరపోతనన్ - భాస్కర తిక్కన
నన్నయభట్టుల - నతి యొనర్చి
సనక సనందన - శౌన కాగస్త్య ద
ధీచ్యత్రి గర్గమై - త్రేయ మునుల
హరిహరబ్రహ్మల - నఖిల దేవబ్రహ్మ
యమిసత్తముల నాత్మ - యందు వేడి
సకలవేదోపనిష దర్థ - సార మరసి
యాత్మతత్త్వోపదేశంబు - నానతిచ్చి

దేశికోత్తముఁ డన ధాత్రిఁ - దేజరిల్లు
జమిలి శేషార్యవర్యుని - సన్నుతింతు.

అని యిష్టదేవతాప్రార్థనం బొనర్చి, నూతన పురాతన సంస్కృతాంధ్రకవులం గొనియాడి, హరిహరభక్తాగ్రగణ్యులగు భక్తమహేశ్వరదాస భాగవత దేవర్షి బ్రహ్మర్షి ముఖ్యులం బ్రస్తుతించి, అస్మద్గురువర్యుని ధ్యానించి, ముముక్షుజనుల కత్యంతోపయుక్తంబౌనటుల భక్తిజ్ఞానాచల పూజావిధానంబు లను నాలుగు భాగంబులు తత్త్వార్థంబున గీత ప్రబంధంబుగాఁ "బరమానంద సుధాలహరి" యను నామంబున నాయొనర్చు కృతి క్రమం బెట్టిదనిన-

౧. రాగము - నాట - ఆదితాళము.

నమోస్తు శ్రీశేషదేశికేంద్ర - నమోస్తు - సమస్తభూతౌఘ
ముఖ్యకారణ - త్రిమండలాద్యంతమధ్యపూరణ ॥ న ॥

త్రికూటతలచిత్ప్రకాశధామం - వికల్పహరనిర్వికారకామం
సుకాంతిహిరణ్మయకోశరూపం- సౌకర్యయుతపంచకోశదీపం॥న॥

త్రిమండలాతీతముక్తసంగం - సమంచితైకపరమాత్మలింగం
శమదమాదిగుణమాన్యచరితం-అమోఘసంవిత్ప్రమోదభరితం॥

అనాద్యంతసజ్జనౌఘసురతం - వినోదకళబిందునాదనిరతం
మనోరథఫలార్చనానుకూలం - ఘనస్తవితచేతనాదిపాలం ॥ న ॥

నిరాకారనిర్మలావిచారం - చరాచరవిలక్షణాత్మధీరం
నిరామయవిపత్సరోరుహేభం - నిరంజనపరాత్పరం నిరాభం॥న॥

దురంతరకిల్బిషరాజిదూరం - దరిద్రతమోపహారోగ్రసూరం
కురోగతాపోత్కరప్రహారం - నిరీహానిరహంకారోపకారం ॥న॥

అరాతిషట్కనికరప్రణాశం - స్ఫురత్సత్యభామాపురేశం
శరణ్యలక్ష్మిస్వాంతవికాసం - నిరంతరదయాదృతపీరుదాసం ॥న॥

౨. రాగము - శంకరాభరణము - ఆదితాళము

గురుపాదుక మనిశం - మానస - శరణైక్య మసదృశం ॥గురు॥

పరసాధువశంకరవిధివిధుశం - కరనుతసువశం కలుషాద్రికులిశం
నిరుపమసంకటనికరవినాశం - నిరవయవిదిశం నిత్యనిరాశం॥గు॥

పరోపకరణం భవాబ్ధితరణం - నిరహంకరణం నిగమాచరణం
అరిషట్కహరణం అజరామరణం - నిరశితకరణం నిఖిలంభరణం॥

పరహితపాత్రం పతితపవిత్రం - నిరీహాసూత్రం నిర్మలమాత్రం
గురుతరస్తోత్రం గుణగణజైత్రం - సురుచిరక్షేత్రం సుకరచరిత్రం॥

కరుణాపారం కర్మవిదారం - సరసాగారం శాంతాకారం
ఉరుతరధీరం యున్మనిజారం - నిరతవిస్ఫూరం నిర్మితస్ఫారం॥

చలననిరాసం సంవిదాకాశం - లలితనిష్కల్మశం లాంఛనకోశం
ఫలితబుధేశం భద్రగిరీశ - స్థలవసద్రామ శేషగురుప్రకాశం॥గు॥

❀

ఓమ్

# పరమానంద సుధాలహరి

## భక్తిభావము

### నమశ్శివాయ నక్షత్రమాల - పంచచామరము

శివ స్తుతామర ప్రసన్న - చిత్ప్రకాశకాకృతే
భవార్ణవోద్ధృతిప్రసాద - భాగ్యవైభవోన్నతే
సువస్తువాహనప్రద త్రి - శూలహ స్త శైలధా
మ వామదేవ శంకరోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౧

పవిత్రవిద్వదానుకంప - భావసంయుతోర్వపాం
గవీశవిశ్వతోముఖప్ర - కామితార్థదాయకా
శివాధవ త్రిలోకనాథ - సేవితాంఘ్రిపద్మ భీ
మ వామదేవ పాహి మాన్న - మశ్శివాయ ధూర్జటీ. ౨

ధరాధరప్రదేశహర్మ్యశ్రీ - ధామసంయమీద్ధృదం
తరంగరాజితప్రపూర్ణ - తత్వకేవలాత్మరా
ట్పరాత్పరా వికల్ప నిష్ప్ర - పంచ నిర్వికారకా
మ రాజరాత్మలింగ ఓన్న - మశ్శివాయ ధూర్జటీ. ౩

నిరంతరప్రభాసమాన - నీరజాప్తకోటికాం
తిరమ్యదివ్యరూప శాంత - నిర్గుణావ్యయాఖిలాం
తరస్థ రాజితాత్మ సుప్ర - ధాన నిర్మలాకృతే
మరుద్భుగింద్రకుండలోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౪

క్షరాక్షరాద్వయాతిగ ప్ర - శాంత సర్వతోముఖా
చరాచరప్రపంచసాక్షి - చారుబాలచంద్రశే
ఖరస్థిరాభృదింద్రజాధి - కాంత సద్విలాస త
న్మరాళ వాహనార్చితోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౫

ఇలాజలానలానిలాంత - రిక్షభూతకోటిసూ
జ్జ్వలాఖిలాతిరిక్త నిర్వి - చార నిర్విశేష ని
ష్కలా ప్రలాలితాత్మ నిర్వి - కల్ప నిర్వివాద ని
ర్మలాచలాంతరాత్మ కోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౬

పినాకి నాగకుండలా క్ర - పీటయోనిలోచనా
ధినాథ నాగచర్మ చేల - దివ్యసంయమీట్సుధీ
జనావనా వనీశ తాంగ - శైలచాప చండికా
మనోవినోదలాలసోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౭

పురందరాదినిర్జరాళి - పూజితాంఘ్రివారిజాం
బరాంబర ప్రతాపశాలి - భావజారి నీలకం
ధరా విరూపనేత్ర సర్వ - దాకృపాంబుధీ సుధా
మరీచిమాళిమండనోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౮

మృగాంకహస్త సుప్రశస్త - మృత్యుహంతృభీమ ప
న్నగేంద్రకుండలప్రకాశ - నందిరాజవాహనా
నగాత్మజావధూమణీమ - నఃపయోజభృంగ సా
మగానలోల శంకరోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౯

సుధాంశుమండలార్ధమాళి - శోభితా గుణాలినీ
రథీ సుధీంద్రపద్ధృదంత - రంగభావ శంకరా

విధిస్వరాఙ్ముఖాదితేయ - వేద్య ముక్తిదాయకా
మధుస్వనాంత నిర్మలోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౧౦

సనందనాదివందితాంఘ్రి - సారసద్వయా నిరం
జనాగమాంతవేద్య హృద్య - శాంత నిర్గుణాత్మ పా
వనా వనీధరేంద్రవాస - వామదేవపార్వతీ
మనోవినోద శంకరోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౧౧

దయాపయోనిధీ ప్రధాన - తత్వ నిర్మలాత్మ చి
న్మయాత్యతీంద్రియామనస్క - మాననీయసద్గుణా
వ్యయాపరేశ ధీర శర్వ - హృద్యబోధతత్వ త
న్మయాద్వయాపవర్గ ఓన్న - మశ్శివాయ ధూర్జటీ. ౧౨

చరాచరప్రపంచసర్వ - సాక్షి నాకనిమ్నగా
స్ఫురచ్ఛిరోబృహజ్జటాప్ర - పుంజచండభండనాం
తరోగ్రనిర్మలప్రతాప - దారుణప్రకాండభృ
న్మరుద్భుగింద్రకుండ లోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౧౩

కురంగరాజశూలపాణి - గోప్యభస్మ లేపనాం
బరాంబరా వృషధ్వజోరు - భద్రసద్మృగంచలో
ద్భరా విరూపనేత్ర పూర్ణ - భావ నిష్కళంక కా
మరస్థిరాత్మలింగ ఓన్న - మశ్శివాయ ధూర్జటీ. ౧౪

పురామరారిసూదన ప్ర - ఫుల్లభానుసోమచ
క్షు రక్ష రాఖిలాంతరంగ - శుంభదవ్యయాత్మ శం
బరార్యరాతి దక్షయాగ - భంగ విశ్వతోముఖా
మరేశ్వరార్చితాంఘ్రి కోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౧౫

ఉమాసుమానినీమనోమ - హోల్లసత్కళా చల
ద్భ్రమప్రమోదలాలస ప్ర - భావకోమలాకృతే
సమస్తమండలాధినాథ - సార్వభౌమ విశ్వరా
ణ్మమ ప్రమోదవర్ధనోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౧౬

నదీహృదంతరావినోద - నర్మకేళికాబృహా
న్మదాస్పదాఖిలప్రపంచ - మోహనాతిశోభనా
సదాచిదంబరాతిరిక్త - స్వప్రకాశపూర్ణ కా
మదాంచితాత్మలింగ ఓన్న - మశ్శివాయ ధూర్జటీ. ౧౭

జటాచ్ఛటాప్రపూరసూల్ల - సద్వియద్ధునీధవా
కటీతటస్థ వజ్రభాని - కాశ భోగిమేఖలా
తటిత్పటీరచంద్రికాప్ర - ధాన శుభ్ర పాహి మా
మటత్కటాక్షదృగ్విభా న - మశ్శివాయ ధూర్జటీ. ౧౮

లలాటలాంఛ నాగ్నిహోత్ర - లాఘవ ప్రచండదో
ర్బలాఖిలారివాహినీపు - రాసురప్రహారణా
చలాచలాతిరిక్త సుప్ర - శాంత శుద్ధసత్వ ని
ర్మలోజ్జ్వలోన్మనీశ్వరోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౧౯

ప్రసాదసర్వదావిభూతి - భవ్యసంగరోద్భట
ప్రసన్నసంయమీంద్ర సాధు - భక్తలోకపాలనా
లసన్మహీధరాగ్రవాస - లక్షణాగ్నిఫాల భీ
మ సారసాసనస్తుతోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౨౦

ప్రభూతభూతరాడ్గణాధి - పస్తుతాబ్జయుగ్మస
న్నిభాంఘ్రిభాసురప్రధాన - నిర్మలప్రభాకరా

సుభద్రభాగ్యదాయక ప్ర - సూనపత్రపూజ్య కా
మభంగ భీమశంక రోన్న - మశ్శివాయ ధూర్జటీ ౨౧

అపారపాతకాంబుభృన్మ - హానిలాసముల్లసత్
కపర్దపార్వతీమనోవి - కాస నిర్మలాకృతే
ప్రఫుల్లచారునీరజాత - రాజితాక్ష శర్వ జ
న్మపుంజపూతరూప కోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౨౨

సహస్రహంసచంద్రదీప్త - సత్పదా సుధీమనో
విహారహంస తత్వరూప - వేదసార కిల్బిష
ప్రహార హంసవాహనాద్య - పాసనీయరూప స
న్మహాస్ఫులింగలోచనోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౨౩

సమస్తమంత్రవేదశాస్త్ర - సారభూత భూతరా
డ్రమత్రిమండలాగ్ర చిత్ప - రా స్వయంప్రకాశ కా
శమక్షమాదిమంగళప్ర - శస్త సద్గుణోన్నతే
మమ ప్రమోదవర్ధనోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౨౪

దురంతఘోరకిల్బిషౌఘ - తోయదప్రచండవా
త రాజరాజితాభ్ర కేశ - తాపదుఃఖదూర శం
బరాంతకాంతకాతిశుభ్ర - భస్మలిప్తవిగ్రహా
మరాపరూప కేవ లోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౨౫

నిరామయా నిరంజనా వ - నీరధప్రశాంత సు
స్థిరాకలంక నిశ్చలావి - చింత్య నిర్వికల్ప ని
ర్జరావికారనిర్హృషీక - సత్యశుద్ధనిష్ప్రకా
మ రంగదంతరాత్మ కోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౨౬

నమోస్తు సర్వదా సుధీమ - నఃపయోరుహోజ్జ్వలా
నమోస్తు దీనలోకరక్ష - ణప్రశ స్తతత్పరా
నమోస్తు దుర్విపన్నివార - ణా మహేశ శంకరా
మమాంతరంగమంది రోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౨౭

సదా పర న్నరాళిసర్వ - సంపదీప్సితార్థను
ప్రదా సమ స్తదోషదుర్వి - పత్ప్రహారణా శుభా
స్వదా పురారి వీరుదాస - పాలనామలాత్మ వా
మదేవవిశ్వకార ణోన్న - మశ్శివాయ ధూర్జటీ. ౨౮

౧. రాగము – శంకరాభరణము – చాపుతాళము

రామభజన సేయరాదటే - ఓమనస పరం - ధాముని సేవింపరాదటే ॥రామ॥

ఆముష్మోన్న ఘోరకిల్బిషౌఘములను పరిహరించి - ప్రేమ మీరఁ బ్రోచుతారకనామ మలరు సీతామనోభి ॥రామ॥

సంకటములు దీరిపోవును - సదాసుధీవ - శంకరత్వ మనువుమీరును - పొంకముగను దివ్యమంగళాంకవిభవ మమర నిరా - తంక చిదానందసౌఖ్యదాయక మని యెంచిసీతా ॥రా॥

నీలనీరదాభగాత్రుఁడు - కస్తూరితిలక - ఫాలసరోజాత నేత్రుఁడు - మేలిమిపసిండివలువ ప్రేల సత్కిరీటరుచిర - జాల మావరింప సద్దయాలవాలుఁడై వెలుఁగు ॥ రామ ॥

నిరతభ క్త పారిజాతము - పావనము నిరం - తరము త్రైలోక్యపూతము - సరసిజగర్భామరేంద్ర సకలనిర్జరాఘనుత కర పరాత్పరస్వరూప పరమిలోకరూప మొసఁగు ॥ రామ ॥

పంచపంచహృషీకంబుల - నిరసించి విషయ - ప్రపంచకాంచ
దైకసూజ్జ్వల - పంచశక్తి పంచముక్తి పంచకర్త్రాతీతమై వికసించి నిర్వికారనిర్మలాంచితమై వెలయునాత్మా । రామ ।

వాసనాత్రయం బడంగును - సంపూర్ణచిద్వి - లాసమోద
మందగల్గును - భాసమానభద్రశైలవాస రామచంద్ర శ్రీనివాస మహద్భక్తహృద్వికాస నిరామయ సదాత్మా । రామ ।

౫. రాగము - పూరికల్యాణి - రూపకతాళము

రామరామరామరామ రామకృష్ణతారకం
రామరామ సర్వదోషదుర్విపన్నివారకం ॥ రామరామ ॥

సంతతంబు భక్తిమీర స్వామి నిన్ను గొల్వగా
చింత లన్ని దీర మిగుల నేమ మెసగు చెల్వగ ॥ రామ ॥

కామమోహములను గెంటి నీమహత్వ మెన్నగా
నామకోన్న పుట్టుగిట్టు బాములన్ని సున్నగా ॥ రా ॥

తామసులము దుష్టమతుల మే మెఱుంగజాలము
నీమవర్జితులము శుద్ధపామరులము గావుము ॥ రా ॥

ఎన్నియెన్ని జన్మములను నెత్తి యిడుముపాటులు
పన్నగా ఘటింపవలయుచున్న వెన్నికోటులు ॥ రా ॥

అన్నిటికిని నీపదాంబుజాశ్రయంబె పారము
నిన్ను సన్నుతింపఁ గలిగె నితర మేమి గోరము ॥ రా ॥

ఇటకు మున్ను పుట్టి యనుభవించినదియె చాలుగ
దిటముగ నీనామభజన కుటిలతలను దోలుగ ॥ రా ॥

ద్రోహశీలచిత్తు లనుచు ద్రోహ మెన్నఁబోకుర
మోహజలధినావమైన శ్రీహరే పరాకుర ॥ రా ॥

కాములనే యటవికి నీనామమే కార్చిచ్చుర
రామనామ మాశ్రితులకు కామితార్థ మిచ్చుర ॥ రా ॥

గండదోషములను బాపి నిండుదయను బ్రోవర
యండదండ మాకు నీవై యుండుజానకీశ్వర ॥ రా ॥

ఎల్లలోకములను మిగిలి కొల్లలయ్యె నీదయ
చల్లనైనచూపు లెసగఁ జల్లు కల్ల గాదయ ॥ రా ॥

ప్రాపు దాపు నీవెగాక పరగ నెవ్వ రున్నవారు
నాపు కాపు నీవెతప్ప నన్యు లెవ్వారు లేరు ॥ రా ॥

సతముగా దిహసుఖంబు బ్రతుకు లతుకు లాయెర
గత మనాగతము శాశ్వతము కరుణసేయర ॥ రా ॥

పోయె కాలము వృథామాయ ననుసరించియుఁక
డాయు నిన్ను గొలిచిన సుశ్రేయసంబు మించియుఁక ॥ రా ॥

మూఁటిఁ గోసి మూఁటి రోసి మూఁటిమూఁటి దాటఁగ
మూఁటినడుమ బాట సూటినాటి చూడ నేటుగ ॥ రా ॥

నిండుపున్నమచందురుని పండువెన్నెలందున
దండివియన్మండలమై యుండి యంత వెందున ॥ రా ॥

భాసురముగ భద్రశైలవాసుఁడైనవాఁడవు
వాసుదేవ గురో పీరుదాసు నేలినాఁడవు ॥ రామ రామ ॥

3. రాగము - బేగడ - త్రిపుటతాళము

కీర్తి యేమిర శరణార్తులమనుచు రామమూర్తి నీవని యెంతురు సేవింపుదు రార్తితో నాశ్రయింతురు ॥ కీర్తి ॥

వార్త కెక్కినసత్యవర్తనుఁడవై కరుణ - స్ఫూర్తి పాలించి విశ్వమూర్తివై యున్నందుకు ॥ కీర్తి ॥

మున్న గస్త్యునిశాప - మున నింద్రద్యుమ్నుఁడ - త్యు న్నతకరీంద్రుండునై - మత్తుండునై - యెన్న నసాధ్యుండునై - తన్ను గొల్చుమదేభము - ల్దశలక్షకోటులు వెలయ ॥ పన్నగ నీరు ద్రావుచున్నెడ న్మకరి బట్ట - నెన్ని పగల బెనంగుచును గడు - సన్నమై బలహీనుఁడై - యాపన్నతను హరి పాహి యన మక - రి న్నడంచి గజేంద్రు నేలిన ॥ కీర్తి ॥

శరణాగతత్రాణ - శపథముఁ బూనిన - దొరవని శ్రుతి స్మృతులు - చేయుసన్నుతులు బరగు ననేకరీతులు - నరయఁ దథ్యముగాదె దురితచేతస్కుఁడయ్యు - సారిది దుర్యోధనుఁడు జూదమున నోడించి - పరమసాధ్వియు ద్రౌపది యంబరముల న్విడిపింపఁగృష్ణా - హరి కటాక్షింపుమన నతులాంబరము లిడి మానంబు బ్రోచిన ॥ కీర్తి ॥

ధీరత పాండవ - వీరులచేఁ దెగ - టారి కౌరవసైన్య ముల్ - బటుదైన్యముల్ - మారినసౌజన్యముల్ - వారక ధర్మకుమారముఖులు నీద - యారసమునఁ దేలుతోరము సహింపక॥ క్రూరతను ద్రౌణియు నకులముగఁ గోరి నారాయణ శరాహతి - జేరి నిర్భేదింప నుత్తరభార ముడిపి యబలను బ్రోచిన ॥ కీర్తి ॥

మునులు సుపర్వులు - మును దశాననుబారి - కని
సహింపగరాకను - స్థితి లేకను - మనఁగ నెచ్చట గాకను - జని
సరోభవగర్భాద్యనిమిషుల్ శౌరి పాహి - యని మొరబెట్టగ
విని రామచంద్రుఁడవై ॥ జనన మొంది నిశాటకుల భేదనముకై
కపిసేన గొల్వగ - మొనసినంత విభీషణుఁడు శరణనుచు వేడగ
నభయమిచ్చిన ॥ కీర్తి ॥

వనజారణ్యముఁ బెకలిం - చిన గజేంద్రంబుచా - ద్పున
దశగ్రీవాదులఁ - సురభేదులఁ - దునిమి కుంభకర్ణాదులన్ -
దనర వాస్తోష్పత్యాదినిలింపుల్ స్వవిభుత్వ - మున రంజిల్లగఁ
జేసి మునులెల్ల నానందింప॥ దినకరశశాంకతారకమై - యొవర
లంకారాజ్యము విభీషణునకు న్మ్రజి ధారవోసితి - వనుచు
రామాయణము జెప్పిన ॥ కీర్తి ॥

దీనులఁ బోషింపఁ - బూనియుందు రెవ్వారు - నానా
భువనములందున - మూర్తులందున - ధీరుత నీవైనందున -
నానేలుటంచు కీవేకాని యన్యులు లేరు - నానేర మెన్నక
నీవానిగ దయజూచి॥ మేనఁ బొడమి నడుమను పరిహారమై
యరుంగంజేసి నిత్యాసు - ఖానుభూతి రెయిసంగుపరమని ధాన
సీతాజాని నీదగు ॥ కీర్తి ॥

వాసనారహితుఁడై - భాసిల్లునీయం దా - భాసమై భువ
నావళుల్ - చరాచరాళుల్ నీపద్రూపలీలావళుల్ - వాసవా
చిజ్ఞాత చిద్విలాస నిర్మల నిరా - భాస కేవలాత్మ సుధీసాక్షి
పరమేశ॥ వాసుదేవ జగత్ప్రభో కరుణాసరిద్విభు భద్రశైలని-
వాస రాఘవ శేషగురురాడ్భాస పీఠాసావృతుండను ॥ కీర్తి ॥

## ౪. రాగము - కమాచ్ - చాప్ తాళము

కరుణ సేయవే రమా కామినీమనోహర
సరసిజాతపత్ర నేత్ర సాధుమనస్తత్పర ॥ కరుణ ॥

పామరుఁ డతితామసాన్వితసోమరుఁడని చూడకు
రామనామ మేమియు మది నేమర విడనాడకు ॥ క ॥

మలినయుతుఁడ చలనగతుఁడ వలన నేర మెంచకు
దలఁప నఘకలుష జలధి నలగి నన్ను ముంచకు ॥ క ॥

మనమున ననుదినము నీదుఘనము నెంచి వేడితి
యణగి పెనగి కణగినట్టి గుణముల దిగనాడితి ॥ క ॥

ఐహికాముష్మికసుఖసాహములను బాసితి
దేహి దేహమోహవ్యూహపోహణముల రోసితి ॥ క ॥

రేపుమాపు శ్రీపతి నీప్రాపు దాపని నమ్మితి
నేపు చూప నోపుకోప తాపములను జిమ్మితి ॥ క ॥

భక్తియుక్తియుక్తముగ విరక్తిముక్తుల గూడితి
భుక్తిరక్తిసక్తసిక్తభోక్తల దిగనాడితి ॥ క ॥

కంటి వింటి నీపదములు జంట బాయకుంటిని
కంటు గెంటి యంటి నీకు బంట బంటు నంటిని ॥ క ॥

పాంచభౌతికాఖిలప్రపంచమైన యొరుకను
గాంచి యెంచి మించి నిన్భజింంచెద నేమరకను ॥ క ॥

మూఁటిమూఁటి దాటి సూటి మేటి స్వప్రకాశుఁడ
ఘాటి సాటిలూటి భానుకోటియహా పరేశుఁడ ॥ క ॥

మూఁటి మీఁటి నాటినక్రియతోఁటి నిన్ను గొల్వఁగ
నోటుపాటు చేటులేనిదీటు నేటు చెల్వఁగ ॥ క ॥

త్రొక్కితి హరి దక్కితివని యెక్కితి కుధరంబును
నిక్కితి వృథ గ్రక్కితి సుధ మెక్కితి మధురంబును ॥ క ॥

పండితహృన్మండితోరుఖండితభవసంచిత
మండలోర్ధ్వకుండలీ యఖండితతల్పాంచిత ॥ క ॥

వాసవనుత దాసావిత భాసుర భద్రాచల
వాస వాసుదేవ పీరుదాసపాలితాంచల ॥ కరుణసేయవే ॥

౧౧. రాగము - ముఖారి - ఆటతాళము

ఎంతనిర్దయమానసుఁడవు - రామ నే - నెంతవేఁడిన -
కండ్లబడవు ॥ ఎం ॥

పంతమేటికి రమా - కాంత నీమనసు ర - వ్వంతైన
గరుగదు - యెంతకాఠిన్యమో ॥ ఎంత ॥

నీదాసులగువారియందు - నీలా - నిరాదరించుట కేమ
నందు - సాదరంబుగ నీప్ర - పాద మిడలే వంత - బీదవా
నీదుమ - ర్యాద యింతేగాద ॥ ఎంత ॥

అన్నదమ్ముల వైరమునను - భానుజుఁడు - విన్నవించిన
వాక్యములను - తిన్నగా ధర్మంబు - దీర్చకయె దోషమని-
యెన్నకను వాలి నొక - యేటునను మాటితివి ॥ ఎంత ॥

ఘననీతిశాలినైనట్టి - జానకిని - జనలోకవాదుకనుబట్టి-
వినయ మించుక లేక - వీరపత్ని మనసు - కనలేక ఘోరకా -
ననములకు బంచితివి ॥ ఎంత ॥

ఘనుఁడు వాల్మీకిఋషి వెంట - వచ్చి మృదు - గాన
మును సేయగా వింట - నణుమాత్రమైన నా - హ్లాదమొంద
కను నీ - తనయు లగుకుశలవుల - తనులుగా నెంచితివి ॥ ఎంత ॥

బలధార్తరాష్ట్రపాండవులు - నుభయులకు - గలపోరు
దీర్పగాజాలు - తొలిమధ్యవర్తివని - పిలిచినను ధార్తరా -
ష్ట్రులను జంపించితివి - వలపక్షమును జేసి ॥ ఎంత ॥

అలమహాదానగుణశాలి - యైనట్టి - బలిని వంచింప
దయమాలి - బలుక పటవటునివలె - నిలచి మూఁడవయడుగు -
తలనుంచి వడి రసా - తలమునకు ద్రొక్కితివి ॥ ఎంత ॥

క్రయము లక్షలకొలదిగాను - విక్రయిం - చియు
నిజోత్సవసేవగాను - నియతి దప్పక సేయు - నిలరామదాసు
నిటు - దయలేక కొన్నాళ్ళు - ఖయిదులో నుంచితివి ॥ ఎంత ॥

దాసుఁడై యితరంబు మాని - సంతతో - ల్లాసమున
నీసేవ బూని - జేసి సద్భక్తిభా - సిలుతూము నరసింహ
దాసునిం బట్టి గో - దావరిం ద్రోసితివి ॥ ఎంత ॥

ఎపుడు నీసేవకుల నెల్ల - నీరీతి - కృపదప్పి చూడ నే
నొల్ల - నపరాధ మెన్నవని - యాశ్రితత్రాణైక - నిపుణుఁడీవని
వింటి - కృప జూడకున్నావు ॥ ఎంత ॥

వాసిగ గోదావరిని - భద్రాద్రి - వాసుఁడై నెలకొంటి
వని - యాసించుకొని పీకు - దాసుఁడను నీకు నే - దోసి
లొగ్గిన కరుణ - జేసి రాకున్నావు ॥ ఎంత ॥

౭౦. రాగము - పున్నాగవరాళి - త్రిపుటతాళము

నాటి కిప్పుడె శ్రీమన్నారాయణ యనుచు ॥ నాటి ॥
నోటినిండా తనివి దీరగ - మాటికిని స్మరియింతు నే నల ॥ నాటి ॥
అంతకునికింకరులు క్రోధా - వంతులై గర్జించి శరీ
రాంతమున పీడించుబాధా - త్యంతమున గల్గునో గల్గదో ॥నా॥
వాతపిత్తశ్లేష్మములు సం - ఘాతమై యేకీభవించి ప్ర
భూతదుర్వికారజరవి - ఘాతమున దోచునో దోచదో ॥ నాటి ॥
కుత్తుకందు కఫంబు నిండి వి - యత్తలామృతవర్ష ముడిగియు
తత్తరంబున భీతి వణకు - నత్తరిని గల్గునో గల్గదో ॥ నాటి ॥
దినకరాబ్జరిపులు గతులు ద - ప్పి నడువగ నలబ్రహ్మరంధ్ర
మ్మునవాలు తాశనుఁడుడుగునా వే - శనుగలుంగునో గలుగ నేరదో॥
వరలువాఙ్ముఖరేంద్రియంబులు - ధరను తద్విషయంబులేనా
శరమునందు విలీనమగు నవ - సరమునను దోచునో దోచదో॥
జ్ఞానకరణము లగ్నియందు స - మానప్రాణోదానపాన
వ్యానములు పవనమున లీనం - బైనతఱి గల్గునో గల్గదో ॥నా॥
ఘనత నంతఃకరణములు నా - కంబు నొందఁ సగంధధారుణి
వనమునందు విలీనమగునెడ - నిను దలంపన్గలనో లేనో ॥ నా ॥
సరసజలము న్నిఖిని రూపో - త్కరకృశానుఁడు మారుతంబున
స్పర్శపవనము మింట నుడిగిన - తఱిదలంపన్గలనో లేనో ॥నా॥
సరవి నాకము తన్మహాహం - కరమునందు తదహము మహదం
తరమునను తన్మహత్తు పరా-త్పరమునం దైక్యంబగుదునని ॥నా॥
భాసురంబగుభద్రశైలని - వాసరాఘవ శేషగురుకరుణాసమన్విత
పీరుదాసా - భ్యాసమగు సన్మంత్రరాజము ॥నాటి కిప్పుడె॥

భక్తిభావము - సంపూర్ణము

ఓమ్

# పరమానంద సుధాలహరి

## జ్ఞానభావము

౧. రాగము - శంకరాభరణము - ఆదితాళము.

పరంధామ శ్రీధరుండవని మునివరు లెట్లు వినుతించిరో
నిరాతంకసుస్థిరానందతత్పరత్వసుఖ మెటు గాంచిరో ॥ పరం ॥

అరూపకుఁడవై విరాజిల్లు నీస్వరూప మెటు వర్ణించిరో
స్ఫురన్నిజహృదంతర స్థితుఁడవై భరింప నెటు లక్షించిరో ॥ పరం ॥

అమాయకుడవై సమస్తబ్రహ్మాండము ల్కుక్షి నెటు లుంచితో
రమేశ నీ వాదిమధ్యాంతశూన్యమై యెటుల వ్యాపించితో ॥

నిరంజనుడవై చరాచరాకృతి శరీరముల నెటు దాల్చితో
క్షరాక్షరవిలక్షణావ్యయ పరాత్పరాత్మవై యెటు నిల్చితో ॥

గణింపరానియగుణుండ నీచే గుణత్రయం బెటు లాయెనో
గుణాతీత కారణత్రిమూర్తికాకరణవ్విశ్వ మేచాయనో ॥ పరం ॥

నిరామయత నావరింప నీచే ధరావ్యోమముఖరంబులుఁగా
భరింపఁగ స్థావరాదిజంతునికరంబు లతిసుకరంబులుఁగా ॥ పరం ॥

అకాముండవై వికాసింప నీవికారంబు లెటు గల్గెనో
సకాయాదివిశ్వకల్పనవిలాసకుండనఁగ నెటు చెల్లెనో ॥ పరం ॥

త్రిలోకములు నీవిలోకనముచే వెలుంగ నెటు పాలింతువో
తలం పుడిగి నిశ్చలదోగనిద్రలో నేమి గావింతువో ॥ పరం ॥

భవస్థితిలయాదివర్తనములందు వర్తింప నెటులైతివో
దివాకరశశాంకవహ్నితారాద్యవార్యరుచు లెటు జేతువో॥

అనారతము సజ్జను ల్విశ్వపావనుండంచు భావింతురు
కనత్కళాబిందునాదముల కెటు సనాతనునిగా గాంతురు॥

సమాయాప్రపంచమూలప్రకృతి కాదిమూలమై యొకరీతిగా
సమస్తంబు లీనమైనతఱి సత్యమై యుండు విఖ్యాతిగా ॥పరం॥

చలాచలవివృత్తులం బడక కేవలాత్మగా ప్రకటింతువు
సులభార్థనిస్తులాచింత్యనిర్మలాత్మగా శోభింతువు ॥పరం॥

ధరాభద్రభూధరేశ కోదండరామ విధిశివసేవిత
స్ఫురచ్ఛేమసద్గురోనుకంపాకరార్ద్రి పీఠాపావిత ॥ పరంధామ ॥

౨. రాగము - కాఫీ - ఆదితాళము

ఎంతో బ్రహ్మానంద మాయెనె - మన - చింతలన్నియు
దీరిపోయెనె ॥ ఎంతో ॥

సంతసమున హృద - యాంతరంగము నాత్మా - చింతన
చేత నిహ - చింత లేనట్టివారికి ॥ ఎంతో ॥

కీకారణ్యము బయలాయెనె - యొంటి - మెకము గిట
ణగి పోయెనె - యేకాంతమున కొండకూకలు సమసి నిర్లోక
నిరింద్రియ - నిరాకారు లైనవారికి ॥ ఎంతో ॥

ఏడుకోటలు కొలుపోయెనె - యీ - రేడులోకము
లేకమాయెనె - యామచు బంగారుమేడలోపలఁ జొచ్చి -
ఈడైనము క్తికాంతను కూడియున్నట్టివారికి ॥ ఎంతో ॥

దండిచీకటి వెల్తురాయెనె - చిన్మా - ర్తాండు డఖండ తేజుండాయెనె - నిండు మున్నీటిమీద పుండరీకములోన - నుండే మరంద మానుపండితు లైనవారికి ॥ ఎంతో ॥

సాకారగుణజయ మాయెనె - తన్ని - రాకారపరవశ మాయెనె - ఆకాయవిషయాదిలోకాతిరిక్తపర - మేకచక్రము గాను జోకతో నేలువారికి ॥ ఎంతో ॥

మర్మము లన్ని వీడిపోయెనె - సర్వ - ధర్మపరిత్యాగ మాయెనె - దుర్మోహపాశపరినిర్మితమనః పూర్వ- కర్మవర్జిత నిత్యనిర్మలు లైనవారికి ॥ ఎంతో ॥

భూమియాకాశ మేకమాయెనె - డెంద - మామీద నిర్వికల్ప మాయెనె - నామరూపవికారస్తోమవిలీనమై ని - రామయ మొందియు నిక నేమియు గానివారికి ॥ ఎంతో ॥

భాసురభద్రాద్రివాసుఁడై యొప్పు - శ్రీసీతారాములకు దాసుఁడై - శ్రీశేషగురుసత్కృపాసమన్విత పీరు - దాసాభ్యాస పరతోల్లాస మొందినవారికి ॥ ఎంతో ॥

### 3. రాగము - కేదారగౌళ - జంపెతాళము

సర్వంబు బ్రహ్మమని సరణిఁ దెలిసినయోగి - నిర్వాణ పదవిభవ నిరతుఁడై చెలఁగుఁగా ॥ సర్వంబు ॥

సదములవీచి బుద్బుద ఫేన నివహంబు - పదఁపడి వీక్షింప నుదక మగురీతిఁగా - విదితచైతన్యాది విషయప్రపంచంబు - మది నరయ దృగ్బ్రహ్మ మైనవిఖ్యాతిఁగా ॥ సర్వంబు ॥

అమలనిర్వ్యాచి బ్రహ్మానందవారాశి - సమరుదంబుతరంగ
సమితి యగునట్లుగ - అమలపరాత్మప్రత్యగ్భావమున నిండి
సమరున్మనఃప్రపంచముగాఁగ నిటులగ ॥ సర్వంబు ॥

మూఁడు కాలంబులును - మూఁడు లోకంబులును -
మూఁడు గుణంబులును - మూఁడు మూర్తులును - మూఁడు
కాయంబులును - మూఁడు జీవంబులును - మూఁడవస్థల తిర
మ్ముగ నుప్పతిలను ॥ సర్వంబు ॥

తగులసత్ప్రాణచైతన్యేంద్రియాద్యఖిల - జగము ల్గ్రాడ
వుల పసిడిగ జూచుగతిని - మిగుల సంవిన్మాత్ర మగుగా మనః
ప్రాణ - విగతేంద్రియంబై వెలఁగ స్వతస్థితిని ॥ సర్వంబు ॥

ఘనఘటావరణమైనను ఘటమహాన్నభము - లన నొప్పి
నటు బ్రహ్మమును నజాండమును - మును లేనిజగము లేద
నెడుభావము కనుం - గొన నిరావరణమైనను తద్విధమునగ ॥
శ్రీమించుభద్రాద్రిశిఖరీశ సీతాభి - రామతత్వమును పరం
ధామతత్వమును - ప్రేమ శేషగురుండు పీకుదాసున కాత్మా-
రామతత్వ మొసఁగె స్వామిచందమునగ ॥ సర్వంబు ॥

౪. రాగము - ముఖారి - ఆటతాళము

రామనామము - జీవనము - రామనామము ॥
సామీరి విభీషణాది - ధీమత్కామార్థప్రసాద
భూమానందామితాంభోధి - సామోపనిషదంతర్వేది ॥ రామ ॥
ఘోరభవార్ణవోత్తారం - దారుణవిపద్విదూరం
సూరిజనోపాసనాధారం - దారిద్ర్యాంబుభృత్సమీరం ॥ రామ ॥

సురయమీంద్రహృత్పవిత్రం - దురితౌఘలతాలవిత్రం
శరణాగతత్రాణసూత్రం - అరివర్గవనవీతిహోత్రం ॥రామ॥

పంచవింశతితత్వాతీతం - పంచపంచనినదవిఖ్యాతం
సంచితప్రారబ్ధవిఘాతం - సంచలన్మానసపూతం ॥ రామ ॥

ఆఱుకంజములను మీఱి - కోరి సూక్ష్మద్వారము దూరి
చేరి చిత్సౌఖ్యాధికారి - యై రంజిల్ల నిది మంచిదారి ॥రామ॥

చిన్మాత్రతత్వానుకూలం - ఉన్మనీపదాలవాలం
తన్మయప్రమోదావేలం - తారకమంత్రాదిపాలం ॥రామ॥

ఆగమాంతతత్వసారం - రాగద్వేషమలినవిదూరం
యోగలభ్యాంతరవిస్ఫారం - భోగయోగ్యప్రదాతారం ॥రా॥

ప్రత్యక్షావగమ మస్తోకం - సత్యానృతేంద్రియవిపాకం
నిత్యానిత్యాత్మవివేకం - ప్రత్యగాత్మపరమాత్మైక్యం ॥రా॥

నిరుపమాననిర్వికారం - నిరవయవనిరహంకారం
నిరఘాంతర్బహిస్స్ఫారం - నిరీహాత్మ నిర్విచారం ॥ రామ ॥

దుర్విహారాఘాత్మాగమ్యం - సర్వదా సుధీంద్రగమ్యం
నిర్వాణఫలైకరమ్యం - నిర్వికల్పప్రాప్తసుకామ్యం ॥ రామ ॥

సంగరహితాత్మలింగం - లింగలీనసంవిత్సంగం
రంగదనుకంపాపాంగం - ఇంగితాంతరంగప్రసంగం ॥ రామ ॥

భాసురభద్రాద్రివాసం - శ్రీశేషగురోవిలాసం
వాసుదేవతత్వాభాసం - శ్రీసహితాయతపీరుదాసం ॥ రామ ॥

౫. రాగము - ఆనందభైరవి - ఆటతాళము

పాహి శ్రీకోదండరామ - మాం త్రాహి సదానంద దేహి శ్రీరామ ॥ పాహి ॥

దేహి దేహాంతప్రకాశ - సోహం - సోహంభావాత్మనిరాహం నిరాశ - మోహార్ణవోత్తీర్ణావేశ - శ్రీవై - దేహివధూమనోమోహనావేశ ॥ పాహి ॥

చారుషట్సరోజాతీత - సహ - స్రారకర్ణికా విస్ఫారవిఖ్యాత - మేరుశిఖరవసత్పూత - నిర్వికారసదామృతకారణనేత ॥ పాహి ॥

నాదబిందుకళాతిరక్త - వాద - భేదవర్జితపరమాహ్లాదవివిక్త - వేదాంతసారప్రయుక్త - యింద్రి - యాదివికారవిషాదవిముక్త ॥ పాహి ॥

మండితమహదంతర్భావ - యూర్ధ్వగ - కుండలీంద్రతల్పాఖండప్రభావ - కాండాధీశ వాసుదేవ - సోమ - చండకరాగ్నిత్రిమండలాతీత ॥ పాహి ॥

సర్వభూతాంతరారామ - దివ - శర్వరీయేకాత్మనిర్వాణధామ - నిర్వికల్ప నిర్విరామ - ఏత - త్సర్వతోముఖపరసర్వాత్మారామ ॥ పాహి ॥

నిర్విశేష నిర్విచిత్ర - నిత్య - నిర్వాసనజగత్సర్వపవిత్ర-దుర్విపల్లతాలవిత్ర - సర్వ - గీర్వాణజటిలహృత్పద్మైకసూత్ర॥

సారాసారవిచార - హేతు - సారభూత సర్వసారార్థ
పూరా - పారసర్వాధార - నిరా - ధార నిష్క్రియ నిరా
కార నిష్కార ॥ పాహి ॥

పంచభూతములను మించి - నభో - పంచక మావల
నెంచి శోధించి - పంచకర్తల నిగ్రహించి - ప్రభా - సించు
పరాత్మవా ప్రణుతవిరించి ॥ పాహి ॥

నాల్గింటిలో మర్త్య మరసి పదు - నాల్గింటి నేపార్చి
నాణెము న్నొఱసి - నాల్గువీధులనడుమ మెఱసి - యిరు -
నాల్గింటికడ వెల్గు దజ్ఞాననిరసీ ॥ పాహి ॥

మూఁడుగుణంబుల రోసి - యిరు - మూఁడుగుణంబుల
మొదలంట గోసి - మూఁడుయేరుల కడ ద్రోసి - చూడ మేడలో
వెల్గుదా మృదరుచిరాశి ॥ పాహి ॥

రూపనామంబులు లేక - ప్రాపు - దాపు నీవైయుండి
దీపింతువేక - ఆపు కాపు నీవె జోక - చిత్కళాప సుధీంద్ర
మనఃపరిపాక ॥ పాహి ॥

ఎందు జూచిన నందె నీవు - పొంది - పొందక పరగి
సంపూర్ణమైనావు - మందమతుల కందరావు - యేమి ॥ సందు
లేకయె పొలుపొందియున్నావు ॥ పాహి ॥

లోకములెల్ల నీలోన - యెడ - లేక రాకపోకలై కల్గ
గాను - సాకు దెప్పుడు వీఁకగాను - సర్వ - లోకములను
నేమిగాకనె పూను ॥ పాహి ॥

అతిరహస్యము బట్టబయలు - అంచు - క్షితిలో నెరుగ లేరు మతిలోనిమేలు - అతులితగతి గనఁజాలు - దాము - కృతకృత్యు లౌదు రాశ్రితులకు వీలు ॥ పాహి ॥

భాసురభద్రాద్రివాస - శ్రీని - వాస శేషగురోకృపాసు వికాస - వాసుదేవ సద్విలాస - పీరు - దాసపోషక పరమేశ విభాస ॥ పాహి ॥

౬. రాగము - శుద్ధకాంభోజి - ఆదితాళము.

నిన్ను నామది సన్నుతించెదను - శ్రీరామచంద్ర - నిన్ను నామది సన్నుతించెదను ॥ ఎన్న నఖిలాపన్నరక్షాసన్న సుప్రసన్న శుభకర - కన్న విన్న - వన్నె లన్ని నున్న మిన్నుచెన్ను మున్ను ॥ నిన్ను ॥

ఇందిరాత్మానందకందలిత - మధుకైటభాదిపు - రందర ద్విషబృందసందలిత - నిందితస్ఫురదిందు మండల సుందరానన యిందుధరనుత - కంధుకుంద డిందు జెంద కందు నిందు పొందు విందు ॥ నిన్ను ॥

పంతమేల దయాంతరంగ హరి - రక్షింపవే స - ర్వాంత రాత్మానంతతేజ భరి - శాంత సుజన స్వాంతసీమ నిశాంత పరమనితాంతముగ నే - వింతు నెంత కంత చింతాత్యంత ధ్వాంతహాంతకాంత ॥ నిన్ను ॥

పంచవింశతిసంచయములైన - చతురంగపంక్తిని - మించి పరిశోభించెదవుగాన - కొంచె మధికము నెంచరాక ప్ర - పంచ మరచే నుంచుఘనుఁడవు - మంచి పెంచి నించుమంచు పంచ పొంచి యొంచి గాంచి ॥ నిన్ను ॥

చారుషట్సరసీరుహాతీత - శృంగాటకాంచిత - మేరు శిఖరాగారవిఖ్యాత - ఘోరకలుషవిదార జగదాధార సకల విహారవిరహిత - ఘోరభార దూరశూర మేరుధీర సారాసార ॥

చండకరముఖమండలాంతరమై - శోభిల్లు విశ్వద - జాండభాండపిచండ మేదురమై - మండిత శరదఖండశీతవిధు - మండలంబుల పండువెన్నెల - నిండి పండియుండు మెండు - నండదండ దండితంద్రి ॥ నిన్ను ॥

అంగలింగములం గలంగకను - బహిరంతరంబుల - నింగి భంగి యసంగమై తగను - భంగ మెందు గలంగరాక ని - రంగసాంగోపాంగ సద్గురు - హాంగురంగుపాంగెఱుంగకం - గడంగుమంగళాత్మ ॥ నిన్ను ॥

వాసుదేవ సదాసుభద్రకర - భద్రాచలాగ్రని - వాస రామ ధరాసుతాధివర - ధీసుశేషగురో సదనుకంపా సహిత కీర్దాసకల్పక - హాసభాసదానోపాసనాశ పాశక్లేశనాశ ॥నిన్ను॥

౭. రాగము - శుద్ధకాంభోజి - అటతాళము

అంతట దిశల మిన్నావరించిన పర - మాత్మ యెక్కడ నున్నది - యీవ్యా - ప్తాంతమెల్ల వినగ నార్యులచే చాల - సంతస మగుచున్నది ॥ అంతట ॥

పంతమున నే పల్కనానని పండితులు మది నుంచ కిపు డ - త్యంతమోద మెలర్ప నుపనిష - దంతవిదులు ప్రసంగ రీత్యా ॥ అంతట ॥

అలఘుటాకాశమహాకాశద్వయ మని - పలుకుమాత్రమై యుండగ - ఘటము - పొలసిన ద్వయనామము లే దాకాశ

మాత్ర - మలరుచున్నది నిండుగ - తలఁప నాకాశతత్వముతో
ధరణి మొదలగు సకలభూతా - ఘటిలితప్రాపంచబహిరంగాంత
రంగములందు నెడపక ॥ అంతట ॥

ఆకాశశరీరం బ్రహ్మంబని శ్రుతియందు - జోక పలుకు
చున్నది - చూడ - నాకాశ మేక మనేకవస్తువు లౌంది -
ప్రాకటమై యున్నది - యాకసంబన శబ్దమాత్రము నాకసము
లే దనుచు పల్కెదు - రాకసము నొక నేర్పువలన సికాకరించు
తెఱంగు దెల్పెడి ॥ అంతట ॥

మున్ను వ్యోమాతీతం నిరంజనమని - యున్న దాగమ
వాక్యము - గాన - మిన్ను మన్ను తానన్నదాని మిగి -
లున్నది పరసౌఖ్యము - మిన్ను నాత్మను దెలిసి యెందఱు
యెన్ని విధముల నెంచిచూచిన - మిన్నుగాదది - దాటి ప్రత్య
గభిన్న మాత్మను గాంచు టేక్రియ ॥ అంతట ॥

నినదగుణంబున నింగి యనదగెను నినద మణఁగినంత నె -
వ్యోమము - మును లేదు నిశ్శబ్దమును బ - హ్మ మని యూర
కయ కొంద అన్నంతనె - యనఘు లటుకాదందు రారవగుణక
నాకము స్వా - నుభవసరణిని విలీనము జేసి నిర్ణభమును
నిరారవబ్రహ్మమగు నెటు ॥ అంతట ॥

కాసారతీర సంకాసిత భద్రగి - రిశిఖరావాసమై - చిద్వి
లాసపరసతి జానకీశ జ్యోతిర్మయా - కాశాతీతోల్లాసమై- భాసుర
శ్రీరామతత్వము దాసహృద్యము శేషగురుకరు - ణాసమన్విత
పీరుదాసాభ్యాస మగుపరమాత్మ నిరతము ॥ అంతట ॥

౮. రాగము - శహాన _ ఆటతాళము

దనరు నభోగ్రగతత్త్వము స్వానుభవసర - జేని బోధిం
చుట వినరె - బాగు - గను రత్నగర్భాదిగా నీచతుర్భూత -
మును జనించి యెనరె ॥ దనరు ॥

ఎనసి వియద్గుణమున లీనమైనమి - న్ను నడఁగి యంత
నిర్గుణబ్రహ్మ మగురీతి ॥ దనరు ॥

వర హేమ మనగ నాభరణము ల్మాహారీలు - వరవాలు
కణిక లేక - వేరు - పరుపగ వేరే బంగరు లేదు చూడగ పరి
కింపగ వివేక - మరి నినదాదితన్మాత్రలవలన నం - బరమాది
భూతము బ్రహ్మాండభాండమై - బరగె కావున నీయజాండా
వరణమున మహాదంబరం బగు - తెలిగు పరిశీలించిన నిరా
వరణానిశ్శబ్దాత్మ యగువని ॥ దనరు ॥

రమణీయషట్పంకజములను నాడిత్రయముల నహర్ని
శము - పొంక - మమరగ త్రిమండలముల నావరించి - సము
రున్మనో యుతముఁ - న మరిరువదొక వేయిన్నూర్నూ అమూరులు-
సమత విహరించుసరణి రేచకపూర - కముల కుంభకగతులచే
నీ - క్రమమునను హంసు డంతఃకర - ణమున పిండాండమ్మునై
శీ - ఘ్రమున బ్రహ్మాండమై మించిన ॥ దనరు ॥

అలరు పరమహంస యంతఃకరణమ్మునై - చెలఁగి శ్రో
త్రాదిజ్ఞానేంద్రియము - లందు - గలపిండాండగోళ - కముల
శబ్దాదులౌ - జలజభవాండౌఘము - వెలయునజాండ మిమ్ముల
పిండాండమ్మునై యలపిండాండము ప్రవర్తిలుచైతన్యము

నందు - నలఘుచైతన్యంబు నీపర - హంసయుం దైక్యంబు వగుని - శ్చలత నీహంసయు పరాత్పరు - నందు లీనంబౌ నటంచును ॥ దనరు ॥

మఱి యంతయు నజాండావరణములే ననంతరము నిరాకాశమై - నిరం - తరము నిశ్శబ్దమై - నిరవయవానంత - స్థిరసిద్ధప్రతీకాశమై - యెఱుకావరణము వీడి - పరిపూర్ణతత్వమై - కెరలి ప్రపంచభ్రాం - తిరతి వతిరించునె - సరి పరాత్మైక్యమను పాలుపెరుగురీతైనను మథించిన - సరవి వేరైనట్టివెన్నయు - మరలి తక్రము గలయునే యని ॥ దనరు ॥

ఇల నదీతటభద్రాచలశిఖరీపూర్ణ - నిలయుండై ప్రకటిం పుచు - సీతా - లలనసమేతవిలాసవిద్యావిద్య - కలితుండై నివసింపుచు - చెలువొందుశ్రీరామచంద్రుని సత్పాద - జలజ యుగంబు హృజ్జలజమం దెడపక - గొలుచుపీర్దాసునకు జమిలి- శేషయాచార్యుండు సుదృగం - చలదయాపరుండై యెఱుంగం దెలిపె నీసందియము దీరగ ॥ దనరునభో - ॥

౯. రాగము - కమాచ్ - ఆదితాళము.

సేవింపఁగలిగె నమ్మ - శ్రీరామచంద్రుని - సేవింపగలిగె నమ్మ - భావము నిర్మలమై రంజిల - ధీవిశేష మింపొంద న్వర- కైవల్యదాయకము మనఃపావనమని జీవనమని ॥ సేవింప ॥

ఘోరభయోర్విభృచ్ఛిఖరాకారమై - బహుజన్మకర్మ - వారాటవీశాతకుఠారమై - దారుణదుర్భరదోషవ్రజ - వారి

వాహాజంఝానిలముల్ - ప్రారబ్ధసంసృతిసింధుసము - త్తారణ శుభకారణమని ॥ సేవింప ॥

రోగదుఃఖతాపవిదారమై - సమస్తనిగ - మాగమాంతా ర్థైకసారమై - రాగవిరోధవికారత్యాగ - యోగభాగధేయాం చత్స - ద్భోగింద్రపర్యంకదయా - సాగరమగు శ్రీగురువరు ॥ సేవింప ॥

చింతాలతౌఘలవిత్రమై - యజ్ఞానమహా - ధ్వాంత వారణమిత్రసూత్రమై - సంతతవిశ్రాంతమహాంతని . శాంత సౌఖ్యలక్ష్మివైభవముల్ - భ్రాంతిప్రవృత్తివిగత మ - శ్రాంతం బును శాంతంబని ॥ సేవింప ॥

నీలతోయధరాంతఃఖేలియై - నీవారశూక - లీలా విద్యున్మహాణుశాలియై - లాలితపీతవిభాస్తుత్యశి - ఖాలసత్ప రంజ్యోత్యాకృతి - పాలైకధాత్రాండ జగ - జ్జాలమునకు మూలమిదని ॥ సేవింప ॥

చండధామహిమాంశువహ్నులల్ - వీక్షింప మించి నిండుపున్నమ పండువెన్నెలల్ - మండితతేజఃహిరణ్మయ - మండలంబు బహిరంతరమా - శాండైకకోటిప్రభ వెలుగున- ఖండం బగుచుండ న్గని ॥ సేవింప ॥

పంచవింశతితత్వాతీతమై యేతన్మనఃప్ర - పంచాంత బహిరనుస్యూతమై - పంచనభోవృతమై సంవిద - చంచలా ద్వితీయస్వయం చంచత్సదానందము భా - వించియు శ్రీమించి యుపరి ॥ సేవింప ॥

నిర్వికారనిరామయాత్మ రైయై - నిరంజనమై - నిర్విచార నిరారవాత్మ రైయై - నిర్విషయావ్యయనిర్గుణమై - నిర్విశేషని ర్బాధ్యంబై - నిర్వాసనాబోధ్యంబై - పర్వగ హారి సర్వగుఁడని॥ సేవింప ॥

భాసురభద్రాద్రివాసుఁడై - దాశరధి శ్రీ - వాసుదేవ తత్వవిలాసుఁడై - వాసవసన్నుత శేషగురుద - యాస పీరుదా పావన మూర్తి - ధీసాక్షి సంపూర్ణచిదా - భాసము సముపాసము గను ॥ సేవింప ॥

౧౦. రాగము - బిళాహరి - ఆటతాళము

పుట్టఁగానె సెలవ - మానవులై యిల - పుట్టఁగానె సెలవ ॥ పుట్టపై చెదలట్టె గన్పడి - గిట్టినట్టుల మట్టు లేకను - పుట్టుగిట్టుల నట్టియేర్కడ - మట్టలేని దుష్టమనుజులు ॥పుట్ట॥

కాలమెల్లను వ్యర్థమై - కడచిపోగ - జాలినొంది నిర ర్థమై - యాలుబిడ్డలు మూలమని తను - మాలి యింద్రియ లోలుఁడై తమి - దేలి సుఖముల సోలి శ్రీవన - మాలి దలపని జాలమర్త్యులు ॥ పుట్ట ॥

దేహరూపయౌవనము - పశువిత్తసం - దోహ గేహ వర్ధనము - మోహ మెడపక సాహసంబున - నూహజెడి మమ కారమున - వెను - ద్రోహులై హంసోహ మెఱుగని - కూహ కాత్ములు బాహుబలమున ॥ పుట్ట ॥

తెలివి గలిగినందుకు - మానసికసం - చలన మడగని దెందుకు - తొలుత నేల కలంగెనో యిపు - డిలను తా నెట్టుల

జరించునో - యొలమి ముందెండుల వసించునో - ఫలిత మెఱుగనితులువ లీభువి ॥ పుట్ట ॥

ఇంగితార్థము మేలుగా - నెఱిఁగి గురు - పుంగవుచే చాలగ - నంగలింగవిధి - న్గనుంగొని లింగభంగ మెపంగ నిర్మల సంగతిం దనుసంగ ముడిపి య - సంగ మొందనిదొంగలై భువి ॥

సారార్థమును గాంచియు - కామాదివి - కారము లణగించియు - ఘోరముగ ముయ్యేరు గడచి క - ళారవవృష త్పారమున కమ - లారివహ్ని పయోరుహా ప్తుల - మీరి సద్గతి జేరనిజనులు ॥ పుట్ట ॥

చింతల దెగటార్చియు - సద్గురునియం - దంతరంగము జేర్చియు - వింత పైకొని భ్రాంతి దొఱఁగి చి - దంతరాత్మే కాంతసౌఖ్యా - నంతముదమున సంతతము వి - శ్రాంతి నొందని శాంతిహీనులు ॥ పుట్ట ॥

పంచభూతవికృతులు - దిగనాడి ప్ర - పంచార్థసంగతులు- మించి కోశపంచకము గమ - కించి శక్తిపంచకము భే - దించి ముక్తిపంచకము సా - ధించి యచలము గాంచనేరక ॥ పుట్ట ॥

వాసవార్చితచరణ - భద్రాద్రిని - వాస విశ్వంభరణ - వాసుదేవవికాస శేషగురో సదనుకంపాసమన్విత - దాసహిత పీర్దాసపోషోల్లాసు నెఱుగనిదోసకారులు ॥ పుట్ట ॥

## ౧౧. రాగము - కేదారగౌళ - ఆటతాళము

నరుఁడై పుట్టగ నేమిఫలము - బుద్ధి - నరయగ కుటిల చంచలము ॥ నరుఁడై ॥

పరగురూక్తమంత్రపఠన సేయనిదుష్ట - నరునికన్న వాన రుండే మేలనవచ్చు ॥ నరుండై ॥

ఎలమి సుజన్మమైనందు - కిపు - డలరుసద్గురుదీక్ష నొందు - తెలివి గలిగి భవదీయవిలాసము - తెలిసి నిర్వాణతత్ఫల మంద నేరని ॥ నరుండై ॥

మూంటిమూంటిని విభేదించి - పద - మూంటిమూంటిని బెంపణంచి - సూటిదప్పకను ముద్యోటిమధ్యమునందు - హాటక శైలత్రికూట మెక్కనిదుష్ట ॥ నరుండై ॥

ఒంటిమేకమును వధించి - నా - ల్గింటి నేకముగ దలంచి - కొంటెపోతుల నాఱింటి సంహరించి - యంటుబాసి యఱగంట మేల్కనసట్టి ॥ నరుండై ॥

గుంటిమీద నిర్గమించి - పరి - ముంటిద్వారము నెగ్గ లించి - రెంటిసందున ఫణి నంట మేల్కొల్పి యా - మింటి కెగువను ముక్కంటి నరయనట్టి ॥ నరుండై ॥

మండలత్రయభాగమందు - మా - ర్తాండసందీప్తి యింపొందు - నిండుపున్నమనాటి పండువెన్నెలలోనా - ఖండ చిన్మయమూర్తి నండజేరనిదుష్ట ॥ నరుండై ॥

ఉదయలయస్థితి లేక యెప్పు - డొక్కరీతిని వెల్గు పేంక - సదమలపరిపూర్ణస్వయంప్రకాశప్ర - ముదము జెంది నెమ్మది నుండ నేరని ॥ నరుండై ॥

వాసిగ గోదావరిని - మ్మ్నగ - భాసితభద్రగిరిని - వాస లోకము పేరుదాసుకు దెల్పిన - శ్రీశేషగురుకృప సిద్ధిజెందనిదుష్ట॥

౧౨. రాగము - బిళహరి - ఆటతాళము

అలరు శ్రీరామబ్రహ్మానందమగ్నులై - వెలయుచుందు
రార్యులు ॥ సదాచార్యులు ॥ అలరు ॥

తలప షడ్గుణసంప - న్నులు బాహ్యేంద్రియనిగ్ర -
హులు వినిర్జితషడూ - ర్ములు జితంతర్ద్విష - యులు త్రిగుణాతి
రి - క్తులు వేదాగమతత్త్వ - జ్ఞులు శాంతహృద్వార్ధి - ష్ణులు సర్వ
శాస్త్రవే - త్తలు బ్రహ్మవిద్యానిర్మలయోగనిష్ఠాఢ్య - తులు
జీవన్ముక్తిర - తులు మనోన్మనీయు - తులునై ప్రకాశించి -
సద్గతి మించి - పలుకులను బలుకంగ రాకను - తలపులను భావింప
రాకను - మెలగుచూడ్కుల కగోచరమై యిల నభోశాశేష
ఘనమై ॥ అలరు ॥

వారక షడ్విధాంభోరుహదళముల - మీరి మహా
నీయమై - పరాత్మీయమై - కూరిమితోడ ము - య్యేరు గడచి
భవ - వారాశికడ నీద - నేరు పిదేయని - మేరుశిఖరసూక్ష్మ -
ద్వారము వికసించి - కోరి త్రికూటవి - హారియై యూర్ధ్వగామ -
హోరగేంద్రునిజిగి - మీర మేల్కొల్పి శృం - గారమైన బం -
గారుసౌధమున నప్రి - భారంజనోన్మత్తవ - ధూరత్యానందప -
యోరాశిలో గ్రుంకుచు - చెలంగుచు - ఘోరమాయా
సహితవిషయవి - కారములు చైతన్యవ్యాప్తికళ - రిరసచరాద్య
ఖిలజగదా - ధారమై మంగళకరంబై ॥ అలరు ॥

పూని పరాత్మైక్యానుసంధానసమానసుఖాధ్యక్షమై -
యపరోక్షమై - జ్ఞానాజ్ఞానత్యాగ - మానావమానవి - హీన
కేవలసత్య - జ్ఞానానందసుధీ - మానసాంతర్గత - మానారూ

ధ్యాత్మ - నానాయుపాధ్యధి - ష్ఠానజగత్సన్ని - ధాన నిస్సంగ
ని .. ర్వాణహా రే చతు - రాననేంద్రపం - చాననాదిహృద -
ధీనస్వప్రకాశ మై - పరేశ మై - మూనుగను జీవత్రయమ్మను -
గాని దీశత్రయము లేనిది - తాను నేనన కెపుడు నిరఘుని -
ధానమై - నిశ్శబ్దపర మై ॥ అలరు ॥

మండలాతీత మై మహదహంకారప్ర - చండప్రభాపూర మై-
యవికారమై - యండపిండాండబ్ర - హ్మాండభాండమునం
ద - ఖండమై వెలిలోను - నిండారి ద్వాదశస్థ - పుండరీకాం
తమై - నిండుపున్న మనాటి - పండువెన్నెలవలె - మండితమై
దశ - మండలవ్యతిరిక్త - పండితవేద్యప - రుండు విరాట్పురు -
షుండు పారమార్థిక - కుండై వెలుంగొందునె - చెల్వొందునె-
యొండమావులచాడ్పునం గను - చుండు మిహాపరసౌఖ్య
భోగము - లెండనీడయు లేక రేబగు - లొండు తానై యుండు
నెడపక ॥ అలరు ॥

ఎందు జూచినమరి సందింత లేక చె - న్నొంది వెల్గు
చున్నది - బయలైనది - పొందుగ సనకస - నందనాదిముని -
బృందము లింద్రియ - బృందము న్విషయార్థ - మొంద
నియ్యైక బ్రహ్మ - నందులై పరమాత్మ - నొంది సుఖింతు రే-
నందుకతన ప్రియ - ముంచి నీమది గల - సందియ ముడిగి మే-
లొంది యాకర్ణింపుము - తరింపుము - అందముగ పరమార్థ
మిది నీ - వందుమని జమిలి శేషాఖ్యలు - విందుగా పీర్దాసునకు
గో - విందుఁడు భద్రగిరివిభుఁడై ॥ అలరు ॥

౧౩. రాగము - శహాన - ఆదితాళము.

పరిపూర్ణమైనట్టి బట్టబయలులోన - నెఱుక లేకయొక ర్తైను ॥
అరుదుగ కలయందు పరికించుచిత్రములు - తెలుగున నీచరాచరవిశ్వాకృతిగాను ॥ పరి ॥

అరుణాకరముల దోచునంబులాగున నం - బరమూనము చందమున - నరయ రజ్జువునందు నురగమువిధమున - వర నారికేళంబున వారి జనితమైనట్లు ॥ పరి ॥

మూలప్రకృతి యాలవాలముగ తన - మూలము తానె గాగను - లీలావిలాసముగ కాలాకాలరూపమై - మొాలి త్రిగుణ హంకారలయమై సర్వ ॥ పరి ॥

హరవిష్ణువిరించినిర్జరధరాంబుకృశాను - మరుదభ్రపంచకమునై - నరసరిదంభోధితరుగుల్మలతభూమి ధరమృగ విహంగాదిభరితమై కనుపట్టె ॥ పరి ॥

తనువు నింద్రియములై మనసు వికారములై యెనసి విషయ వృత్తులై - కనుపట్టి కులాశ్రమాగారవర్తనంబులై - జననవాశములకు నునికిపట్టు తానయ్యె ॥ పరి ॥

రమణీయశాస్త్రపురాణ వేదాగమ - సమితివాదభేదములై భ్రమరూప మైనట్టిబ్రహ్మాండభాండానం - తములై జూపట్టి చిత్రములు జేయుచుండును ॥ పరి ॥

అన్ని తానై యుండి యన్నిటికిని వేరై - యున్నానను బల్కను - యెన్నగ నలవిగాకున్నది లేనిదని - యున్నదనను యున్న దెన్నడు లేదను ॥ పరి ॥

పాపపుణ్యకర్మకు లోబడి సలుపుచు - నాపదసంపదలకా- ప్రాపించును భవబద్ధులుగను. నరక - కూపములను ద్రోసి కాప మొందును దానె ॥ పరి ॥

అనయ మూర్ణనాభియును సృజించు భక్షించు - పను పడి పాటములను - కొన కాతంతువుచేత జనినరీతి నీయొలుక - జనితమై విశ్వము గనును ద్రుంచి తానేగు ॥ పరి ॥

జలముచే వడగల్లు గలిగి తనకు తానె - బొలియుచుంద మీ తెల్వియు - చలనము లేని కేవలపరిపూర్ణములో - పల దోచ గురుకృప తెలిసిన తానె లేదు ॥ పరి॥

కాసారతీరసంకాసితభద్రగి - రిశిఖరావాస - వాసుదేవ శేషగురుసత్కృపను పీ - ర్దాసును రక్షించు తత్వార్థసిద్ధిగా ॥

౧౪. రాగము - కమాచ్ - ఆదితాళము.

రామ సదా పాహిరే హరే - తారక - నామ ముదం దేహిరే ॥ రామ ॥

సామగానలోలామరఋషిసు - త్రామసురముఖస్తోమ వినుతపద - తామరసద్వయామినీచరవి - రామ సుందర శ్యామలాంబుద - శ్యామ కోమల సదామలాకృతి ని - రామ యాత్మ సుధీమనోవశిత - శ్రీమహితచరిత ॥ రామ ॥

ఇందిరాహృదరవిందకలిత మక-రంద భాస్వదిందిందిరోపమ స - నందనాదిమునిబృందవర్ణిత - మి - లిందసంవిదానందపూర్ణ ముచి - కుందవరద శరదిందుబింబజిత - మందహాసముఖ కుంద రదన రఘు ॥ రామ ॥



శ్రీ కూరపాటి రాఘవయ్య దంపతులు

చండకిరణాఖండకోటిస - న్మండితప్రభాజాండభాండ సుపి - చండపుషితవేదండనేతలస - దండభరద్వాజపుండరీక నయ - నాండజతల్పక పండితహృది క - రండరంజిత త్రిమండ లాంతకో - దండశరాంచిత ॥ రామ ॥

భూపకులకలాప విధుశిర - శ్చాపఖండనప్రతాప వైరివిపి- నాపరిమితకీలపరిశోభిత - పాపవిగత కరుణాపాంగవిలో - కాపారజగద్వ్యాపకాత్మ ని - ర్లేపావరణవిక్షేపరహిత ని - ష్ఠాపనిర్మలోద్దీపితపావన ॥ రామ ॥

భానుకులపయోనిధి హిమ - భానుసజ్జనమనోనలినావళి- భానుసద్గుణవితాన భక్తసం - తానసకలప్రజ్ఞానిధానవి - జ్ఞాన తదనుసంధాన సన్నిరభి - మాన పరమనిర్వాణనేత బహు - మాననీయసన్మానిత శుభకర ॥ రామ ॥

భూవనతేజోవాయుర్వ్యోమ - దావళితనుచేతోవికార గుణ - భావవైకృతవిరావముఖవిషయ - ధీవిలక్షణ సుధీవిల సిత రా- జీవజాండగర్భావహిత మహా - ద్భావయుత సుబోధా విశేష స - త్కేవలాత్మనిర్భావ నిర్గుణ ని - రావరణ మహాదేవ దేవనుత ॥ రామ ॥

చారుతరపయోరుహషట్కావి - చారాంతసహస్రార లలితసుక - ళారవబిందుస్ఫారదనుపమసు - ధారాశితటిద్వారి జారివి - స్ఫూరపరంజ్యోతీరంజిత యవి - కార సన్మయాత్మా రామ నిరా - కార నిష్కళ నిరాలవ నిర్భవ ॥ రామ ॥

ఖేలదఖిలమూలప్రకృతి భవ - సాలమూలకుద్దాల వల గ్నవి - శాలహాటకదుకూలవిద్విషవి - పాలమృగమదవిలాలిత

చిత్రక - పాలదర్పణకపోల విశ్వజగ - దాలయ నిత్యనిరా లంబ స్వయం - పాలనశీల సుమాలిమాలధృత ॥ రామ ॥

దాసవరద భద్రాచల - వాస రామ సీతాసమేత నవ - భాసమానమకుటాసమానమా - లీ సురుచిర శ్రీవాసుదేవ శ్రీ- శేష దేశికదయాసమన్విత వి - కాసయశగపీర్ఠాసమానసని_వాస చిన్మయోల్లాస కేశవ ప - రేశ భద్రకర ॥ రామ ॥ సదా పాహిరే ॥

౧౫. రాగము - దర్బారు - ఆటతాళము

ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ మనుచు శ్రుతి - ఓంకారమే మూలము - చరాచర । స్తోమ విశ్వవిశాలము ॥ ఓమిత్యే ॥

శ్రీమించునట్టి నిరామయాత్మయం - దీమహామహిమ చేతోముఖ్యప్రాపంచ ॥ ఓమిత్యే ॥

నయమొప్ప జ్ఞానేంద్రియపంచకము కర్మేం - ద్రియపం చకముతోడను - తద్వి_షయపంచకమును పంచప్రాణాంతరేం - ద్రియచతుష్కము గూడను - స్థూలము జాగ్ర - త్తయవస్థాకీ యగంబును - యుక్త సుభోగ - మయము రాజసంబును - విశ్వుం డభిమా - నియు నచలాత్మయును - జీవాత్ముండ - నయవ్యవహారికుండును - భూనీరా - గ్ని యు మరుదభ్రంబును - కంజారిశ - శియు నాత్మయుక్తంబును - నీయష్టమూ - ర్తియు నీశ్వరున కెన్నను - విరాడా - హ్వయదేహ మొప్పారను - నియతిసంభవావస్థయు వీరించి యభిమా - నియును క్రియా శక్తియు రజసహం(కృ - తియు రవిస్థానం బఖిలకర్తృత్వ

భోగమునం దధిష్ఠానా _ త్మయును భూతాత్మయు నకారా
ర్థము విలోకింపంగ నదియే ॥ ఓమిత్యే ॥

రమణీయజ్ఞానేంద్రియము లైదు కర్మేంద్రి-యము లైదు
ప్రాణాదులు_ పంచ - కము లంతఃకరణము - లౖమము కర్మంబు
కా - మమును పృథివ్యాదులు _ భూతపంచ _ కమును స్వప్నా
వస్థయు - కంఠస్థా - నమును స్వేచ్ఛాభోగము - సూక్ష్మశరీ-
రమునకు నభిమానియు - తైజసుఁడు ని - త్యమును వ్యాప
కాత్మయు _ నంతరాత్మ - సమత నధిష్ఠించియు - ప్రాతిభాసి-
కమన బరగు నంతయు - దిశలు శ్రో - త్రము వాయుచర్మేం
ద్రి _ యము స్రవియు నే - త్రము లగునాజిహ్వయు - నమరు
ప్రచేతసుఁ డశ్వీను ఘ్రాణేంద్రి _ యము వహ్ని వాగింద్రియము
పాణి యింద్రుండు - కమలనేత్రుఁడుపాదము లుహ్యము విరించి
గుదంబు మృత్యువు - కమలవైరి మనంబు గురుఁడగు సుమతి
క్షేత్రజ్ఞుండు చిత్తము ॥ ఓమిత్యే ॥

హరుఁ డహంకారము సరవి చతుర్దశ _ సురలగుం జతు
ర్దశ - కరణ - భరణహిరణ్యగ - ర్భతను వవస్థ స్థి - తి రహి
మీర నహర్నిశ - మభిమానియు - సరసీరుహాక్షుండును -
నిచ్ఛాశక్తి - పురుణింప సత్వంబు న - హంకార మం - బురు
హరిస్థానంబుచు - సర్వపాల _ కరణత్వభోగంబును - నందు
లను సు - స్థిరత వ్యాపకంబును - యగునాత్మవి - స్ఫురిత
సూత్రాత్మయును _ యది మహాత్మ _ మతి యుకారార్థం
బును - కారణము ని _ దురను నిర్విషయంబును - సరిదైన
నందు నంబర మున్నందున వాయు - వరయ నీ రగ్ని కుర్వార
పాత్రదై యుండు - తరల కీగతి పంచవింశతి తత్వములు వట

బీజక్రియమ - గ్నరతనది యజ్ఞానరూపస్మరణమాత్రము కార
ణాంగము ॥ ఓమిత్యే ॥

ఘనసుషుప్త్యవస్థయును హృదివాసంబు - మనుప్రాజ్ఞుం
డభిమానియా- నందు - నను ద్రవ్యశక్తిస్థ - యునజానందభోగ-
మును తామసాజ్ఞానియు - వ్యాపకాత్మ - యును పరమాత్మ
యును - అతఁడే పర - మార్థికాత్ముఁడును - బైందవాకృ -
తిని యవ్యాకృతంబును - ప్రళయావస్థ - యు నభిమాని
యీశుండును - వహ్నిస్థాన - మును సర్వసంహారమును -
భోగంబునం - దు నవ్యాపకాత్మయును - శుద్ధాత్మకా - వున
మకారార్థఁబును - నీశ్వరుని మా - యోపాధితనువులకును -
మును సాక్షిరైనది మూలప్రకృతి న్వరా - ట్టనుతను వది యనా
హతనామ మదియె చ - య్యనను పంచబ్రహ్మ మది యయ్యెను
మహాకారణము వ్యష్టికి - దనరుభూతోత్పత్తి హేతువు లనగ
సద్యోజాత మాద్యము ॥ ఓమిత్యే ॥

తలప సద్యోజాతాదులు నివృత్తిప్రతి - ష్ఠలు విద్యశాంతు
లును - శాంత్యతీత - కళ లేనువిషయం - బులు పరాదిశ - క్తు
లగుపంచకంబును - పంచప్రాణ - ములు పంచాక్షరి యన్నను -
పంచేంద్రియ - ములు పంచకర్తలును అంతఃకరణ - ములు గూడి
యన్నియును - నిరువదేనిమ్ముల మహాకారణమును - తుర్యా
వస్థ - లలి ప్రత్యగాత్మయును జ్ఞానశక్తి - విలసిల్లు ననయం
బును - శుద్ధసత్వ - మలవడు సుగుణంబును - మూర్ధస్థాన -
మలబ్రహ్మానందంబును - చెలవొంద భోగమందలి వ్యాప
కాత్మ ని - ర్మలాత్మయా నతఁడే కూటస్థచైతన్యుండు - నలరు

నం దోంకార ముండుటవలన నదియె త్రిగుణగర్భము - నలఘు
భూతోత్పత్తిమూలం బదియె పంచబ్రహ్మ హేతువు ॥ఓమిత్యే॥

కెరలి యీమూలప్రకృతిశరీరము నకు - వరలుసర్వసాక్షి-
యవ - స్థ రుచింప నభిమాని యీశ్వరుఁడు నందు నహం -
కరము శుద్ధసాత్వి - కంబు దనర్చు - నిరవజాండాతీతము -
సర్వక - ర్తృత్వసర్వపాలకము - సర్వసం - హారకత్వము సమ
స్తము- నియంతృత్వ - ముఁ సర్వభోక్తృత్వము - సర్వైశ్వర్య-
ద్యురుపద్గుణైశ్వర్యము - నందుల నిరం - తర వ్యాపకము
పూర్ణము - మహాత్మభా - సురసత్తామాత్రము - సకలవిశ్వాం -
కురిత మోంకారార్థము - నరయ పిండాండబ్రహ్మాండో
పాధుల - భరియించునట్టిసత్పరమాత్మ తత్వము - పరమపావన
మైన గోదావరీతటోద్యద్భద్రగిరి మం - దిరసదాత్మారామ
పీర్దాస ఋషిపాలిత శేషగురువర ॥ ఓమిత్యే ॥

౧౬. రాగము - కల్యాణి - అటతాళము

రామభజన సేయరే - సంతత మూత్మా - రాముల
సేవింపరే ॥ రామ ॥

కామాదిరిపుషట్కస్తోమము నంటక - క్షీమించునీ రామ
నామ మమృతమని ॥ రామ ॥

ఆరింటి నణగించరే - నేర్పున పది - యాఱు నిగ్రహిం
చరే - ధీరతతో నాఱుసారసముల దాటి - దేరిచూడ సహ
స్రారము నలరాత్మ ॥ రామ ॥

రెంటి నొకటి సేయరే - ఆపై నొక - రెంటిని నెడ బాయరె - రెంటినడిమి నడ్వనంటి నెమ్మది రెంటి - గెంటి నొంటి వెల్గుమింటిపోలికె నాత్మా ॥ రామ ॥

మూఁటి నిషేధింపరే - యవ్వల నొక - మూటిని వారిం పరే - మూ టిని దాటిన మూఁటికూటమిని శ్రం - గాటకాంత రమున మేటివెలుఁగునాత్మా ॥ రామ ॥

నాలు గొక్కటి కూర్పరె- యేకాగ్రముగ- నాలుగింటిని జేర్పరె - నాలుగింటిలోనిమూలము చేకొని - నాలుగింటి మిగిలి మీఁలై వెలుఁగు నాత్మా ॥ రామ ॥

ఏనింటి నేపార్పరె - నిశ్చలముగ - వేనింటి నటు దా ర్చరె - ఏనింటిచే నిర్వేదేనై యొసంగ న - య్యేనింటి కరయ నిధానమై యలరాత్మా ॥ రామ ॥

భాసురగోదావరి - తీరమున వి - కాసమై భద్రగిరి - వాసుఁడైన శ్రీనివాసుఁ డెపుడు పీరు - దాసునేలిన శేష దేశికుఁ డగునాత్మా ॥ రామ ॥

౧౭. రాగము - కల్యాణి - ఆటతాళము

అన్నిరూపము లైనవాఁడమ్మ - శ్రీరామమూర్తి - యన్నిగాకయె యున్నవాఁడమ్మ ॥ అన్ని ॥

మున్ను నేకబ్రహ్మమున నుత్పన్నమూలప్రకృతిభిన్నా - భిన్నమహదవ్యాకృతులయం దెన్నగ హిరణ్యగర్భవిరా - డున్నతేశ్వరతనువులై యంత న్నభోవాతాగ్నిజలములు - మన్నునైదొగిభూతము లవిచ్ఛిన్నమై పంచవింశతితో - త్పన్న

స్థూలాదిత్రికాయములున్నెరయ విశ్వతైజసప్రా - జ్ఞు ల్నయా
వస్థాత్రయములం దన్నమయముఖపంచకోశము - లున్నిసధ
ముఖ్యతన్మాత్రలు జెన్నలర షడ్వికారంబులు - షన్నుగషడూ
ర్మ్ములును షడ్భ్రమ వన్నెచిన్నెలైనవాఁడమ్మ - శ్రీరామ
మూర్తి ॥ అన్ని ॥

పరమపావన మైనవాఁడమ్మ - సకలార్థసాక్షి - నిరతుఁడై
చెలువొందువాఁ డమ్మ - భరితమై యెడలేక సచరాచరములు
న్విధివిష్ణురుద్రే - శ్వరసదాశివమూర్తులు దివాకరనిశాకరవహ్ని
తార - సురుచిరంబును విద్యుదావళి గురుతరాఖండోజ్జ్వలం
బును - గరిమనాదిచ్ఛాక్రియాశక్తి రజనీదివము త్రిసంధ్యలు -
నరయ నాధారాదిషడ్విధసరసిజంబుల వెలయ దివ్యా - క్షరము
లేబదిపై సహస్రాంబురుహమున శోభిల్లుపరమా - త్మ రహి
మీరగ సచ్చిదానందరసబిందుకళాతిరిక్తము - సరసజ్ఞానజ్ఞాతృ
జ్ఞేయము లెఱుకమఱపుల మీరి సాక్షి - త్పరపరాత్పరుఁడైన
వాఁడమ్మ - శ్రీరామమూర్తి ॥ అన్ని ॥

కమలజాండానీకవిభుఁ డమ్మ - గన నాదిమధ్యాం -
తములు లేనిమహాప్రభుండమ్మ - సమత భూర్భువముఖకరోర్ధ్వ
జగములు నతలాదిగ నధోభువ - నములు తత్తల్లోకపాలకు
లమర సంయమియోగిజనపుం - జములు ఖగమృగపురుషప్రకృ
తులు నమితవార్ధులు తన్నవగ్రహ - సమితి భూధరనిమ్నగా
భూజములు గుల్మలతాప్రసూనఫ - లములు కాననము ల్పురా
ణాగమసదుపనిషదర్థశాస్త్ర - ప్రముఖచరితకథాప్రబంధౌఘము
పయోదస్తనితములు వ - ర్షమును తటిద్దైరమ్మదంబును కొమ

రమిరాగగ నన్ని తానై విమలభద్రగిరీంద్రధాముఁడు సుమతి శేషగురుప్రకాశుఁడు - నమర పీఠ్గాసావితుఁడు కొమ్మా - శ్రీరామమూర్తి ॥ అన్ని ॥

౧౮. రాగము - నాదనామక్రియ _ ఆదితాళము

శివాయ మహాదేవాయ - ఓంఓంఓం నమ - శ్శివాయ మహాదేవాయ ॥

శివాయ సిద్ధలింగంభావాయ భావలింగం - భావాభావ గర్వభంగం కేవలపరమాత్మలింగం ॥ శివాయ ॥

వశిషసవర్ణస్తభక్తవాసాచారలింగ ఓం - అసమాత్మ క్రియాశక్తిసవిఘ్నేశ్వర ఓం - విశదనాసికేంద్రియకారణ మస దృశనకార మేదినినివేశ ఓం ॥ శివాయ ॥

కలితస్వాధిష్ఠానచక్ర - జ్ఞానశక్తిమహేశ్వర - స్థలగురు లింగస్థానర - సజ్జవృష్టికకారణ ఓం - సలలితబభమయరలవర్ణ మకా - రలసజ్జలతలజలజాసన ఓం ॥ శివాయ ॥

సరసమణిపూరకయిచ్ఛాశక్తిశివలింగ ఓం _ నిరతప్రసా దస్తవేశ నేత్రేంద్రియకారణ ఓం - హరిపడాదిఫాంతాక్షరదశ యుత - వరసికారపావకనివాస ఓం ॥ శివాయ ॥

అనుపమానాహతచక్ర మాదిశక్తి జంగమ ఓం ఘనచర లింగవకార కాదిఠాంతవర్ణ ఓం - అనయత్వజకారణరుద్రాధిప - మనిలాలయదివ్యాత్మలింగ ఓం ॥ శివాయ ॥

తతవిశుద్ధపరాశక్తియుతప్రసాదలింగ ఓం - సతతశరాణ

తలాషోడశస్వరశ్రవణికారణ ఓం - ఖతలేశ్వరతత్వతియకార సం - గతపంచాతురహితశంకర ఓం ॥ శివాయ ॥

లలితాజ్ఞేయచిచ్ఛక్తిసూజ్జ్వలపరమశివాత్మ ఓం - మల హారప్రణవబీజమానసకారణ ఓం - తులహంతుంద్విదళ మహా త్తత్వ - స్థలసర్వాధీశసదాశివ ఓం ॥ శివాయ ॥

చాయసహస్రారచక్రాధారయిష్టలింగ ఓం - సూరిశిఖా చక్రస్వయంజ్యోతిప్రాణలింగ ఓం - చరమచక్రభాస్వరమహా త్కళా - భరితవినిర్మలభావలింగ ఓం ॥ శివాయ ॥

కాశికాపురీవాసవిశ్వేశాన్నపూర్ణేశ ఓం - శ్రీశబ్రహ్మాది స్తుత మహేశ పరమేశ ఓం - శ్రీశేషగురుదయాసలలిత పీఠా పావన సవిలాస శుభద ఓం ॥ శివాయ ॥

౧౯. రాగము - భైరవి - ఆటతాళము

ప్రశ్న. ధరణిలోపలను భూసురముఖ్యులను జూచి - శరణు నేయనట్టి సరణి యేమయ్య ॥ పీరుదాస - పీరుదాస - సుగుణవికాస - పీరుదాస ॥

ఉత్తర్వు. పరమాత్మతత్వ తత్పరు లైనయేజాతి - నరులైనవారికి శరణార్థి నన్న ॥ లక్ష్మణాఖ్య లక్ష్మణాఖ్య దాక్షిణ్యసఖ్య - లక్ష్మణాఖ్య ॥

ప్ర. ధరను వర్ణాశ్రమధర్మాతిశయములు - పరికింపవలసినపద్ధ తిగాదా ॥ పీరుదాస॥

ఉ. అరయ తృణాదిపంకరుహగర్భాంత మీశ్వరుఁ డగు నతనికి శరణార్థి నన్న ॥ లక్ష్మణాఖ్య ॥ ౨

ప్ర. గణుతింప బ్రాహ్మణాగ్రణుల గన్గొని భువి - బ్రణుతింప
వలెనన్న ఫణితి యేమయ్య ॥ పీరుదాస॥

ఉ. అణుమాత్రమైన చిదాత్మను గనుఁగొను - ఘను లెవ్వరైన
బ్రాహ్మణు లౌదు రన్న ॥ లక్ష్మణాఖ్య॥ 3

ప్ర. కరమొప్పు వేదాధికారులైన భూ - సురులె పూజ్యులని స్మరి
యించు టేమయ్య ॥ పీరుదాస ॥

ఉ. అరయఁగ నిగమాగమాంతవేత్తలైన - పరమసాధులు వంశ
కరు లౌదు రన్న ॥ లక్ష్మణాఖ్య ॥ ౪

ప్ర. భువి చాతుర్వర్ణ్యమానవులందు నగ్రసం-భవులె యోగ్యు
లని బలుకు టేమయ్య ॥ పీరుదాస ॥

ఉ. వివరింప కులమేమి స్తవనీయ మయ్యె నె - క్కువగుణ
యుతుని మక్కువనేతు రన్న ॥ లక్ష్మణాఖ్య ॥ ౫

ప్ర. పరికింప షట్కర్మనిరతులై యహింస - పరులైనవారె
భూసురు లందు రేమయ్య ॥ పీరుదాస ॥

ఉ. సరవిఁ శ్వపచుఁడైన హరిభక్తిజ్ఞానభా - సురుఁడైనవాఁ
డగ్రేసరుఁ డందురన్న ॥ లక్ష్మణాఖ్య ॥ ౬

ప్ర. పరగ వాజపేయపౌండరీకాదుల - నెరపువారలె ధరా
సురు లందు రేమయ్య ॥ పీరుదాస ॥

ఉ. నిరహంకృతిని పరాత్పరభావ మొందిన - నరులనె బ్రహ్మ
విద్వరు లందు రన్న ॥ లక్ష్మణాఖ్య ॥ ౭

ప్ర. గాయత్రిమంత్రశిఖాయజ్ఞోపవీతోప - ధ్యాయులె ద్విజు
లనిదలఁచు టేమయ్య ॥ పీరుదాస ॥

ఉ వారయి సదా జపగాయత్రిమంత్రవి - ధేయులో వారె సుధీ
యుతు లన్న ॥ లక్ష్మణాఖ్య ॥ ౯

ప్ర॰ జలజభవానన జలజసంభవు లని - యిలలో విఖ్యాతిగ
బలుకు టేమయ్య ॥ పేరుదాస ॥

ఉ. పొలుపొంద నెచ్చట పొడముచుండునాయా - స్థలమె
యోనిగ నార్య ల్దలపోతు రన్న ॥ లక్ష్మణాఖ్య ॥ ౯

ప్ర. భాసురభద్రాద్రివాసుఁ డైనశ్రీని - వాసుని గలసెడిదాసు
లెవరయ్య ॥ పేరుదాస ॥

ఉ. వాసనరహితులై ధీసాక్షి యగుసంవి - కాసు నెఱిఁగిన
వారె దాసులో నన్న ॥ లక్ష్మణాఖ్య ॥ ౧౦



శ్రీ పీర్దేశికేంద్రులవారి శిష్యుఁడగు

## వనమా సుబ్బారాయదాసు చెప్పిన తత్వములు

౨౦. రాగము - యదుకులకాంభోజి - ఆటతాళము

గురుఁడే బ్రహ్మం బనరె - గురుఁడే విష్ణు - గురుఁడే
మహేశుఁ డనరె ॥ గురుఁడే ॥

శరణని వేడగ శిరమున దక్షిణకర ముంచి సత్కరుణ -
దురితములను బాపి పరమజ్ఞానార్థమై చరణద్వయము నొసగెడి॥

చతురాననుఁడు నుదుట స్థితముగ వ్రాయులిఖితము
దుడిచివేయను - హితము మీరగను భసితరేఖ దీర్చి యమిత
బోధ నందిచ్చెడి ॥ గురుఁడే ॥

ఆక్షీణకరుణాకటాక్షవీక్షణజేసి రక్షింపుమని వేడిన - సాక్ష్యము బుచ్చుక మోక్షసాధనమని దీక్షాత్రయము నిడెడి ॥ గురుఁడే ॥

సాధనలు బోధించి బాధలన్ని యడంచి మోదమంద జేసియు - శోధించి ముద్రలజూడ తత్వజ్ఞానబోధనేతుననియెడి॥ గురుఁడే ॥

మిన్నాదిభూతముల వన్నెలందున బుట్టి యున్నకమల పుబిలమున - నున్నట్టిపాపను నిన్నుగా గనుమని కన్నులకు గనుపఱచెడి ॥ గురుఁడే ॥

అంగమావరణము లింగవిక్షేపము సంగమును గనుం గొని - అంగలింగము మ్రింగి యింగితముగ నీ వుప్పొంగు చుండు మనెడి ॥ గురుఁడే ॥

చరణతీర్థమిచ్చి త్రివిధప్రసాదము లురువడిగ నందిచ్చి - మరల స్వస్వరూప మెఱుగజేసి తాను పరిపూర్ణబోధ నిచ్చు ॥

నన్ను నిలుపకను నే నన్నదుండగానె యన్ని మాయ మాయెను - అన్నది విన్నది కన్నది లేదని యున్నదే యున్న దనెడి ॥ గురుఁడే ॥

కలలేమి జూపి యచలము మెళుకువగాను - దెలియ నేర్పిన చాలును - కులగోత్రములు బోయి కలువరింతలు బాయు ఫల మింతే ననిదెల్పెడు ॥ గురుఁడే ॥

భాసురతరభద్రాద్రీ శిఖరావాస వాసుదేవుసిదయను - జేసి సుబ్బారాయదాస హృద్వాస పీర్దేశికేంద్రులె ధరను ॥ గురుఁడే ॥

౨౧. రాగము - కమాచ్ - రూపకతాళము

తల్లి వీరమాంబ యండ్రు - తండ్రి వీరోజియండ్రు ॥తల్లి॥
కొల్లలుగ బోధను జెద - జల్లువారు జగతిలోన ॥ తల్లి ॥
తామరసభవుఁడు గురుఁడని - తామరసాక్షుఁడు గురుఁ
డని - వ్యోమశిరోజుఁడు గురుఁడని- నేమము నేమరకుమనెడు॥
పంచీకృతపంచభూత - పంచకర్తలను నతిక్రమించి
వెలయునాత్మను శో -ధించు మనుచు బోధించెడు ॥ తల్లి ॥
ఆముకనింద్రియదశకము - తో మారుతపంచకము -
ధీమనములస్తోమంబున - మూలము లేదనియెడు ॥ తల్లి ॥
ఇందు నందు నెందుఁ జూడ - సందులేక యున్న బయలు -
నందు చిదానందము నిం - పొందగ ననభేద్యమనెడు ॥ తల్లి ॥
భాసనత్యభామపురని - వాసు లయ్య సుబ్బరాయ -
దాసు నేలుటకును కృప - జేసి వసుధ నవతరించిన ॥ తల్లి ॥

## అవధూత యదుసంవాదము

౨౨. రాగము - బేగడ - త్రిపుటతాళము

అనఘ మీకథను విను - మవధూతసంవాద - మని
శుకముని పల్కెను - ఆపరీక్షిత్తు - జనపాలునకు వేడ్కను -
మను నిరువదినాల్గై యొ - ప్పినగురువులను జె - ప్పినరీతి శ్రీజనా-
ర్దనుఁడు వికుంఠమునకు - జనునెడఁ వీక్షించి యుద్ధవుఁ -
డెనసి చింతాపరత నమ్రత - గని మురారిపదాబ్జయుగళ -
మ్మునకు సాష్టాంగముగ మ్రొక్కెడి ॥ అనఘ ॥ ౧

కరములు ముకుళించి - పరమపురుష రూపం - కరుణా
నాథ దయాళు - త్రిమూర్త్యాతీత - పరమాత్మ సుప్రియాళు -
గురురాయ త్వదంఘ్రియుం - బురుహము లెడబాసి - మఱి
యేనేవిధమున - మనగల నో సామి - వరదయుని వగజెంది
నంతనె - కరుణగని యుద్ధవున కపుడు - పరమతత్త్వోపదేశము
సు - స్థిరముగా బోధించె శ్రీహరి ॥ అనఘ ॥ ౨

వినుమా యుద్ధవ నీవి - వేకముగా గురువుగ - నొన
రించుకొని సద్బుద్ధి - చేత దుర్బుద్ధిగా - దునిమి మోక్షసంసిద్ధి -
నెనయగ నీవే నేను - నేనే నీవుగా తెలుసు - కొనుమని
యానతివ్వ - గను యుద్ధవుఁ డప్పుడు - ఘననిభా నే నెటుల
దెలియం - గలనని న్వేండెను ముకుందుఁడు - మనకులము
నాలుగవ తాతయు - మును యదుప్రభుఁ డలరు వేళను ॥అ॥ 3

తలప నయ్యదువిభుఁడు - దత్తాత్రేయమునీంద్రు - వలన
దెలిసినట్టి - అవధూతసం - వాదకథనుబట్టి - యెలమి దత్తా
త్రేయునితో - యదుమహారాజవ్వేళ - సలిపినప్రశ్నము ని -
ర్మలహృదయప్రకాశ - మలఘులీలా విభూతియు చె - న్నలరు
దత్తాత్రేయసంయమి - తిలకుఁడని యార్యులు నుతింపగా -
గలమహాత్ముని యెదురుగాగనె ॥ అనఘ ॥ ౪

మునినాథాశ్రమధర్మ - ముల గలగుణత్రయ - మెనయుం
నాశల మూటిని - నిసుమంత జెంద - కను బ్రహ్మానందపేటిని -
మును మీరు దేనిచే నెఱిం - గిన దీపథమని స - వినయములతో
మ్రొక్కి - వివరింపు మనవుఁడు - వినుచునయ్యదువిభునితో
న - మ్మునివరుఁడు జెందినమహాచ్ఛి - ద్ఘనసుఖము నీకారణం
బున - గలిగెనని విభజింపబూనెను ॥ అనఘ ॥ ౫

ధరణి సలిల వహ్ని - మరుదభ్రరవీందులు - శరనిధి యజగరము - శుండాలశలభ - శరచారమును భృంగము - మణి మృగయుఁడు కన్య - మధుమక్షికమును పా - వురము వేశ్య ఖగము - సురగ మూర్ఖనాభియు - పరగ శిశువును భ్రమర మెత్తిన - పురుగతో నిరువదియు నాలుగు - నెరిగి మదిలో గురువులని భా - వించి నిత్యవివేక మొందితి ॥అనఘ॥

విను దుర్మార్గము లొనరిం - చు నివి సన్మార్గ ములు జే - యు నివి యటంచు వీని - నెఱింగి పొంది - తి నజానందము బూని - యొనర నీవిధ మంత నీ - కును యదు మహారాజ - మొనసి భూమిచే గ్రహిం - చినగుణ మేమన్న - దనకొనర్చెడిదురపకారము - లనక నోర్చి యపకృతి బూనక- దనుపరుల కుపకరించుననియు - దలచి శాంతుఁడనైతి ననె విను॥

జలముచే విశదముగ తెలిసినగుణము ని - ర్మలరూపమును చింతించి - తన్ను దర్శించి - కలనామమును వినుతించి - దల కొనువారి మనోంగ - మలినము బాపియు వి - మల మొనర్చు చేగాక మాలిన్యము తనకు లేక వెలయునటు తన్నెవరు గాం చిన - దలచిన నుతించిన జనకలుష - ముల దొలంచుచేగాక తా నా - తలఁపుగాకుం డెఱింగితి ననె ॥ అనఘ ॥ ౭

అనలముచే నెఱింగినట్టిగుణ మున్నచో - టనె హితా హితములు లేక - తత్కాలమున - గనుపట్టువాని వీడక - నెనసి గబళింపుచు - నెటువంటివారిని దా - వునకు ధీరత రానీ - కను నేకమై యుంట - యును విభాసించుమంచివెలుం - గును హుతాశనువలన జెందితి - యొనర నొకసంగంబు లేకను - యుంటి తన్మయత స్వరాత్మత ॥ అనఘ ॥ ౮

అనిలముచే దెలి - సినగుణము నానాపు - ష్పనికరసు
గంధా - ద్యనేకములతో - ననుకూలముగ సంబంధ - మున
నరుదెంచి తద్గుణ - ములు గాలికి లేనట్లు - తను గ్రందుకొను
కామ - మును రోషములయందు - మొనసి కోరికె లుండి
యోగీం - ద్రునకు నాకోర్కెలుఁ లేవని - యనయమును
నావివేకమునకు - నొనరగా దెల్పి గల్గె ననెను ॥ అనఘ ॥ ౧౦

గగనముచే గ్రహించి - నగుణము ఘటమహా - గగన
యుగముగను - గన్పించినంత - విగతకలశమైనను - యొగి
నేకమై తజ్జన్యము - లగుభూతములచే మ - రుగుపడక సర్వత్ర -
నగుపడినటు తనచే - నగుసమస్తచరాచరములకు - మిగిలి
కారణమగుచు లోబయ - లగణితంబుగ నిండి పూర్ణం - బుగ
వెలుగుబ్రహ్మమును గంటిని ॥ అనఘ ॥ ౧౧

ఇనునిచే గ్రహించిన - గుణము భానుఁ డొకఁడయ్యు -
ననేకజలకుంభములం - దనేకంబు - గను బింబములు తేటగ -
దనరుచున్నట్లు రూపమై దగుతేజోమయమైన - ఘనచైతన్య
మొకటిగా నుండి యనేకశరీ - రనికరముల వెలుంగుచున్నప -
రాత్పరుఁడు జీవేశ్వరైక్యం - బునను బ్రహ్మానందపదముఁ -
గనుట సూర్యునివలన దెలిసితి ॥ అనఘ ॥ ౧౨

వనజారిచే దెలి - సినగుణ మిందుకి - రణవృద్ధిక్షయము
లను - జెంది బింబస్వ - రణము తఱుగు లేకను - యొనరిన
చందమున దేహికిని రాగాదివికృతు - లును మోచింప శరీర -
మునకేగాని చిదాత్మ - కును మనోవికృతు లేమియు లే - కను
వెలుంగుస్వయంప్రకాశా - త్మను హిమాంశునిచే నెఱింగితి -
నని యదుప్రభునకును దెల్పిన ॥ అనఘ ॥ ౧౩

జలధివలన బుద్ధి - దెలిసినగుణ మబ్ధి - జలబాహుళ్యత నిండి - బహునదీకూప - ముల సంపూర్ణత నుండి - యొలమి తత్తద్గుణాభివృ - ద్ధుల నొందక గంభీర _ త లలి స్వమహిమ కొదు - వలేక యుండినరీతి - చెలఁగి సచరాచరాదిలోకం - బులును గూడియు వానిగుణచం - చలము నొందక చిదానందా- చలస్థితి జెందితి పయోధిచే ॥ అనఘ ॥ ౧౪

తలపగ నజగరమువలన దెలియుగుణము _ మలచిల్వ బహుప్రయత్న - మున దుష్టకష్ట _ ములోనర్పక యె వినూత్న- ఫలితముగాను తనసమీపమున జేరినదాని - మలచి భుక్తిగా గొనుట - తలపున యోచించి - యిల మెయి న్మానావమాన వి - దళన సాధుల కిటుంచుట ని _ ర్మలమనస్కతగాన నూరక - గలిగినప్పుడె భుక్తి గొందును ॥ అనఘ ॥ ౧౫

వినికిచే మృగమువ - లన గ్రహించినగుణము - ముసు శృంగమునీంద్రుఁడు - వేశ్యలగాన - మునను మోదించి నిండు- మనమున నొకకన్యకా - మణిని కోరి పెండ్లాడి - నినదాకర్ణన మృగ - యునివలం జిక్కి లేడి - వనటజెందుట గాంచి జనరం- జనసుగీతము లీప్సితంబున - వినను సద్బ్రహ్మానుభవకీ - ర్తనము లుర్వి విని సంతసింపుదు ॥ అనఘ ॥ ౧౬

గజమువలన నెఱుం - గబడినగుణము న - క్కజముగ మావటీఁడు - పొనర్చినట్టి - కలవాదమున నాడు _ గజమును కూడగ గోరి - గంధోద్రేకమున సా - మజ మాగోతిలో దుమికి - మావంతువశమైన - నిజము జింతించుటయు గని చి - త్తజవికారముఁ జెంది చేతో - గజము స్త్రీస్పర్శాసుఖ మార్తిని - గలుగజేయునటంచు మానితి ॥ అనఘ ॥ ౧౭

శలభమువలన నే - దెలిసినగుణము సూ - జ్జ్వలముగ జ్యోతిరూపము - నైనదీపము - కలితహారాలాపము - వలన చుట్టూరఁ దిరిగి - ఫలమని భ్రమింగబోయి - పొలసి భ్రుంగినరీతి- దెలిసినధీరుడైన - జలజగంధులచెంతఁ జేరిన నెలమి సెగపొంత నవనీతము - నిలఁ గరగి చెడునంచు లోలాత్ముల వరింపక మానియుంటిని ॥ అనే ॥ ౧౭

విను మీనమున గ్రహిం - చినగుణముఁ ధీవరుఁ డుం - చినగాలమున మాంసంబు - గీలించి వ్రేయ - గను జిహ్వేంద్రియ చపలంబు - నను భ్రమింగి భ్రుంగినమత్స్య - మును గాంచి జిహ్వోపస్థ - లును జాంచల్యముల్ గాన - ఘనరుచిపదార్థములు- గొనుట మానియు మితాహారం - బునను జఠరానలము నారుపు - కొనుచు విజితేంద్రియుఁడనై నే - ర్పున విహరింపు చున్నా నిటు ॥ అన ॥ ౧౮

దనరు భృంగముచే జి - త్తమున గ్రహించినది - వనజ సుగంధమునను - మకరందపాన - మున మందబుద్ధిచేతను - ఇనుఁ డస్తమించునకాల - మున నది ముకుళింప - గను జిక్కు పడంగాంచి - యు నొక్క గృహం బాసించి - నను సుభోగాదు లను గావిం - చునని గేహాపేక్ష నొందక - మొనసి కరపా త్రచే భిక్షం - గొనుచు దొరికినయది భుజింతును ॥ అన ॥ ౨౦

పరగ రవస్పర్శరూ - పరసగంధము లేను - ధర నొక్కొక్క గుణంబున నొక్కొక్క ప్రాణి - మఱిజిక్కి బెడిదంబున - పరి విగ వెతజెందుటే - నెఱిగి మే నింద్రియంబు - లురవడిం గల హింప - నొక్కొక్క యవివేకి - యారయ దమకు వశంబు

జేసుక - నరిమురిగ జీకాకుపఱుచుట - పరమసుజ్ఞానసాధన మగు
బ్రహ్మబోధము గలుగ నివ్వదు ॥ అన ॥ ౨౧

మృగయుఁడు లక్షించి - మృగముపై నేత్రాబ్జ - యు
గము గదల్పకుండియు - చాపంబునం దా - శుగము సంధించి
వెండియు - దగిలి దశేంద్రియాఘబం - ధన మొనర్చి మది
నిలిపి - నగతి నతీంద్రియుఁడ - నై చేతోస్థిరత్వమున - జిగి
యొసగ నిర్వాతదీపముచెల్వునను ఘనస్వస్వరూపము - నగు
పరాత్మను నాత్మచే నిం - డుగను జూచుచునుంటి ననుకొనె॥

విను కన్నియచే గ్రహిం - చినగుణ మొకానొక -
ఘనకన్యకను గాంచియు - పరిణయించుట - కును బంధువు
లేతెంచియు - మను భుజించుటకై తండుల - ములు సడించు
నక్కాల - మున గేల గాజులరొద - వినుపింప దరిద్రురా -
లనుచు నిందింతురని తత్కాం - కణముల దొలంగించి దంచిన -
యనువున నొప్పరని నిజ - జనుల విడి యొంటిగ జరించితి॥

ఎలమిని దేటివలన - దెలిసినగుణము ని - మ్మల మధు
మక్షికంబు - దాను గూర్చిన - యలరులమధురసంబు - దెలిసి
భుజింపకుండి యా - దేనె నొడుచుక జను మ - ర్త్యులచే పొంది
సినరీతి - దలచి ధనాద్యపేక్ష - సలుపకను గల్గినంతయు ని -
శ్చలమతిఁ భుజియింపుచును భూ - స్థలమునను సంచరింపుచు
ని - ర్మలపరాత్మానంద మొందితి ॥ అన ॥ ౨౨

సరి పావురమువలన - నెఱిగినగుణము చె - చ్చెరను
శబరుఁ డుంచి - నట్టియురులఁ - బరికింపకను మించి - బిర
బిరఁ పావురంబుకొ గా - వరమున నురిం ద్రొక్కి - మఱి

జిక్కుపడి వెతల - బొరయుట గని యొకపా - వురము భ్రమ
దానిజేరి యవల - జరుగనేరక జిక్కి దక్కిన - తెఱుగుగని
నన్నటుల వెతలకా - బరతురని సతిసుతుల వీడితి ॥ అన ॥ ౨౫

వెలబోటివలన నే - దెలిసినగుణము పిం - గళ యన
న్నొకవార - కాంతాతిధనా - దులపై నపేక్షమీర - బొలుపు
మీరగ దన్నును - పొందగోరినవారి - వలపుసొక్కించి మక్కు-
వల నింపుబుట్టించి - వెలధనంబు హరించి యొకనా - డలము
కొన దొరకమికి జింతా - కులత నటు ధనకాంక్ష బాసివి - ము
లత నొందినరీతి నైతిని ॥ అన ॥ ౨౬

విను మాంసభుక్పక్షివ - లన గ్రహించినగుణము -
మును ఖగ మొకయామిష - ఖండము గొన మిం - టను జను
నెడ గ్రాసము - గొన నొకమహాద్విహంగం - బును దానిచే
నాక్రమిం - చి నితాంతానంద మొందు - టను గాంచి నే
నెయ్యెడ - లను మఱేమిపదార్థములు గో - రిన నవియు జేకూర
కుండుట - కును నిరర్థకముగ గృశించను - అనుపమామృత
పదవి వీడను ॥ అన ॥ ౨౭

భుజగముచే నెఱుంగ - గ జెలంగుగుణ మిది - భుజ
గము తను వసింపను - వాసము వేరే సృజియింప తలంపు
లేకను నిజనికేతనముల్గా నే - ల జదలుపురువులచే - సృజన
యగువల్మీకము - జేరియుండుట దెలిసి - నిజనిలయము
నిర్మించ కెప్పుడు - రజని దివముల్లేక నేకత - సుజనదేశవిహా
రినై య - క్కజముగ నం దదుండుచుండుదు ॥ అన ॥ ౨౮

అలయూర్ణనాభిచే - దెలిసినగుణము సం - చలదూర్ణ
నాభియును తూల - పుంజము గోర - కిల స్వయంతంతుజాల-

ముల విరచించినచిత్ర - ములనుండి తద్విచిత్ర - కలితతంతువు
దనలో - పల నడంచుట గాంచి - యొలమి సచరాచరజగత్పం-
క్తుల సృజించి వసించి దా నం - దుల ముదంబంది క్రమ్మర జగ-
ముల నడంచి పరాత్మయగునని ॥ అన ॥ ౨౯

సమత నర్భకునిచే - సంగ్రహించినసల్ల - క్షణము
బాలుండు చేలము - దాల్పక నవమా - నము మానముల
మూలము - లెమి విసర్జించి భూమిజ - నములు గర్జించిన బిడి-
యము నొందక పూర్ణ్ణానం - దమునస్ఖలద్రై వర్జించు - ట మది
నిం గని నేను తత్క్రియ - నమితపరమబ్రహ్మసన్మో - దమును
బొందియు లజ్జవిడి స - త్యము దిగంబరతను వహించితి ॥అన॥

భ్రమర మెత్తిసగీట - కముచే నెఱుంగులక్ష - ణము
బంభరము హుంకార - మున నొక్కకీట - కమును లంఘించి
గార - పమున గూడటు నిర్మించి - యమరగ నందు నుంచి -
శ్రమ జంకొదువ ఝంకా - రముజేసి తిరుగ నా - దము వినక
విన గీటకము - నవభ్రమరమైనటు నే సదాబ్ర - హ్మమున
లక్ష్యంబుంచి చూచుచు - నమలచిత్పరమై వెలింగితి ॥ అన ॥

సుమతి వసుంధరాత - లమున నన్నిటికి శరీ - రములె
ప్రధానమాటను - వానివాని భే - దములు గ్రహించి తేటను -
రమణ నిర్వాణపదసౌ - ఖ్యము నొంద దలంచితి - సుమనో
వాక్కుల కతీ - తమై ధాత్ర్యండముల్ నిండి - యమితపూర్ణం
బైనసద్బ్రహ్మమును వైరాగ్యభక్తిజ్ఞా - నములచే నెఱుగుటకు
నీదే - హమును కారణ మైనకతమున ॥ అన ॥ 3౨

గురు వనదగియుండు - నరయ నిట్లు కళే - బరము
లీభూమియందు - నండజోద్భిజ్జ - జరాయుజములై చెల్వొందు -

మఱియు స్వేదజాతములైన - పరగ చాతుర్విధసృ - ష్టి
రహించి యవి సప్త - సరణుల సురభేద - మగుదుగను పదో
కండులక్షలు - నరవిభేదములు నవలక్షలు - శరచరమృగవి
హంగభేదము - లిరువదియులక్షలు నెలర్పగ ॥ అన ॥ ౩౩

ఇల బౌరుతనుభేద - ములు పంచదశలక్షా - చలతరు
లతతృణాది - కము లేకోనవిం - శతిలక్ష స్థావరభేద - ముల
నెనుబదినాల్గుల - క్షలు కళేబరసంఘ - ముల వానియందు
నిహప - రలోకజ్ఞానశక్తి - గలిగి వర్తించుటయు బరముఁ గా -
దెలియ కిహ మెఱిగి వర్తించుట - నెలమి నిహముఁ గా - బరము
దెలియక - నిలిచియుండుటయు నిబ్బంగిని ॥ అన ॥ ౩౪

అరయ నుత్తమమధ్య - మాధమములై యందు - వరుస
మధ్యమాధమము - లైనతిర్యక్స్థా - వరములు దక్క ద్వయము
తిరిగి యుత్తమమైనట్టి - నరులకే సుమోహాధి - కరణశక్తి
గలిగియు - న్నరీతి యట్లుండియు నీ - నరులలో పాషండుఁడన
నిహ - పరజగత్కాములు నకామియు - మఱి ముముక్షు
భ్యాసి యారూ - ఢరహిసప్తవిధముల నుందురు ॥ అన ॥ ౩౫

సరి పాషండుఁడు వేద - శాస్త్రముల్ మిధ్యలని -
విరసకర్మముల్ సేయు - నిహలోకకామి - వరధనతనుభవ
జాయా - దిరాజితైహికసౌఖ్యముల్ - స్థిరమని యదృశ్యమౌ -
పరలోకము మిధ్యయని - చరియించుస్వర్గకామి - సురజగ
న్మఖసుఖములకుగా - పరమకర్మము లొనర్తురు వా - విరి
యకామిశ్రుతిస్మృతులను మ - ఱెఱిగి సత్సేవను సుధీయగు॥ ౩౬

విను ముముక్షుఁడు రాగ - ద్వేషత్యాగనిత్యాని -
త్యనియతవివేకాఢ్యుఁడై - యిహపరభోగ - ముఁన విరాగ

సదార్ధ్యుఁడై - ఘనశమషట్కసంపత్తు - లనుసాధనచతుష్క -
మును గల్గి పరాత్మార్చిం - తనము సేయుచునుండు - ననుపమా
భ్యాసయోగిశరీ - రాద్యఖిలవిశ్వం బనిత్యము - నని మహా
వాక్యోపదేశము - నను నిజాత్మపరాత్మ గాగను ॥ అన ॥ ౩౭

మృగతృష్ణికలయందు - నగపడు జల మట్లు - జగము
లాభాసమాత్రమై దోచుట గని మి - థ్యగను దెలిసినచిత్రమై -
మిగిలి జీవేశభావచి - ద్గగనాతీతమై సంవి - త్సగుణనిర్గుణ
ద్వంద్వ - విగతమై పరిపూర్ణ - ముగ నలరు కేవలాత్మై తా -
నగణితారూఢుఁడు నిజస్థితి _ మగుడి ద్వయదోషంబు నొందక-
నెగడు మోక్షసతీశుఁడై మహి ॥ అన ॥ ౩౮

ముని యదుమహాభూవ - రున కిట్లు బోధించె - నని
యుద్ధవునకు శౌరి - బోధింప తద్బో - ధనిరూఢుఁడై కడతేరె-
నని పరీక్షిన్మహారాజ - ఘనునకు శుకయోగి - వినుపింప విని
తరిం _ చిన దీకథ నెవ్వరై _ నను విన్న జదివిన్న భద్రా - ద్రి
నిలయుఁడు శుభముల నొసంగును -దనరు శేషగురుప్రభునిసద-
యను నుతించెను పీరుదాసుడు ॥ అనఘ ॥ ౩౯

౨౩. రాగము - ముఖారి - ఆటతాళము.

శుకయోగీశ్వరుఁడు వేడుకతో పరీక్షిత్తు _ నకు బోధిం
చుట వినరె - నిత్య - మకలుషముగ పరమామృతప్రదమహ -
త్సుకర మొసగుఁ గనరె - అకలంకమై సరోజాప్తకోటిప్రదీ -
పకుఁడైన విశ్వతోముఖపర మొందగ ॥ శుక ॥

పరమయోగీంద్రులు నిరుపమబ్రహ్మైక్య _ పరత నొంద
పూనియు - శ్రేయ _ స్కరులై కాలదేశముల గాచుకొన

రరయ సర్వము మానియు - సరవి కాయమును విసర్జించుతలఁ
పున - నరమర లేక భద్రాసనస్థులయ్యు - స్థిరమతిఁ బ్రాణా
నిలము నిర్జించి చేతోవేగముఁ పరి - హార మొనర్చియు
బుద్ధిచే నిర్భరత ధీవృత్తినైపుణతఁ ॥ శుక ॥

తలప క్షేత్రజ్ఞుతో గలిపి క్షేత్రజ్ఞునిఁ - గలిపి యాత్మ
తోడను - యాత్మ - నలవడ బ్రహ్మమం దైక్య మొనర్చి
నిశ్చలశాంతితో గూడను - వెలయ నిరూఢులై వికృతులఁ
బిగనాడి - యలరునిత్యసుఖము వలయు ననుచు గాంచు -
కలితబ్రహ్మంబునకుదక్కను కాల దేశరజస్తమోహం - బులకు
సత్వమహాత్త్వ ధానంబులకు సామర్థ్యంబు లేదనె ॥ శుక ॥

దనరుగాన పరమాత్మవ్యతికరము లే - దని కాయాదు
లందు నా - త్మత్వ - మును వీడి యన్యసామనము మాని
పూజ్యమును సుస్వాంతములందున - నయము హరిపదమును
నాలింగనము ల - ర్చనముల వైష్ణవమును పరమపదము -
వినుతసర్వోత్తమ మదియు సజ్జను లెఱుంగుదు రీవిధంబున -
మొనసి విజ్ఞానాగ్నిచే దహనవిషయవాసనులై మఱి ॥శుక॥

ఘనత నాధారచక్రంబు పాదమూలమున బంధించి
నేర్పున - వాయు - వును బిగియించి మెల్లన నాభిస్థలి జేర్చి
పనుపడ నటు లోర్పున - మనసి పయోజంబునకు నెగయబట్టి -
యనువుపరచి యురమ్మున నటుమీదను - యొనసి తాలుమూల
ములకును నేగ నిల్పి తిరిగి భ్రూయుగ - మునకు దెచ్చియు
చెవులు ముక్కులు కనులు వక్త్రము మూసి యంతయు ॥శుక॥

పరమయోగి యిచ్ఛ బాసి యింద్రియార్థరతి యేమి
లేకను - శమత - వరలి ప్రాణముల వంచి ముహూర్తావ

పరము లేమియు గాకను - తరలితబ్రహ్మరంధ్రము జించి సుషుమ్న - సరణి బ్రహ్మమునందు సాయుజ్యమును బొందు - పరగ భద్రధరాధరాధీశ్వరుఁడు రామబ్రహ్మకరుణా - పరత పీఠ్గాసునకు శేషయగురుఁ డెఱింగించె నీమార్గము ॥శుక యో॥

## అవస్థోల్లాస నవకము

౨౮. రాగము - దేవగాంధారి - ఆదితాళము

శ్రీరాములకును వ - శిష్ఠుఁడు మును తత్వ - సారము నెఱింగించెను - సంపూర్ణభక్తి - మీఱ తా నాకర్ణించెను - ధీరుఁడైనట్టి శిష్య - తిలకునిం గని కృప - తో రహి దేశికుఁడా - తీరు బోధింప దివిరె - వారక నప్పు డవస్థోల్లాసప్ర - కారం బంతయు తోర మెలర్పగ ॥శ్రీరాము॥

శ్లో. ఇదం మమేతి సర్వేషు - దృశ్యభావేషు భావనా -
జాగ్రజ్జాగ్ర దితి ప్రాహుః - ర్మహాతో రఘునందన !

దరువు ॥ ఆరయ స్థూలసూక్ష్మ - కారణము లనుశ - రీరత్రయమునందును - అభిమానాహం - కారము వీడి యంతను- అనృతజడదుః - ఖోరుత్రితాప మంచును - దృశ్యము నశ్య - మై రంజిల్లగ దానును - ఆరూఢిసత్తు చిదానందరూప పరా - త్మారామతత్వమైన - తీరు నీవైతివేని - గారవమున జాగ్రతజాగ్రతయని - దారుతత్వదార్థమని రార్యులిది ॥ శ్రీరా ॥

శ్లో. విదిత్వా సచ్చిదానంద - మద్వయం చ పరాత్పరం -
నామరూపపరిత్యాగో - జాగ్రత్స్వప్న ఇతీర్యతే. ౨

దరువు ॥ కనుపడుమృగతృష్ణ - కలరీతి దోచిన - ఘన చరాచరములైన - పాంచభౌతిక - మును తనుహృదయప్రాణ - హృషీకముఖ - రనిఖిలప్రపంచవితాన - మెల్ల నిస్సంగ - మను నిత్యసత్యనిధాన - సచ్చిదానంద - మును సాక్షిచైతన్యంబున - జననస్థితివినాశము నొందునటంచు దెలి - సిన జాగ్రతందు స్వప్న - మనిపల్కుదు రార్యులు - దనరుతత్వంపదార్థదర్శనం బిది- యనుచు కేవలాత్మానందుండగు ॥ శ్రీరా ॥

శ్లో. పరిపూర్ణ చిదాభాసే - మయి బోధాత్మతాం వినా
నకించి దన్య దస్తీతి - జాగ్రత్సుప్తి రితీర్యతే. 3

దరువు॥ నిరుపమానమై నిరం - తర నిరామయచిదం - బర పరిపూర్ణ మయ్యును - నిశ్శబ్దపరా - త్పర బోధరూప మయ్యును - నిర్గుణనిరహం - కరణనిర్వేద్యమయ్యును - వెల్లు పద్బ్రహ్మ - మిరవొంద నింతకన్నను - వేరులేదని - బొరయు సుషుప్తియందును - నెఱడిందు నింద్రియముల- తెఱగున త్రిపుటి కళే - బరేంద్రియవిషయము - ల్మఱి నాకు లేవని చి - త్పర భావము జా - గరమున సుప్త్యని - యరయుదు రార్యులు - నసిపదార్థ మిది ॥ శ్రీరా ॥

శ్లో. మూలాజ్ఞానవినాశేన - కారణాభ్యాసశేషితై
ర్బంధో మే నేతి విజ్ఞానం - స్వప్నజాగ్ర త్ప్రగద్యతే.

దరువు॥ ఏను చిదాత్మని - యెఱుగక బహుజంతు - యోనుల జన్మింపుచును - భ్రమసితిరిగి - దానీశ్వరునికృపను - యిహపరభోగ - హీనహృదయమనను - గురుదయాలబ్ధ - జ్ఞానోదయంబుచేతను - విదళితమూలా - జ్ఞానమైనందువల్లను- గాన ప్రారబ్ధదేహ - లీనపర్యంతశంక - హీనుండ నైననాకు -

జ్ఞానకర్మేంద్రియవి - తానము లేదనుజ్ఞానము స్వప్నము - లోని జాగ్రతని ధీనుతు లని రిది ॥ శ్రీరా ॥

శ్లో. కారణాజ్ఞాననాశోపి - ద్రష్టృదర్శనదృశ్యతాం
న కార్యోస్తీతి విజ్ఞానం - స్వప్నస్వప్న స్సమీార్యతే. ౫

దరువు॥ తలఁపగ నిది శివ - దర్శనకార్యోపాధి - దొలఁగిననిష్ఠగావున - ద్వైతోపాధి - వలన జీవత్వ మొందిన - కతము నింద్రియ - చలన హేతువుగాకనా - బడినమూల - బలమైనట్టి యజ్ఞాననా - శనము సద్గురుని - వలన సిద్ధించినందున - పోలు పొందుత్రిపుటి - మొదలుకొని యొకలైన - తులలేని దను కొని - వెలయునిశ్చయజ్ఞాన - మలవడ కలయందలి కలయని ధీ - రు లిదియు త్రిపుటిని దొలగిననిష్ఠని ॥ శ్రీరా ॥

శ్లో. అతిసూక్ష్మవిమర్శేన - బుద్ధివృత్తి రచంచలా ।
విలీయతే యథా బోధే - స్వప్నసుప్తి స్సమీార్యతే.

దరువు॥ గురూపదేశవిశేష - సరణిచే తత్త్వమసి - వర వాక్యములచేతను - దెలిసి పరమే - శ్వరానుకంపమువల్లను - అతిసూక్ష్మానంద - పరిపూర్ణబ్రహ్మ మయ్యూను - వెల్గువిజ్ఞాన - స్ఫురణా దృగ్దృశ్యదర్శన - ము ల్లీనమగుచో - టరయ తన బోధయందున - బరగుచున్న దనుదృఢ - భావాతీత మైనట్టి - పరమాత్మతత్త్వమాత్ర - మురుధీరు లిదియె స్వప్నాం - తర సుప్త్యని భాసురముగ భావిం - తు రిది శివాకృత్యనుభవ నిష్ఠని ॥ శ్రీరా ॥

శ్లో. చిన్మయాకాశమయతః - ధీవృత్తిప్రసరే గతే
ఆనందానుభవోనామ - సుప్తిజాగ్రత్త్వగద్యతే. ౭

దరువు॥ పనుపడగ నంతఃక - రణచతుష్టయము వృ - ద్ధిని పొందు నయ్యెడను - మనంబు వేరు - మనఃప్రధాన మని యును - మతి వేరు బుద్ధి - కిని ప్రధానమ్మనియును - యీరీతి నుండ - గను తొంటి జాగ్రత్స్వప్నమును - యం దనుభవ - మును గాంచి ధీయధిష్ఠమును - యొనరినప్పు డింద్రియా - ర్థనికరాస్పదప్రజ్ఞా - ఘనచిదాకాశాద్వయ - మును గుణశూ న్యానంద - మనుభవధీవృత్తిని ధీరులు సు - ప్తిని జాగరమని వినుతింపగ నిది ॥ శ్రీరా ॥

శ్లో. వృత్తే చరానుభూతాత్మా - ఆనందానుభవే స్థితం
సమ్యగ్యవనియత్నేషు - సుప్తిస్వప్న స్సమీార్యతే. ౮

దరువు॥ కని మును జెప్పినజా - గ్రత్స్వప్నముల మెలం గినట్టిధీవృత్తి యంతను - నిర్వికార మ - య్యును వెల్గుచున్న యెడను - బ్రహ్మచైతన్య - మును జూచి సమ్మోదమ్మును - సంపూర్ణమైన - దని యీబ్రహ్మముదంబును - అసమానమైన - దని గాడ్పు లేనిచోటను - దనరుదీపమువలె నిగుణమై నిశ్చలనిర్ద్వో - షనిరంజనంబు సుషు - ప్తిని స్వప్న మందు రార్యులును సత్యజ్ఞానానుభవసుని - ష్ఠని రఘుకులమండన నిర్మలమతి ॥ శ్రీరా ॥

శ్లో. దృశ్యన్నివృత్తిదేశస్య - కేవలాభావభావనా
పరంబోధైకతావాప్తి - స్సుప్తిసుప్తి స్సమీార్యతే. ౯

దరువు॥ ఈరీతిగాను వి - చారించుకొనగానె - తేరుధీ వృత్తియంతను - నిశ్చలనిర్వి - కారనిరామయంబును - నిస్సంగ నిరహం - కార బ్రహ్మమునందును - లీనమై సర్వా - ధారమై

జీవత్వంబును - వదలి యఖం - డారూఢి - బ్రహ్మమయ్యెను
ధీరు ల్దదానుభూతి - స్వారస్యమాహాత్మ్యలు చె- ల్వారఁ సుషుప్తిలో
సుషుప్తి- గా రచించిరి సదా - పారచిన్మ్మదనుభవము నుపనిష-
త్సారసమాధిని శ్రీరమ్యంబుగ ॥ శ్రీరా ॥

దరువు॥ సొరిది జాగ్రత్స్వప్న - సుషుప్తియవస్థలకు బర
గునతీతమయ్యెను - తురీయస్వరూప - మిరువొంద సద్బ్రహ్మం
బును - వచియింపఁబడునీ - తెలి గవస్థానవకంబును - బ్రహ్మ
ధ్యాస - పరత నొనరింపవలెను - జననమరణ - పరిహారమౌనీ
క్రియను - ఉరుతరావస్థాత్రయోల్లాసగ్రంథానుభవ - మెఱిగి
యభ్యసించిన - పరమమోక్షసిద్ధి యగును - రవి నిది వినం
జదివిన వ్రాసిన - నరులకు బ్రహ్మానంద మొదవునని ॥ శ్రీ ॥

దరువు॥ అనఘాత్మ యిదియు బ్ర-హ్మాండపురాణమున
సనకసనందనులును - శుకమహామునీం- ద్రునకు బోధించి రం
చును - వసిష్ఠమహా - ముని రామచంద్రునకును - విభజించి
రని - దనరుభద్రాద్రిసదను హరిని ధ్యానించి - ఘనశేషగురుని
కృపను - వినుపించె పీర్దాసు వా - విరి కూరేడువంశోరం -
జనుఁ డగునాగన్నకు - ననుపమబ్రహ్మానుభవ - మును మహా
త్పదమ్మును నిత్యనిరం - జనము దివ్యపావనము నిర్గుణము
॥ శ్రీరా ॥

జ్ఞానభావము - సంపూర్ణము

ఓమ్

# పరమానంద సుధాలహరి



## అచలభావము

౧. రాగము - బేగడ - త్రిపుటతాళము

ఏమి చెప్పుదు నేమి చూపుదు నీతువాంపథరమ్యము
తామరసగర్భాదులైనను దలంపరాని దగమ్యము ॥ ఏమి ॥

సామకామము నామనీమము రామభీమము గానిది
క్షేమహేమము వ్యోమభూమము సీమధామం బైనది ॥
అందియందక పొందిపొందక సందులేకనె యున్నది
ముందు సనకసనందనాదుల డెందములకై యున్నది ॥ ఏమి ॥
దిక్కుదిక్కుల పిక్కటిల్లుచు నక్కజంబై యున్నది
చొక్కమై యీటక్కుపిక్కుల నిక్కు తెలుగక యున్నది ॥
చూపురూపును కోపుగేపును యేపుమాపును గానిది
యాపుగాపును ప్రాపుదాపును రేపుమాపై యున్నది ॥ ఏమి ॥
ఎప్పటికి నొకముప్పు లేకను కప్పి కదల కున్నది
తప్పులొప్పులతిప్ప తెలుగక కుప్పరము గాకున్నది ॥ ఏమి ॥
రాకపోకలు లేక చలనము గాక నేకంబైనది
టీకుటాకులు సోకరాకను శ్రీకరాకర మైనది ॥ ఏమి ॥
శిక్షరక్షో పేక్షలక్ష్యాలక్ష్యపక్షము గానిది
మోక్షసాక్షివిలక్షణాక్షరదీక్షరక్షక మైనది ॥ ఏమి ॥

ఎన్నిపుట్టిన నెన్నిగిట్టిన నెన్నటికి చెడకున్నది
వన్నె చిన్నె లన్ని సున్నగ నన్నిటికి మిగిలున్నది ॥ ఏమి ॥
అండపిండాజాండభాండోద్దండశతండము గానిది
నిండి ఖండాఖండములకును దండయుండయు నైనది ॥ ఏమి ॥
చింతవంతలు వింతపొంతలు తంతుపంతము లేనిది
యంతకంత కనంతమై భావంత మింతయు గానిది ॥ ఏమి ॥
మాతృపితృభ్రాతృగోత్రపవిత్రపాత్రము గానిది
క్షేత్రపాత్రాపాత్రగాత్రపవిత్రసూత్రక మైనది ॥ ఏమి ॥
అంటుగెంటులు నొంటిజంటలు కంటుగొంటులు లేనిది
అంటియంటక నొంటిరొంటికట మింటితోంటిది యైనది ॥ ఏమి ॥
మంకుబొంకులు జంకుజింకులు వంకశంకలు లేనిది
క్రుంకుధృంకుల సంకళంకము లింకిపొంకం బైనది ॥ ఏమి ॥
భాసురం బగు శేషగురుకరుణాసమన్విత మైనది పీ
ఠాసు నేలినభద్రశైలనివాస మనదగి యున్నది ॥ ఏమి ॥

౨ రాగము – సావేరి – ఆటతాళము.

రామా నీస్వస్వరూప మరయగ ని-రామయ మై యున్నది॥
రామా సీతారామా యిదేమో మరేమియు గాకను - యేమనరాకున్నది - కామరాగము లేమి లేకను నామరూప వికారగుణముల - భూమి నిష్ఫల కందరాకను భోమసన్మోదం బెలర్పగ ॥ రామా ॥

జననమరణములను జెందకెప్పుడు నిరం - జనము నిరాకారమై - జనా - ర్ధనశూలిధాత్రాదియనిమిషమునిజను -

ల్వినుతింప నాకారమై ॥ యనుపమానమై యాద్యంతరహితమై-తనరి యింద్రియాదుల నగనుగొనరాకను - తనుమనఃప్రాణాది వృత్తుల దగుల కెప్పుడు మిగిలి తానే - ననక నాహంభావ వైకృతమునకు బాల్పడక కలరుచున్నది ॥ రామా ॥

తలుగక విలుగక పెలుగక కలుగక మరుగు వరుగు లేకను - చరా - చరరూపమై యజాండకోటుల కెల్ల ॥ నిరవు తానైగాకను - పరికింప భావాభావాతీతమై - పరమపవిత్రమై భాసిల్లుచున్నది - ధరణి జలపావకసమీరాంబరము లైదును శబ్దమాదిగ - పరగ తన్మాత్రౌఘభవసంసరణభావ మెఱుంగ కున్నది ॥ రామా ॥

ఎఱుకచే జనియించు నెల్లలోకములను - యెఱుకే వర్ధనసేయును - మరలి - హరియించు భరియించు వరియించు చరియించు - తరియించ తానాయెను - అఱనిమిషమంత మహా యుగమును జేయు - మరలి గోష్పదమాత్ర మఖిలధరిత్రిగ - తిరిగి మేరువ తృణముసేయును తృణము మేరువగా నొనర్చును- మెఱపువలె కనరాక నరిగెడుయెఱుకజో లేమెఱుగకున్నది ॥

కలపోలికను దోచుతెలివి దేహము జగం - బులు బీజ వృక్షాగతి - ప్రకృతి - బలిసినగురుకృపవలన మేలుకున్న - కల మిథ్యయగా జగతి - తెలివి లేనంత కేవలపరిపూర్ణమై - పాలు పొంద లోపల న్వెలుపల నంతట - చలన మచలము గాక వెలిఁ గెడు వెలుఁగులకు వెలుఁగయ్యు వెలుఁగక - కలుఁగకను మలు గకను నలుగక దలుగకను మెలుగకను యున్నది ॥ రామా ॥

వాసనాత్రయగుణవాసితవృత్తుల - మోసము లేకున్నది - చిద్వి - లాసములను మించి హాసవాసము లా - భాసము

లేకున్నది - దోసరోసముల వేసట లెఱుగక - నీసకింపక నిసు మంతాస లేకున్నది - భాసురం బగు శేషగురుకరుణాసమన్విత మింపాదువ పీ - ర్దాసుఁడను రక్షింప భద్రగిరీశుఁడై వెలుగొందునాత్మా ॥ రామా ॥

3. రాగము - శుద్ధకాంభోజి - ఆదితాళము.

పూర్ణమై యున్నదది - నిరాద్యంతవి - స్తీర్ణమై యున్నదది - వర్ణధర్మాశ్రమనిర్ణయమును లేక - నిర్నినాదభవార్ణవోత్తీర్ణమై యున్నది ॥ పూర్ణ ॥

అన్నిటి మిగిలినదీ - తనకు తానై - యున్నపరాత్మయది - మన్నునీరగ్నిగాడ్పుమిన్నుల మీరి లావు - సన్నముగాక ప్రసన్నమై యున్నది ॥ పూర్ణ ॥

సత్తుచిత్తును గానిది - నిత్యమై సద । సత్తురిత్తైయున్నది - చిత్తవై కారికాయత్తుల కందరాక - సత్తామాత్రముత్తమోత్తమమైనది ॥ పూర్ణ ॥

బిందుకళయు గానిది - అందియందక - సందు లేకయె యున్నది - ఇందునందనరాక యెందు జూచిన తానై - మందమానసులకు పొంద శక్యముగాక ॥ పూర్ణ ॥

యోగముగాని దది - ఐహికపర - భోగము లేని దది - రాగద్వేష వియోగసంయోగార్థ - త్యాగమైన రాజయోగభోగమైనది ॥ పూర్ణ ॥

రూపము లేని దది - దృగ్దృశ్యభ్రమా - రోపణ గాని దది - చూపుల కందక నిర్లేపకమైనది - చూపు దలఁపు లేనిప్రాపకమైనది ॥ పూర్ణ ॥

రాకపోకలు లేనిది - యంతర్బహిర్వ్యా ప్తికవిషయియా గానిది - యేక మనేకవిలోకలోకాకృతి - పీక గన్పించునెరుక లేక నిరాకృతి ॥ పూర్ణ ॥

ఖండముగాని దది - ఖండాఖండములు - నిండి తానై యున్నది - అండపిండాండ బ్రహ్మాండకోట్లకు రాట్పి - చండమై దోచుట కండదండైనది ॥ పూర్ణ ॥

దివనిశములు లేనిది - హరిహరబ్రహ్మ - దివినుతాకర మైనది - భవము నాశము జూడ లవము నెందు దగులక - యవిరళానారతప్రవిమల మైనది ॥ పూర్ణ ॥

మానము జెందనిది - శాంతమై యవ - మానము నొందనిది - పూని ప్రకృతిపురుషజ్ఞానాజ్ఞానము లేక - మానితానంద సత్యజ్ఞానాతీత మైనది ॥ పూర్ణ ॥

త్రిపుటియు గాని దది - యంతరాంతర - త్రిపుటులు లేని దది - జపతపస్స్వాధ్యాయనిపుణుల కందరాక - యపరిమిత మైనగురుకృప నుపమించునది ॥ పూర్ణ ॥

వాసన లేని దది - సదా సచ్చిద్వి - లాసము మించినది - భాసుర శేషగురుదయాసమన్వితపీరు - దాసపోషితభద్రాద్రీశ మై యున్నది ॥ పూర్ణ ॥

౮. రాగము - భైరవి - ఆటతాళము

ఈమూలము లేనిగుర్తెఱిగే శరీరం - ఏమి లేదని దెల్పెనె ॥ ఈమూ ॥

కోమలిరో యిది కోటిమారులకైన - నేమారకు మనె నే- సద్గురుమూర్తి భామరో యీాయు త్తబట్టబయలే కాని - యేమి

లేదని పల్కెనె - నామీఁద నెడపక నామహామహాలునిద - యామృతమును జిల్కెనె - శ్రీగురుమూర్తి ॥ ఈ ॥

వనజనాభుఁడు సాందీపునిచే సంగ్రహించి - యనుమాన మును లేకను - దను పరిపూర్ణుఁడై జనుదేరఁగాంచి రు - క్మిణి యడిగిన వీఁకను ॥ సద్గురుమూర్తి ॥

వనితామణితో నేమనక యూరకుం - డిన పరేనన జోకను - ఉనికి గాంచి మోదమున నీరహస్య - సూచన జేసె నన రాకను - శ్రీగురుమూర్తి ॥ ఈ ॥

కలలోన దోచినకరి యేమి లేనటు - వలెను లేదని జెప్పెనె - కలకాల మొకరీతిగా సమస్తలోక - ములను నిండి యొప్పెనె ॥ సద్గురుమూర్తి ॥

పలుకుల నంటక భావము నొందక - వెలయుచుండు ననెనె - తలఁపునించుకైన తలపోయరాక ని - శ్చలముగ నుండుననెనె - శ్రీగురుమూర్తి ॥ ఈ ॥

మృగతృష్ణికలయందు నిగనిగఁదోచునీ - రుగ జగదా భాసము - దగుల రజ్జువందురగము దోచినతె - రగున మాయావాసము ॥ సద్గురుమూర్తి ॥

గగన ప్రసూనము నగుపడ్డపోల్పున - మిగుల చిద్విలా సము - జిగిమీఱ వంధ్యపుత్రగతి దోచుదృశ్య - దృగదృక్పరీ హాసము - శ్రీగురుమూర్తి ॥ ఈ ॥

సకల దేశములందు సచరాచరములందు - నొకరీతిగా నుండును - సుకరమై యంతట సూది మోప సంది - వ్వక సత్యమై నిండెనె ॥ సద్గురుమూర్తి ॥

అకలంకమై యెడపక సర్వకాలము - వికల మొంద కుండునె - ప్రకటితమై సర్వపరిపూర్ణమై నిర్లేపకమై వెలయు ననెనే - శ్రీగురుమూర్తి ॥ ఈ ॥

నానావిధముల పుంఖానుపుంఖములురు - మీనాధికము లెన్నియు - మానుగఁబుట్టిన లీనమైన దన - లోన జూడ నన్నియు ॥ సద్గురుమూర్తి ॥

ఆ నీరధి యెఱుఁగ లేనటు నీబ్రహ్మాండానీకముఁలు నన్నియు - పూని జనించిన పోయిన నెఱుగక - తానుండుఁబయ లనెనే - శ్రీగురుమూర్తి ॥ ఈ ॥

పుట్టదు యెన్నడు గిట్టదు యెందున - ముట్టదు పరికిం పగ పుట్టుగిట్టుల కున్కిపట్టై మిట్టిపడు - నట్టియెఱుక చలిం చగా ॥ సద్గురు మూర్తి ॥

అట్టిట్టుకదలక చట్టువిధంబున - గుట్టు దెలియ దెంచగా- దిట్టముగా గనుపట్టరాక యుత్త - బట్టబయలు మించగా ॥ శ్రీగురుమూర్తి ॥ ఈ ॥

కాసారతీరసంకాశితభద్రగి - రీశ దివ్యధామము - వాసుదేవతత్త్వాభాసమాన శ్రీని - వాస మాహాత్మ్యారామము ॥ సద్గురుమూర్తి ॥

శ్రీశేషగురుసత్కృపాసమన్వితపీరు - డాసాభిస్తుత నామము - వాసనరహితసుధీసంయమీమనో - భ్యాసనిర్వి రామము - శ్రీగురుమూర్తి ॥ ఈ ॥

౫. రాగము - సురట - జంపెతాళము

ఈమహాగోప్యంబు నెవ రందఁగలరు - శ్రీమించుసద్గురు స్వామిచే నలరు ॥ ఈమహా ॥

ఆమహాదేవదైత్యారివిరించిను - త్రామాదిసురహృదంతర్గతంబు - నీమానవులు సంగ్రహించ నెంతటివారు - భ్రామికహారణమై ప్రబలాభేద్యంబు ॥ ఈమహా ॥

ఇట్టి దట్టి దటంచు నెఱిగింపఁగారాదు - పుట్టిగిట్టెడిదానిపోడి మెఱుఁగకను - చట్టువలెఁ గదలకను సర్వపరిపూర్ణమగు - గుట్టు దేశికుఁజేరి గొలిచి బడయకను ॥ ఈమహా ॥

తనమహిమ కొంచెమైనను జూపకను లెస్స - తనమహిమ చూపుదానిని నెఱుంగకను - అనరాక వినరాక కనరాక వెనుతాక - లను పోకలను జెందకను వెలుంగగను ॥ ఈమహా ॥

రూపనామక్రియాలాపసల్లాపకా - రోపణంబులచే నిరూపింపరాకఁ - ప్రాఁబల్కు లోఁబల్కు పైపల్కుల స్మీరి - సూపనిమత్సారమై పర్వు వీఁకఁ ॥ ఈమహా ॥

ఏవికారము లేక నేవికల్పము లేక - నేవిచిత్రము లేక వీఁక నిఁపొనరు - నేవిలాసము లేక నేవిశేషము లేక - నేవిచారము లేక నేకమై తనరు ॥ ఈమహా ॥

కాసారతీరసంకాశ మగుభద్రాద్రి - వాస స్వయంపరంభాస మిరవుగను - శ్రీశేషగురుసత్కృపాసమన్విత పీరు - దాసునకు సంతతాభ్యాస మయి దగనూ ॥ ఈమహా ॥

౭. రాగము - కల్యాణి - ఆదితాళము.

రండు గనుమని శేషగురుముఖ్యుండు శిష్యుల కన్నది
నిండుకొని బ్రహ్మాండమెల్లను నిలిచి కనుపడుచున్నది ॥రండు॥

సృష్టికిని శీతోష్ణములకును కష్ట మించుక లేనిది
స్పష్టమై వాగ్భావములకు నభీష్టముల గనరానిది ॥ రండు ॥

మొదలు కొన మధ్యంబు లేక నమోఘ మచలం బైనది
కదిసి ముల్సొర సందు లేకను గన నభేద్యం బైనది ॥ రండు ॥

జననమరణము లొంద కనిశంబును పరాపర మైనది
ఉనికి దెలియనినరులు శాస్త్రోక్తులను సారం జెడిపొయ్యేది ॥

తెలివి విశ్వం బున్నదని యాపొళుకు వెలుగక యున్నది
తెలివి గన్గొని తెలివి వీడియు తెలివి సమయుచు నున్నది ॥

గరిమ స్వప్నము మెళుకువను పొడగన్న విధమున గుర్తది
తిరముగను బయలుం గనుంగొని తిరిగియిక రాబోదది ॥ రం ॥

రూపనామక్రియలచేత నిరూపణము గారానిది
ప్రాపు దాపై శేషగురుకృప భక్తవశమై యున్నది ॥ రండు ॥

ఏమిసాధన లేక సద్గురుస్వామిచే గననైనది
నేమమున సద్గతి ఘటించెడు శేషగురుసత్కృప యది ॥ రండు ॥

తెలివొనర్చిన నిగమములు విన తెలివికే యింపైనది
తెలివిమాలిన యచలవిధులకు తెలియ నిక నేమున్నది ॥రండు॥

షోడశాంతరియుక్తమయి యీరేడులోకము లైనది
చూడనేరనిమూఢమతులకు గూఢమై కనరానిది ॥ రండు ॥

కపటవృత్తిజటాయుతం బగుజపములను గనరానిది
నిపుణతను గురుసమ్ముఖంబున నిమిషమున గనుపడునది ॥ రం ॥

గురువనుజ్ఞను గాంచి శిష్యులగూర్చి యుపదేశించెడి
తెరవు తొలఁగి బావిలోబడు నెరపధికుని కరణిది ॥ రండు ॥

కుక్షికొరకై పదరుచును సద్గురువులంటే కాదది
అక్షయస్థితి లక్ష్మగురునికటాక్షమున గన్పడు నిది ॥ రండు ॥

పరశురామనృసింహదాసుఁడు పరవశంబై యున్నది
గురుతు నెడసినభాగవతుల కృష్ణదాసున కైనది ॥ రండు ॥

భూని వరశివరామదీక్షితు లానతిచ్చినపథ మిది
తాను నేనను భ్రాంతి లీనం బైనగోప్యార్థం బిది ॥ రండు ॥

తెలిపి శేషగురుండు ద్వాదశి వెలయ తానై యున్నది
తలఁప షోడశి వీడియును పీర్దానుఁ డచలం బైనది ॥ రండు ॥

అచల భావము - సంపూర్ణము.

ఓమ్

# పరమానంద సుధాలహరి



## పూజావిధానము

౧. రాగము - శుద్ధకాంభోజి - ఆదితాళము.

మంగళస్నానములు దీర్చిరి - సీతారాములకు ॥మంగళ॥

గంగావాణియు సర్వమంగళనిభులైన స - దంగనా మణులు సెలంగ ముదంబెలర్ప ॥ మంగళ ॥

ఘనవధూవరులఁ బీఠములనూ - కూర్చుండఁబెట్టి - వని తలు హారతు లివ్వగాను - అనువొందునట్టి కరకంకణములు మించి మ్రోయ - గను రత్నకలిత మైనకనకంపు గిండీలతో ॥

పరిమళించెడుపన్నీరు సంపెంగనూనె - గొని తల లంటు చున్న తీరు - దినకరతేజులైనజనకజరాములకు నునుపైనసిక్కా పిండి నెనపి నలుఁగుఁబెట్టుచు ॥ మంగళ ॥

అలివేణు లంత గుమిగూడి - పాటలు పాడుచు - నలుఁగుబెట్టిరి భక్తి వేడి - అలనా డజాదినిలింపులు వేడు కొన్నందుకు - బలురక్కసుల ఖండింపనె బుట్టినారంచు ॥మం॥

గంగయమున సరస్వతులు - ముచ్చ్వరు భక్తి - పొంగు జల మ్మొనరిచిరి సతులు - సంగతి బంగారంపుగంగాళముల నింప- శృంగారవతులు సుష్నాంగి దంపతులకు ॥ మంగళ ॥

విమలవస్త్రముల తమ లొత్తి - కురులార్చి సంభ్రి - మమున కృష్ణాగరుధూప మెత్తి - రమణి చీనిచీనాంబరములు గట్టించిరి చొ - క్కముగ కస్తూరితిలకములు నొసట దిద్దుచు ॥

భాసుర భద్రిశైలమునను - కళ్యాణమంట - పాసనా సీనులై వెలయగను - శ్రీశేషగురు సత్కృపాసమన్వితపీరు - దాసపోషణులైన శ్రీసీతా రాములకును ॥మంగళ స్నానములు॥

౭. రాగము - సురట - ఆదితాళము

గురుపూజ సేయరె - గురుభక్తవరులార - పరమాత్ముఁ డని భావించి - భక్తి సేవించి - పరమానందము నర్థించి - నిరుపమభవవార్ధి తరియింపఁజేయు శ్రీ - గురుపాదయుగళము నెరనమ్మి శ్రీరామ ॥ గురుపూజ ॥

హృదయ మనిలము దృ - క్పథ మేకగతిగా త - త్పద మునందు గీలించి - శాంతివహించి - సదమలాత్మరై మించి - విదితబుద్ధిపాత్రిను - కుదురొనర్చి కర్మసం - పదతైల ముంచి చి - న్మదసుజ్యోతి ముట్టించి - జవిపి విషయసముదయమును నే - ర్పొదువ నైవేద్యం బొసంగియు - కదసి కామముఖారి షట్కము - జిదిపి ధూపముగా నొనర్చియు ॥ గురుపూజ ॥

తోర మెలర్ప నా - ధారముఖర సహ - స్రారతాం బుజశ్రేణి - నిలయువై రాణిం - చి రమ్యమహాత్కాంతిని - వారణముఖప్రష్టసారసాతురప్రదేశుల్ - మీర సదాశివుని - పై రంజిల్లుసన్ని రా - కారనిస్సంగావికారని - రారవనిరాధార నిరహం - కారవేదాగమోపనిష - త్సారభూతంబై యలరు శ్రీ ॥ గురుపూజ ॥

కోమరుమించినగంగ - యమునసరస్వతి - కమలగాహన మొనరించి - శ్రమము న్వరించి - విమలజ్ఞాతచేమించి - యమ నస్కభావులై - యమృతాంశుశిఖనబిం - బములపై శృంగాట - కమున నాసీనులై - యమితుఁడై రవికోటితేజస్కమున కేవల సత్యచిదఖం - డమున నాత్మారాముఁడై ని - త్యము స్వయం రంజిలు నిరంజన ॥ గురుపూజ ॥

వరతులసీదళ సరసిజదళములు - సురుచిరోత్పలములను - హింజులవకుళ - విరజాజిబంతులను - మఱి మల్లెమొల్లలవిరుల చేమంతుల - కరవీరపున్నాగ - సురభూజచంపక - పరిమళిత సుమములను మాల్యాం - బరసుగంధాక్షతల నర్చన - నెఱపి మృగనాభికర్పూరా - గరుమలయజంబుల నలందియు ॥ గురు ॥

భాసురేక్షురసాసు - మాసవపకీ౽ద - ధీసుధాన్వితము గను - పంచామృతము భ - క్తి సమర్పించియును వాసుదేవ గోదావ - రీసరి త్తట భద్రాద్రిశిఖరావాస - శ్రీశేషగురో సత్కృ - పాసమన్విత పీరుదాసో - పాసనాకరభవవినుత సీ - తాసమేతుఁడు నాగయాఖ్యుస - దాసురక్షణ జేయు శ్రీహరి ॥ గురుపూజ సేయరె ॥

3. రాగము - మోహన - త్రిపుటతాళము

పూజ యొనర్పరె - పొందుగ సద్గురు - రాజశిఖామణికి ॥ పూజ ॥

భూజనాన్వీదోషరాజి నివారింప - రాజితశ్రీపదాం భోజయుగమునకు ॥ పూజ ॥

స్వాంత మనిలము ల - క్ష్యాంత మేకము జేసి - సంతస మిరవొందగ - వంతు కెక్కినభగవంతుఁడనుచు గంధా - క్షతం తల బంతుల చేయుంతివిరులతోను - సంతత వేదాంతరసాంతము - హాంత శాంతచింతాత్మటనా - త్యంతవిమల కాంతికలాపా - నం తునిచరణాంతయుగంబును ॥ పూజ ॥

సుందరముగ నర - వింపతులసీదళ - బృందవకుళము లను -, కుందమల్లి కామకరందయుతోత్పల - మందారచంపక మాలతీసుమముల - వందితమౌనేంద్రధరాద్యర - విందభవ పురందరహృద్యా - నందు డింద నం దలరారుగ - డెందము నానందము జెందగ ॥ పూజ ॥

సారభాగరఘున - సారమలయజక - స్తూరి లేపను జేసి - పూరితదధిఘృత - క్షీరేక్షురసాన్విత - సారపంచామృత మే - పార సమర్పించి - సూరిజనాధారవికారవి - దారధీరమందార నిరాదవ - సారాసారనిష్పారాపారా - వారుని కనులారగ తీరుగ ॥ పూజ ॥

పొంగుచు ముర్యేటి - సంగమస్థలి నాలు - చెంగల్వ ములతువను - రంగుగ నాసహస్రాంగకమలమధ్య - నింగి తెలంగు వెలుంగు నిరంగుడై - సంగతి మీరంగ నపాంగో - త్తుంగసంగలింగభంగ - రంగదంతరంగేశుగ గురు - పుంగవు పత్సంగు నసంగుని ॥ పూజ ॥

భాసురగోదావ - రీసరిత్తటభద్రా - ద్రీశిఖరమునందు - వాసుఁడైనట్టి సీతాసమేతానందవి - లాసత్రైవ్యక్యమా శ్రీశేషు గురోచిద్వి - లాసావాసననిర్భాసా - త్మాసమానదాసోల్లాస - శ్రీపతీసనాథా హరిపీ - ర్థాసమనోభాసుని హాసుని ॥ పూజ ॥

౪. రాగము - భైరవి - అటతాళము

శ్రీనివాసునకు ప్రజ్ఞాన ప్రభాసునకు - నానాజగన్నుతో
ల్లాసునకును - ఆనందశుభదసంభ్రాంతైకదాసునకు - మౌని
ప్రజ్ఞాంతర్నివాసునకును ॥ జయమంగళం నిత్యశుభమంగళం ॥

తామరొప్ప నాల్గురేకులను చతుర్వ - ర్ణసమితిచే నాధా
రచక్రమునను - అమరు దంతిముఖరూపమునను యధీశుండై -
రమణించునిత్యనిరామయునకు ॥ జయ ॥

ఆఱురేకులచేత నలరుస్వాధిష్ఠాన - సారసంబున షడ
క్షరయుతముగ - నారయ విశ్వసృష్ట్యాకరణపద్మజా - కారుం
డనదగునిరాకారునకును ॥ జయ ॥

పదిరేకు లమర నింపొదువ మణిపూరకా - బ్జదశవర్ణో
పేతసదనమునను - విదితాఖిలావితప్రదుండై వెలుంగు చి - న్మో
దపయోనిధి యైనమురవైరికి ॥ జయ ॥

తరలితద్వాదశదళయుతానాహతాం - బురుహాధిదైవమై
పొందుమీర - సరవి ద్వాదశవర్ణభరిత మగునందునీ - శ్వర
రూపమున వెల్గుపరశివునకు ॥ జయ ॥

పదియాఱుదళము లింపొదువ షోడశవర్ణ - సదనమైన
విశుద్ధచక్రమునను - పొదలుజీవాకృతిౙ పూర్ణపరబ్రహ్మ - సద
మలం బగువిశ్వసాక్షి కెపుడు ॥ జయ ॥

రెండు రేకులు గల్గు పుండరీకమునం ద - ఖండమై
హంస మక్షరయుతముగ - నిండుతేజము నూర్ధ్వకుండలిని
మించి ప్రైతై - మండలాంతపరాత్మమండితునకు ॥ జయ ॥

ఆరూఢిగ సహస్రారపద్మాంతరోం - కారనాదంబు విస్తా రింపగ - శ్రీరమ్యమై ప్రకాశించుగురునకు నిర్వి - కారనిస్సంగ నిరాకారునకు ॥ జయ ॥

కాసారతీరసంకాశ మగుభద్రాద్రి - వాసుడై తగు జానకీశునకును - శ్రీశేషగురుసత్కృపాసమన్వితపేరు - దాస మనోంబుజోల్లాసునకును ॥ జయమంగళం ॥

౫. రాగము - సురట - ఆదితాళము

శ్రీరామచంద్రునకు మంగళం - సీతాసమేతునకు మంగళం ॥ శ్రీరామ ॥

సూరిజనవ్రజమందారభూరుహావిశ్వా - ధారచిదాత్మునకు మంగళం ॥ శ్రీరామ ॥

భర్మచేలము కటిభాగంబున - నిర్మలద్యుతిమహనీయం బున నర్మిలి రంజిల్ల ము - హుర్మహుస్స్వయంజ్యో - తిర్మయ మహాత్మకు మంగళం ॥ శ్రీరామ ॥

పంచభూతముల న్విభేదించియు - పంచశక్తుల నిరాక రించియు - మించి మండలము ల్లతిమించి మిగిలి శో - భించు పరాత్మునకు మంగళం॥ శ్రీరామ ॥

వెలయు త్రివేణిసంగమంబున - పొలుపొంద నతుల విశ్రాంతంబున - జలధినడుమ - నీలజలదమధ్యస్థతటి - దలఘు ప్రకాశునకు మంగళం ॥ శ్రీరామ ॥

తరణిసహస్రకోటితేజంబున - పరిపూర్ణసహస్రారపద్మంబున- సిరిమించుమహా మేరుశిఖరమున న్వెలుంగు - పరమాత్మునకు జయ మంగళం ॥ శ్రీరామ ॥

మూడుమూర్తులు తాను ముఖ్యంబుగ - మూడులోకములం దశక్యంబుగ - నాడింపుచున్న గొనియాడఁగరానివిశ్వ - క్రీడావినోదునకు మంగళం ॥ శ్రీరామ ॥

శిరమున న్గిరీటము నిరవొందగ - నురమున కౌస్తుభమణి-వెలుగొందగ విరివిగ నవరత్నాభరణకాంతులు దిశల - భరితమై యలరు సామికి మంగళం ॥ శ్రీరామ ॥

భాసుర భద్రాద్రివాసాంతమై వాసుదేవుఁడు సన్మహాశాంతమై - శ్రీశేషగురుసత్కృపాసమన్వితపీరు - దాసాభిస్తుతునకు మంగళం ॥ శ్రీరామ ॥

౬. రాగము - సౌరాష్ట్రి - ఆదితాళము

జానకీశ్రీరాములకు జయమంగళం
నిత్యజ్ఞానానందులకు నిత్యమంగళం ॥ జానకీ ॥
మానుగను పాలు నీళ్ళు లూని యేకమైనరీతి
జ్ఞానాజ్ఞానరూపులై లోకంబుల సృజించునట్టి ॥ జానకీ ॥
పంచవర్ణచిత్తరువుచే మించిన యంతగపురమునం
దంచితానందలీల వర్తించు నాదిదంపతులకు ॥ జానకీ ॥
ఏడుచుట్ల కోటలోను - ఎలమి పువ్వులతోటలోను
క్రీడావినోదంబులను - జోడుగూడి యాడునట్టి ॥ జానకీ ॥
గంగయమునసరస్వతి - సంగమున రమ్యమైన
బంగారుమేడలోపలను - శృంగారంబై యలరునట్టి ॥ జానకీ ॥
ఆణిముత్తెముల చేర్ల - యపరంజిహోలికయందు
జాణలై శయనించి సొంపె - సగనుయ్యాలలూగునట్టి ॥ జానకీ ॥

ముమ్మూర్తులకోనలోపలను - తమ్మిరేకు లాకుతుదను
నెమ్మియలరునా సహస్రా - రమ్మునఁజెన్నొందునట్టి ॥ జానకి ॥
చేతనాచేతనమై స - ర్వాతీత మోక్షశ్రీపర
నేత సంవిన్మయస్వయం - జ్యోతిర్మయానందుడైన ॥ జానకి ॥
ఎల్లలోకములను శో - భిల్లునట్టి శ్రీసత్తైన
పల్లెవాసులై యెప్పుడు - తల్లిదండ్రులై రక్షించు ॥ జానకి ॥

## వనమా సుబ్బారాయదాసు చెప్పిన మంగళహారతులు

### ౭. రాగము - ధన్యాసి - చాపుతాళము

మంగళం బనుచు పాడరె - గురుపుంగవునకు ॥మంగళం॥
అంగనామణులెల్ల లింగభంగునకును నింగితముగ ॥మం॥

ఇందు నందు నెందు జూచిన - పొందుగను భక్త - బృందహృదయములను గాంచిన - గ్రందుకొని సహస్రారమందు జూడగాను బ్రహ్మ - నందముగను క్రిందుమీఁదు సందులేక - యున్నవానికి ॥ మం ॥

ఆఱు విడిచి యాఱు గడచియు - నామీఁద మనో - మారుత మేకంబుజేసియు - ధీరులగుచు బాగుగ ముయ్యేరు గడచి రెంటినడిమి - దారి దెలిసి మేరుశిఖరి జేరి యచట గురువరునకు ॥ మం ॥

ఆఱుచక్రములను మీఁదుగ నిరువదొక వేయునా - ర్నాలుమార్గ చేరి కొలువఁగ - సారెసారెకును తదీయపారసముల మీటి మీరు - కోరికలను బారదోలి - వేరులేనిగురుని జేరి ॥ మం ॥

నాదబిందుకళల మీరుచు - మోదముతో హంస - పాడు దెలిసి యోలలాడుచు - వాదభేదములను విడిచి - రాదు పోదు లేదటనక - యాదియంత్యశూన్యనిర్ని నాద మైన గురున కిపుడు ॥ మం ॥

అండపిండాజాండ మెల్లను - వ్యాపించియు తా - ఖండాఖండమై గాకను - నిండుమున్నీటిమీద - పుండరీకంబునం ద- ఖండమై వెల్గుచు తా - నిండిన చిన్మండితునకు ॥ మం ॥

భాసురముగ భద్రశిఖరిని - వెలసినశ్రీని - వాసుదయను చాలా చేకొని - దోసరోసములను నీవు రోసివేయు మనుచు సుబ్బయ - దాసునకును దెల్పి హృన్నివాసుండౌ పీఠదేశికునకు॥

౮. రాగము - సురట - అటతాళము.

నామనంబున పరంధామసద్గురు నీకు మంగళం ॥
శుభమంగళం ॥ శుభమంగళం - జయమంగళం ॥

సత్యాసత్యరహిత నిత్యనిరామయ ॥ మంగ ॥
అండ పిండ బ్రహ్మాండాతీత నీకు ॥ మంగ ॥

నాదబిందుకళాభేదరహిత నీకు ॥ మంగ ॥
పంచతన్మాత్రౌఘు పంచభూతాతీత ॥ మంగ ॥

అంగవిలక్షణ లింగభంగ నీకు ॥ మంగ ॥
గంగయమున వాణి సంగనిలయ నీకు ॥ మంగ ॥

మర్మము వీడ షడూర్మిరహిత నీకు ॥ మంగ ॥
నిర్వాణాకర మైనసర్వపూర్ణ నీకు ॥ మంగ ॥

భాసురభద్రాద్రి వాసుదేవ నీకు ॥ మంగ ॥
సతతసుబ్బాఖ్య పాలిత పీఠేశిక నీకు ॥ మంగ ॥

౯. రాగము - మధ్యమావతి - జంపెతాళము

లాలి రామనృపేంద్ర రక్షితకరీంద్ర
లాలి సుయశస్సాంద్ర లాలీ నృపేంద్ర ॥ లాలి ॥

పాలమున్నీటిలో బాగుమీరగను - మేలైనకుండలీ మేనిపై దగను - నీలనీరదకాంతి నెమ్మి వెల్గగను - నిర్మలాకృతి యోగనిద్ర నొందగను ॥ లాలి ॥

సప్తవార్ధులనడుమ చెలఁగి వేడుకను - సప్తసుద్వీపాగ్రసరణి చూడగను - తప్త హేమమయ సౌధాంతరంబునను - తప్తవసుపాత్రవిద్రుమహార తివ్వాక ॥ లాలి ॥

అనువుగను గంగాయమునసరస్వతులు - గొని వేడ్కచల్లెదరు కుసుమసంతతులు - దనరు నిరువంకల సుధాంశుహార్వతులు - మొనసి వీచెదరు ముదమొప్ప చామరలు ॥ లాలి ॥

పంచవర్ణముల గర్భాగారములను - పంచవేశ్యాంగనల్ బహువినోదమును - పంచలోహవిచిత్ర పళ్ళెరంబునను - వాంఛ యింపెసగ నీవాళు లివ్వగను ॥ లాలి ॥

కరమొప్ప వైకుంఠ పురసౌధమందు-పరిగాణిముత్యాలసరుల నేర్లందు - గరిమ చాపసిండిఘనడోలికందు - సిరితో వసింప నూచెద రథిప లందు ॥ లాలి ॥

హరిహరబ్రహ్మాదు లాసుర ల్మునులు - గరుడగంధర్వ కిన్నెరకింపురుషులు - నిరతమును వినుతింతు రెవనికీర్తనలు ఒరు లెఱుగరా రట్టివాని వర్తనలు ॥ లాలి ॥

ఘనసారచందనాగరుసమన్వితము-అనువొందమృగనాభి యుతముకర్దమము- కనకపళ్ళెరమందు నునిచి- సమ్మోదము- గొని యొసంగిరి సురాంగనామణివ్రజము ॥ లాలి ॥

గోదావరీసరిత్కూలభాగమున - కోమరారుభద్రాద్రి కుధరసౌధమున-శ్రీదేందుకాంతమణిశయ్యామధ్యమున- వైదేహి పాదంబు లొత్త మోదమున ॥ లాలి ॥

భాసురాద్వయచిద్విలాస మేర్పడను - శ్రీశేషగురు కృపాంచల మెలర్పగను - వాసుదేవబ్రహ్మ వర్ణింప తగను పాసింపగా పీరుదాసుఁ డింపుగను ॥ లాలి ॥

వనమా సుబ్బారాయదాసు చెప్పిన లాలిపాట

౧౦. రాగము - నీలాంబరి _ ఆటతాళము

లాలి యనుచు పాడరే - లలనలు మీరు ॥ లాలి ॥

లాలిలాలి యనుచు మీరు చాలగా నిశ్చలత చిన్మయ-లోలురై చలనమును వదలియు కీలుదెలిపినగురునిఁ జేరి ॥లాలి॥

పంచభూతముల మించి- సంచితకర్మ - మంచితంబుగను ద్రుంచి - మించి కోశాపంచకము గమకించి శక్తిపంచకము భే-దించి ముక్తిపంచకము సా- ధించి వంచన లేక గురునకు ॥లాలి॥

రెంటి రెంటిని దెలిసియు - పైగాను నా - ఱింటిని గిటణఁచియు - మంటిమంటిమధ్యను తా నంటియంటక యున్న గురునణి - గంటిచూపులఁ జూచియును మూడింటితుద ముక్కంటినిం గని ॥ లాలి ॥

నాదబిందుకళలను - పాదుగనుండి - భేదమోదము లేకను - వాదభేదంబుల నడంచి యనాదియై యాద్యంతము లనే- భేదభావము లేక నపరిచ్ఛేదమై యున్న పరమాత్మకు॥లాలి॥

భాసురభద్రాద్రిని - వెలసినశ్రీని - వాసునిదయ చేకొని - దోసముల నెడబాయగా పీఠేశికదయాస్ఫూర్తిసుబ్బయ - దాస హృద్వనజాంతరైక నివాసుఁ డగుశ్రీరామగురునకు ॥లాలి॥

౧౧. రాగము - ఆనందభైరవి - అటతాళము

జోజోజో గోపాలకృష్ణ - జోజోజో కోమలరోచిష్ణ - జోజోజో దయాగరిష్ణ - జోజోజో ॥ కృష్ణా ॥

వనరాశినడుమ కృష్ణాశ్రయంబునను - ఘనత సూక్ష్మ ద్వారవతిపురంబునను - కనకంపు మేడలోపల గోపికలును - గరిమ షోడశసహస్రములు గొల్వగను ॥ జో ॥

నవరత్న సంఘటితమై వెలుంగగను - నాలుగుస్తంభాల మంటపంబునను - తవచతుర్వాక్యార్థతతి గొలుసులుగను - తత్వమస్యర్థ మొకతొట్టె జేసియును ॥ జో ॥

కన దున్మనిమనోన్మని రూపవతులు - నావర రుక్మిణి సత్యభామకామినులు - తనివిదీర వసించి రాత్మకేశవులు - మనసుదీరగ నూచి రందు నుయ్యాలలు ॥ జో ॥

పంచకన్యలు చామరములు వీవగను - పంచకర్త లధిక్ర మించి వేడుకను - పంచవాద్యములు శ్రీమించి మ్రోయగను - పంచామృతము విశ్రమించి కురియగను ॥ జో ॥

తనకిశోరమటంచు తగని మోహమున - చనువుమీర యశోద యత్యాదరమున - తనయు నెత్తుక ముద్దులాడ హర్షమున - ఘనత నుయ్యాల లూచె గగనాంతరమున ॥ జో ॥

సనకాదిఋషు లుల్లాసమున నుతింప - అనసూయారుంధతులును నివాళింప - అనిమిషౌఘము ప్రసూనాళి గురియింప - మొనసి దిక్పతులు దిక్కులను పాలింప ॥ జో ॥

భాసిల్లు శ్రీసత్యభామ పురమున - శ్రీసత్యభామ రాధా సహితముగను - వాసుదేవ ప్రసన్నవరద మాయెడ ను - ల్లాస మొప్పగ పీరుదాసు నేలగను ॥ జోజోజో ॥

౧౨. మేలుకొల్పు - భూపాలరాగము - ఆటతాళము

మేలుకో చిత్తమ మూలములే నింద్ర - జాల మైహిక మని మేలుకో - జేలవై విషయవిలోలత జిక్కక - మూలము దెలుసుక మేలుకో _ మనస ॥ మేలుకో ॥

జ్ఞానార్కుఁ డస్తాద్రి లీనమై గ్రుంక న - జ్ఞానధ్వాంతము గ్రమ్మె మేలుకో - పూని శమాదికంజానీకములు తేజో - హీనమై ముకుళించె మేలుకో ॥ మనస మేలుకో ॥

ధృతి లేక విషయసంతతు లనువిహంగముల్ గతి మాని శయనింప మేలుకో - కృతకార్యవిషయార్థతతు లనుమనుజసం - గతి మాని నిద్రింప మేలుకో ॥ మనస మేలుకో ॥

క్రూరగుణము లనుఘోరమృగంబులు - గేరుచు నటియింప మేలుకో - వారక కామాదిచోరకానికర సం - చారక మున ధృతి మేలుకో ॥ మనస మేలుకో ॥

పరమగురూ క్తసుస్థిరలక్ష్యమున మది - బరపి నిర్మల మతి మేలుకో - అరయ శమాదివిస్ఫురదిందీవరములు - బరు వడి వికసింప మేలుకో ॥ మనస మేలుకో ॥

లలిమీర హృన్నభోవళిని చిత్కళ లను - వెలుగగ దారలు మేలుకో - విలసితపూర్ణమంజుల జారిపూర్ణమం _ డలము ప్రకాశింప మేలుకో ॥ మనస మేలుకో ॥

విమలసదిందుబింబము విరాజిల్లగ - తమసెల్ల విరిసెను మేలుకో - గమకించి మున్నిటికడ తూర్పు న్వేకువ - సుమతి చుక్క బొడిచె మేలుకో ॥ మనస మేలుకో ॥

శిఖరముపై నూర్ధ్వముఖమై వేకువ నభి-ముఖమై కోడి గూసె మేలుకో _ అఖిలదిగజ్ఞాధ్వాం - తఖరావృతము పరా - జ్ముఖమై బోవ సాగె మేలుకో ॥ మనస మేలుకో ॥

శుకపికాదిఖగనికరధ్వానము రేచి - ప్రకటించె ప్రణ వమై మేలుకో - ప్రకృతిజాతము లగువికృతి చెంగల్వలు - ముకుళించె సన్మతి మేలుకో ॥ మనస మేలుకో ॥

భ్రూమధ్యోదయపూర్వభూమీధరమున ప్ర - జ్ఞామిహి రుఁడు దోచె మేలుకో _ శ్రీమించుకాంతిహృద్వ్యోమారూ ఢుఁడై _ భూమూర్కుఁ డలరారు మేలుకో ॥ మనస మేలుకో ॥

వెలయు నాధారాదిజలజము ల్వికసించె _ జలజభవాం డమున మేలుకో - మలినమెల్ల బాసి యలపట్టపగటి బ - యలు నీవై ధీరత మేలుకో ॥ మనస మేలుకో ॥

భాసురభద్రాద్రివాసుఁ డైన శ్రీని - వాసునిపదసేవ మేలుకో - శ్రీశేషగురుసత్కృపాసమన్విత పీరు - దాసుఁడు మేలొంద మేలుకో ॥ మనస మేలుకో ॥

ఓమ్

# పరమానంద సుధాలహరి



## శ్రీ భద్రాద్రి మజిలీలు

### కందార్థములు

శ్రీభద్రాచలరామ వి - భో భవ్యకృపాకటాక్ష - పూర్ణప్రాప్తి - ప్రాభవమున నిజదర్శన - లాభము నొందుటకు ము క్తి - లాలసబుద్ధిన్ - రామమంత్ర - ఫలసమృద్ధిన్ - శోభిత విశ్వ చి - దాభాసమై పరి - శోభిల్లునట్టి భ - రాభవపతిభ క్తి - లాలసబుద్ధిన్ - రామమంత్ర - ఫలసమృద్ధిన్॥ ౧

పరగుస్వభానాహ్వాయ వ - త్సరమున ఘనచైత్రశుద్ధ - సత్ప్రతిపత్తిన్ - పరమదయాంభోనిధి యగు - హరినామస్మరణ చేతా - నంద మింపొందన్ - వెడలి బ్రహ్మానందము జెందన్ - నిరుపమభవసా - గరము తరింపగ - పరమపావనుఁడగు - భద్రాద్రీశుని - గొల్వా - నంద మింపొందన్ - వెడలి బ్రహ్మానందము జెందన్॥ ౨

వరసత్యభామపురమం - దిరుఁ డగు గోపాలమూ ర్తి - దివ్యకృపావి - స్ఫూరణన్ సకుటుంబముగా - వరభద్రగిరీంద్ర యాత్ర - వరలు సుభ క్తిన్ - నిత్యము శోభ - స్కారసదోద్య ము క్తిన్ - బొరయుటకై యట - దరలి నందిగామ - పురము దాటి గుడి - పూడిమాధవుసేవ - వఱలుసుభ క్తిన్ - నిత్యము శోభ - స్కారసదోద్యము క్తిన్॥ 3

అట తర్లి కూరపాడను - పుట భేదనవాసుఁ డైన - పురు
షోత్తము వి - స్ఫుటకాంతు సన్నుతింపుచు - పటుతరపరతత్వ
సరణి _ భావ మూహించి - విజ్ఞానప్రభావము నెంచి - చటు
లత - గడచి యం - తట తాళ్ళూర వసించి - వటపత్రశాయను
హృ - త్పుటమున సద్భక్తి - భావ మూహించి - విజ్ఞాన
ప్రభావము నెంచి॥ ४

ఆవూర భోజనంబులు - గావలయు నటంచు నిల్వ - గా
సజ్జనుఁడౌ - ఈవూరివీరనాఖ్యుఁడు గావలసినవిందుఁ జేసి -
గారవించిననూ - బ్రహ్మానంద - పూరితముననూ - గోవింద
పాదరా - జీవసేవకులమై యావూరు గడచి ప - రాత్మజ్ఞాన
గోష్ఠి - గారవించిననూ - బ్రహ్మానందపూరితముననూ॥ ౫

పరసయును, బలుసుపాడును - వరలింగాపురము దాటి -
వచ్చుచు సీతే - శ్వరుపాదయుగము హృదయాం - తరమున
గీల్కొల్పి భజన - తత్పరత్వమునఁ - మెలగుచు సుధీ - హృత్ప
విత్రమున - నిరువంద నంతలో - ధరణికోటకు జేరి - వరలు
వేంకటలక్ష్మీ వాసమున పరాత్మ - తత్పరత్వమున - మెల
గుచు సుధీ - హృత్పవిత్రమున॥ ౬

ఆరాత్రి నిలచి పరమా - త్మారాముని తలపునుంచి -
తన్నగరాధ్యా - గారుఁడగురామలింగపు - రారి ధ్యానించి
సుప్తిరతి శయనించి - యంత ప్రభాత - స్థితిని మేల్కాంచి -
వారనిభక్త్యమరా - వతి క్రౌంచాద్రీశుని - నారాధిఁ గొని
యాడి - యాత్మయోగసుప్తి - రతి శయనించి - యంత
ప్రభాత - స్థితిని మేల్కాంచి॥ ౭

విమలం బగుకృష్ణానది - రమణీయంబుగను గాంచి - రాజితబుద్ధి - క్రమసరణి నుత్తరించియూ - సుమతులు సద్భక్త వరులు - సుగుణులు గూడి - చవిటికల్లుగ్రామము వీడి - కమలాక్షునిపాద - కమలము లనవర - త మెద నిల్పి యుపాస - న మొనరింపుచు సుధీ - స్తోమము - గూడి - చవిటికల్లుగ్రామము వీడి॥ ౯

బిందునినాదకళాగ్రము - నందు సహస్రాంతసత్వ - రాత్మారాముఁ - డెందమున నేమరక నభి - నందింపుచు ప్రకృతిభావ - మంతయు విడచి - కంచికచెర్ల - నంతలో - గడచి - పొందుగ జుజ్జూరు - పురము ప్రవేశించి - యం - దోగిరము వేడ్క - నారగించి కుటిల - మంతయు విడచి - కంచికచెర్ల - నంతలో - గడచి॥ ౯

అరయ సదాధారాబ్జము - ఖరషట్కంజాంతమై ప్ర - కాశించుచతు - స్సరణీకనిలయుసంవి - త్పరమాత్మారామ మొంద - పరవశమునసూ - అల్లూరు వే - గిరమే దాటుచును - పరుషతోడ పెద్ద - వరము గడచి యారా - తిరి వెల్లిపాలెమున - పురిని నిద్రించి చి - త్పరవశమునసూ - అల్లూరు వేగిరమే దాటుచును॥ ౧౦

మరునాడు మేలుకని శ్రీ - హరినిఁ ధ్యానించి లేచి - హర్షమెలర్పఁ - పరతెంచి గోపవరముఁ - పరికింపుచు రామచంద్రు - భజన - జేయుచుసూ - మాధవు గరుడ - ధ్వజునిఁ బాడుచును - గరిమతోడుత చొప్ప - కట్టలపాలెము - బరగురాజుల దేవి - పాడు దాటి రామ - భజన - జేయుచుసూ - మాధవు - గరుడ - ధ్వజుని - బాడుచుసూ॥ ౧౧

చను దెంచి గోపవీ డం - దున భోజనముల నొనర్చి - తోషణమలరగ - జను లందరు హరి నెద దల - కొని సీతా పతి ముకుంద - గోవిందా యనుచూ - భద్రాద్రిరా - ఘువునిఁ జేర్కొనుచు - దనరుకొ మెరగ్రామ - మును దాటి యవ్వల - పనిఁబూని పోయి గం - పలగూడెమును జేరి - గోవిందా యనుచూ - భద్రాద్రిరా - ఘువునిఁ జేర్కొనుచూ॥ ౧౨

తరువాత కైరవారి, య - పరవారిధిఁ గ్రుంకినంత - పక్షులు వృక్షాం - తరముల సమాశ్రయించెను - పరితమసము దిశల గవసె - పటుతరమునమా - మింటను తారా - చటు లుప్ప తిలను - హరి నెద నిడి యొకరా - తిరి యెడ నచ్చట - వఱలి యోగనిద్రా - పరతఁ బరుంటిమి - పటుతరముగనూ - మిం టను తారా - చట లుప్పతిలను॥ ౧౩

అరుణోదయమున మేల్కాని - నరహరి! వైకుంఠ! శౌరి! నారాయణ శ్రీ - హరి దామోదర యనుచును - పరిపరివిధ ముల మురారి - భజనఁ జేయుచునూ - కదలి యొరుకం - పాడు దాటుచును - గురుతుమిగుల ముష్టి - గుంట గడచి రమా - వరుని దర్శింపగ - తిరువూరు జని రామ - భజన - జేయుచునూ- కదలి యొరుకంపాడు దాటుచునూ॥ ౧౪

తిరువూర బంధుగృహముల - మఱివిందుల నారగించి - మగుడి కదలి యా - సరణి నరుదేర విపినాం _ తరమున గోవిందనామ - ధ్వని పిక్కటిలనూ - కుప్పెనగుంట్లం _ దున మోదమునను - సరసిజాక్షునినామ - స్మరణదప్పక నారా - తిరి శయనించి క్ర - మ్మర శ్రీహరినామ - ధ్వని పిక్కటిలను- కుప్పెనగుంట్లం - దున మోదమునను॥ ౧౫

వనమాలిని సేవింపుచు - పెనుమల్లెను వేగ దాటి భీకర
గహానం - బున త్రోవ లింగగూడె - మ్మను బూరగగూడె
మపుడె - ముందుగ దాటి - సర్వజన బృందముతోటి - చనువు
మీఁర నర - సాపురపుతటాక - మున గ్రుంకి - భోజన - మ్మ
లొనర్చి - యట లేచి - ముందుగ దాటి - సర్వజన - బృందము
తోటి॥ ౧౬

చను దేరు నెడను మధుసూ - దన! గోవిందాయటంచు -
దలచుచు విపినం - బున చిత్రతరువు లెన్నుచు - పనుపడి యట
చాపరాళ్ళ - పల్లెఁ - జేరుకొని - నిలచి రాత్రి - చల్లగాలికిని -
వనజనాభుని డెంద - మున నిడి శయనించి - యును నిద్ర జెంది
మే - ల్కనియుఁ జాపరాళ్ల - పల్లె - జేరుకొని - నిలచి - రాత్రి-
చల్లగాలికిని॥ ౧౭

దనుజాంతక విష్ణు జనా - ర్దన గోవిందా యటంచు -
దలపోయుచు కీ - ర్తనములు జేయుచు శీఘ్రము - గను ముల్క
లపల్లెఁ జేరి - కమనీయముగనూ - ఓగిరము ల - క్కడ భుజిం
చియునూ - జను లంత గూడి కా - నన మార్గమును బట్టి -
చనుచో భూరుహాముల - ఘన మెన్నుచును ప్రేమ - కమనీయ
ముఁగనూ - ఓగిరము ల - క్కడ భుజించియునూ॥ ౧౮

వనజాక్ష! విష్ణు మధుసూ - దన శ్రీపతి యంచు నామ -
తతిఁదలచుచు కీ - ర్తనముఁలనుడువుచు మోదం - బున కిన్నెర
సానిఁజేరి - ప్రొద్దుగ్రుంకినసూ - నిశీథవే - ళను జనౌఘమును -
కనకాంబరధరుని - మనము లోపల నిల్పు - కొని నిద్రఁ
జెంది మే - ల్కనియు వేకువ లేచి - ప్రొద్దుగ్రుంకినసూ -
నిశీథవే - ళను జనౌఘమును ॥ ౧౯

అంతట శ్రీహరిభక్తి - స్వాంతంబున దృఢమొనర్చి - సకలజనంబుల్ - దంతెలభోరునుఁగడచియు - సంతసమున భద్ర గిరియు - సామీప్య మనుచూ - శిఖరచక్ర - ధామము - గనుచూ - కొంత నడచి బూర - గుమ్మలపాడు ని - శ్చింత గడచి య - త్యంతమోద మెలర్ప - సామీప్యమనుచూ - శిఖరచక్ర - ధామము - గనుచూ ॥ ౨౦

సదమలమై పావనమై - పొదలు మహాగౌతమీప్ర - పూరితమగు త - న్నదిఁ గడువేడుకఁగనుకొని - విదితముగను స్నానపాన - విధు లాచరించి - బ్రహ్మానంద - సుధను వరించి - పదపడి శ్రీరామ - పదపద్మయుగళము - ముదమున సేవింప - హృదయము నిర్మల - విధు లాచరించి - బ్రహ్మానంద -సుధను వరించి ॥ ౨౧

ముకుళితకరసారసులై - యకుటిలభక్తిప్రవర్ధ - నైక మనమునన్ - ప్రకటమగు భద్రశైలము - సుకరంబని చూచి మ్రొక్కి - శోభస్కరముగా - సమస్తదు - ష్కృతమోచన ముగా - అకలంకభావులై - యారోహణముఁజేసి - సకలజనం బులు - స్వామిని దర్శింప - శోభస్కరముగ - సమస్తదు - ష్కృతమోచనముగా ॥ ౨౨

దేవాలయము ప్రదక్షిణ - గావించి సమస్తనామ - గణ దేవతలన్ - సేవించి రామలక్ష్మణ - శ్రీవైదేహులను వేగ - చిరభక్తితోను - కనులార ద - ర్శించి మ్రొక్కియును - కేవ లముగ వాసు - దేవుని దేవాది - దేవుని సేవించి - భావము రంజిల్ల - చిరభక్తితోను - కనులార దర్శించి మ్రొక్కియును ॥

కలియుగవైకుంఠం బన - వెలయగ సర్వోత్సవంపు - విభవమెలర్పగా - పొలుపొందుసర్వరాష్ట్రం - బుల చాతుర్వర్ణ్యజనులు - భూరిహర్షమునగా - జూడచూడ - చారురమ్యమున - కలసి సీతారామ - కళ్యాణోత్సవము - తలపోయ నేరికి - తరము - గాదనిచూడ - భూరిహర్షమున - చూడం జూడ - చారురమ్యమున ॥ ౨౮

ఈనాటికి రామునికళ్యాణము దర్శింపఁగలిగె - లాలితమగఁ బ్ర - జ్ఞానసుసిద్ధిం జెందితి - మానితశ్రీశేషయార్య - మండనుకరుణగా - పీరుదాసా - ఖ్యుండ విస్ఫురణగా - మానుగ భద్రాద్రి - మజిలీలు - జేసితి - భానుతారశశిగ - ప్రకటింప సద్గురు - మండనుకరుణగా - పీరుదాసాఖ్యుండ విస్ఫురణగా ॥



సీ. ఉత్తమపురుషుఁడౌ - నుపనిషద్బ్రహ్మ దే
శికనాథుకారుణ్య - సిద్ధుఁడైన
పరిపూర్ణనిర్గుణ బ్రహ్మ తన్మాత్రుండు
రంగరాజాచార్య - రమణశిష్యు
డసదృశాద్వయనిశ్చ - లానందదివ్యప్ర
భాలక్ష్మణాచార్య - భక్తుడైన
నిత్యసత్యాఖండ - నిర్మల పరమాత్మ
శ్రీశేషయాచార్య - శిష్యుడైన
ఆ. తత్పదార్చన నేర్పి - తార్థినై యుండి నే
నస్మదీయ రామ - గురునిమీద

సంకేతం బొనర్చి - నాఁడ రక్షింపగా
నయ్యనుజ్ఞ మౌళి - యందు నుంచి.

మ. పరిపూర్ణాచలనిర్మినాదనిరఘు - బ్రహ్మప్రమోదామృతో
త్థరసంప్రాప్తమనీషినై పరమస - త్త్వావ్యంబు నుద్యత్కృతిన్
సరసోక్తిస్రగ్వజసూనమాల్యముగ సు-త్సాహంబునం గొమ్మెస
త్కరుణ న్బ్రోవుము వాసుదేవ గురుసా - క్షాద్బ్రహ్మనిష్ఠారతిన్.

చ. వసుమతి నెవ్వరైనఁ జదు - వన్మతిన్వ్రాసిన విన్న వారు దు
ర్వ్యసనములందుఁ జిక్కక య - వార్యవివేకులునై ధరిత్రి సం
తసమున సర్వసిద్ధులుచి - తంబుగఁ గందురు శుద్ధమాయలన్
మసగొనియాడునీయెలుక-మాలిన దాము చలింపరెన్నడున్

క. ఈపరిపూర్ణార్థము ని
ష్కాపట్యము నిశ్చయము వి - కల్పరహితమై
ప్రాపంచకమున నిది సం
దీపించెడి సారవీందు - దిజ్ఞాగ మిఁకన్.

క. నిరుపమ నిర్మల శశ్వ
త్పరిపూర్ణ పరాత్మ నిత్య - పావనమూర్తీ
నిరవయవ నిరతిశయమో
దరసాంబుధి రామభద్ర - ధరభృద్ధామా!

మాలిని. పరమపదవిహారీ - భక్తహృత్తాపహారీ
నిరుపమ పరమాత్మా - నిత్యసంవిన్మహాత్మా
నిరఘ విమలభావా - నిర్విశేషప్రభావా
భరితభువనసీమా - భద్రశైలేశ ధామా!

సీ. ఇది సదాచార్యు డౌ - నిందిరానాథవ
రప్రసాదాత్త వి - రాజమాన
కవితాప్రకల్పన - గౌరవ మొప్ప కా
శీసగోత్రజుఁడనై - చెల్వుమీర
నరుసోజిసూనుండ - నరసమాంబోదర
జనితుఁడ సజ్జన - సమ్మతుండ
పులహరివంశవి - స్ఫురితవాశాశికి
శశి యన సద్గురు - చరణవారి

గీ. జాతమకరందరసపాన - షట్పదాయ
మానుఁ డగుపీరుదాసుఁడ - మద్విరచిత
కావ్యమునఁ దప్పు లుండినఁ - గరుణచేసి
దిద్దవలె నార్యు లంద ఱ - తిప్రియమున.

శ్రీభద్రాద్రిమజిలీలు - సంపూర్ణము



# దశావతారదండకము

## మత్స్యావతారము

శ్రీరామచంద్రా! లసత్కీర్తిసాంద్రా! మహీభృత్కులేంద్రా!
కృపాంభోధిచంద్రా! త్రిలోకాభిరామా! శివాస్తుత్యనామా!
సదాపూరితార్థార్థికామా! పరంధామ! నీలాంబుదశ్యామ!
ఘోరాజిభీమా! సమస్తాంతరారామ! నీపాదకంజద్వయిన్ మన్మ
నోవీథి సేవించి మూర్తిత్రయిం దత్కళత్రంబులన్ గొల్చి నిర్వి
ఘ్నమై పర్వ విఘ్నేశుఁ గీర్తించి వాల్మీకివ్యాసాదిమౌనీంద్రు
లం, గాళిదాసాదులన్ వేడి శ్రీనాథునిం బోతనామాత్యునిం
దిక్కనార్యున్ మదిన్ నిల్పి నే డియ్యెడన్ శ్రీరమానాథుచా
రిత్రముల్ మన్మనోవార్తనూశుద్ధిగల్గన్ దశాకారచారిత్రముల్
దండకంబై ప్రకాశించునట్లు రచింపంగ నూహించి
తిన్ భక్తమందార! సీతామనశ్చోర! నీదివ్యకారుణ్యసాపాంగ
దృష్టిన్ విలోకించి రక్షింపవే రామ! నీదాసదాసుండ దేవా!
భవత్కీర్తనం జేను గావింతు; నీ వాదికాలంబునన్ విశ్వకల్పాం
తవేళన్ నృపాలుండు సత్యవ్రతుం డొక్కవేణీప్రవాహంబునన్
స్నానకృత్యంబులం దీర్చి పద్మాక్షు! నిన్ గూర్చి యర్ఘ్యోదకం
బెత్తగా రాజు స్వీయాంజలిన్ సూక్ష్మమీనంబు రా నుల్కి
దానిన్ జలంబందు వీడన్ జలాంతస్థమై మీనపోతంబు రాజేం





శ్రీ కూరపాటి లక్ష్మీకోటి దంపతులు

ద్రుతో నిట్లనెన్ భూధవా! గొప్పమీనంబు లొక్కుమ్మడిన్
స్వల్పమీనంబులన్ మ్రింగగా భీతి నీదోయిటం జేయునన్నీటిలోఁ
గ్రమ్మఱం ద్రోయఁగాఁ బాడియే? జాలరుల్ పెన్వల ల్గ్రిమ్మఁ
గా నెందుఁ బోఁజాలకన్ జిక్కియున్ గ్రుక్కనక్రాల మే నేమి
సేయంగలన్ బార్థివోత్తంస! నన్ భక్షణార్థంబుగా దుర్జనుల్
కొందఱుం బట్టుకంబోదు రీపట్టునం బ్రోవుమీ నన్ దయాం
భోనిధీ! యార్తులం బ్రోచుకంటెన్ విశేషంబు వేఱున్నదే!
యన్నఁ గారుణ్యసంయుక్తుఁడై యన్నరేంద్రుండు దా మెల్లనన్
మత్స్యపోతంబునుంబట్టి పాత్రోదకంబందునం బెట్టి వే వీటికిం
జేరి గేహంబునం దుంచగా నేకరాత్రంబులో మీన మాపాత్ర
మంతై విచిత్రంబుగాఁ బల్కె నో భూపతీ! నేఁ జరింపంగ
నిం దిమ్ము లేదయ్యె నన్నింతకంటెన్ మఱిగొప్పపాత్రంబునం
దుంచు మన్నన్ విభుం డట్లు చేసెన్ ముహూర్తంబులో
మూఁడుహస్తంబులంతై మహాశ్చర్యముం బెంపఁగా నాథరా
ధీశుఁ డా పెద్దచేపన్ దటాకంబులో నుంచె నం దగ్గలంబై
చరింపం దటాకంబునుం జాలకున్నంత నప్పార్థివేంద్రుండు
వేఱొక్కవిస్తారవారిప్రదేశంబునం దుంచఁగా మీన మందున్
మహోదంచితం బైనసంచారమున్ సేయఁగా లేక యోమాన
వేంద్రోత్తమా! యిజ్జలాధారమం దిమ్ము లేదన్న నప్పుణ్యుఁడున్
సత్యవాక్యంబుఁ బాటించువాఁ డౌటచే నాఝషంబున్ వెసన్
బట్టి వారాశిలో వీడఁగా నందు నక్రాలయం బయ్యె నాన
క్రముల్ గ్రమ్మినం గిన్కచే నమ్మొసళ్ళం గసింబెంచి ఘట్టించి
నన్ నిల్వ కేగన్ విలోకించి రాజేంద్రుఁ డమ్మేటిమీనంబుతో
నిట్లనెన్ నాకు జూడన్ మహావిస్మయం బయ్యె నీ వేకరాత్రం

బులో యోజనంబుల్ శతాధిక్యమై యొప్పెదుగా జూడ మెం
దుగా వినంబోము నీలాగు మత్స్యంబులం బూర్వముగా
నేడు నీవృద్ధి యాశ్చర్య మెవ్వండ విశ్లేల యీరూపముం
దాల్చితో? యెవ్వ రేయాపదగా దీనులై బ్రోవుమీ యంచుం
బ్రార్థించినారో? ఋషంబైన దేవాదిదేవా! రమాప్రాణ
నాథుండ వీవాదినారాయణాఖ్యుండవే! తెల్లమయ్యెగా జగత్సృ
ష్టివృద్ధిక్షయంబుల్ వొనర్పంగం జాతుర్యధుర్యుండ వీవే!
మముం బ్రోచుభక్తేష్సితార్థప్రదం బైనమీనావతారుండ వీవే!
సదాదిక్కు మాకంచు లక్ష్మీకుచాభోగకేళీపరానందలోలుం
డవై మించి క్రీడించుదేవుండ విశ్లేల మీనాకృతిం దాల్చితో?
తెల్పుమన్నగా రమానాయకుం డిట్లు వల్కెగా ధరాధీశ! యీ
నాటికిగా సప్తమంబౌ దివస్సూర్తిచేం బద్మగర్భాహముగా నిందు
మున్నీటిలోనగా మునుంగుం ద్రిలోకంబు లాలోన విచ్చేయు
నాపంపునగా గొప్పదౌనావ యొక్కండు; తన్నావలో నోషధి
వ్రాతముగా బీజసంతానముం బెట్టి యంభోధిలో సంచరింపంగ
సప్తర్షులుగా నావలోనుండి చూడగా మునుం గానరాకుండం
బెన్జీకటుల్ ముంచు నమ్మాని మైకాంతులుం దొల్క వారాశి
దోదూయమానంబుగా నావ తేలగా బయోరాశిభంగంబులగా
లోనుగాకుండ నే నిర్వలంకుల్ మునుగా వెన్కనే మారకం
జక్కగా నడ్పుచుందుగా బలుగ్రావము ల్దాకినం జించుచుగా
సంచరింతుగా దుదిం జేరువందొక్క పెన్పాము నాసమ్మతిం గన్న
దుగా దానికెన్నాడ్పులం దూలకుండంగ నానౌక నాకొమ్ముసం
దిమ్ముగాం జేసి నీకుగా మునిశ్రేణికిగా బాధ లేకుండ నిప్పాట
మున్నీట నానల్వ రేయేగునందాక సంచారముం జేతు నే

నందుచే నిజ్జలాటాకృతిం బూనితిన్ భూపతే! తెల్సికొమ్మంచు
నంతర్హితంబయ్యెఁ దద్ద్రావిడాధీశుఁ డైనట్టిసత్యవ్రతుం డంత
మత్స్యాకృతిం బొల్చు శ్రీవిష్ణుపాదాబ్జముల్ చిత్తమం దుంచి
తా దర్భతల్పంబునం దూర్పుగా నౌదలం జేర్చియుం గాచుకన్
నాటికాలంబునై పండుకొనుండినన్ నీరదవ్రాతము ల్గాడి
జల్లించి యత్యుగ్రమై కుంభధారాళి వర్షింపఁగా నేడు సంద్రమ్ము
లొక్కుమ్మడిన్ లోకముల్ ముంచివేయన్ మునుం జన్నక
ల్పాంతకాలంబునన్ బ్రహ్మ నాఁ జెల్లునైమిత్తికంబందు మిన్ముట్టి
యుత్తాల్కు మున్నీటిలో మున్గె భూతాళి లోకంబులున్
మేరలుం దప్పియున్ దన్మహా రాత్రియుం దొక్కటన్ నిత్యమున్
నిల్చి ప్రాణవ్రజోన్మీలనప్రౌఢి నిర్మించి వెన్వెర్వగా నీల్గుచో
నావలింత ల్గడుంగల్గి ధాతృండు సృష్టిక్రమంబంతయున్ మాని
తా శయ్యపై మేను డించెం దగం గేల్గడంజేసి కన్ఱెప్పలున్
మూసి గుర్వెట్టి నిద్రింపుచుండన్ శ్రమాయాసము ల్దీరి త
న్నిద్రవేళన్ బహూచ్ఛ్వాసమార్గంబులన్ వెళ్ళి వీతెంచఁగా
నాదివేదంబులం గాంచి వేగన్ హయగ్రీవుఁడన్ రాక్షసుం
డంతలోఁ దస్కరప్రౌఢిఁ గొంపోయి వారాశిలోన న్మనుం
గన్ విలోకించి వానిన్ వధింపన్ విచారించి యామ్రానుతీ
గందు నాబీజముల్ నింపినన్ సర్వకార్యాళికిన్ హేతువైనట్టి
విశ్వంభరాదేవు నాబ్రహ్మ రాత్రిం దగం గర్గరుల్ గొప్ప
మీసంబులున్ వెల్లనై చిన్న దౌతోఁకయుం బైడిమేనుం బొడల్
చెల్వుమీరన్ వెలుం గొంటికొమ్ముం గడుం దళ్కుచూపు
ల్చెలంగన్ బయోజాక్ష! మీనంబవై వార్ధిలోఁజొచ్చి యం
దొక్కమా రప్సరశ్రేణితోఁగూడి వేటొక్కవేళం దరుల్వట్టి

పర్వెత్తుచున్ మింటి కింకొక్కమాటున్ వడిన్ లేచి లంఘిం
చుచు నొక్కతేపన్ జలంబందునన్ డాగుచున్ నీటిలో
నీటిపైఁ బొర్లుచున్ లేచుచున్ వెండి యింకొక్కతేపన్ ఝష
శ్రేణులన్ మ్రింగునంతన్ వెడల్గక్కు నింకొక్కసారిం గడల్
గడ్క సారించు మీసల్ గడల్కొల్పుదీప్తిన్ పొడల్మించు
చూడ్కుల్ కళల్మార్పు మైదళ్కు ఝళిపింపుచుండున్ ధగ
ద్ధాయమానంబుగా మీనవేషా ! సుధీబృందపోషా ! విరా
జిల్లుదీ వంతకు న్మున్ను సత్యవ్రతుండున్ మహావార్ధు లొక్కుమ్మ
డిన్ ధారుణీచక్రము న్ముంచునవ్వేళ భక్తైకపాలుండవౌ నీపద
ధ్యానపారీణుఁడైనన్ భవత్ప్రేరితంబైన పెన్నావ రాఁజొ
చ్చినం జూచి యమ్మేదినీనాథుఁ డోజన్ వికాసించి మ్రాన్దీగ
బీజంబులున్ నావపై నుంచి యందున్ బయోజాక్ష !
నీపాద పంకేరుహధ్యాన పారీణులైనట్టి యమ్మౌనులుం
దాను గూర్చుండి మున్నీటిపైఁ దేలుచుండన్ మునుం గాంచె
మీనావతారుండవౌ నిన్ను నమ్మీనశృంగంబునం దొక్కపె
న్పాముఁ ద్రాటం దగం బిగ్గ బంధించినం బ్రీతి నమ్మౌనులం
గూడి సత్యవ్రతోర్వీశుఁడున్ మిమ్ముఁ బ్రార్థించె నిట్లుందనం
దుద్భవంబౌ నవిద్యావృతుండయ్యుఁ దన్మూలసంసార విభ్రాం
తులై కొందఱుం దేలుచున్ మున్గుచుండంగ నాదైవయోగం
బునన్ శ్రీహరిం గొల్చి తద్బంధనిర్ముక్తులై మోక్షసంప్రాప్తులై
సంతసంబందరే ? దేవ ! మమ్మావు కారుణ్య మింపారఁ గాపా
డు మాకా ! కనుల్ లేనివాఁ డంధునిం దారి చూపంగఁ గైసేసి
నట్లే విమూఢాలి కజ్ఞుండు గుర్వాటయుం జూడఁ జంద్రార్కు లే
కన్నులై సర్వభూతావళిం జూచు నీవే మహాదైవమై సద్గురుం

డీవరైయొ మోక్ష మొందింపవే వహ్ని యోగంబునం బైడికిన్
వన్నె చెన్నొందునట్లే భవత్పాదసేవాప్రభావంబున న్నీదుదా
సాళికిన్ గల్మషౌఘం బెడంబాసి మోక్షంబు సేకూరకున్నే?
భవత్సుప్రసన్నత్వలేశార్ధమ్ముం బోలఁగాఁజాలునే యింద్రభో
గంబు లెన్నేనియున్? శౌరి! నీభక్తితో సాటికిన్ వచ్చునే?
కంటికిన్ జెప్పవై మేనికిం జాయవై బుద్ధికిన్ సాక్షివై బాంధవుండై
మనస్థుండవై చిన్మయుండై సమస్తాత్మవై కామకల్పంబవై దైవమై
యున్న నిన్నెల్లకే యన్యవృత్తంబులం బూని సంసారసమ్మోహ
పాశంబులన్ బద్ధులై పోవుచున్ నిల్వఁగా నేర్తురే? హేమమ్ముం
గోరకేయిన్మనుం గోరునట్లయ్యె వారాశిలోనన్ స్వకర్మైకసంబ
ద్ధమై లోకముల్ సుప్తినిం బొందఁగా నేమహాశక్తిచే నెయ్యెడన్
మేల్కొనం జేయునో యట్టియస్మద్గురుం డౌదు మాకున్ దయాం
భోధియంచున్ సదా నిన్నుఁ బ్రార్థింపఁగా నీవు సత్యవ్రతోర్వీ
శు వీక్షించి యా సాంఖ్యయోగోపదేశంబు సేయన్ మహారాజు
మౌనివ్రజోపేతుఁడై బ్రహ్మతత్వం బొగిన్ దెల్సుకన్ ధన్యతం
బొందె నీకల్పమందున్ వివస్వంతుఁడౌ నుత్పలారాతికిన్ శ్రాద్ధ
దేవుం డనం బుట్టి నీసత్కృపన్ సప్తముం డైనమన్వయ్యె నీరీతి
నంతన్ మహారాత్రియుం బూర్ణమౌ నంతరున్ మత్స్యరూపం
బుతోఁ దిర్గుచుండంగ నీవా నిశాంతంబునం దన్మహావారిరాశిం
దగం ద్రోసి యవ్వేదచోరుం బొడంగాంచి కిన్కం గరుల్పర్క
నిక్కించియున్ వక్త్రముం జాచియున్ వీఁకతోఁ జిన్న దౌతోఁక
సారించియున్ మై మెఱుంగుల్ప్రసారింపఁగా దౌడలుం గిరివెల్మి
సముల్లోంగలింపన్ ఝషాకారమై దానవుం దాకియున్ నిష్ఠురం
బైన పెన్ముష్టిచే వేసినన్ వ్రేటునన్ వ్రేటు దంభోళిధారాభమై

తాకినంతఁ హయగ్రీవుఁడుం గూలెఁ గల్పావసానంబునం దెప్పఁ
డా వేగుటంచుం బ్రతీక్షించు మౌనివ్రజస్వాంతమోదంబుగాఁ
బ్రక్కనిద్రించునవ్వాణియుఁ లేచి తాఁబయ్యెదం జక్కనొత్తంగ
మాలిన్యమై లీనమైనట్టితేజఃప్రభాదీప్తియుం దొంటిరీతిఁ విజృం
భింపఁ బ్రాణావళీసంచితార్థంబు లెల్లం గనుంగొల్కులం గాను
పింపఁ మెయిం బొర్లియుఁ నిక్కి పెల్లావులించెఁ మహానిద్ర
యుం దీరి మేల్కాంచియుం జాగి మైవిర్చుచుం గన్గవఁ నల్పు
చుఁ ధాత కూర్చుండె సర్గప్రసంధాతయైనంత దైతేయునింగూల్చి
యుఁ వానిచేఁ జిక్కువైపడ్డ యామ్నాయకోటిం దగం జిక్కు
లుఁ విచ్చియుం దెచ్చి కూర్చున్న యన్నల్వకీ విచ్చితౌ రా చిదా
కార! నీకై పయస్తర్పణం బిచ్చుచున్నట్టిసత్యవ్రతుండబ్ధిజీవించి
మన్వయ్యె నీసత్కృపం గాదె? శౌరీ! స్వరాడ్దానవారీ! దళద్వైరి!

## కూర్మావతారము

మున్నాసురానీకముల్ మూఁకలై కూర్మి నాకాసులం గూడి
వైకుంఠవాసా! హరీ! శ్రీనివాసా! యటంచుం గడుఁ వేడి
మీప్రాపుచే మందరాగంబు నొక్కుమ్మడిం బెల్లగింపంగ సం
భారమైనంత భూమీధరం బెత్తుకఁ వచ్చి యప్పాలమున్నీరు
భాండంబు గావించి తన్మందరాగంబు మంథానముం జేసి
యక్కుండలీంద్రుం దరిత్రాడు గావించి పీయూషపానాభి
లాషం బయోబ్ధిఁ మథింపఁ సురస్తోమముల్ పుచ్ఛముంబట్టి
దైతేయసంఘంబు లమ్మస్తముల్ పట్టి త్రచ్చందొడంగం బుడు
క్కఁ మునింగెఁ సుధావారిధిఁ మందరాగం బధఃపాతమై

నంత వారెల్ల దిక్కేది దీనాత్ములై మిమ్ము నారాయణా !
భక్తబృందావనా ! ప్రోవవే యంచుఁ బ్రార్థించినం గర్కశంబై
మహావిస్తృతంబై యొగిన్ లక్షపై యోజనవ్యాప్తమై వజ్రసం
కాశమై పొందగుం గర్పరంబున్ విశాలోద్ధతిం బర్వ గూఢోత్త
మాంగం బజాండంబునైనన్ వెసన్ మ్రింగఁగానోపువక్త్రంబు
విశ్వంబుపై వేయువిశ్వంబు పైఁబడ్డఁ బెన్మ్రూసికన్ నిల్వరింపన్
దృఢంబైనప్రహ్వాంఘ్రులున్ భాసిలన్ లోపలన్ ముడ్చుచున్
వెల్పలం జాచుచున్ దీర్ఘమైనట్టి తుండంబుతోఁ బద్మపత్రం
బులం గేరునేత్రద్వయంబుం బ్రకాశింపఁ గూర్మాకృతిం దాల్చి
యాధారమై నిల్చి భాండాకృతిం బాలసంద్రంబుపైఁ దేల్చి
దేవాసురశ్రేణులుం ద్రచ్చఁగా వారి కీవే సహాయుండవై యుం
డఁగాఁ గాలకూటంబు దోర్లన్ జనింపన్ మహావహ్నికీలల్
జగద్వ్యాప్తమైనం దదుష్ణంబుచేఁ దూలి సైరింపఁగా లేక
యవ్వేధ శక్రాదిదేవావళుల్ శంకరుంగూర్చి ప్రార్థింపఁగా
సుప్రసన్నానుకంపాపరత్వంబునన్ సత్కటాక్షేక్షణస్ఫూర్తి వీ
క్షించి విచ్చేసి గౌరీశ్వరుం డవ్విషాగ్నిం గడింజేసి నిర్భీతిచే
బల్వడిన్ మ్రింగె దేవాసురుల్విస్మయంబంది చూడన్ జగద్వి
శ్వజాలంబు రక్షించె నంతన్ ముకుందాబ్జగర్భేంద్రముఖ్యుల్
పినాకిం బ్రశంసింప నక్కాలకూటంబునుం గంఠభాగంబునన్
నిల్పె గౌరీశ్వరుండంత దైత్యామరుల్ గ్రమ్మఱం ద్రచ్చగా
నర్థి సంతానకామార్థసంధాయిగాఁ గామధేనూత్తమం బుద్భ
వింపన్ ముదంబంది దేవర్షులద్దానిఁ జేకొన్న మీఁదన్ సిత
చ్ఛాయ చెన్నొందనుచ్చైశ్శ్రవం బుద్భవింపన్ సురేంద్రుండు
దానిన్ గ్రహించెన్ సుధారాశియం దంతటన్ శ్వేతశైలంబన

న్మించునైరావతం బుద్భవించెన్ బిడౌజుండు దానిన్ వహిం
చెన్ మఱిం ద్రచ్చఁగా దేవభూజంబు పుట్టెన్ బయోరాశి
యందుం బిదుందన్ శశాంకుండు జన్మించె నామీఁద వెంటన్
శరత్పూర్ణచంద్రున్ హసింపంగ నౌమోము మత్తాళి నీల
ద్యుతిన్ మించుకేశంబులుం బద్మపత్రంబులన్ మించునేత్రం
బులున్ మంజుకెంజాయ హస్తంబులున్ సూక్ష్మమధ్యం
బునుం గర్కశస్వర్ణకుంభోపమం బైనపాలిండ్లు జిత్సైకతశ్రోణు
లుం బల్లవోద్యత్పదంబుల్ వికాసింప సౌజన్యలావణ్యతారుణ్య
వారాశి నానొప్పు నారీలలామంబు పుట్టెన్ రమాదేవినిన్ రత్న
సింహాసనాసీనఁ గావించి దేవాంగనల్ మౌనిపత్ను ల్ముదం
బంది నానావిధార్ఘోపచారంబులుం జేయ రంభోర్వశీమేనకా
దుల్ జగిన్మీర నృత్యంబులాడన్ మెయిన్ గీతము ల్పాడ భేరీ
మృదంగధ్వనుల్ వేణువీణాదివాద్యంబులుం బిక్కటిల్లన్ బిడౌ
జాదిదిక్పాలకుల్ రత్నమాణిక్యభూషాంబరాదుల్ వెసం దెచ్చి
యర్పించి సాలంకృతం జేసినన్ భార్గవీదేవి బ్రహ్మేశ్వరేంద్రాద్య
మర్త్యావళిం జూచి యీభోగసౌభాగ్యముల్ లోకసామ్రాజ్య
సౌఖ్యంబు లెల్లన్ విచారింపఁగా స్వప్నతుల్యం బటంచున్
మదింగాంచి విశ్వోద్భవ వ్యాప్తి సంహారకర్తం ద్రిలోకాధి
నాథున్ సరోజాక్షునిం గాంచి సత్పుష్పమాల్యంబు కంఠంబునం
దుంచి తత్పాదపద్మంబులం బూజగావించి స్వావాసముంచున్
శిరంబెత్తి పద్మాక్షువక్షస్స్థలిం జూచి మోహించి లజ్జం దలన్
వంచుకున్నంత వైకుంఠుఁ డామెం గృపం జూచి కైసేసి
వక్షస్స్థలిం జేర్చె నవ్వేళ నీశాబ్జగర్భేంద్రముఖ్యామరుల్ సంత
సంబంది కీర్తించి రబ్ధీశుఁ డాపూర్వమే స్వాంతరస్తంబమాల్య

ప్రభాకౌస్తుభాఖ్యం బ్రకాశించు మాణిక్యరాజంబు నాచక్రి
కర్పింప నాతండు వక్షంబునం దాల్చె నాలక్ష్మి శ్రీవత్సముం
గౌస్తుభంబుం దగన్ వైజయంతీసుమాల్యంబు సత్తారహారాద్య
లంకారమైనట్టికంజాక్షువక్షస్స్థలిన్ నిల్పియున్నట్టివేళన్ విరిం
చీంద్రముఖ్యామరుల్ దుందుభీశంఖవీణామృదంగధ్వనుల్ భూ
నభోభాగముల్ నిండుగా మ్రోయఁగాఁజేసి రామీఁద త
ల్లింగమంత్రంబులన్ స్తోత్రముల్ సేయఁగాఁ బుష్పముల్ మింట
వర్షింపుచున్ బాలవెల్లిన్ మఱింద్రచ్చఁగా వారుణీకన్య జన్మిం
చినం జక్రియాజ్ఞన్ నిశాటాళి గైకొన్నయంతన్ సుధాకుంభ
మున్ హస్తపద్మంబునం దాల్చి ధన్వంతరీనామ గీర్వాణ
వైద్యుండు వారాశిలోనుండి వచ్చెన్ నిశాటామరశ్రేణు
లాశ్చర్యమందన్ బలోద్రేకులై యందు దైతేయు లక్కుంభ
ముం గొన్నదీనార్తులై నిర్జరుల్ వాసుదేవా! ముకుందా! హరే!
యంచు నిన్ జాలగాఁ బ్రస్తుతింపన్ జగన్మోహినీ రూపముం
దాల్చి క్రవ్యాదు లత్యద్భుతభ్రాంతిచే నిన్నుఁజూడన్ నిశాటా
మరశ్రేణి వేర్వేఱుగాఁ బంక్తులం దీర్చి కూర్చుండఁగాఁజేసి
మున్ముందుగాఁ దత్సుధన్ సర్వమున్ దేవతా శ్రేణికిం
బోసి సంజీవులంజేసి దైత్యాళికిన్ ఖేదముంగూర్చి రక్షించి
తౌరా ! రమామానినీచిత్తచోరా ! సుధీభక్తమందార !

## వరాహావతారము

తత్పూర్వకాలంబునం బద్మగర్భుండు బుద్ధిన్ జలాంతర్గతంబైన
భూచక్ర మేలాగుసంస్థాపనం బాచరింపంగ నే నోపుదంచుం
బయోజాక్ష ! దామోదరా ! శౌరి ! గోవింద ! నారాయణా !

యంచుఁ జింతింపుచున్నంత నాసాబిలశ్వాస సంగుష్ఠమాత్రాం
గుఁడై యజ్ఞపోత్రిస్వరూపంబుచేఁ బుట్టి సాకస్థలస్థాయియై తత్క్ష
ణంబుగ మహాస్థూలమై తోఁప బ్రహ్మమ లత్యద్భుతం బంది
చూడం బ్రజాసర్గసంయుక్తులైనట్టిమన్వ ల్మరీచ్యాదులుం
బ్రస్తుతింపఁ సటానిష్ఠురోద్యచ్ఛటాజాతవాతావినిర్ధూతజీమూత
సంఘూతమై పర్వ వజ్రాభశుంభత్ ఖురోద్భిన్నకంపత్ఫణీంద్రాష్ట
దిగ్దంతిసంతానమై మించ నత్యుగ్రదంష్ట్రోత్థవహ్ని ప్రకీలాస్రవ
ద్రాజత స్వర్ణభూమీధరస్తంభమై యొప్పు గంభీరఘోషా బృ
హత్ ఘుర్ఘురారావ కల్లోల పంకాఖిలాంభోధి సంకీర్ణమై
తోఁప సూర్ధ్వాండ విస్ఫోటితంబై చలింపంగఁ బొర్లుం దగం గెర్లు
దెర్లుఁ నభంబంట గెంటుఁ వెసన్మ్రొట్టె ధట్టుఁ వడిఁ బొప్పు
చుం గొప్పరించుఁ ముసన్మారుకొంచుఁ నిదానించు వేఱొ
క్కమాటుఁ వడిం దాకి లోకాళిదొంతు ల్వెసం జిమ్ము
శృంగంబులం గాంచనాద్రిఁ ఖురోరస్సులం దాకి రాపాడు
వేఱొక్కమారుఁ ఖురాగ్రంబులఁ సప్తవారాసులఁ రొం
పిగాఁ జేసి మట్టాడు నింకొక్క మాటుఁ ఘనాభీల
వాలోగ్రవాతాహతిఁ నాక మెల్లం బగుల్చున్ మఱింద్రిప్పి
వేఱొక్కమాటుఁ యుగాత్మంబులఁ విస్ఫులింగంబు లొల్క
న్మహాభీకరంబై మఱింకొక్కమారుఁ మునీంద్రామరస్తుత్యమై
యోగ్యమై తోఁచుచో నొక్కవేళఁ మనోజ్ఞప్రభఁ యజ్ఞ
ఘోణిక్రియం దా విహారించు సర్వేశ్వరుం డాదిలో యోగ
నిద్రావశత్వంబుచే నున్నెడఁ నీరమధ్యస్థమయ్యుఁ రసస్థాన
మొం దుర్వరం బ్రీతితో నుద్ధరింపం బయోరాశిలోఁ జొచ్చుఁ
దీవ్రంబు సైరింపఁగా లేక వేణీసుఁడుఁ వీచుల న్మ్రాపు గెలెత్తి

విచ్ఛిన్న చేతస్కుఁడై యార్తిచే యజ్ఞపోత్రీ! ననుం బ్రోవు
నన్ బ్రోవుమంచున్ మొఱల్వెట్ట శాతక్షురోగ్రాభశోభాఖురా
గ్రంబులం దోయవిచ్ఛిన్నముం జేసి నిష్పారమౌ నారసస్థాన
ముం జేరి ధాత్రిం బొడంగాంచి యున్నంత హేమాక్షుఁ
డుద్యద్గదాదండముం దాల్చి యత్యుగ్రశౌర్యోద్ధతిన్ దన్ను
మార్కొన్న శూరుం ద్రిలోకంబులం గానకే వచ్చి వారాశిలోఁ
జొచ్చి పారంబు లేనట్టి నీరంబు భేదించి తా నారసస్థాన
మధ్యంబునం దున్న నయ్యజ్ఞ ఘోణిస్వరూపుం ద్రిలోకైక
రక్షున్ విఫుల్లాంబుజాక్షుం బొడంగాంచినన్ శౌరి యత్యద్భు
తంబౌ నిజాంగద్యుతిస్ఫూర్తిచే వాని దేహద్యుతిన్ మాపి
దుర్వారశౌర్యంబుచేతన్ విహారింపుచున్నయ్యెడన్ మోరచేఁ
దున్ని పారంగఁ జేయుం గులక్ష్మాధరాగ్రంబులం గొంతలో
రోదసీభాండమున్ భిన్నమై చిల్లులుం బోవ దాటించుశృంగం
బులం గొంత మున్నీరు లేదున్ ఖురాగ్రంబులం బెల్లుకల్లోలమై
పర్వగాఁ జేయు నొక్కింతసేపున్ శశాంకార్కతారాగ్రహశ్రేణిఁ
దా నొక్కమూలం జనం జేయు వాలాగ్రముం ద్రిప్పుచుం గొంత
కుప్పించి లంఘించు వేగంబుతో నేపుమీరం బొరింగొప్పరిం
చున్ సురారాతిగుండె ల్వెసం బల్లటిల్లన్ వరాహస్వరూపుండు
సంగ్రామసన్నద్ధుఁ డయ్యెన్ నిజాక్షాగ్రజాతస్ఫులింగచ్ఛటల్
రాల దంష్ట్రాగ్రయుక్తావనీమండలుండై సురారాతికిన్ ముందు
గారాఁ బొడంజూచి యేలా వనాటంబు నీజీవనాటంబునై
యుండెనంచున్ భయాశ్చర్యముల్ స్వాంతరంగంబునం దొంగ
లింపన్ వరాహస్వరూపంబుతో నున్న దైత్యారితో దానవుం
డిట్లనెన్ గ్రోడమా! ఆత్మభూదత్తసద్దానకృత్యంబుచేఁ గొన్న

యీభూమి దే నాయధీనంబునై యుండఁ గొంపోవఁగా రీతియే
శక్యమే చోరవృత్తిం దగన్ నీవు గొంపోవ ని న్నీక్రియం
బోవఁగానిత్తునే నీమదాటోప మేపార్ప కే నోర్తునే! యోగ
మాయాప్రభావంబు లీవేళ నాస్త్రాల సాగించి పోనిత్తునే!
నీతృణప్రాయదోస్సత్వశౌర్యంబు వారించి మద్వంశమున్ వృద్ధి
గావించి గీర్వాణవంశంబు నిర్వంశముం జేసెదన్ జూడు మీ
వన్నెఁ బద్మాక్షుఁ డవ్వాక్యముల్ కర్ణశూలంబులై నాటినం
గిన్కచే వీని వీడన్ విధాత్రాదిదేవాళికిన్ మోసముం గల్గు
నంచున్ ధరిత్రీధరుండౌచు రాకాసినిం దాకి వీతేర హేమా
క్షుఁడున్ వెంటనే నక్రమున్ దంతివెంటన్ వడిం దాకుచందం
బునన్ దోడనే తాకి నిందాపరత్వంబునన్ మిద్దు లేకన్ జయం
బొందు దేనంచు దెందంబులో నెంచి భీరుక్రియం బోరగా
యుక్తమే యంచు నాక్షేపముం జేయగా రోషచేతస్కుఁడై
ధాత్రినిం దోయమధ్యంబునన్ నిల్పి యంతన్ విజృంభించి
దైత్యారి బృందారకానందసంధాయియై నిల్వగా నిర్జరుల్
పుష్పముల్ మెండు వర్షింపఁగా దుందుభీకాహళస్వానముల్
పిక్కటిల్లంగ రంభోర్వశీమేనకాద్యప్సర స్త్రీజనంబెల్ల నృత్యం
బులం జేయఁగా నొప్పుమీఱం గిరీటోర్మికాకుండల స్వర్ణమా
ణిక్యకేయూరగ్రైవేయ హారాద్యలంకారకాంతుల్ దిశల్ గ్రమ్మ
సంగ్రామసన్నద్ధుఁడై హేమసద్రత్న వర్ణాంగుఁడై తా గదా
దండముం గేలఁ గీల్కొల్పినన్ దైత్యుఁ డత్యుగ్రబాణంబులన్
వింట సంధించి మర్మస్థలంబుం గలంపన్ మహోద్దండకోపోల్ల
సత్స్వాంతుఁడై శౌరి శౌర్యోద్ధతిన్ దైత్యునిం జూచి దైత్యా
ధమా! నీవు న న్నొక్కసామాన్యమా కాననాటంబుగా

నెంచినావేర ! నే నియ్యెడం గాననాటంబ నాదున్ బలాఢ్యుం డవై తేని నన్ దాకుమీ పోర నీవంటికుక్కన్ విదారింపఁగా నెంత ? నీ వూరకే రజ్జులం బల్కుచుం బంతగింపంగ నేలా ? దురాత్మా ! మహాసత్త్వశౌర్యప్రభావంతులై నట్టిశూరుల్ మఱిన్ నీవలెన్ ఆత్మసంస్తోత్రముల్ సేయుచున్ సంతసంబందిరే ? బంటుపంతంబులన్ దుష్టవాక్యంబు లీరీతిగాఁ బల్క నీకేల ? యంచున్ హిరణ్యాక్షునిం బద్మనాభుండు హీనోక్తులం దూలనాడన్ మహారోషసందీపితస్వాంతుఁడై పుచ్ఛముం ద్రొక్కినం గృష్ణసర్పోద్ధతిన్ మండి కందోయిఁ జెన్నిప్పుకల్ రాల్చుచుం గేల నుద్యద్గదాదండముం బట్టి హేమాక్షుడుం జక్రినిం దాకికిన్కన్ వడిన్ వ్రేయగా దానిఁ దప్పించి కేలం గదాదండ ముద్దండభండోద్ధతిం బర్వ కంజాక్షుడున్ వానిదండంబు భగ్నంబుసేయన్ నిశాటుండు వేఱొండు దండంబుతో వ్రేసినన్ వ్రేటు తన్ దాకకుండన్ సమిత్కోవిద ప్రక్రియన్ హస్తసల్లాఘవంబుల్ దగంజూపి వక్షంబుపైఁ గొట్టినన్ సోలి యంతన్ వెసన్ దెల్వితో లేచి వ్రేసెన్ మురారాతియున్ లెక్కలేకుండ నన్యోన్యజైత్రాసమాకాంక్షతో నల్లకల్లోలమై పోరు దిగ్ద క్షీణాంభోధులట్లన్ భయద్ఘోరగంధాంధమాతంగయుగ్మంబు రీతిన్ మహాభీకరోగ్రంబుగాఁ బోరుశార్దూలముల్ చాడ్పునన్ గిన్క దర్పాతిరేకంబునన్ అంకెలన్ వేయుచున్ డాయునాఁబోతులట్లన్ బృహద్విక్రమాటోపకోపంబులన్ వారిజాక్షుండు హేమాక్షుడుం బోరునవ్వేళ దైత్యారి హేమాక్షువక్షంబు దంభోళిసంకాశ ముద్యద్గదన్ వ్రయ్యనేయన్ నిశాటుండు మూర్ఛిల్లి వేగంబ తెల్వొంది దైత్యారిఫాలంబు నొప్పింప

నమ్మెటిసూరుల్ మహారక్తసిక్తాంగులై పుష్పితాశోకభూజం
బులట్లన్ వడిం బాయుచున్ డాయుచున్ రోయుచున్ ధిక్క-
రింపుల్ వెసన్ హుంకరింపుల్ పొసంగం గసింబోరునావీరులం
జూచు వేడ్కన్ విధాత్రేంద్రగీర్వాణమానీంద్రసంఘాతముల్
నిల్చి యద్ధాత్రికై పోయి యజ్ఞేశ్వరుం జూచి యోదేవదేవా !
నిశాటాధముం గిల్బిషాత్మున్ విదారింపకే మీ రుపేక్షింపఁగా
రాదు సద్యోదివస్కాల మిప్పట్టునన్ దైత్యునిం ద్రుంపఁగా
వచ్చు నింకన్ నిశాకాలమైనన్ నిశాటున్ వధింపంగ సాధ్యంబు
గా దీదురాత్మున్ నివారించి మమ్ముం గటాక్షింపు మన్నన్
ముకుందుండు శౌర్యోద్ధతిన్ బల్గదాదండముం బట్టి దైతేయు
హన్వల్ వడిన్ మొత్తఁగా వాఁడునున్ రోషతామ్రాక్షుఁడై
పెన్గదం బట్టి చిత్రం బెలర్పన్ మురారాతిహస్తాయుధంబున్
వడిం గొట్టి వార్ధిన్ బడన్ వేసినన్ శౌరి నిస్సాధనుం డయ్యె
దేవారిసంగ్రామధర్మప్రకారంబు యుద్ధంబునుం దక్కి నిల్చున్న
దేవావళు ల్మింట హాహారవంబు ల్పొనర్పన్ నిశాటారి
యాదైత్యు శౌర్యాతిధైర్యంబులున్ ధర్మయుద్ధంబునుం జూచి
యుల్లంబునం జిత్రముం బొంది దైతేయవంశాటవీశుక్రమై సం
ప్రకాశించుచక్రంబునుం జిత్తవీథిం దలంపన్ సహస్రాంశుబింబ
ప్రభాభాసితంబై మహాకాంతిపుంజంబుచే దైత్యగంధాంధకారం
బడంగన్ వడిన్ వచ్చి బ్రహ్మాండరాట్సవ్యహస్తాంబుజాతంబు
నన్ నిల్చె నంత న్ముకుందుండు తాఁ జక్రహస్తుఁడై యొప్పి
నం గాంచనాక్షుండు వైచెం గదాదండ ముద్దండసత్త్వోద్ధతిన్
వైచినన్ దాని దైత్యారి పాదంబునం దన్ని మోదంబుతో
హేమనేత్రుం దిరస్కారముం జేసి నవ్వన్ గదం గ్రమ్మఱం

త్రిప్పి కుప్పించి వేయన్ వెసన్ దాని తార్క్ష్యుం డహీంద్రున్
వడింబట్టిన ట్లుద్ధతిం బట్టినన్ శౌరి సత్యప్రభాప్రౌఢికిన్ వైరి
నిస్సత్వశౌర్యాంగుఁడై తక్కియున్ వహ్నికీలాభశూలంబు
చేపట్టి గోవిందునిన్ వ్రేయఁగా వ్యర్థమైపోవ దానిన్ రథాం
గంబుచే మధ్యనే చూర్ణముం జేసినం జూచి తా వెండియున్
ముష్టిఘాతంబుచేఁ జక్రినిం గ్రుద్దినం బుష్పగుచ్ఛంబుచే వ్రేసిన
ట్లయ్యె దానిన్ విలోకించి దైత్యుండు ఘోరాద్భుతం బైన
మాయావిశేషంబులం బెక్కులుం జేసినన్ వాని నన్నింటి
సమ్మోహనాస్త్రంబుచేతన్ నివారించినంతన్ మహామాయ
కోటుల్ నిరర్థంబులై వ్యర్థమై పోయినం జూచి తా రోషముం
దక్కకే లేచి యప్పుండరీకాక్షునిన్ బాహువుల్ సాచి బిట్టూ
చియుం బొడ్చి పద్మాక్షువక్షంబు పీడించినన్ దాని దప్పించు
కం దొల్గినంతన్ విడంబించి వెంటన్ దృఢం బైనముష్టిన్ వడిన్
వ్రేసినన్ దానవారాతి లెక్కింపకే భీషణక్రోధుఁడై నిర్జరేం
ద్రుండు వృత్రాసురుం ద్రుంచుభంగిన్ శతారాభమైనట్టిపాణిన్
నిశాటావలగ్నంబునన్ వ్రేయ నవ్వ్రేటుచే దిర్దిరం దిర్గి సమ్మీ
లితాత్ముండునై సోలి యొక్కింతసేపైనపైఁ దెల్విచే నిల్చి
నంతన్ హిరణ్యాక్షుఁడున్ దుర్బలుండై నిశాటారికిన్ లోఁబడ
న్నింగి నింద్రాద్యమర్త్యావళుల్ చోద్యమందన్ శతా
రాభహస్తంబునం గర్ణమూలంబునం గొట్టినన్ గాంచ
నాక్షుండు రక్తాక్షుఁడై ధాత్రిపైఁ గూలె వాతాహతిన్
తామ్రరుహంబట్లు పెన్నెత్తురుల్ గ్రక్కుచుం బండ్లు గీటిం
పుచుం బ్రాణము లీడ్వెన్; నంతన్ విధీశామరేంద్రాది దివ్యు
ల్మహాశ్చర్యముం బొంద యోగీంద్రులున్ లింగదేహంబు

భంగంబు గావింప నెవ్వాని హృద్వీథిలో నిల్పి చింతింతు
రా దేవు హస్తోరుఘాతంబునం దన్ముఖాంభోజ మీాక్షింపుచుం
బ్రాణము ల్వీడె నీయాజిశూరుండు దైతేయుసత్పుణ్య మెబ్భం
గిదో మున్ను శ్రీవిష్ణుదాసు ల్మునిస్వామి శాపంబుచే నిట్టి
జన్మంబు దా రొందినా రంచు బ్రహ్మేంద్రముఖ్యామరశ్రేణి
కీర్తింపఁగా ధారుణీచక్రముం గొమ్ముచే నెత్తుకః వచ్చి పూర్వ
ప్రకారంబునః నిల్పి రక్షించినంతః సరోజాతగర్భామరేంద్రా
మరర్షు ల్మహానందముం బొంది సేవింపఁగా దేవభేరీమృదంగాది
వాద్యంబులుః మ్రోయ గంధర్వ రంభోర్వశీమేనకాద్యప్స
రోగీత నృత్యంబులుః మించ నంభోజనేత్రా! సుధీస్తోత్రపాత్రా!
రమాధీశ! వైకుంఠముం జేరి లక్ష్మీసమేతుండవై యుంటి
వంచుం బురాణంబులం జెప్పఁగా వింటి వైకుంఠవాసా!
రమాహృన్నివాసా! మహావిస్మయానేక లీలాసముల్లాస!

## నృసింహావతారము

ఈతీరునం గాంచనాక్షుః విదారించినావంచుఁ దజ్జ్యేష్ఠజన్మం
డునా హేమకశ్యపుండు వైరంబు వాటిల్లఁగా మందరాగంబు
పైఁ జేరి కంజాసనుంగూర్చి పెక్కేండ్లు కాయంబు శుష్కించి
జీర్ణింప నత్యున్నతాత్యుగ్రనిష్ఠం దపం బర్థి గావించినః బ్రహ్మ
ప్రత్యక్షమై తోచినః లేచి సాష్టాంగదండప్రణామంబులం జేసి
కారుణ్యవార్ధీ! త్రిలోకేశ! వాణీశ! యంచుః నుతుల్చేసి
హస్తంబులః ఫాలభాగంబునం జేర్చియున్నః నిశాటేంద్రునిం
జూచి నీభక్తికిః మెచ్చితిం గోరు మెద్దేని యే నిత్తు నన్నన్
సురారాతి గోరెన్ హరాబ్జాక్ష బ్రహ్మర్షి దేవేంద్ర ముఖ్యామ

మరానీకముం గెల్చునట్లున్ మనుష్యాలితిర్యక్ మృగస్థావరా
ఘుంబు చేతన్ గదాఖడ్గచక్ర త్రిశూలాది దివ్యాయుధశ్రేణి చేతం
దివారాత్రులందుం బుర్ధారణ్యమధ్యంబులందున్ భువిన్ నింగి
నిన్ లోపలన్ వెల్పలం జావకుండన్ వరంబుల్ కృపం జేయు
మన్నన్ బయోజాసనుం డాక్రియుం గోరినట్లే వరా లిచ్చి
యంతర్హితుండైన రాత్రించరుం డంత నిర్భీతుఁడై ముజ్జగంబుల్
సురేంద్రాది దిక్పాలురం గెల్చి ప్రౌఢిన్ జగత్కంటకుండై ప్రవ
ర్తించు వేళం దనూజాతుఁడైనట్టి ప్రహ్లాదుఁడుం జక్రపాణీ!
పయోజాక్ష! నీపాదభక్తుండు వాక్కాయకర్మంబులన్ నిత్య
సత్యవ్రతాఖండభక్తిన్ రమాధీశ! నిన్నే ప్రశంసింపుచుండన్
విరోధించి యుగ్రాసురశ్రేణి కొప్పించి నొప్పించి రమ్మించుఁ
బన్ప న్మదోద్రేకులై యస్త్రశస్త్రంబులన్ శూలచక్రాసిబాణాది
నానాయుధశ్రేణిచేఁ గ్రమ్మి ఖండించి మొత్తించినం దేప తేపణ్
నమో మాధవా! కేశవా! కృష్ణ! గోవింద! దామోదరా
నంత! దీనార్తిదూరా! దురాపద్విదారా! నమో యంచు
ధ్యానించినంతం దనుక్లేశ మేమాత్రముం జెందకే హాయిగా
నుండె నాతండ్రి పుత్రుం గడుంబెక్కుమార్గంబులన్ మారణో
ద్యోగకర్మంబుఁ జేయించినం జావకున్నన్ వితర్కించి నీదేవు
నిం దొల్లి నాతమ్మునిం జంపినాఁడంచు వైరంబునన్ వాని
శిక్షింపఁగా నెంచి పల్మారు రోయుం గనన్ రాకపోయెం దగ
న్నేఁడు నీదేవునిన్ నిన్ను ఖండింతు నావైరముం దీర్చుకొందుణ్
సుమీ యేడిరా యియ్యెడన్ నాకుఁ జూపింపురా యన్నఁ
బుత్రుండు వల్కెన్ సమస్తేశ్వరుండై విధాత్రాదిగా స్తంబ

పర్యంతమున్ నిండి యాకాశమున్ సర్వమున్ వ్యాప్తమై
నట్లు విశ్వేశ్వరుం డైనవిష్ణుండు సర్వంబునందుం గలం డంచు
భాషింపఁగా డింభకా! యిప్పు డీ స్తంభమధ్యంబునం జూపురా
యంచు హ స్తంబునన్ స్తంభమున్ వ్రేయఁగాఁ బెల్లునం జీలి
యత్యద్భుతంబౌ నృసింహాకృతిన్ దాల్చి బ్రహ్మాండభాండంబు
ప్రస్ఫోటితంబై ప్రకంపింప ఫుల్లాబ్జపత్రంబులం బోలియుం జక్ర
చాపాప్పరచ్ఛత్ర రేఖాంకితం బైనపాదంబులున్ క్షీరసింధూత్థ
శుండాల శుండాభ శుంభత్ప్రకాండ ప్రచండోరుయుగ్మంబు
చెన్నొంద మాణిక్యసత్కింకిణీస్వానధృఙ్మేఖలావిస్ఫురత్పీత
చేలావలగ్నాంచితం బై చెలంగన్ ఝురినిమ్నగావర్తులావ ర్త
గంభీరనాభీమహాసూక్ష్మమధ్యంబు పొల్పార హేమాగసాను
ప్రదేశాభ తేజోబృహత్కర్కశోరస్కుఁడై దైత్యహృద్ధైర్య
వల్లీ లవిత్రాయమాణాశ్రితశ్రేణి సద్దృక్చకోరేందురేఖాయమా
నారి భూభృచ్ఛతారాభ వైశ్వానరజ్వాల సంకాశసంశాత శో
భానఖాగ్రుండు నై శంఖ చక్రాసి కౌమోదకీ బాణ బాణాసనా
ద్యాయుధాంచద్గిరివ్రాత సాదృశ్యవీరాబ్ధివేలాయమానోజ్జ్వ
లానర్గళానేకదోరర్గళుండున్ గనన్ మంజుమంజీర మాణిక్య
సంఘద్యుతిస్ఫార హారోర్మికాకుండలోద్యత్కిరీటాది సద్భూ
షణుండై వళిత్రీనగాగ్రాభశంఖప్రభాబంధురగ్రీవుఁ డుద్యచ్ఛర
త్కాల పాథోధరాంత ర్ధగద్ధక్త సౌదామినీవల్లి తుల్యోగ్ర
దంష్ట్రాంకురుండున్ యుగాంతానలాభీల కీలాసమానోరు
జిహ్వుండు హేమావనీభృత్ బృహత్కందరాభాస్య
నాసావిశాలుండు పూర్వాద్రివిద్యోతమానైకఖద్యోత బింబాభ

నేత్రద్వయుండున్ బిడౌజోరుచాపద్యుతిస్ఫార విస్తారభ్రూవల్లి
కాబంధురోద్భీమవక్త్రుండు తద్గండశైలాభసన్మంజు గండస్థలుం
డున్ నభస్సాంధ్యరాగారుణాంభోదమాలా సదృక్షోత్సటాపుం
జలుండున్ భ్రమన్మందరాగోరువేగాభ్రమథ్యామృతాంభోధి
కల్లోల సచ్ఛీకరాకార భాకేసరుండున్ ఘనశ్వేతభూభృత్సదృ
గ్దీర్ఘదేహుండు త్రైలోక్యమానప్రభా భాసురుండై నృసిం
హుండు గంభాన నావిర్భవించెన్ మహాదారుణంబై మహో
గ్రంబునై ముంగలన్ నిల్చియున్నం గదాదండముం దాల్చి
పెల్లార్చియున్ వచ్చి కంఠీరవం బున్న యచ్చేరువన్ డాయుమ
త్తేభమట్లున్ నృసింహప్రభున్ డాసియున్ హేమకశ్యపుండు
తా నాగదాదండముం ద్రిప్పివేయన్ ఫణిం దార్క్ష్యుఁడుం
బట్టురీతిన్ సురారిన్ వడింబట్టినం బట్టుదైత్యుండు బిట్టల్క
దట్టించి తప్పించుకన్ ధైర్యముం దప్పకే వేగ కుప్పించి విన్వీ
ధికిం బాఱినన్ దానవారాతి యద్దైత్యువెంటన్ వడిన్ లేచి
తారాపథం బంటి ఖల్ శ్యేనముల్ పోరురీతిన్ వెసం బోరుచు
న్నన్ నభోవీధి జీమూతసంఘుంబులన్ డాగి శక్రాది గీర్వాణ
బృందంబులుం జింతతో నిల్చి చూడన్ స్ఫురత్ ఖడ్గవర్మంబులం
దాల్చి యతీక్ష్ణసంగ్రామ సందక్షతన్ భూవియద్దేశ మధ్యం
బునన్ లంఘనాలాఘవస్ఫూర్తి భేదంబులుం జిత్రలీలన్ నృకం
ఠీరవుండున్ గరాళాస్యుఁడై దైత్యునిం బిట్టుధట్టించి యన్యో
న్యవైరానుబంధమ్ములన్ మెల్లఁ బంచాన నోద్ధూతవహ్ని
ప్రకీల ద్దిగంతంబులం గ్రమ్మ దంష్ట్రాంకు రాభీలకాంతుల్
నభోభూమికోణంబులన్ వ్యాప్తమై పర్వఁగా కంటకాభ

స్ఫురత్కేసరౌఘాహతిన్ మేఘజాలమ్ములుఁ భిన్నమైపోవ శుంభత్సటల్ బిట్టుఁ ఝళిపించి కఁదృష్టి సారించి భ్రూబంధముం జేసి రోషానలాభీలకీలై తగఁ నాలుకం గ్రోలుచున్ మూషకం బున్ బిడాలంబు దాఁబట్టురీతిన్ నృసింహుండు కుప్పించి లంఘించి యొక్కుమ్మడిన్ దైత్యునిం బట్టినం బ్రాణభీతిం గడున్ లోఁబడెన్ మర్త్యకంఠీరవుం డూరుమధ్యంబునన్ వాని నత్యుగ్రతం జండవజ్రప్రతీకాశశాతోన్నఖాగ్రంబులన్ దైత్యగర్భంబు వ్రచ్చెన్ సురారాతి శల్యౌఘము ల్మాలికల్గాఁగఁ గంఠంబునం దాల్చె హృత్కంజముం జించినన్ శోణితంబుల్ ధరామండలిం గ్రమ్మ వక్షంబు ఛేదించు మాంసంబు ఛేదించు నెమ్మ్మెల్మఱిం బ్రేవులుం దోడు దైత్యేంద్రు నీరీతి బ్రహ్మేంద్రముఖ్యామరుల్ గాఢసంతోషచేతస్కులై చూడఁగా మర్త్యుడుంగాక సింహంబునుంగాక యొన్నన్ నృసింహాకృతిం దాల్చి ప్రౌఢిన్ బగల్ రాత్రి గానట్టిసంధ్యాదికాలంబునం జూడఁగా వెల్పలన్ లోపలంగాని మధ్యన్ సభాద్వారదేశంబునన్ వ్యోమమున్ భూమియుంగాని యూరుస్థలిం జేర్చి సప్రాణముల్ నిర్గతప్రాణముల్ గాని యుద్యన్నఖాగ్రంబులన్ లోకబాధాకరుండై విహారించునా హేమకశ్యపున్ విదారించి కాలానలాభీలకీలావలోకుండుఁ జంచత్కరాళోరుభీమాస్యబింబుండునై రక్తసిక్తంబు నౌగాత్రముం గేసరంబుల్ మహాభీకరంబై చెలంగన్ నిశాటాంత్రమాల ల్మెడం దాల్చి మత్తేభముం జంపి గర్జించుసింహంబు రీవన్ దితిజ్యేష్ఠజుం ద్రుంచియున్ లేచినన్ దైత్యసంఘంబులుం జక్రశూలాస్త్రఖడ్గా

శుగాద్యాయుధశ్రేణులన్ మూగి దాడిన్ బ్రయోగింపఁగా వాని లెక్కింపకే దైత్యసైన్యంబులుం దైన్యముం జెందఁగా నొక్కపెట్టన్ నివారించి సంరంభము న్మాని యున్నంత నాబ్రహ్మరుద్రేంద్రులున్ నిర్జరుల్ సంయముల్ సిద్ధులున్ సాధ్యులున్ భక్తి విద్యాధరుల్ కిన్నరుల్ పన్నగుల్ పక్షి గంధర్వముఖ్యావళుల్ వేలువేలుం బ్రణామప్రవీణాదికస్తోత్ర ముల్ చేసినం గ్రోధమున్ మానకున్నంత లక్ష్మీమహాదేవినిన్ భక్తి రావించినం జూచి తాఁ బెక్కుమార్గంబులం బ్రస్తుతింపన్ సమీపస్థలిన్ డాయ భీతిల్లినన్ బద్మగర్భాదు లావేళఁ బ్రహ్లాదునిం జీరి నీ వానృసింహుం బ్రశంసించి కోపంబు వారింపుమన్నన్ నృసింహాఖ్యసాన్నిధ్యముం జేరి నానావిధ స్తోత్రముల్ సేయఁగా రోషమున్ డించి కారుణ్యముం జూపి యాశీఃప్రయుక్తంబుగాఁ జెంతకుం జేర్చి మన్నించి బోధించి మీతండ్రి కగ్నిక్రియల్ సేయుమన్నన్ సురారాతికిన్ దాన వారీ! భవద్భక్తముఖ్యుండు స్వర్లోకకర్మంబు గావించినన్ బ్రహ్మరుద్రేంద్రముఖ్యావళిం బిల్చి ప్రహ్లాదునిన్ దైత్య సామ్రాజ్యపట్టాభిషిక్తుం దగం జేయు మన్నన్ ముదంబంది బ్రహ్మాదులున్ దైత్యరాజ్యాధిపత్యంబు గావించి సింహాసనా సీనునిం జేసి మేలౌవరంబుల్ గృపం జేసి ప్రహ్లాదు రక్షించి నీ యాజ్ఞఁ బాలింపరే? దేవదేవా! భవద్దివ్యమాయాప్రభావంబు నెన్నంగ నే నెంతవాఁడం గృపాదృష్టి వీక్షించి రక్షింపు నీదాసదాసానుదాసుండ నేఁ బీరుదాపుండ నీనామమంత్రంబు నిత్యంబు పారాయణం బేను గావింతు నన్నేలు శౌరీ!

# వామనావతారము

దయాంభోనిధీ! ధీనిధీ! ఆదికాలంబునన్ నిర్జరశ్రేణికిన్ శోక వారాశినిం దాటఁగా నావయై ప్రోవుచో నీవు మధ్యాహ్న కాలంబునం దర్కుఁడుండన్ గ్రహోడుచ్ఛటాబద్ధసోమస్థితిన్ శ్రీశివద్వాదశిన్ వామనాకారమై దేవతామాతకున్ సంభవించెన్ మురారాతియున్ శంఖచక్రంబు లొప్పం గదాపద్మముల్ నాల్గుహస్తంబులం దాల్చి యుద్యత్త్విశంగాకృతిన్ వక్త్రపద్మంబు చెన్నొంద మాణిక్యసత్కుండలోద్భాసి గండాగ్రభాగుండు శ్రీవత్సవక్షుండు పంకేరుహాక్షుండు నిత్యేందిరావాసభృంగవ్రజవ్యాప్తసద్వైజయంతీలసన్మాలికాలంకృతుండున్ సువర్ణప్రభారత్నసత్కంకణస్వానమంజీరకేయూరకాంచీకలాపుండు గ్రైవేయసత్కౌస్తుభాభూషితుండై జనింపన్ బిడౌజాదిబృందారకుల్ యక్షతార్క్ష్యుల్ మునుల్ కిన్నరుల్ సిద్ధసాధ్యుల్ శశాంకార్కులుం జారణుల్ ఖేచరుల్ పద్మగర్భాదులుం జాలసంతుష్టచేతస్కులై చింతలం బాసి రంభోర్వశీమేనకాద్యప్సరోగీతనృత్యంబులున్ దివ్యవాద్యంబులున్ మ్రోగఁగా సర్వలోకంబులున్ సౌఖ్యశోభాయమానంబులై మించఁగాఁ బుష్పవర్షంబు వర్షించి రా దేవతాబృందము ల్పన్నుతింపన్ మదీయోదరస్థాయియై శ్రీరమానాథుఁ డీవేళ నీలాగు వర్తించెనేమో యటం చెంతయున్ దల్లి సంవిస్మయత్రాససంతోషము ల్పొందినం దండ్రియా కశ్యపబ్రహ్మ వేదోక్తమంత్రంబులం బ్రస్తుతింపన్ ముకుందుండు తద్దివ్యదేహాకృతు ల్మాటుసేసెన్ వటుండయ్యుఁ గౌటిల్యరూపంబు దాల్పెం దగం దల్లియుం బాలునిం

బ్రక్కలోఁ జేర్చియున్ స్తన్యపానం బొనర్పించియున్ జాత కర్మంబులం దీర్చి యక్కశ్యపబ్రహ్మచే మౌనిబృందంబు లబ్బాలకస్వామికిం దారు బాల్యోచితం బైనచౌలోపనైనాది కర్మంబు లానంద మింపొందఁ జేయించి సావిత్రి గాయత్రి మంత్రోపదేశంబు గావించి జీవుండు యజ్ఞోపవీతంబు నాకశ్యప బ్రహ్మయుం దల్లి మౌంజిన్ దగం గూర్పఁ గౌపీనమున్ ధాత్రి కృష్ణాజినంబున్ మఱిం దండమున్ సోముఁడున్ దోయ జాప్తుండు ఛత్రంబునున్ ధాతయుం బాత్రమున్ వాణి రుద్రాక్షమాల్యంబు సప్తర్షులుం బ్రీతి దర్భ ల్పవిత్రంబులున్ యక్షనాథుండు భిక్షైకపాత్రంబు నిచ్చెం దగన్ వామనస్వామి కిన్ గౌరి భిక్షంబు పెట్టెన్ విధాత్రర్షిబృందార్చితుండై వటుం డున్ హితాచారమార్గంబునన్ సుస్వరస్ఫూర్తితో వహ్ని మంత్రంబులన్ వహ్నినిన్ వ్రేల్చి సచ్ఛీలుఁడై లేచి మాయా వటుండున్ విదేశానుగమ్యార్థులై కొంద ఱుర్వీసురు ల్వోవఁ గా వారలం గూడి సుత్రామరక్షాపరత్వంబునన్ స్వీయమాయా ప్రభావంబుచే లోకసామాన్యవిప్రార్భకుం డట్టులన్ దేవతా రాతియౌ నబ్బలిన్ జేరి భిక్షంబు యాచింపఁగా నేగుచోఁ గుక్షినిక్షిప్తవిశ్వంభరుం డౌటచే భూమి క్రుంగెన్ ఫణీంద్రుండు భారంబుచే వ్రొగ్గె నవ్వేళ నానర్మదానిమ్నగన్ దాటి తత్తీర భూమీసమీపంబునం దొప్పు నింద్రారియజ్ఞోల్లసద్వాటికం బ్రీతిఁ దాఁ జొచ్చి కాంచెన్ జిగిన్మిఱు గంధర్వమేధాలయంబున్ వెసం దాటియున్ వచ్చుచోఁ బౌరులుం జూచి గౌరీశుఁడో? మాధవుండో? విధాతృండో? చండాంశుఁడో? పావకుండో? సదంభస్థితిన్ వచ్చువాఁ డిద్ధరన్ భూసురుం డెవ్వఁ డీసుందరా

కారుఁ డంచున్ మహావిస్మయభ్రాంతులై బ్రహ్మచారి న్వాలో
కించి సభ్యుల్ రహస్యంబునం వారువారల్ ప్రసంగింపుచుండన్
సభాస్థానముం జేరి యాసామగానంబులం జేయుహోత్రౌఘముం
జూచి తన్మంత్రతంత్రార్థభావంబులం బల్కునయ్యాజులం
గూడుచున్ హోమకుండంబులం దున్నత్రేతాగ్నులన్ వ్రేల్చు
చో యాజకాళిం బరీక్షింపుచుం బెక్కురీతు ల్మఖప్రక్రియా
రంభము ల్సెప్పు సభ్యావళిం గూడుచున్ వామనాకారుఁడున్
జిత్రలీలన్ భయంబందినట్లుం దలంగున్ జెలంగున్ మెలంగున్
విలాసంబుచే వంగుచున్ వ్రాలుచుం గొందఱిం జర్చసేయున్
జట లొక్కొందఱన్ జెప్పఁ దాఁ గొందఱిం జేరి తర్కించు
సద్గోష్ఠిసేయున్ వచించున్ దగం గొందఱిం జూచి నవ్వున్
వటుం డిట్లనేకప్రకారంబులం దన్నిరూపంబులై తోచుచున్
దగ్గఱి న్మాయభిక్షుండు రక్షఃపతిం జూచి వీడే బలీంద్రుండు
వీడే బిడౌజాగ్నిధర్మాదిదిక్పాలురం గెల్చి ముల్లోకముల్ దా
స్వతశ్శక్తిఁ బాలించు నుద్దాముఁడై మించి నానాధ్వరానీక
సద్దానధర్మప్రవీణుండు సత్యానుకంపావ్రతాచారశీలుండు వీడే
గదా యంచు దర్భ ల్పవిత్రాక్షతల్ పట్టియున్ సవ్యహస్తం
బొగిం జూచి స్వస్తి త్రిలోకైకరాడ్భర్తకున్ దానవానీకరక్షా
లసత్కర్త కంచున్ వటుం డిట్లు దీవించి నిల్చున్న సద్వేదపుం
జంబు నా నిష్కళంకుండు సత్తాపసుండున్ లసద్దండఛత్రుండు
భిక్షైకపాత్రుండు పూర్ణేందుబింబాననం బొప్ప మాయావివా
దుండునై మించునవ్వామనుం జూచి యాచార్యుఁ డైనట్టి
శుక్రుండు దా లేచి ప్రీతిన్ శుభాధిక్యముం గూర్చి ప్రశ్నించి
నన్ దానవేంద్రుండునున్ వందనం బిమ్ముగాఁ జేసి భద్రాసనం

బిచ్చి పత్నీసమేతంబుగాఁ బాదముల్ గడ్డి తత్పాదతీర్థంబు
మస్తంబునం దాల్చి యంతం దడిన్దుడ్చి యభ్యాగతున్ దాన
వేంద్రుండు వీక్షించి యోవామనా! నిన్నుఁ గన్నట్టివా రెవ్వ
రెవ్వండ వేదేశ మేగ్రామ మేవంశ మేనామమో నీవు విచ్చే
యుటన్ జన్మమున్ వంశమున్ గ్రామమున్ గేహమున్ నేఁడు
సాఫల్యమందెం గృతార్థుండనైతిన్ భవద్దర్శనం బొట నే ధన్య
తం బొందితిన్ నీకుఁ జేలంబులో? కాంచనంబో? తగన్ ధేను
పుంజంబో? వాహంబులో? వారణేంద్రంబులో? రత్నరా
జంబులో? భూములో? కన్యలో? ధామవారంబులో?
గ్రామపూరంబులో? సద్విజోత్తంస! యేమేమి వాంఛింతువో
యిచ్చెదం గోరుమంచున్ బలిస్వామియున్ ధర్మయుక్తంబుగా
బల్కినన్ సంతసంబంది సర్వేశ్వరుం డిట్లనెన్ నా కిదే స్థానమం
చేక్రియుం బల్కనౌ నొక్కటంగాక సర్వత్ర నే నిండియుండున్
మఱెవ్వారివాఁ డంచు నెట్లాడుదున్ నేను నాయంతవాఁ
డౌచు వర్తింతు నివ్వేళ నివ్వర్తనం బంచు నేలా వచిం తేను
నానాప్రకారంబులన్ సంచరింతున్ భువిన్ నేర్పు లెన్నేనియున్
నేర్చియున్నాఁడ నా కెవ్వరుం గారు నే నెల్లజీవాళికిం గూర్తు
నన్ దొంటివాఁ డంద్రు చుట్టంబు లే దొక్కఁడున్ లక్ష్మి
యుం దొల్లియుం గల్గె నే నెందు సన్మార్గులం జొచ్చియుండున్
వినం జెల్లు నీవాక్కు సత్యంబు సత్కీర్తిదం బన్వయార్హంబు
ధర్మానుకంపాపరుల్ సంగరాళిప్రవీణుల్ వదాన్యుల్ విశేష
జ్ఞులై తాతతండ్రుల్ బలోదగ్రశౌర్యుల్ ప్రతాపప్రభా
వాఢ్యులై తాత లట్లుండ నింద్రాదులుం దన్ను వేడం జిరా
యుష్యముం బ్రీతితో నిచ్చె మీతండ్రి యట్లుండఁగా నీప్రతా

పంబు సామాన్యమా ? యేకచక్రంబుగా మూడు లోకంబు
లెల్లన్ సురేంద్రాదిదిక్పాలురం గెల్చి సద్దానధర్మంబులందున్
బ్రశస్తుండవై యున్న నిన్ బోలఁగా నీత్రిలోకంబులం దియ్యెడన్
లేరు రాజేంద్రుఁడైనందునం బూజ్యులన్ విప్రులన్ సాధులం
దన్ప దేనిన్ విగర్హ్యంబులా వానిజన్మార్థగేహంబులున్ మున్ను
నిన్నున్ వదాన్యోత్తము ల్వేఁడ రెన్నం ద్రిలోకేశుఁ డీవంచు
విచ్చేసినా నిందు నే నొంటివాఁడన్ విశేషంబు నేఁ గోర
మూఁడడ్గులే నేల నాకిమ్ము దే చాలు ' నాబ్రహ్మచారిడాగ్ర
ముస్ ముట్టిదన్ దానవేంద్రా ! యటన్నన్ బలీంద్రుండు
తాఁ గ్రమ్మఱం బల్కె మీ రన్న మాటల్ యథార్థంబులౌఁ
గాని నన్నింత స్వల్పంబుగాఁ గోరనేలా ? ధరాఖండమో
రాష్ట్రిలోకంబులో కన్యలో వారణాశ్వంబులో విత్తరత్నం
బులో వేడకే బాల్యవృత్తిన్ వెసన్ నీవు నన్ గోరునీస్వల్ప
మేరీతి నీకిత్తు నన్నన్ ముఖంబందు నవ్వొల్కఁగా వాగ్మియౌ
వామనుండున్ సురారాతితో ఛత్రమో జన్నిదంబో తగన్
మౌంజియో దండమోగాక యే నిక్కమౌ నెక్కడన్
ధాత్రిఖండంబు నాగాశ్వబృందంబు కన్యార్థభోగంబు లవ్వే
క్కడన్ వేశ నొండేమియుం గావు నాకిమ్ము మూఁడడ్గులే
చాలు నాపాలి కీస్వల్పమే చూడ బ్రహ్మాండమౌ లేశమైనం
బ్రియస్ఫూర్తి చేకూరు దానిన్ మహామేరుతుల్యంబుగా నెంచ
కున్నన్ గృతార్థత్వమే లేదు - ఆశాపిశాచంబుచేఁ దొల్లి రాజు
ల్మహారాజులుం జక్రవర్తుల్ తగన్ ధర్మకామార్థభోగంబులం
దీప్సితస్ఫూర్తినిం గాంచిరే ? యాశకున్ మేర లే దెట్లు భావిం
చినన్ నీవు సద్దాతవంచున్ సమస్తంబు నేఁ గోరుటల్ ధర్మమా ?

నాకొలందిం త్రిపాదంబు లేఁ గోరితిం గొంచెమం చెన్న కీ విష్ణు
చాలుం బ్రియస్ఫూర్తిచే నన్న యవ్వామనస్వామికిన్ దానముం
జేయఁగా సమ్మతింజూపి యత్తోయపాత్రంబు గైకొన్న భూనా
థునిం జూచి దైత్యాన్వయాచార్యుఁడైనట్టి శుక్రుం డిటుల్
విన్నవించెన్ ధరాధీశ! యీతండు భూదేవుఁడుం గాడు విష్ణుం
డనాద్యుం డనంతుండు నీదివ్యత్రైలోక్య సామ్రాజ్యమున్
నిన్ను వంచించి వృత్రారి కీఁబూని యక్కశ్యపబ్రహ్మసూనుం
డునై వామనాకారముం దాల్చి జన్మించి విచ్చేసినాఁ డీక్రియన్
నీవు పాదత్రయం బుర్వి నీయంగ ముల్లోకముల్ మూఁడు
పాదాలతో నాక్రమించున్ ధరాచక్రసామ్రాజ్యసంభోగముల్దక్కి
భూమీధరారణ్యమధ్యంబులన్ మౌనివై సంచరింపంగఁ జే
కూరు సత్యంబు నావాక్యముల్ నమ్ము డెందంబులోనన్ భువిన్
దానధారేయులైనన్ ధనం బంతయుం దానముం జేసి నిర్భా
గ్యులై ముందు దా రేమియుం జేయఁగా లేరు విత్తంబు
లేకున్న సత్కర్మ మేలాగు చేయంగవచ్చున్ ధనం బైదు
భాగంబులుం జేసి కామార్థధర్మాశ్రితశ్రేణికిన్ గీర్తికిం దుల్య
భాగాలుగాఁ బంచి యిందందు సౌఖ్యోన్నతిం బొందుటే
లెస్స యీమార్గముం దప్పఁగాఁ బాడియే నాహితం బింత
గాదంచు నీదాన మీ విచ్చినన్ సర్వముం బోవు నీ కున్న
లేశంబునున్ దుష్కృతం బేమియున్ లేదు నే నొక్క సన్మార్గ
ముం జెప్పెదం గాంతలందున్ వివాహంబులందున్ ద్విజశ్రేణి
ప్రాణార్థమానప్రణాశంబులం బొంకగా వచ్చు దోషంబు
లేదందు రార్యుల్ ధరన్ వంశమున్ రాజ్యమున్ దేజమున్
నిల్పు మీకుబ్జుఁడున్ స్వల్పమార్గంబునం బోఁడు త్రైవిక్రమ

స్ఫూర్తి బ్రహ్మాండముల్ నిండినన్ మాన్పఁగా నెవ్వరున్
లేరటంచున్ హితోక్తుల్ గురుం డానతీయన్ నిశాటేంద్రుఁ
డాలించి వాక్రుచ్చె నీలాగునన్ దావకోక్తుల్ నిజంబౌ గృహ
స్థాశ్రమాచార మింతే యగుంగాని తద్ధర్మ కామార్థసత్కీర్తు
లేమైనఁ బ్రార్థింపఁగా నిత్తునంచున్ వెసన్ విత్తలోభంబుచే
నీయకున్నం దగం బల్కు లేదన్న పాపంబుకంటెన్ ధరన్
దుష్కృతం బెద్ది? యే నెట్టిదుష్కర్మ మైనన్ భరింపంగలంగాని
సత్యాపహా న్నోర్మ యలే నంచు భూదేవియున్ బ్రహ్మతోఁ
బల్కదే? యాజి వెన్నియ్యకే చచ్చుకంటెన్ వచస్సత్యముం
దప్పకే యిచ్చుకంటెన్ సుధీరాళికిన్ భద్రముల్ వేఱ ప్రాపిం
చునే? తొల్లిరాజుల్ మహారాజ్యగర్వోన్నతిం బొందరే?
వార లేరీ? మహైశ్వర్యముల్ గొంచుఁబోఁగల్గిరే? ధాత్రిపై
వైన్యుఁడున్ దా గయుండున్ శిబిత్మాథవాదుల్ యశస్కా
ములై యియ్యరే కోరికల్ యజ్ఞయాగంబులన్ యోగ
మార్గంబులం జూడరానట్టివిష్ణుండు గుజ్జుండుగా వచ్చె మా
బోంట్ల కిష్టార్థ మియ్యంగరాదే? తగ న్మన్న శ్రీదేవికిం
గొప్పుపై సత్కుచగ్రావయుగ్మంబుపై మేనిపై నొమ్మపైఁ
కైటపైఁ బాదపద్మాలపై నూత్నమర్యాదలం బొందు శ్రీ
నాథుహస్తాబ్జ మీరీతిఁ గ్రిందౌట నాకేలు మీఁదౌట మేల్గాదె?
యీ రాజ్యముం గిజ్యముం గాయముం బ్రాయమున్ శాశ్వ
తంబే! శశాంకార్కముఖ్యగ్రహంబుల్ గతుల్దప్పినన్ బర్వత
వ్రాతముల్ గ్రుంగినన్ మేరుభూమీధరంబట్టె దోర్లాడినన్
సాగరం బింకినన్ మృత్యు వాసన్నమైయైన వంశాంతమైనన్
నిజం బింత రానిమ్ము కానిమ్ము శ్రీనాథుఁడైనన్ శివానాథుఁ

డేయైన బ్రాహ్మీధవుండైన నాఁగాక యభ్యాగతుండై పగన్ వచ్చినం ద్రిప్పఁగానేర నాజిహ్వ నీవేళ నీచిన్నికుబ్జప్రభుం గాదటంచూరకే పంప నేనోప సత్యంబుగాఁ బల్కిన ట్లిచ్చుచో విఘ్నుఁ డేలా ననుం గట్టు? తాఁ గట్టినన్ విప్పకే పోవునే? పోవని మ్మన్నమా టెంతయుందప్ప కే నిత్తునంచన్న శుక్రుండు గోపించి మచ్ఛాసనోల్లంఘనం బీవు గావింతువే? యింతధిక్కారమా? శీఘ్రకాలంబునందే పదభ్రష్టతం బొందుమంచున్ శపింపన్ నిశాటేంద్రుఁడున్ శాపదష్టుండునై కూడ సత్యంబుఁ బాలించువాఁడై మనస్థైర్యముం బాయకే తాఁ జిరంజీవియై యుండఁగావచ్చు వెన్నేనికష్టమ్ములున్ బంధముల్ గల్గుగాకేమి? జీవార్థబృందంబులుం బోయినం బోవుగాకేమి? మానార్థు లెవ్వేళఁ దామాడుసూక్తిప్రకారంబె వర్తింతు రేమాత్రముం దప్పఁబో రన్నవేళన్ నిశాటేంద్రునర్ధాంగి వింధ్యావళీదేవి ప్రాణేశునాజ్ఞానుసారంబుగా నీరపాత్రంబుఁ దాఁదెచ్చినన్ వేగ దైత్యేంద్రుఁ డాకుబ్జునిం జేరఁగాఁబిల్చి పీఠంబుపై నుంచి సర్వాఘవిచ్ఛేదమున్ సజ్జనశ్రీదమున్ మౌనిహృన్మోదమున్ శౌరిశ్రీపాదమున్ వామపాదంబునున్ భక్తిప్రక్షాళనంబుం దగంజేసి తత్పాదతోయంబుఁ దా నుత్తమాంగంబునం దాల్చి భక్తిప్రపత్తిన్ నమోవాకముల్ సెప్పి కాలంబు దేశంబు పాత్రంబు గుర్తించి ధాత్రీసురేంద్రాయ వేదస్వరూపాయ విశ్వంభరాయ ప్రదాస్యామి ధాత్రీం త్రిపాదామటంచుం గ్రియా. క్షిప్రుఁడై దానవేంద్రుండు చేసాచి పూజించి బ్రహ్మార్పణంబంచు నద్దానమున్ ధారవోయంగ నద్ధార రానీక తానడ్డమైనం గవిన్ గుబ్జుఁడున్ దర్భచే గ్రుచ్చినం దాన నేకాక్షుఁ

డయ్యెన్; సురేంద్రారి దానాంబుధారన్ గ్రహింపంగ మాయా
వటుం డిమ్ముగాఁ జాచె లక్ష్మీకుచోపాస్తమున్ హస్తమున్
నిర్జరేంద్రారియుం గుబ్జరూపుండు వైకుంఠుఁడే యన్న
భావంబుతో దేశకాలంబులన్ శుక్రువాక్యంబులన్ నాశ
ముం జక్క యోజించి సత్పాత్రమంచుం ద్రిపాదోర్విఁ దా
దానమిచ్చెన్ జగంబెల్లఁ గీర్తింపఁగాఁ; దత్పముల్ భూమిపైఁ
గల్గిరే! ధాత్రి దానంబుతోఁ దుల్య మేదానముం గా దిహ
స్వర్గలోకంబులం గీర్తి సత్కృత్యముం బొందుమంచున్ వటుం
డిట్లు పల్కెన్ మహాస్వల్పముం గోరినానంచు భావింపకే
యిచ్చితీయర్థమే ముజ్జగంబెల్ల మా కిచ్చుటల్ చాలు నంచన్న
వాక్యంబులన్ హర్షనిర్భితచేతస్కుఁడై దానవేంద్రుండు సం
తృప్తుఁడయ్యెన్ సరోజాక్షుఁడున్ సర్వభూతేశ్వరుం డాటచే
విశ్వమెల్లన్ శుభప్రాభవోపేతమై యొప్పినం బంచభూతంబు
లంతన్ బళీయంచుఁ గీర్తించె; దేవోరగుల్ సిద్ధగంధర్వులుం
గిన్నరుల్ పక్షియక్షాదులున్ దేవమౌనుల్ ప్రమోదించి సం
కీర్తనల్ సేయఁగాఁ బుష్పవర్షంబు వర్షింపఁ దూర్యధ్వనుల్
మ్రోయఁగాఁ గుబ్జుఁ డింతై మఱింతై యొకంతై వియద్వీథి
యంతై పయోదాళికంతై సుధాధామునంతై సరోజాప్తునంతై
ధ్రువశ్రేణికంతై మహర్వాటికంతై వెసన్ సత్యలోకోన్నతుండై
యజాండాంతసంవర్ధియై సూర్యుఁడున్ ఛత్రమై మస్తరత్నం
బునై కర్ణభూషంబునై కంఠమాణిక్యమై స్వర్ణకేయూరమై
హస్తభూషంబునై మధ్యవస్త్రంబునై నూపురంబై వటుం డిట్లు
బ్రహ్మాండమున్ నిండి విశ్వాకృతిం దాల్చి యాకాశమున్
స్వర్గమున్ లోకముల్ దిక్కులున్ జంగమస్థావరం బైన సర్వ

ప్రపంచంబునుం దానయై యేకమై చూడఁ త్రైవిక్రముం డయ్యె భూలోకమంత్రె భువర్లోకము న్మించి స్వర్లోకముం దాటి యంతన్ మహాలోకమున్ మీఱి వేవేగ దేవర్షి ముఖ్యుల్ మహాభూతసంఘాన్వితం బైన బ్రహ్మాండభాండంబులున్ మేనికిన్ గప్పుగా నొప్పియుండన్ విజృంభించి యొక్కడ్గుచేఁ గ్రింది భూలోకముం గప్పి, వేఱొక్కపాదంబునన్ మీఁదిలోకంబు లెల్లన్ విలంఘించి, కన్పట్టకే పద్మగర్భాండభాండోత్కటాహం బొగిన్ విచ్చియున్ వేంద్రమైనం బరుల్ గానరా నొక్కఁడై వాగ్విగప్రాప్తుఁడై మాధవస్వామి యొప్పెం; ద్రిలోకంబు లెల్లన్ వడిందాటి యచ్చోఁ బదాబ్జాగ్ర తేజంబునన్ సత్యలోకంబునన్ ధాతృతేజం బడంచెన్ సహస్రాంశురీతిన్ దివంబైననిష్పాపులై యందు వాసించు రాజుల్ మరీచ్యాదిమౌనుల్ సనందాదియోగీశ్వరుల్ సంతతం బుండినన్ మూర్తిమంతంబులై మ్రోయునుద్యత్పురాణేతిహాసంబులామ్నాయముల్ సంహితాదుల్ గురుజ్ఞానవహ్నిన్ విదగ్ధాఘకర్మౌఘు లైనట్టివా రెల్లఁ దత్పాదకంజంబు నీక్షించి సద్భక్తితో మ్రొక్కి తా మెల్ల నిత్యంబుఁ బూజించుని క్షేపముం గంటి మంచుం బ్రమోదించి చూడన్ విధాతృండు పూజించె సద్యోగమార్గంబులన్ బుష్పగంధాక్షతశ్రేణిచే ధూపదీపాదు లర్పించి శంఖాదివాద్యంబు లొప్పన్ జయధ్వానముల్ చేసి ప్రార్థించి యున్నంత విశ్వాబ్జగర్భాండమెల్లం దగం దానయై యున్న సర్వేశ్వరుం జూచి లేశంబు భావింపఁగాలేక దైత్యేంద్రుఁడున్ సభ్యులున్ సన్నుతుల్ చేసినం బూర్వరీతిన్ వటుండై వెలుంగన్ నిశాటౌఘముల్ చూచి మోసంబునన్ విష్ణుఁ డీరీతి

మాయావటుండౌట దా సుంత భావింపకే సత్యసంధుండు గానన్ నిజోక్తప్రకారంబు దైత్యేంద్రుఁడున్ దాన మీయంగఁ గుబ్జుండునున్ ముజ్జగంబు ల్దగన్ దా గ్రహించెన్ బలారాతికీఁబూని యంచున్ వటుం దూఱుచుం బాఱినీకే విదారింతమంచున్ మహావీరులై హేతిరాహుల్ వడిన్ విప్రచిత్త్యాది దైతేయు లత్యుగ్రతన్ ఖండనాటోపసన్నద్ధులై శూలచక్రాసి బాణాదినానాయుధశ్రేణినిం దాల్చి సైన్యాలతో మూఁగినం జూచి శ్రీవిష్ణుదాసుల్ సునందుండు నందుండుఁ బేర్మిన్ జయుండున్ జయంతుండుఁ దార్క్ష్యశ్రుతాదు ల్మహాయూథనాథుల్ బృహత్సత్త్వసంపన్నులై సైన్యముంగూర్చి దైతేయసంఘంబులన్ నాశ మొందించువారై రణాటోపసంరంభులై రాఁగ వారందఱం జూచి దైత్యేంద్రుఁడున్ శుక్రశాపంబుఁ జింతించి దైతేయులారా! యనిం బోరఁ గాలంబు గా దిప్డు డీసర్వభూతాళికిన్ సంపదాపత్ప్రభుం డైనదైవంబు భంజింపఁగా నేమిసేయన్ సురారాతిరాజ్యంబునన్ నిర్జరస్వామినాశంబు-దేవేంద్రరాజ్యంబునన్ దానవశ్రేణి చేట్పాటుగానన్ సురారాతులం గాంచినన్ భీతిచేఁ బాఱువైకుంఠదాసుల్ బలోద్రేకులై మిమ్ములం గెల్వఁగా వచ్చుటల్ దైవసత్త్వంబుగాదే! జగిం దైవ మేవేళ వాటిల్లునో నాడు దైత్యాళికిం గెల్పుగున్ నేఁడు వల్దంచు బల్దుర్గము ల్మంత్రిమంత్రౌషధంబుల్ బలవ్యూహసామాద్యుపాయంబులం గాలముం జక్కఁగాఁ జూచి భూనాథుఁడుం బోరుటొప్పున్ రిపుశ్రేణులన్ మోహరింపంగ నిక్కాలముం గాదలుంగం బనేలేదు మీర ల్దలంగుం డటున్నన్, ముకుందైకభక్తాళికిన్ భీతులై చిక్కి దైతేయులెల్లన్ రసాస్థానముం జేరి

ర్హావేళ వైకుంఠుహృద్భావ మూహించి పక్షీంద్రుఁడున్ వేగ
దిక్పాలపాశంబులన్ దైత్యరాజేంద్రు బంధించె బాహా
ల్పదంబుల్ వెసం గట్టినన్ శ్రీధవానుగ్రహం బిట్టులున్నన్
మఱెవ్వారుఁ దప్పింపలేరంచు దైత్యప్రభుం డేమియుం జింతిలం
బోక బద్ధాంగుఁడై నిల్వ హాహాధ్వను ల్దిక్కులం గల్గె సంపల్ల
యం బైనచో దైన్యకంపంబులం బొందకే తొంటికంటెన్
గడుం బెంపు దెంపుల్ ధృతిన్ దేజముం గల్గునింద్రారినిం జూచి
కుబ్జుండు వల్కెన్ త్రిపాదోర్వి దానంబులో భూమియెల్లం
దగం బాద మొండయ్యె స్వర్లోకము న్నాకు నేకాంఘ్రి
యయ్యెన్ భవద్విత్త మెల్లం ద్విపాదప్రమాణంబె నీవిత్తు
నన్నర్థ మీకున్న దోషంబు గాదే! మఱింకొక్క పాదంబుకున్
భూమి యేదీ? యనన్, సత్యభంగప్రసందేహచేతస్కుఁడయ్యున్
భయాత్ముండుగాఁబోక సత్యోక్తి నాజిహ్వకుంగా కసత్యోక్తి
లేదెన్నఁడున్ నీతృతీయాంఘ్రికిన్ నాశిరం బిమ్ముగా నిత్తు
దేవా! పదధ్వంసమైనం గులచ్ఛేదమైనన్ వినిర్బంధమై యర్థ
నిర్మూలమై పోయినన్ లేదనంజాల నే బొంకుకుం జాల
పద్మాక్ష! నీ వాదిదేవుండవై నన్ను బంధించుటల్ నిగ్రహం
బో? లయంబో? శుభార్థంబొ? నేఁజెప్పఁగాఁజాల నీతో విరో
ధించి నీకెగ్గు గావించి నీదాసులన్ హింసలం బెట్టి దేవారి
ముఖ్యుల్ భవద్దాసు లేస్థానముం గాంతురో యట్టిపెంకిన్
దుఃఖం బొందరే? తొల్లి పెక్కండ్రు; నీతో విరోధంబెమైనన్
దుదిన్ ముక్తికిం గారణం బౌను; వైరుల్ హితుల్ లేరు నీ
కెందు; నీ వెల్లరం బ్రోతు వీవిశ్వమెల్లన్ భవచ్ఛిద్విలాసంబు
సర్వేశ! నిన్ గొల్చినన్ దుర్లభం బేమి? యామృత్యుష్వం

జెల్లెలా? కాలుఁ డేమూర్తుఁడా! కింకరుల్ భృత్యులా? బ్రహ్మ యున్ జాతితోఁ జేసెనే తన్ను? నిత్యంబులే వైభవంబుల్ సతంబౌనటే? జీవులుం జెల్లరే! సారహీనంబు సంసారమెల్లం దటిచ్చంచలం బంచు భావింపకే మూఢులున్ సత్యదానానుకంపాపరిత్యక్తులై వ్యర్థులై కూలుచున్నారు ధాత్రిన్; జగత్కంటకుం డైనతండ్రిన్ విరోధించి నిష్కల్మషుం డైన మాతాత ప్రహ్లాదుఁడున్ సాధుసన్మాన్యుఁడై నీపదద్వంద్వముం గొల్చియున్ ధన్యతం బొంది దీర్ఘాయురారోగ్యసంపన్నుఁ డయ్యెన్ విరోధంబుచేఁగాక మావారలుం దొల్లి నిన్ గాంచిరే? యర్థివై వచ్చి నన్నడ్గుటల్ నాదుపుణ్యంబుగాదే? యటంచున్ హరిన్ వేడుచున్నయ్యెడన్ సంతతారాధితాత్మస్థితాబ్జాక్షు శ్రీపాదునిన్ ఘోరసంసారపాపాటవీమూలవిచ్ఛేదకున్ బ్రహ్మబోధాకళాహ్లాదు నిఃఖేదుఁ బ్రహ్లాదునిన్ ముందటం గాంచె నిట్లాగతుం డైన తాతం బొడంగాంచి వారాశిరాట్పాశబద్ధుండు గానన్ సురేంద్రారి సాష్టాంగముం జేయఁగా లేక లజ్జన్ దలన్ వంచి యామ్రొక్కు చెల్లించినంతన్ మఖాగారసీమన్ సునందాదిభక్తాళి సేవింపఁ గూర్చున్న కుబ్జప్రభుం జూచి ప్రహ్లాదుఁ డానందబాష్పంబు లొల్కం బ్రణామంబు గావించి శ్రీవాసుదేవా! బలీంద్రున్ దగన్ నీవు మున్నింద్రసామ్రాజ్యసింహాసనాసీనునిం జేసియుం గ్రమ్మఱం ద్రిప్పుట ల్మేలు సామ్రాజ్యగర్వాంధకారంబునుం బాపి కారుణ్యముం జూపి రక్షించుటల్ గాక బంధించుటే? తత్వసంవేది కింద్రత్వమేలా? భవత్పాదసేవోపమం బౌనె దేవేంద్రభోగంబు? నారాయణా! యంచు

భాషింపుచున్నంత "నాథైకభిక్షాం ప్రభో దేహి మే శ్రీసతీ
వల్లభా" యంచుఁ గేల్మోడ్చి వింధ్యావళీదేవి సంస్తోత్రముల్
చేసి నిల్చున్న వేళన్ విధాత్రుండు విచ్చేసి యోసర్వభూతేశ!
యోదీనమందార! యోదేవదేవా! లవంబేని సత్యంబునుం
దప్పకే విత్త మెల్లన్ మనస్స్ఫూర్తిగా నిచ్చె దండార్హుఁడుం
గాఁడు ధర్మాత్ముఁ డీతండు ప్రోవంగ నర్హుండు విడ్పించి నిర్భీ
తునింజేసి రక్షింపు శౌరీ! భవత్పాదపద్మాభిషేకంబు గావించి
పూజించుసద్భక్తుఁడే నీవు ప్రత్యక్షమై వచ్చి వేఁడన్ నినున్ శ్రీర
మానాథుగాఁ దాను గుర్తించి రాజ్యంబు సర్వంబు నర్పించు
వానిన్ బలిం బాశబద్ధాంగునిం జేయఁగాఁబాడియే? యన్న
బ్రహ్మోక్తి లాలించి శ్రీశుండు పల్కుం గృపాదృష్టిచే నెవ్వ
నిం బ్రోవ వీక్షింతునో వాని సర్వార్థముల్ నే హరింతున్
మదోద్రేకగర్వాంధులై తమ్ము నన్నుం గనన్ లేనివారిన్
భవాంభోధిలో ముంగుచుం దేలుచుం బుట్టుచుం గిట్టుచున్
సర్వజంతువ్రజగ్రస్తులై భూరిబాధప్రభిన్నాత్ములై స్రుక్కఁ
గాఁజేయుదున్ విత్తవిద్యావయోరూపసత్తోజ్జ్వలైశ్వర్య
కర్మంబులన్ గర్వనిర్ముక్తుఁడై యేకభంగిన్ విశుద్ధామలుండై
ప్రవర్తించు నెవ్వాఁడు వాఁ డెంతు నాకూర్మిరక్షింపఁగా నర్హుఁ
డుంగాన నీతండు శాపాగ్నిసంతప్తుఁడై బాంధవత్యక్తుఁడై
వర్జితైశ్వర్యుఁడై బీదయై సత్యకారుణ్యసన్మాన్యసౌజన్యసం
యుక్తుఁడై యీక్రియ న్మాయనుం గెల్చెఁ బుణ్యుం డితం
డల్పుఁడే? దానవుండంచు నిర్వైరిమర్యాద నేనుం బరీక్షిం
పఁగా నీక్రియం బల్కితిన్ సత్యసంపన్నుఁడే నిర్మలాచారుఁడే
నిక్క మీతండు మేల్మేలు నాకు న్మదిన్ మెచ్చుగావచ్చెఁ

సావర్ణిమన్వాఖ్యు నీతండు దేవేంద్రుఁడౌ దేవతాశ్రేణి కాపైజిగిం
బొందఁగా మత్పదంబిచ్చి రక్షింపుదున్ బాధలున్ వ్యాధులున్
దప్పులున్ నొప్పులున్ లేనియావిశ్వకర్మైకనిర్మాణమున్ దాన
వారాధితం బైనసుస్థానధామంబునన్ సద్విభూతిన్ నివాసించు
నందాక నీదైత్యనాథుం డటంచున్ బలిం జూచి సేమంబు నీ
సేనకున్ నీకు పాతాళలోకాధినాథుండవై యేలుమో! శాశ్వ
తానందసామ్రాజ్యపట్టంబు నీదేసుమీ! దేవరాజ్యంబుకంటెన్
గడున్ శ్రేష్ఠ మచ్చోట దుఃఖంబులున్ బాధలున్ దుష్కృతుల్
లేవు ధర్మాత్ములౌ వారికెల్లన్ నివాసార్హ మాలోకమం
దాధిపత్యంబుతో నొప్పి నీవుండు మెవ్వేళ నీయాజ్ఞకున్ లో
బడం బోని దైత్యావళిం బట్టి నాచక్రి మేతెంచి ఖండించు
నచ్చోట లోకేశముఖ్యాళికిన్ లోనుగాకుండ వే నెప్పుడున్
నిన్ను రక్షింపుచుందున్ గనన్ వచ్చెదం బ్రేమమీరన్ భయం
బేమి లేదంచుఁ బద్మాక్షుఁ డీరీతి సంప్రీతి మాధుర్యసారంబులై
పల్కు వాక్యంబు లాలించి యానందచేతస్కుఁడై దానవస్వామి
సద్భక్తితాత్పర్య మింపొందఁగా నిట్లనెన్ శ్రీహరీ! యోగు
లున్ మౌనులున్ దేవతానాథులున్ లోకపాలాదులుం బొంద
రానట్టియుష్మత్కృపన్ నన్నుఁ బెంపొందగాఁ జేసి రక్షించి
తీవాశ్రితత్రాణ బద్ధాదరా! నిన్ను భక్తిం బొడంగాంచి
సేవింపఁగా నాపదల్ గల్గునే! యంచుఁ గీర్తింపఁగా బంధనిర్ము
క్తుఁడై యిందిరాభర్తకున్ మ్రొక్కి వాగ్భర్తకుం దాఁ బ్రణా
మంబు గావించి మారారికిన్ వందనం బిమ్ముగాఁ జేసి యంతన్
నిజాత్మీయబంధుద్విజశ్రేష్ఠులం గూడి వేడ్కన్ బలీంద్రుండు
సుస్థానధామంబునుం జేర గోవిందకారుణ్యసంప్రాప్తుఁడై ధన్యతం

పొంది ప్రహ్లాదభక్తుండు పద్మాక్షుతో నిట్లనెన్ ధాతయున్
నీప్రసాదం బొగిన్ గానఁ డీలక్ష్ములం బొందగానేరఁ డిట్లెంత
లుం జాలఁగా లేరు దైతేయులా మాకు బ్రహ్మాదిసంపూజితాం
ఘ్రిద్వయస్వామి వైనట్టినీ వియ్యెడన్ దుర్గపాలుండవైనావు
దేవా! భవత్పాదకంజాతయుగ్మంబు సేవించిగాదే మహై
శ్వర్యదివ్యప్రభావాత్ములై తొల్లి మావారలున్ మించి
రెన్నంగ మే మెంత? దుష్టక్రియాలోలతం గుత్సితస్వాంతు
లైనట్టిమాకున్ భవన్మంగళోదాత్తకృపాదృష్టిచే సత్పదం
బందఁగా మేము మున్నేమిపుణ్యంబులం జేసినామో? మముం
బ్రోచుటల్ చిత్రమయ్యెన్; సమస్తాంతరంగుండవయ్యున్ సమా
లోకనస్వామివయ్యున్ విపక్షంబు నుంతేనియున్ లేక నిష్కా
మభక్తాళికిం గామితార్థప్రదస్వామివైనావు కల్పద్రుమప్రౌఢి;
నిట్లన్న ప్రహ్లాదునిం జూచి మాయావటుం డిట్లు వల్కెన్
శుభంబే సుతా! నీకు నీవారికిన్ నేఁడు నీపౌత్రునిం దోడు
కంబోయి సుస్థానముంజేరి యందుండుమా నే గదాపాణినై
యెల్లకాలంబుఁ గాపాడుదున్ లెమ్మటన్నన్ మురారాతికిన్
మ్రొక్కి ప్రహ్లాదుఁ డంతన్ బలిం గూడి సర్వాసురశ్రేణితోఁ
దాను ధాత్రీబిలద్వారముం జొచ్చి సుస్థానలోకంబు చేరంగ
నిచ్చో ధరన్ బ్రహ్మవిద్యాజకశ్రేణిమధ్యంబునం గూరుచున్నట్టి
శుక్రున్ విలోకించి శ్రీశుం డిటుల్వల్కె యాగంబునం దెట్టి
లోపంబు గాకుండఁ బూర్ణత్వ మొందింపుమన్నన్ ద్విజస్వామి
యున్ సర్వకర్మాధినాథుండవై యజ్ఞరూపుండవై కర్తవై
భోక్తవై యొప్పు నీ వియ్యెడం దృప్తినొందంగ నేలోపముం
గల్గునే? కర్మయోగాళికిన్ దేశకాలార్హసన్మంత్రతంత్రంబు

లన్ నిన్నుఁ జేర్కొన్న లోపంబులు న్మానవే? యైన నీయాన పాలించుట మేలుగాదే? హరి! యింతకంటెన్ శుభం బేమి టం గల్గు? నాకంచు దైత్యేంద్రుయాగంబు సంపూర్తిగావించె నయ్యాజ్ఞచే బ్రహ్మమౌనీంద్రసాహాయ్యుఁడై కాప్యుఁ డారీతిఁ దా వామనుండై బలిస్వామి గైకొన్న త్రైలోక్యసామ్రాజ్య మున్ వజ్రి కిచ్చెం గృపాసాంద్రుఁడై; దక్షభృగ్వాదులున్ శంకరుండుం గుమారుండు దేవర్షిసందోహమున్ దేవతా నీకమున్ ధాతయుం దాను నేకంబుగాఁ బోయి వే తల్లికిన్ గశ్యపబ్రహ్మకున్ మోద మింపొందఁగా లోకభూతాళికిన్ లోకపాలాళికిన్ వల్లభుండై తగన్ వామనుండున్ యశోధర్మ లక్ష్మీసమేతుండునై దేవతావేదస్వర్గాపవర్గాళి కెల్లన్ విభుండై యుపేంద్రాహ్వయుండై ప్రకాశించె నంతన్ విధాతృండు దిక్పాలురున్ శక్రునింగూడి యాకాశయానంబునన్ వామ నున్ స్వర్గలోకంబుకుం దోడుకంబోయి రిట్లీబలాఢ్యుండు దో డౌటచే నింద్రుఁడున్ స్వీయరాజ్యంబుఁ దాఁ బొందఁగల్గెన్ మహాదివ్యశక్తిప్రభాభాసమానుండు దమ్ముండు సేకూరఁగా నన్నకుం గోర్కులం దేమి లోపంబు గల్గున్? ధరన్ గర్భ భారంబుగాఁ బుత్రులం గాంచుకంటెన్ దగన్ బల్లిదుండైన సత్పుత్రుఁ డొక్కండె చాలున్ సురశ్రేణిఁ గడ్వారఁగన్నట్టి వేల్పుమ్మ కూర్మిం దుదిం గన్న గుబ్జయ్యరీతిన్; సురేంద్రుం డుపేంద్రోరుదోర్వీర్యసంరక్షితం బైన త్రైలోక్యసామ్రాజ్య ముం గ్రమ్మఱం బొందె నంతన్ విధాతృండు గౌరీధవుండున్ గుమారుండు దక్షుండు భృగ్వాదులున్ సిద్ధమౌనీంద్ర ముఖ్యుల్ విచిత్రోల్లసద్విక్రముం డైనవిష్ణుం బ్రశంసించుచున్

స్వీయలోకంబులం జేరి సౌఖ్యోన్నతిం బొంది రీదివ్యగాథన్
బఠింపన్ సమస్తాఘము ల్వాయు శౌరీ! దయాంభోనిధీ!

## పరశురామావతారము

వాసుదేవా! మహాదివ్యభావా! హరీ! నీవు మున్ హై
హయాధీశుఁ డౌ కార్తవీర్యార్జునుం డొక్కనాఁ డావనంబందు
వేటాడ నేతెంచి తాఁబెద్దయుంబ్రొద్దు వేటాడి యాయాస
ముం బొంది సైన్యంబుతో క్షుత్పిపాసార్తుఁడై వచ్చి జమదగ్ని
ఋష్యాశ్రమస్థానముం జేరి దండప్రణామంబు గావించి
నిల్చున్న రాజేంద్రు మన్నించి యా రాజుకున్ రాజభృత్యా
ళికిం బ్రీతితో హోమధేనుప్రసాదంబుచే నిష్టమృష్టాన్నముల్
చాల నర్పించినం దృప్తిగా మెక్కి కూర్చుండి యాధేనువుం
గోరి యీవైభవం బేల? యైశ్వర్య మేలా? తగన్ ధేనువే
చాలు నీయావునుం బట్టి తెండంచు భృత్యాళి నంపన్ బలో
ద్రిక్తులై వార లాధేనువుం బట్టి తే రాజు గొంపోయి మాహి
ష్మతీపట్టణంబున్ వడిం జేరియున్నంతలో భార్గవుం డైనరా
ముండు పిత్రాశ్రమంబుం బ్రవేశించి సంతుష్టిగా నన్నముల్
మెక్కి మాయయ్య వల్లన్న లక్షింపకే ధేనువుం బట్టి కొం
పోవుచున్నాఁడటంచున్ మహాకోపముం బొంది కాలాగ్ని
భంగిన్ గిరిశ్రేణిపైఁ బాఱుసింహంబురీతిన్ వెసం గార్తవీర్యా
ర్జునుం దాకఁగా రాముఁ డేగెన్ కుఠారంబు వర్మంబు
కోదండకాండైకముఖ్యాయుధంబుల్ వెలుంగన్ బలోదగ్రుఁ
డై యుగ్రుఁడై చేరి యక్కార్తవీర్యార్జునుం జూచి నిల్చున్నఁ

గాంచెన్ శరాకీర్ణతూణీరకోదండశుంభత్కరాగ్రభీమున్
మహోద్దాము రామున్ విలోకించి బాల్యంబునన్ బాడబుం
డయ్యు వైరప్రతీకారముం గోరి క్షాత్రంబు దీపింప భూపాలు
రీతిన్ రణాటోపము న్మానకే నిల్చియున్నాఁడు విప్రుం డటం
చున్ దయం జూపఁగారాదు మాపట్ల నేదోషమున్ లేదు లెం
డేలసైపన్ ద్విజుం బట్టుడీ కొట్టుడంచున్ బలోపేతులన్ వీరు
లన్ మారుకొల్పంగ వారల్ గజస్యందనారూఢులై కొంద
ఱున్ ఘోటకారూఢులై కొందఱుం గాల్బలంబుం బదే
డుద్ధతాక్షౌహిణుల్ గూడి రా రామునిం దా మెదుర్కొన్నవారై
గదా ఖడ్గ చక్ర త్రిశూలాది నానాయుధంబుల్ ప్రయోగించి
నొప్పించినన్ వాని లెక్కింపకే విప్రుఁ డత్యంతరోషోత్కటా
వేశముం బెంచి నేత్రంబులన్ విస్ఫులింగంబులున్ రాలఁగా
మండి యజ్ఞోపవీతంబుఁ జక్కన్ గటిం దోపి ప్రౌఢిన్ గరా
ళించి భాస్వత్కఠోరోద్ధతిం దత్కుఠారంబు సారించి పెన్మా
కలం దొక్కఁడై దూకి యాజిన్ శిరంబుల్ కరంబుల్ గళంబు
ల్పదంబుల్ విజృంభించి ఖండింపుచుం గాయముల్ మధ్యభా
గంబు లూరుల్ రథంబు ల్గజంబుల్ హయంబు ల్పదాతుల్
ధరం గూలఁగా గండ్రగొడ్డంట దున్మాడి వేఱొక్కహస్తంబు
నన్ వింట బాణాళి సంధించి పెన్బాణవర్షంబుచే సైన్యమెల్లన్
మహింగూల్చెఁ దద్రక్తముల్ నేలపై నేరులై పాఱఁగా
భూతబేతాళపైశాచముల్ తండతండంబులై రక్తముల్ గ్రోలు
చున్ మాంసము ల్మెక్కుచుం జాల సంతృప్తిఁజెందన్ సమి
త్కేళి గావించినం గార్తవీర్యార్జునుం డంత నేనూరుహస్తంబు
లం దన్నిటన్ బాణబాణాసనంబు ల్వడిం దాల్చి వేఱొక్క

యేనూరుహస్తాళిచే విండు లెక్కించియుఁ శాతబాణాళిసం
ధించి యత్యుగ్రతన్ బాణవర్షంబు వర్షింపఁగా రాముఁ డుద్దండ
కోపోద్ధతిం జాప మెక్కించి తీవ్రోగ్రనారాచసంఘంబుచే
రాజు చాపంబులం ద్రుంచి వేఱొక్కబాణాళిచేతం గరంబుల్
సహస్రంబు ఖండించి యంతన్ శిరంబున్ గుఠారంబుచేఁ ద్రుం
చినం గార్తవీర్యాత్మజనుం డీల్గెనవ్వేళఁ దత్పుత్రకుల్ తద్దయున్
భీతిచే యుద్ధము న్మాని పోవం దగం గోపుచుం గ్రేపునన్
భండనోర్వీజయశ్రీధవుం డైనరాముండు వేవేగఁ గొంపోయి
తాఁ దండ్రి కర్పించి సంగ్రామరంగక్రమం బంతయున్ వారికిం
జెప్పినం దండ్రి యత్యంతచింతాపరీతాత్ముఁడై రామునిం
జూచి యిట్లేల హింసావిధానంబు గావించినావయ్య! ధర్మా
త్ముఁడై యొప్పునారాజునుం జంపఁగాఁ బాడియే? పుత్ర!
శాంతిక్షమన్ వీడినన్ సౌఖ్యముం గల్గునే? విప్రునిం జంపినన్
భూపతిం జంపినన్ దోషమం చార్యులుం బల్కనారంచుఁ
జెప్పంగ నాలింపవే? తీర్థయాత్రాపరత్వంబునం బోయి తద్దో
షముం బాపుకొమ్మన్న నేడాదిలో సర్వసత్పుణ్యతీర్థంబులం
గ్రుంకి రాఁగా జలార్థంబుగా నొక్కనాఁ డెంతయున్ రేణుకా
దేవి యాగంగకుం బోయినన్ జాహ్నవీవారిలో నప్సరస్త్రీలు
గంధర్వనాథుండు దోయాటముల్ సేయుచుండంగ వీక్షించు
వేడ్కం బరాధీనచేతస్కయై కొంచె మాలస్యమైనన్ నిజే
శుండు గోపించునంచున్ వడిం దోయము ల్నించి కుంభంబు
మస్తంబునం బూని తా వచ్చుచో హోమకాలంబు మీఱన్
బయఃకుంభమున్ దించి భీతాత్మయై భర్తకున్ మ్రొక్కి
కేల్మోడ్చి నిల్చున్నభార్యన్ మునీంద్రుండు బిట్టల్కనీక్షించి

యాలస్యముం గూర్చి ప్రశ్నింపకే పుత్రులం జూచి మీతల్లినిం
జంపిరం డంచు శాసించె; వారెల్లరుం దండ్రివాక్యంబు చెల్లిం
పఁగా నొడియున్నంత రామా! మదీయాజ్ఞ - నీయన్నలం దల్లి
నిం జంపుమన్నంతనే తండ్రికిన్ రాముఁడున్ మ్రొక్కి యొక్క
ఘడిలో నన్నలం దల్లినిం గండ్రగొడ్డంట ఖండించినన్ మెచ్చి
మేలొప్పఁగా మస్తకం బూచినం దండ్రినిం జూచి సాష్టాంగ
దండప్రణామంబు గావించి కేల్మోడ్చి యీకూలియున్నట్టి
వారిం బునర్జీవులుంగాఁ గృపంజూడు మన్నం బునర్జీవులం జేసె;
నిట్లే హతంబైనవారిం బునర్జీవులౌనట్టులన్ మన్పఁగాఁ దండ్రి
శక్తుండుగాఁడే? నిఁ బిత్రాజ్ఞయైనన్ ధరన్ రాముఁడట్లాచరింపం
బరుల్ చూడఁగారాదు; మున్ భీతిచే యుద్ధము న్మాను
నయ్యర్జునాత్మోద్భవుల్ దండ్రినిం జంపెనే యన్న వైరంబునుం
బూని యారాముఁడున్ లేనివేళన్ నిరీక్షించి మున్యాశ్రమ
స్థానమం దంతటం గాచియున్నంతలో నొక్కనాఁ డెంతయున్
భక్తితాత్పర్యమొప్పన్ మునీంద్రుండు బాహ్యప్రపంచక్రియా
తీతుఁడై యింద్రియశ్రేణి బంధించి నారాయణధ్యానపారీ
ణుఁడై యోగనిష్ఠాగరిష్ఠాత్ముఁడై హోమశాలం దపోవృత్తిఁ
గూర్చున్నసత్పుణ్యు నారాజసూనుల్ దగం గ్రమ్మి నోరెత్త
రాకుండఁ గంఠంబునం గ్రుచ్చి వే మస్తముం ద్రుంపఁగా నడ్డ
మే తెంచి యారేణుకాదేవి దుఃఖింపఁగాఁ దల్లిశోకస్వరం బట్టె
యాలించి యంతన్ వడిన్ జామదగ్న్యుండు నచ్చోటికిన్
వచ్చునాలో నరేంద్రాత్మజుల్ పోయినం గూలియున్నట్టితండ్రి
న్విలోకించి శోకించు సైదోడులం దల్లినిం జూచి యారాముఁ
డుగ్రంబుగా మీరు దుఃఖింపఁగా వద్దు మాతండ్రిదేహంబు

గాపాడు డేనిప్పుడే పోయి ప్రత్యర్థులం బోరిలోఁ ద్రుంచి
యేతెంతునంచుం గుఠారంబు జళిపించుచుం బోయి యాజిన్
రిపుశ్రేణికంఠంబులం ద్రుంచి రక్తప్రవాహంబు నిండేఱులై
పాఱఁగా రాజులున్ సైన్యముల్ గుట్టలై కూలఁగాఁ జేసి తా
నంతటం బోక ఘోరప్రతీకారముం జేయఁగాఁ బూని ముయ్యే
డుమాఱుల్ నృపాలావళిం బట్టి ఖండించి లోకంబులో రాజ
శబ్దంబు లేకుండ రూపార్చి; విద్వేషమున్ దీర్పఁగా లేని
పుత్రుండు పుత్రుండె! యా రాముఁ డంతన్ శమంతంబునా
నొప్పు నప్పంచకంబందు భూపాలరక్తం బొగిం దొమ్మిదౌ మడ్గు
లుం జేసి సర్వాత్ముఁడౌ దేవుఁడుం దానె యాటం దనుం గూర్చి
యాగంబు గావించియుం బూర్వదిక్ హోతకున్ బ్రహ్మకున్
దక్షిణంబం దుపద్రష్టయౌ కశ్యపబ్రహ్మకుం గూర్మితో నుత్త
రోర్విం దగ న్మధ్యభూమిన్ సదస్యాళికిం గొంత భూదానముం
జేసి తా జాహ్నవీతోయరాశిం బృథక్ స్నానముం జేసి నిష్క
ల్మషుండై పయోదావళిం బాసి భాసిల్లు చండాంశుబింబోలె
దివ్యాత్ముఁ డౌ పుత్రుచే లబ్ధకాయస్థుఁడై సత్తపఃప్రౌఢిచే మింట
జమ్దగ్ని సప్తర్షులందుండెఁ దా సప్తముండై ప్రకాశింపఁగా;
భార్గవుం డైన రాముం డమోఘప్రభావుండు వేదర్షులందుం
బ్రకాశించుఁ బైమన్వకాలంబునందున్; మహాశాంతుఁడై సంగ
నిర్ముక్తుఁడై భవ్యుఁడై తా మహేంద్రాద్రియందున్నవాఁ
డొప్పు నిరాఱన్ సురల్ కిన్నరుల్ సిద్ధులున్ సాధ్యులుం బ్రస్తు
తింపంగ; నీరీతి నార్యుల్ పురాణాదులం జెప్పఁగా వింటి
రామా! సదానందధామా! యశఃకామ! నీవే ధరాభారముం
బాప ముయ్యేడుమాఱుల్ నృపాంభోధికిం బాడబాగ్ని ప్రభన్

వెళ్లి యేపార్చితౌరా! నమో జామదగ్న్యా! నమో దేవ దేవా! నమో దీనబంధూ! నమో భక్తమందార! మాంపాహి!

## రామావతారవము

శ్రీరామనామంబుచే భానువంశంబునం బుట్టి కోదండ పాండిత్యమొప్పం జతుర్వేదవేదాంతవేతృత్వసంపత్తియొప్పన్ ధనుర్వేదపారంగతఖ్యాతియొప్పంగ గాధేయుయాగంబురక్షింపఁగా లక్ష్మణుంగూడి యేతన్మునీంద్రోపదేశంబుచేతన్ మహామంత్రసారోక్తదివ్యాస్త్రము ల్పొంది దుస్తంత్రమాయాగుణోపేత నాతాటకం ద్రుంచి ఋష్యాశ్రమస్థానముం జేరి దుష్టాసురుండౌ సుబాహున్ విదారించి మాయావి మారీచు నేపార్చి యాగంబు సాంగంబుగాఁ బూర్తిగావించి చట్రాతినిన్ నాతి గాఁజేసి యంతన్ విదేహోర్విరాట్పట్టణంబుం దగంజేరి యచ్చోట గౌరీశుచాపంబు భంగంబుగావించి వైదేహిఁ బెండ్లాడి మాతాపితల్ మోదవారాశిఁ దేలాడఁగా మువ్వురుం దమ్ములుం గూర్మి మీఱన్ విదేహాత్మమాధీశు పుత్రీత్రయంబున్ వివాహంబులాడన్ మహోత్సాహ మింపొందఁగా భద్రతూర్యస్వనంబుల్ ధరావ్యోమముల్ నిండ సీతాసమేతంబుగా ఛత్రముల్ చామరంబుల్ రథానేకవాశ్వవ్రజం బింపుగుల్కంగ సైన్యంబుతోఁగూడి సాకేతపట్టంబుకుం బోవుచో మార్గమధ్యంబునన్ జామదగ్నిప్రభన్ మాపి సాకేతముం జేరి యా మీఁదటన్ దండ్రియాజ్ఞన్ మహారాజ్యభోగంబులం బాసి సౌమి

త్రితో సీతతోఁ దాపసాకారము ల్దాల్చి యాదండకారణ్యముఁ
జేరి యచ్చో భరద్వాజఋష్యాది మౌనీంద్రులం బ్రోచి యం
తన్ విరాధున్ గబంధున్ ఖరున్ దూషణుం ద్రైశిరుం బెక్కు
దైతేయబృందంబులం దున్మి యాచుప్పనాతిన్ విరూపంబు
గావించినన్ మాయసీతన్ దశాస్యుండు గొంపోవ సన్వేష
ణార్థం బరణ్యంబునం గ్రుమ్మఱం గాననోవ్వన్ నిషాదాం
గనన్ బ్రోచి పక్షిప్రభున్ మోక్షమొందించి వాలిం దలం
ద్రుంచి సుగ్రీవునిం గాచి యమ్మారుతిం బంపి సీతాసమా
చారముం జక్క గుర్తించి శాఖామృగశ్రేణులం గూర్చి
వారాశి బంధించి సుగ్రీవనీలాంజనేయాంగదుల్ జాంబవన్ము
ఖ్యులుం దార్క్ష్యతారుల్ నలుండున్ సుషేణుండు ముఖ్యంబు
గాఁ గపివీరోత్తముల్ గొల్వఁగా నేగి యంభోనిధిం దాటి
లంకావరోధంబు గావించి యక్కుంభకర్ణున్ విరూపాక్షు
ధూమ్రాక్షుఁ గుంభున్ నికుంభాతికాయున్ మహాకాయులన్
మేఘనాదాదిదైతేయవీరావళిం దానవానీకముం జట్టి పెన్మ్రొట్టి
యొక్కండునుం బోవనీకుండఁ జక్కాడి లంకేశునిన్ రావణుం
జంపి యంతన్ దశాస్యానుజుం డైనభక్తున్ విభీషుం గృపం
జూచి యవ్వానికిన్ దైత్యరాజ్యాభిషేకంబు గావించి లంకా
పురీరాజ్య మర్పించి దీవించి సీతాసమేతుండవై పుష్పకం బెక్కి
సుగ్రీవసామీరినీలాంగదాదిప్లవంగాన్వయగ్రామణు ల్గొల్వ
బ్రహ్మేశ్వరేంద్రాదిగీర్వాణముఖ్యుల్ ప్రశంసింపఁగా వచ్చి
సాకేతసామ్రాజ్యపట్టాభిషిక్తుండవై శిష్టులం బ్రోచుచున్ దుష్టు
లం దున్ముచున్ సాధుభక్తాళికిం గల్పభూజంబవై సత్కృపాంభో
ధివై నీవు మాయానరుం డన్నవిఖ్యాతితో నొప్పవే! పూజలం

బొందవే? దాసులం బ్రోవవే? జానకీప్రాణనాథా! కృపాదృష్టితో మమ్ము రక్షింపవే! రామ! పట్టాభిరామా! సుధీకామ!

## కృష్ణావతారము

శ్రీరామ! కృష్ణాభిధానంబుతోఁ బుట్టి వ్రేపల్లెలోఁ జాలగా బాలకేళీవిలాసంబులం బ్రీతిఁ గ్రీడించి దుష్టాత్ములై నట్టి దైతేయులం బట్టి ఖండించి నందున్ సదానందవారాశిఁ దేలించి కూర్మిన్ యశోదమ్మకున్ బుత్రలీలాసుఖం బిమ్మగాఁగూర్పనో యన్నరీతిన్ రసక్రీలనొల్కించు నెమ్మోముతో వేణుహస్తంబుతోఁ గేకిపింఛంబుతోఁ దేనియల్గారు కెమ్మోవితో నునువు చెక్కిళ్లతోఁ బొల్పులంజిమ్ము మేల్పుష్పదామంబుతో మంచికస్తూరి తిల్కంబుతో నందముల్గారు కందోయితోఁ బైఁబడంగోరు శృంగార రూపంబుతో బంగరుం గజ్జియల్ మ్రోయఁగా దండ తాయెత్తు లల్లాడఁగా హృద్యచోల్లాస మింపొందఁగా నామెకొంగింటికిం దూరి కన్మూయుచున్ ముద్దులం గుల్కుచున్ ముర్పెముల్ గూర్చుచున్ వచ్చియున్ రాని పిన్పల్కులం బల్కుచున్ బాలకేళీవినోదుండవై గోపికాడింభకౌఘంబుతోఁ గూడి గోబృందముం గాయుచుం జల్దులన్ మెక్కుచున్ లీలగా వారితోఁ గాలముం బుచ్చుచుండం బరీక్షార్థమై బ్రహ్మ విచ్చేసి గోగోపసంఘంబులన్ వేడ్కఁ గొంపోయి తా నొక్కచో దాచినన్ వేండియున్ గోవులం గోపసంతానమున్ వేఱ నిర్మించి యన్నింటఁ దానై మెలంగన్ విలోకించి పద్మోద్భవుం డాత్మలో విస్మయం బంది సత్యంబు గుర్తించి వేవేగ గోగోపసంఘంబులం దెచ్చి హే పద్మనాభా! రమాధీశ! యుష్మత్ప్రభావంబు నెంచంగ నే

నెంతవాఁడన్ మదీయాపరాధంబు మన్నింపు మంచుం గడున్
సన్నుతుల్ సేయుచుంబోయె; వేఱొక్క నాఁడింద్రుఁ డేతెంచి
కిన్కన్ శిలావర్ష మొక్కుమ్మడిం బెల్లు వర్షింపఁగా గోవులున్
గోపగోపీజనౌఘంబులున్ భీతిచే నిల్వఁగా లేక గోవింద! కృష్ణా!
మముం బ్రోవుమన్నన్ దయాదృష్టి వీక్షించి నిర్భీతులై యుండుఁ
డంచుం బ్రబోధించి గోవర్ధనం బెత్తి ఛత్రంబుగాఁ బట్టి గోగోప
గోపీజనానీకముం బ్రోవఁగా నోడి సుత్రాముఁడున్ వంద
నంబుల్ దగం జేసి ప్రార్థింపుచున్ నాకముం జేరె నంతన్ జగ
త్కంటకుం డై ప్రమాదస్థాయియై భూతకోటిన్ మహాబాధలం
బెట్టు కాళింగునిం బట్టి నాల్కల్వ్రేసందోడి భోగంబులం ద్రొక్కి
నొప్పంగ మర్దించి గర్వంబడంగించి ప్రేమన్ జనానీకముం గావవే
భక్తరత్నామణీ! యొక్కనాఁ డింపెలర్పంగ బృందాటవిన్ వేణు
నాదానుమోదంబుఁ జేకూర్చి లీలావినోదంబులం దేల్చి గోపీ
వధూటీమనోహారివై రాసలీలావిశేషంబులన్ వారలం దృప్తులం
జేసి యంతన్ సుధీసాధువిద్వేషియైనట్టి కంసున్ హతుం జేసి
తద్బంధులైనట్టి దుష్టాసురవ్రాతమున్ సంగరోర్విన్ విదారించి
శిష్టాత్ములైనట్టి యా దేవకీదేవికిన్ భర్తకున్ హృత్ప్రమోదంబు
గావించి యా మీఁదటన్ వారలన్ ధన్యులం జేయవే? యాద
వాంభోధిచంద్రుండవై మారకోటీ జగన్మోహనాకారమున్
జెల్వమీఱంగ శ్రీరుక్మిణీసత్యభామాదిభార్యల్ పదార్వేల గోపీ
జనంబుల్ ప్రియం బార నీతోడ నెల్లప్పుడుం గూడిమాడన్
మహానందసంధాయివై ద్వారకావాసివై సర్వసౌభాగ్యసంప
న్నలన్ సంతతాఖండ లైశ్వర్యసంపూర్ణకాముండవై పాండవే
యైక పక్షుండవై పార్థసూతుండవై శ్రీకురుక్షేత్రసంగ్రామ

రంగస్థలంబందు గీతాప్రబోధంబు గావించి యాధార్తరాష్ట్రుల్ శతంబుఁ మహాయోధులైనట్టి గాంగేయ రాధేయ ద్రోణాభిమన్యాది వీరావళిఁ సంగరశ్రేణి నన్యోన్య వైరానుబంధంబులఁ రూపుమాయించి నీభక్తులైనట్టి కౌంతేయులం బ్రోచి యామీఁద నయాదవానీకమెల్లఁ విరోధించి యన్యోన్య వైరంబులంబెంచి కోపోద్ధతిఁ నాశమై పోవఁగాఁజేసి భూభారముంబాపి వైకుంఠముంజేరి లక్ష్మీసమేతుండవై శేషతల్పుండవై యాదివిష్ణుండవై యొప్పితౌరా! విపద్దూర! సద్భక్త మందార! నన్నేలుకోరా! నిరాకార! దామోదరా! సచ్చిదానందమూర్తీ! లసద్దివ్యకీర్తీ! నమస్తే నమస్తే! హరీ!

## బుద్ధావతారము

తొల్లి యాత్రైపురీదైత్యనాథుల్ విరోధంబుచే శక్రముఖ్యామరాళిఁ విపద్వారిధిఁ ముంచినం దాళలేకే వెసఁ వెండికొండింటి ముక్కంటినింగూర్చి ప్రార్థింపుచుఁ వచ్చి యద్దేవు నీక్షించి దండప్రణామంబులంజేసి కేల్మోడ్చి దేవాదిదేవా! మహోద్యత్ప్రభావా! శివా! త్రైపురీదానవుల్ సత్త్వసంపన్నులై మమ్ము బాధించుచున్నారు ప్రత్యర్థులం ద్రుంచి దీనార్తులఁ మమ్ము రక్షింపుమంచుఁ మహాస్తోత్రముల్ సేయఁగా శంకరుండుం గటాక్షించి కోదండమెక్కించి బాణంబు సంధించి మంత్రించి వేయఁ మహాపావకజ్వాలలం గ్రక్కుచుం బెక్కు బాణంబులై తాఁకినఁ రక్కసుల్ స్రుక్కి పెన్గుప్పలై కూల వీక్షించి తోడ్తో మయుం డందఱిఁ సిద్ధపాదంబు చేతం బునర్జీవు

లం జేసినం జూచి మూరారి చింతింపఁగా నయ్యెడం బంకజా
క్షుండు మాయావిలాసంబుతో ధేనువై బ్రహ్మ వత్సంబునై
వెంటరా దైత్యసంఘంబు విభ్రాంతితోఁ జూడఁగా గూపముం
జొచ్చి యాసిద్ధసారంబునుం గ్రోలి నిశ్శేషముంజేసి బుద్ధాకృతిం
దాల్చి దైతేయపత్నీవ్రతం బెల్ల భంగంబు గావించి కా
మారి ఘోరోగ్రబాణానల జ్వాలచేఁ దత్పురంబుల్ త్రయం
బుఁ దహింపించి దైతేయులంగూల్చి సర్వంబు నిర్మూలముం
జేసి యింద్రాది గీర్వాణయక్షోరగుల్ సిద్ధసాధ్యాదులుఁ
దేవతాభామినుల్ దివ్యభేరీమృదంగధ్వనుల్ సేయఁగాఁ
బూలు వర్షింపఁగా మానిబృందంబు లింపొంది హర్షింపఁగా
నప్పురారిం బ్రశంసించుచుఁ సర్వలోకంబులఁ సంతసశ్రీలఁ
దేలించి రక్షించినా వార ! బుద్ధావతారా! మహాదోషదూరా !
శుభాకార! గోవర్ధనోద్ధార !వీరా ! మహోదార ! మాంపాహి !

## కల్క్యవతారము

కృష్ణా ! కలి ప్రత్యుగాంతంబునందుఁ జగత్కంటకోద్వృత్తి
దుర్వృత్తికారాతిఘముల్ వర్ణవృత్తంబులఁ సంకరం బాచ
రింపఁ మనుష్యుల్ స్వధర్మాశ్రమాచారము ల్దప్పి యన్యాయ
వృత్తిఁ మహాదోషభూయిష్ఠులైనఁ ధరాదేవి తద్భారముం
దాల్పలేకున్న సత్కల్కిరూపంబుచే నుల్లసద్వాజిపై నెక్కి
శాతాసి చేఁబూని దుష్టాత్ములంబట్టి ఖండించి వర్ణాశ్రమా
చారముల్ చక్కగా నిల్పి పూర్వప్రకారంబునఁ సత్యశౌచ
క్రియానీకముం బ్రోచి రక్షింపవే లోకముఁ గల్కిరూపా !

సదా సచ్చిదానందరూపా! మహోద్యత్ప్రతాపా! త్రిలోకైక భూపా! నమోరామ! భద్రాద్రిధామా! లసద్దివ్యనామా! మహాసద్గుణస్తోమ! సీతాభిరామా! పరంధామ! నీకున్ సుమాల్యంబుగా నీదశాకార సత్కీర్తనం బియ్యెడం బ్రీతి నానేర్చిన ట్లొప్పుగాఁ గూర్చి యీదండకం బేను గావించితిన్ భక్తితో నీకె యర్పించితిన్ నేఁడు గైకొమ్మ భీష్టార్థసౌఖ్యంబు మాకిమ్ము నిత్యమ్ము శ్రీశేషయాచార్య కారుణ్యవిస్ఫూర్తి చేతన్ సదా పీరుదాసుండ నీభక్తుఁడన్ నన్ను నీసత్కృపాపాంగదృష్టిన్ విలోకించి రక్షింపవే రావణారీ! సరోజాక్ష! లక్ష్మీశ! మాంపాహి! పాహీ! మురారీ! హరీ! వాసుదేవా! భవత్పాదసేవాభిలాషైకచిత్తుండ నిన్నే శరణ్యంబుగా నమ్మి యున్నాఁడ! నాదోషముల్ వాపి రక్షింపవే రామచంద్రా! లసత్కీర్తిసాంద్రా! స్తుతాజామరేంద్రా! దయాళూ! నమస్తే నమస్తే నమస్తే నమః॥

సంపూర్ణము

ఓమ్

# శ్రీ శేషగురు శతకము



కందపద్యములు

శ్రీమదఖండ నిరీహా ని
రామయ సంవిత్స్వయం వి - రాజిత మగు శ్రీ
రామపరతత్త్వగోచర !
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౧

నిర్మల నిత్య నిరంజన
నిర్మధ్యాం తాదిమూర్తి - నిర్విషయజ్యో
తిర్మయ పావనకరుణా
శీర్మహదుక్తిప్రచర్య - శేషాచార్యా ! ౨

నీమహనీయ దయారస
మేమాత్రము లేకయున్న - నిల వివరింపఁగ
మామక భవహర మగునే?
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! 3

భూమి జలాగ్ని సమీర
వ్యోమాతీత స్వయం స - ముజ్జ్వలిత పరం
ధామ నిజతత్త్వగోచర !
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౪

ఓమితి బ్రహ్మంబు శ్రుతి
ప్రామాణ్యం బమర నాది - ప్రణవంబున నే
యీమాతృకత్రయ మొదవె
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౫

మీఱి యకార ముకార మ
కారంబులు గల్గి యం ద - కారంబున నం
భోరుహ గర్భుం డొదవెను
శ్రీరమ్యం బమర జమిలి - శేషాచార్యా ! ౬

తామరసభవుఁడు విశ్వ
స్తోమంబు సృజించుఁ దా ర - జోగుణయుతుఁడై
యేమఱక సంతతంబును
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౭

దామోదరుం డుకారము
చే మఱి పొడమియును బ్రో చ - శేషజగతిఁ దా
నాముకొని సత్వగుణమున
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా ! ౮

వ్యోమకచుండు మకారము
చే మానక పుట్టి విశ్వ - శిక్ష యొనర్చుఁ
దామసగుణ సంయుతుఁడై
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౯

ఈ మాతృకత్రయంబున
కీ మూర్తిత్రితయమునకు - నీ త్రిగుణములం
దేమిట నంటక వెలిఁగెదు
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౧౦

తామరసభవుఁడ వీవే
తామరసాక్షుండ వీవె - తత్వము నీవే
వ్యోమకచుండవు నీవే
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౧౧

మామక దోషానేక ప
యోము క్సంఘాతములకు - నుగ్రం బగుజం
ఝామారుత మగు దీవును
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౧౨

భ్రామిక నెట్టిను గాలము
నా మీనము మ్రింగి వెడల - న ట్లఖిలజనుల్
వ్యామోహమునను జిక్కిరి
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౧3

ఆముకొనెడు నజ్ఞానత
మోమయ దుర్ధ్వాంతపటల - మోచన మగుచి
ద్యోమమణి వన వెలింగెదు
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౧౪

కామా ద్యరిషడ్వర్గము
నేమాత్రంబైన గెల్వ - నెఱుక గలారే
నీమహిమఁ దెలియ నేర్తురు
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౧౫

వ్యోమప్రభంజనాగ్ని
వ్యోమక్ష్మాంభూతరాశి - యొక్కొక పైపై
తా మించె నిరువ దైదుగ
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౧౬

నేమమునఁ బంచవింశతి
యే మహితస్థూలమై ర - హింపఁగఁ గాయ
స్తోమముల నంట కలరుదు
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౧౭

ఆమిక నింద్రియదశకము
తో మారుతపంచకంబు - తో ధీమనముల్
స్తోమింప సూక్ష్మతనువున
శ్రీమించిన దేశికార్య ! శేషాచార్యా ! ౧౮

భూమిఁగ సూక్ష్మస్థూలమ
యామల భవకారణంబు - నై కారణకా
యామోఘమై వెలింగెదు
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౧౯

ఈ మూఁడు దేహములకుం
బ్రాపి మహాకారణాంగ - బద్ధుఁడ వగుచుం
ధామముగ నం దజస్రము
శ్రీమించి చెలంగు దౌర ! శేషాచార్యా ! ౨౦

ఆ ముమ్మేనులకు నికా
శామల మగు విశ్వతైజ - సప్రాజ్ఞులకుం
నేమమున వెల్గుచుందువు
శ్రీమద్గురు వర్య ! జమిలి - శేషాచార్యా ! ౨౧

తన్మాత్రసంచయంబు మ
నోన్మనులకు మించియుం మ - హోజ్జ్వలమై సం
విన్మాత్రగతి వెలింగెదు
చిన్మోదాచార్య !, జమిలి - శేషాచార్యా ! ౨౨

అతుల విరాడ్వపువు హిర
ణ్యతనువు నవ్యాకృతాంగ - మామీఁద స్వరా
ట్ప్రతను వజాండాకృతి రం
జితమై వెల్గుదువు జమిలి - శేషాచార్యా ! ౨౩

దీమసమున జీవేశ్వర
నామాష్టశరీరమై త - నర్చుచు ఘనచి
ద్భామానందత నొప్పెదు
శ్రీమద్గురు వర్య ! జమిలి - శేషాచార్యా ! ౨౪



శ్రీ వేంపాటి లింగయ్యగారు

భూమిర్ణ బిండాజాండము
లేమఱకను లోబయల్ ర - హించి వెలుఁగు జ్ఞా
నామల నిత్య నిరంజన!
శ్రీమద్గురు వర్య! జమిలి - శేషాచార్యా! ౨౫

సామామ్నా యోపనిష
త్ప్రముఖ్యార్థైకసార - పరతత్త్వ పరం
ధామ మహో జ్యోతిర్మయ!
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౨౬

ఈ మాయామయ భువన
స్తోమంబుల కంట కెపుడు - సురుచిర మగు ప్ర
జ్ఞా మాత్రుఁడవై వెలిఁగెదు
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౨౭

శ్యామలఘన మధ్యస్థం
బై మెఱయు పసిండితీవ - యన విద్యుల్లే
ఖామధ్యమున వెలింగెదు
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౨౮

ధీమతముగాఁ ద్రిజగదభి
రామంబుగ నొప్పు నంత - రంగపరాత్మా
రామ పరమామృతప్రద!
శ్రీమద్గురు వర్య! జమిలి - శేషాచార్యా! ౨౯

ఈ మిగుల నినాదశ్రవ
ణామోద విలీన మగుచు - నా హరిణంబుఁ
భూమి నశించినగతి యగు
శ్రీమద్గురువర్య జమిలి - శేషాచార్యా ! 3౦

సామజము స్పర్శసౌఖ్యముఁ
గామించియు గోతఁ గూలు - గతి నైహికసౌ
ఖ్యామోదరతుఁడఁ బ్రోవుము
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా ! 3౧

ప్రేమించి రూపలక్ష్యము
చే మగ్నం బగుచు లయముఁ - జెందు మనంబుఁ
దా మిడుత శిఖం బడుగతి
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! 3౨

ఏపాప నట్టిజివ్హా
చాపల్యముచేత మీను - చచ్చినగతి నీ
ప్రాపంచికభోగంబుల
చేపడితిని నన్నుఁ బ్రోవు - శేషాచార్యా ! 33

ఆమోదలీనమై భ్రమ
చే మధుపము గర్వమున వ - సించి నిశీథిఁ
దామరసమున నశించెను
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా ! 3౪

ఈమహీ నైదింద్రియముల
చే మడిసెను నొక్కటొకటి - చే నొం డొందున్
మైమఱచి జంతుచయములు
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౩౫

భూముద్రాధారం బను
తామరయు చతుర్దళాన్వి - తము వశషసల౯
ధామమునఁ దనరు గణపతి
శ్రీమద్గురువర్య జమిలి - శేషాచార్యా! ౩౬

అనువుగ స్వాధిష్ఠానం
బను షడ్దళసుమము బభమ - యరల౯ వెలయ౯
వనతల మగు వనజము నిం
చినయజుఁ డచ్చట విభుండు - శేషాచార్యా! ౩౭

ఆమణిపూరక మనఁదగు
తామరసము దశదళాన్వి - తం బగుఁ దేజో
ధామమున శౌరి విభుఁ డన
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౩౮

తదనాహతపంకేజ
చ్ఛదినద్వాదశముచేఁ బ్ర - శస్తానిలము౯
సదనముగా భవుఁ డలరు౯
జిదచిత్తత్వజ్ఞ! జమిలి - శేషాచార్యా! ౩౯

ఆమోద విశుద్ధం బను
తామరసము షోడశచ్ఛ - ద యుతము ; తలముగా
వ్యోమము ; జీవుఁడు విభుఁ డగు
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౪౦

భ్రూమధ్యంబున నాజ్ఞే
యామలచక్రంబు ద్విచ్ఛ - దాన్విత మగుఁ ద
త్సీమపరమాత్మ వీవే
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౪౧

హేమకరసహస్రచ్ఛద
తామరసము ప్రజ్వరిల్లఁ - దగ నడుమఁ బరం
ధాముఁడ వగు గురుమూర్తివి
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౪౨

ఈ మహనీయుల సత్పద
తామరసములన్ మనోజ్ఞ - దళపుంజముచే
నేమఱక పూజ చేసెద
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౪౩

సోమదివాకరనాడుల
సామధ్య సుషుమ్న నాడి - కగ్రంబునఁ జి
ద్వ్యోమానందపరుండవు
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౪౪

ఆ ముఖ్యేటికినడుమఁ బ్ర
యాగమండలమునకు మించి - యేకంబై చి
ద్వ్యోమాకృతిచే వెల్గెదు
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౪౫

నామాకృతిగుణసహితం
బై మాయాతీతమై ని - రంజనమై ప్ర
జ్ఞామాత్రము శేషింతువు
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౪౬

భ్రూమధ్యోదయగిరిఁ బ్ర
జ్ఞామిహిరుఁడు మించి వెలుఁగుఁ - గాన నవిద్యా
యామిని వెంటనె తొలఁగును
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౪౭

వామదిశ నిడానాడిక
సోముని జాహ్నవినిఁ గూడి - సురుచిరలీలన్
దా మెలఁగు ఘోణబిలమున
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౪౮

నేమమునం బింగళయును
ద్యోమణి యమునాస్రవంతి - తో దక్షిణనా
సామార్గమునఁ జరించును
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౪౯

ద్వ్యోమధ్యమున సుషుమ్నయు
ధూమధ్వజ భారతీన - దులఁ దాఁ కెసఁగన్
శ్రీమూర్తి వెల్గుచుందువు
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౫౦

తామరసా ప్తానల హిమ
ధామస్థానంబులకు ని - ధానం బగుచి
ద్ధామాతీతపరాత్మవు
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా ! ౫౧

కామాది వికారంబులు
స్తోమంబై మానసమునఁ - దులదూఁగఁగ ని
న్నే మాడ్కిఁ బ్రశంసింతును
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౫౨

వ్యోమమణి సమస్తరస
స్తోమంబులఁ బీల్చి విగత - దోషుం డగున
ట్టిమహి నార్యు లలరుదురు
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా ! ౫౩

ఆ ముయ్యేటికి నడుమను
హేమరచితహర్మ్యమున ర - హిన్ వెలయు మరు
ద్భామినిఁ గూడి సుఖింతువు
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా ! ౫౪

దీమసమున నాదపృష
ద్ధామంబుల మించి సర్వ - దా కన దాత్మా
రామునితో నొకటైతివి
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౫౫

పామరుఁడ జడుఁడ మూఢుఁడఁ
దామసుఁడను దుష్టచిత్త - తాత్పర్యుఁడ న
న్నేమాడ్కిఁ గటాక్షింతువో ?
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౫౬

వ్యోమాది భూతపంచక
మీమహి జంతువ్రజంబు - నీవిశ్వంబుఁ
నీమాయవలనఁ బొడమెను
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౫౭

హేమము సకలాభరణ
స్తోమంబైనట్లు సర్వ - తోముఖ! నీవే
భూమి సమస్తము నైతివి
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౫౮

కామవికారగుణాకృతు
లేమియు లే వరయ నీకు - నీవు ప్రపంచ
స్వామివి శ్రుతిగోచరుఁడవు
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౫౯

క్షేమ మలర శిష్య జన
స్తోమములకు స్వస్వరూపు - చూపుటకై లీ
లామర్త్యుఁడవై తోఁచితి
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౬౦

నా మానసకమలంబున
నీమహనీయోపదేశ - నిర్మలతత్వం
బేమఱక సంస్తుతించెద
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౬౧

నీమహనీయ దయారస
మేమాత్రము లేకయున్న - నిల మే లగునో
కో ? మముబోఁటి చెనటులకు
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౬౨

కామాదిరిపుల గెల్వఁగ
నీమంత్రార్థప్రభావ - నిశితాసి మన
స్తామరసంబునఁ బూనితి
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౬3

ఓమిత్యేకాక్షర మని
ఓమాపోజ్యోతి యని స - దుక్తి మహావా
క్యామలతత్వమయుండవు
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౬౪

ఆ మున్నీటికి మధ్యను
హేమరచితసౌధమున ర - హిం వెలుఁగు చిదా
త్మామృతకన్యాయుతుఁడవు
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౬౫

సామామ్నాయోపనిష
ద్ధామప్రకటిత పదార్థ - తత్త్వమసి ప్ర
జ్ఞామాత్ర సత్వరాత్మవు
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౬౬

భీమ మగు నవిద్యావన
సీమఁ విహరింపుచున్న - సింహం బగుదు
స్తామసమును ఖండించితి
శ్రీమద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౬౭

అనువొందు పంచవింశతి
కిని వేత్తై వెలుఁగునట్టి - కేవల సచ్చి
ద్ఘనమోదము నా కొనగూ
ర్చినసద్గురువర్య! జమిలి - శేషాచార్యా! ౬౮

కామదుగ జ్ఞానము ధీచి
త్తమనోహంకృతిచయంబు - దగ నంబరజా
తములకు నాస్పదమై మిం
చి మహాత్మై తగు చిదాత్మ - శేషాచార్యా! ౬౯

జ్ఞానహృదయధీమతులును
మానుగ హంకృతియు భ్రుకుటి - మధ్యముచే వ
క్షోనాభిగళాస్యంబుల
చే నెఱి వర్తించునంద్రు - శేషాచార్యా ! ౭౦

లలితప్రాణాపానం
బులు వ్యానోదానములును - బొసఁగ సమానం
బిల ననిలపంచకం బనఁ
జెలఁగు చిదానందచర్య ! శేషాచార్యా ! ౭౧

హృదయము ప్రాణ మపానము
గుదమును వ్యానంబు తనువు - గొలుపు నుదానం
బు దనరు గళమున విహరిం
చెదియె సమానంబు నాభి - శేషాచార్యా ! ౭౨

తనరఁగ ద్వక్కర్ణవిలో
చనరసనఘ్రాణములు వి - చారింప హుతా
శనపంచక మని భాగిం
చినసద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౭౩

వినదము స్పర్శయు రూపం
బును రసముఁ గంధముఁ స - ముజ్జ్వలముగ జీ
వనపంచక మని యెఱిఁగిం
చిన దేశికవర్య ! జమిలి - శేషాచార్యా ! ౭౪

ఇరవుగ వాక్కును బదములుఁ
గరములు గుదగుహ్యములును - ఘనతర మగుగ
వ్వారిపంచక మని తెల్పిన
చిరతోషావార్య ! జమిలి - శేషాచార్యా ! ౭౫

ఈ పంచీకృతవిశ్వము
లోపల వెలుపలను నిండి - లోపము లేకే
దీపించు సుధీవ్యాన్ని
తేప చిదానందచర్య - శేషాచార్యా ! ౭౬

కుండలి భేదించి వియ
న్మండలమును మించి బ్రహ్మ - మయుఁడవునై బ్ర
హ్మాండము నిండినప్రకృతిని
జెండినగురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౭౭

కుడియెడమల విహరించెడు
నిడయును బింగళయు నాఁగ - నిరుమార్గములన్
నడచు కరువలియు నిల్కడ
చెడనిదె గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౭౮

ఆ రెంటికి మధ్యస్థం
బై రంజిల్లెడి సుషుమ్న - యనుత్రోవ బయ
ల్దేరి చిదంబరసీమను
జేరినగురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౭౯

పారసపట్కంబునకుఁ
మీఱి సహస్రదళములను - మెఱయు ఘనసహ
స్రారాబ్జపీఠమున ద్యుతి
చే రాజిల్లెడిచిదాత్మ - శేషాచార్యా ! ౧౦

నాదపృషత్కళలకు న
త్యాదరముగ వెలయు ముక్తి - తామరసాక్షిఁ
మోదమునఁ గూడియుంటివి
శ్రీద చిదానందచర్య ! శేషాచార్యా ! ౧౧

విమలంబై దివ్య మచిం
త్యము సత్యము నిర్వికార - తత్వంబై త
త్వమసి సదర్థంబై మిం
చి మహత్పర మైతి వార ! శేషాచార్యా ! ౧౨

పంచవిధకోశములకుఁ
బంచమహాభూతకప్ర - పంచంబునకుఁ
మించి పరిపూర్ణమై భా
సించు పరాత్మైక్యభావ ! శేషాచార్యా ! ౧౩

పంచశరీరంబులకుఁ
బంచావస్థలకు మించి - ప్రజ్వలమై శ్రీ
మించి నిరామయమై శే
షించినగురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౧౪

పంచక్రియశక్తులకును
బంచనభంబులకుఁ గర్త్ర - పంచకమునకున్
మించి సుముక్తులపై భా
సించినగురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౭౫

నడ నుడి భావము లందున
విడువక యొకరీతిఁ జను వి - వేకులకుం జూ
ప్పడుఁగాక మోక్షమార్గము
చెడువారికి లభ్యమగునె ? శేషాచార్యా ! ౭౬

ఎనుబదినాలుఁగులక్షల
జననంబులలోన మనుజ - జన్మము గడుమే
లని యెంచఁగినందుకుఁ దరిం
చినవాఁడే మర్త్యుఁ డార్య ! శేషాచార్యా ! ౭౭

మానవజన్మము దొలఁగిన
దీనత నేజన్మ మెత్తి - తికమకపడునో ?
ధీనిధియై యిపుడే నీ
చే నియతిం జెందవలయు - శేషాచార్యా ! ౭౮

ఏమార్గము భావించిన
నీమార్గము దప్పఁ బోదు - నెంచి ముక్తికిఁ బ్ర
జ్ఞామార్గము నినుఁ గాంచఁగ
శ్రీమద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౭౯

ఈమర్త్యకోటిలోపల
నీమహిమను దెలియకున్న - నిర్మలుఁడగునా ?
కామాదులు విడఁజాలవు
శ్రీమద్గురువర్య జమిలి - శేషాచార్యా! ౯౦

ద్యోమణియుఁ బయస్కుంభ
స్తోమంబున బహువిధాలఁ - దోఁచినభంగిన్
భూమి సమస్తోపాధుల
సీమల నొప్పారుచుందు - శేషాచార్యా ! ౯౧

కలశ విభిన్నంబైనను
గలశ గతార్కుఁడు నిజార్కుఁ - గలిసినభంగిన్
దలఁపం జిదాత్మయగు తాఁ
జెలువొందుఁ బరాత్మ యగుచు - శేషాచార్యా ! ౯౨

ఒనర నిరాకారంబున
మొనసి చరాచరము గల్గి - మొత్తంబై వా
ర్ధిని వీచు లటుల వెలయిం
చినసద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౯౩

ఘనతంతుపంక్తి పటమై
తనరు క్రియఁ సర్వభూత - తతియైన పిఱుం
దను విశ్వమై ప్రకాశిం
చినసద్గురువర్య! జమిలి - శేషాచార్యా ! ౯౪

వనము తరంగము లైనటు
కనకము బహుభూషణప్ర - కారం బగు తె
న్నున నీవిశ్వాకృతిఁ దా
ల్చిన దేశికవర్య! జమిలి - శేషాచార్యా! ౬౫

హరికిన్ వ్యతిరిక్తము లే
దరయఁగ సర్వంబు శేవ - లాత్మ యగు పరా
త్పరుఁడని యెఱిఁగించితి సు
స్థిరతో షావార్య! జమిలి - శేషాచార్యా! ౬౬

ఆకసమున నీలంబు వి
లోకింపఁగఁ దోచె భ్రాంతి - లోఁగొంటను వి
శ్వాకృతిగాఁ దోచితి సు
శ్రీకర! గురువర్య! జమిలి - శేషాచార్యా! ౬౭

ఒగి రజ్జువందు నురగము
మృగతృష్ణికలను జలంబు - మిక్కిలి శశిశృం
గ గతిఁ బ్రపంచము దోచెను
జిగిమీఱ సదార్య! జమిలి - శేషాచార్యా! ౬౮

కలలోఁ జిత్రంబులు సం
కులమై చూపట్టి మేలు - కొనఁ గ ల్లగున
ట్లలరు జగద్విషయంబులు
చెలువంబులు వట్టిభ్రమలు - శేషాచార్యా! ౬౯

లేని నభోనీలంబును
బూని సమీక్షింప లేక - పోయినరీతిఁ
దా నచలబ్రహ్మం బగు
శ్రీనిగమాంతప్రచర్య ! శేషాచార్యా ! ౧౦౦

ఉరగభ్రాంతి దొలంగిన
మఱి రజ్జువు రజ్జువైన - మాడ్కి జగద్భ్రాం
తి రహితమే బ్రహ్మం బగు
చిరసౌఖ్యానందవర్య ! శేషాచార్యా ! ౧౦౧

ఘన కుంభ తటాకాఖ్యము
లను ద్రోసినఁ దద్గతాంబు - లక్ష్యం బేకం
బని జీవేశుల నటు లర
సిన నేకబ్రహ్మ మంద్రు - శేషాచార్యా ! ౧౦౨

కలశ గృహావరణంబుల
నిలిచినగగనంబు తుదకు - నిజ మొక్కటి యా
ట్టుల జీవపరైక్యంబై
చెలఁగిన నేకత్వ మమరు - శేషాచార్యా ! ౧౦౩

జీవేశోపాధిద్వయ
మీ విట్లు నిరాకరింప - నిటు సద్బ్రహ్మం
బై వెలయు ననుచుఁ దెలిపితి
సేవితబుధవర్య ! జమిలి - శేషాచార్యా ! ౧౦౪

వృష్టికి శీతల మనక య
రిష్టోష్ణములకు రవంత - ప్రిదులక యెపుడే
కష్టము నొందక యచలత
శిష్టత నలరారినావు - శేషాచార్యా ! ౧౦౫

పలుకదు పలుకుల నంటదు
నలఁగదు మఱి లేశమైన - నానాగతులన్
వెలుఁగొందు బట్టబయలై
చెలువుగ గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౧౦౬

జననమరణాద్యవస్థల
ననిశంబు నెఱుంగరాని - యవ్యయమార్గం
బును జూపి యచల మొందిం
చినసద్గురువర్య ! జమిలి - శేషాచార్యా ! ౧౦౭

అదరదు బెదరదు ముదురదు
గదురదు మఱి యెందుకైనఁ - గలఁతపడదు కాఁ
బదరదు బయలుకు బయలై
చెదర దని వచించినావు - శేషాచార్యా ! ౧౦౮

అలుగదు కలఁగదు మెలఁగదు
మలఁగదు మఱి దేనిచేత - మఱుఁగుపడదు కే
వలపరిపూర్ణ మచలమై
చెలువొందు నటంటి వౌర ! శేషాచార్యా ! ౧౦౯

పుట్టదు మహాదాదులవలె
గిట్టదు మఱి యెన్నటికిని - గీడుఁ మేలుఁ
బట్టదు మూలప్రకృతి యను
చెట్టుకు మే ల్పట్టుగొమ్మ - శేషాచార్యా !

బాగుగ నిది విని చదివిన
నాగమతత్త్వజ్ఞులను జి - రాయుశ్శ్రీచి
ద్భోగసుఖాత్ములఁ జేయును
శ్రీ గురుదేవ స్తవంబు - శేషాచార్యా !

ఈ గురుశతకము నీదు కృ
పాగరిమ రచించినాఁడఁ - బరసౌఖ్యాపే
క్షాగరిమఁ బీరుదాసుఁడ
శ్రీగురుకులవర్య ! జమిలి - శేషాచార్యా !

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః



ఓమ్

# నమశ్శివాయ గేయము



ధ్యానశ్లోకములు

నమామి గౌరాద్ధమనం సదాశివం
భజామి బాలేందుకిరీటశోభితమ్
వదామి పంచాక్షరమంత్ర మద్భుతం
కరోమి గంగాధరపాదపూజనమ్.

వందే శంకర మానందం
వందేహం విశ్వరూపకమ్
వందే గిరీశ మద్వైతం
వందేహం సత్పరేశ్వరమ్.

శ్రీపార్వతీవల్లభా - సంవిత్స్వ -
రూప! మాయిక! దుర్లభా!
పాపాబ్జవనమ చేభా - మోక్షప్ర -
దీపకర! నమశ్శివాయ. ౧

నీపాదకమలసేవ - చే మన -
స్తాపములు చల్లారును
కాపాడి రక్షింపవే - భవదీయ -
కరుణచే నమశ్శివాయ. ౨

శరణు పరమేశ్వరాయా ! - రుద్రాయ -
శరణు విశ్వేశ్వరాయా !
శరణు భద్రప్రదాయా ! - కావవే -
శరణంటి నమశ్శివాయ. ౩

త్వన్నామ పంచాక్షరీ - మంత్రంబుఁ -
దవిలి పఠియించువారీ
భవపాశములఁ జిక్కకే - మోక్షంబుఁ -
బడయుదురు నమశ్శివాయ. ౪

పలుపాతకములఁ జేసి - నరకబా -
ధల నొంది కుందనేలా ?
తలఁప నీచరణసేవం - జేసి ని -
ర్మలుఁ డగును నమశ్శివాయ. ౫

నిరతమును సత్కర్మము - లొనరింప -
నెఱుఁగ శివభక్తజనుల
పరిచర్యసేయ నెఱుఁగ - మన్నింపు -
మరలేక నమశ్శివాయ. ౬

పరసత్వ మెద లేకయే - రసనచే -
విరసోక్తు లాడుచుందుఁ
గిరిశ ! నీనామ మెపుడు - నాయందుఁ -
గీల్కొల్పు నమశ్శివాయ. ౭

ఎందునఁ దిరంబు లేకే - యీజన్మ -
మొందితి నిరర్థముగను
మందె మేలంబు నుడిపి - నీభక్తిఁ -
బొందింపు నమశ్శివాయ. ౮

ఉదయించినది యాదిగా - నీపణో -
న్మదవృత్తి మెలఁగు నేను
మదనారి ! నిన్నుఁ దలఁప - లేనైతి -
మదిలోన నమశ్శివాయ. ౯

కుజనసంగతి చేతను - నీపాద -
భజన మించుక లేకయే
వృజిన మార్జించునట్లు - సేయ కో -
విశ్వేశ ! నమశ్శివాయ. ౧౦

వినఁ గోరు వీను లెపుడు - లోకరం -
జన ! ప్రాకృతోక్తు లందు
నెనయింపకే నీకథల్ - శ్రవణముల -
వినిపింపు నమశ్శివాయ. ౧౧

తను వగురుమాల్యాంబరా - దులఁ దాల్పఁ -
జననీక నీపదాబ్జ
మున నంటు రజముభూతి - నామేన -
నునుపవే నమశ్శివాయ. ౧౨

కనులు ప్రాకృతవస్తుల౯ - గనఁ గోరు -
ననుదినం బీవిధమున
మనసిజారి ! తావకా - కృతులందుఁ
బనుపఱుపు నమశ్శివాయ. ౧౩

పరసముగ బాహ్యరుచుల - నాజిహ్వ -
మరగి తనియక యుండును
బరమేశ ! దివ్యనామ - స్మరణంబు -
పురికొల్పు నమశ్శివాయ. ౧౪

ఘనసుగంధాదులందు - ఘ్రాణంబు -
కామింపుచుండు నీశా !
నినుఁ బూజసేయు పుష్ప - వాసనల -
నెనయింపు నమశ్శివాయ. ౧౫

నరభవంబున జనించి - సువివేక -
మరయ లేశము లేకయే
నెరసు లెంచెడియుల్లముల్ - నిర్మలము -
పఱచు మీఁక నమశ్శివాయ. ౧౬

ఇనుము పరుసము సోకఁగాఁ - బసిఁడియై -
తనరినటు లెవ్వరైన౯
నినుఁ గొల్చి ధన్యు లౌదు - రీమాట -
నిశ్చయము నమశ్శివాయ. ౧౭

అవసరం బైనయపుడు - శివశివా ! -
యని పల్కఁ గలనో లేనో ?
భవహారా ! ని న్నిప్పుడే - తలఁచెదను -
బాలింపు నమశ్శివాయ. ౧౮

జారుఁడను పామరుఁడను - బహుదురా !
చోరుఁడను మూఢాత్ముఁడఁ
గ్రూరుఁ డని తలఁప కిపుడు - క్షమియింపు -
నేరములు నమశ్శివాయ. ౧౯

తనయుఁ డొక్కఁడ నేరముం - జేసినను -
దండ్రి మన్నించునటుల
ఫణివిభూషణ ! సాపరా - ధిని నన్నుఁ -
బాలింపు నమశ్శివాయ. ౨౦

అజునిసృష్ట్యాదిగా నీ - జన్మప -
ర్యంతమును భవము లెన్ని
నిజము జన్మించినానో - లెక్కింప -
నేర్తు నే నమశ్శివాయ. ౨౧

ఇట కెన్నిభవములైన - శివ ! మహా -
నట ! నీపదాబ్జసేవా
ఘటనచేఁ గడఁగంటిఁగా - నీకటా -
క్షమున నే నమశ్శివాయ. ౨౨

దండధరభటరౌద్రముక్ - విన్నంత -
గుండె లదురుచు నుండును
దండివెతల నడంపఁగా - నీవె నా -
కండ వగుము నమశ్శివాయ. ౨౩

మొనసి కామక్రోధముల్ - లోభ మద -
మోహ మత్సర వికృతులు
నెనసి పీడింప నేను - ని న్నెట్లు -
వినుతింతు నమశ్శివాయ. ౨౪

మనుజునకుఁ దృష్ణయనెడు - గ్రహ మొకటి -
యొనసి పీడింప నతఁడు
వెనుకముందఱ దోఁచకే - తపియించు -
ననిశంబు నమశ్శివాయ. ౨౫

ఈషణత్రయముచేత - రాగవి -
ద్వేషములచే డెందము
దూషితం బయ్యె నన్ను - గురుకృపం -
బోషింపు నమశ్శివాయ. ౨౬

పలువిచారములచేత - నామనసుఁ -
జలనంబు బొందింపకే
మలహరా ! నీనామము - నుల్లమున -
నిలుపవే నమశ్శివాయ. ౨౭

కాలంబుఁ గడచె వృధగా - మాయావి -
కార దుర్విషయములచే
ఫాలాక్ష ! యింకనైన నన్ - జేయు నీ -
భక్తునిగ నమశ్శివాయ. ౨౮

నా నేరములు క్షమించి - శరణార్థి -
నీనామమంత్ర మొసఁగి
పూని శివసాయుజ్యముం - బొందింప -
వే నీవు నమశ్శివాయ. ౨౯

తలఁపునందు జనించిన - సంకల్ప -
ముల కర్మ వాసనలచేఁ
బలువెతలఁ గారింపకే - నను నీకృ -
పన్ మనుపు నమశ్శివాయ. 30

కరికర్ణవిధముగా నా - మానసం -
బొఱసి యూఁగుచు నుండును
పురవైరి ! నిర్మలముగాఁ - జేసి నన్ -
బోషింపు నమశ్శివాయ. 3౧

ఉదరపోషణమునకునై - సర్వదా -
యూరకను జీవకోటిం
జదిపి చెనటులఁ గొల్చి నే - ఖలుఁడైతి -
సవరింపు నమశ్శివాయ. 3౨

ఇలను నేను జనించిన - దాదిగా -
నలఘునిద్రాశనముల
నలవఱచుటాయె నెపుడు - ని న్నెట్లు -
గొలిచెదను నమశ్శివాయ. ౩౩

దివము రాత్రులయందును - విషయాను -
భవముచేఁ బ్రొద్దుఁ గడిపి
యవివేకమునఁ జరించు - చున్నాఁడ -
నపరాధి నమశ్శివాయ. ౩౪

ఊర కున్నప్పుడైన - మనసు నిన్ -
గోరి ధ్యానింపఁ బోదు
క్రూరచిత్తుఁడ న న్నెటుల్ - పాలింతు
వో ! రమణ నమశ్శివాయ. ౩౫

ఎంతదుష్టాత్ముడైన - నీనామ -
చింత గల్గినయంతనే
యంతర్వ్యథలు నొనర్చి - ప్రోతు వ -
త్యంతకృప నమశ్శివాయ. ౩౬

శివభక్తజనపాదరా - జీవముల -
చెంతఁ జేర్పవె సత్కృప
నవిరళానందపదవిం - బొందింపు -
మయ్య నన్ నమశ్శివాయ. ౩౭

పురహరా ! యెన్నిగతుల - నైన నిన్ -
నిరతంబు నుల్లమునను
మఱపులే కునికికంటెఁ - మేలేది ? -
పరమేశ ! నమశ్శివాయ. ౩౮

ఐహికాముష్మికములం - గాంక్షింప -
కూహ నేమఱనిభక్త
వ్యూహంబు లొందఁ గలవు - చిన్మదో -
త్సాహంబు నమశ్శివాయ. ౩౯

మఱియు సృష్టికిఁ బూర్వము - సన్నిరా -
మయ నిరంజనరూపమై
పరగి నిర్భిన్న మగుచు - నుందువే -
పరమేశ ! నమశ్శివాయ. ౪౦

ఘనసచ్చిదానందమై - యద్వితీ -
య నిరాకారాత్మ యగుచుం
దనరు తత్వం బీవని - వేదముల్ -
దలపోయు నమశ్శివాయ. ౪౧

రహిం దేశకాలవస్తు - విచ్ఛేద -
రహితమై నిర్బాధ్యమై
మహితమై యుంట నిన్ను - స్వతంత్రు -
మాన్యు లాగి నమశ్శివాయ. ౪౨

తెలివిచే సర్వదృశ్య - పుంజములఁ -
దెలియఁగాఁ జేయుకతన
నలఘుచి త్తంద్రు నిన్ను - వేదవే -
దాంతముల నమశ్శివాయ. ౪3

అమితసుఖదుఃఖములకు - వేఱగుచు -
నవిరళ సుఖాకారమై
యమరుకతమునఁ బండితు - లానంద -
మని యంద్రు నమశ్శివాయ. ౪౪

వికృతిలేశము లేకయే - నీయందు -
వికృతిమయమైన మాయా
ప్రకృతి ముకురమునం దటుల్ - గనుపట్టె -
ప్రతిగాను నమశ్శివాయ. ౪౫

ప్రతిఫలించిన బ్రహ్మమై - తన్యసం -
గతమైనఛాయ మాయా
యుత మహేశ్వరసంజ్ఞతోఁ - ద్రిగుణసం -
తతిఁ గూడె నమశ్శివాయ. ౪౬

సరజస్తమస్సత్వముల్ - వేర్వేఱఁ -
బరఁగి వికృతులతోడను
వరుసఁ దత్త్వజ్ఞులంద్రు - త్రిగుణపరి -
వార మని నమశ్శివాయ. ౪౭

నీయందుఁ బ్రకృతి గూడి - సువికార -
భూయిష్ఠ మైనప్పుడు
మాయాప్రపంచ మిటులం - గనుపట్టె -
మహిమతో నమశ్శివాయ! ౪౮

భవదీయసంకల్పము - తామసిక -
భావమును బొంది మాయా
భువనప్రకాశ మైన - విధ మంద్రు -
వివరముగ నమశ్శివాయ. ౪౯

భూతంబు లైదు మనసు - శేముషీ -
చేతసాహంకృతి గణో
పేతమై తోఁచె సచరా - చరభూత -
బృంద మిల నమశ్శివాయ. ౫౦

తనరు నీపంచభూత - సత్వౌఘ -
జనిత మంతఃకరణము
ననువుగా నందుఁ గలిగి - చిత్తజీ -
వాత్మయె నమశ్శివాయ. ౫౧

చెలఁగి నాలుగు ధీమనో - హంకార -
చిత్తవృత్తుల విభేద
ములఁ దదంతఃకరణము - వర్తింపఁ -
గలదంద్రు నమశ్శివాయ. ౫౨

నాణె మగుపంచభూత - గుణముచేఁ -
ఘ్రాణ మేకం బగుచును
రాణించుఁ బంచగతుల - నని యంద్రు -
రసికు లిటు నమశ్శివాయ. ౫౩

పూని ప్రాణాపానముల్ - వ్యానం బు -
దాన మరయ సమానముఙ్
మేని కాధార మని రీ - పంచపవ -
మానములు నమశ్శివాయ. ౫౪

మొనసి ప్రత్యేకభూత - సత్త్వగుణ -
మునను జ్ఞానేంద్రియములు
జనియించి నిజకర్మములను - మే లొప్పఁ -
గనుచుండు నమశ్శివాయ. ౫౫

అలకర్ణచర్మనేత్ర జి - హ్వానా -
సలుగ బుద్ధీంద్రియములు
లలి పంచవిషయంబుల - వేర్వేఱఁ -
దెలిసికొను నమశ్శివాయ. ౫౬

విలసిల్లుభౌతికతమో - గుణముచే -
విషయములు ప్రభవించెను
దలఁప శబ్దస్పర్శరూ - పరసగం -
ధము లేను నమశ్శివాయ. ౫౭

తడయఁకను భౌతికరజో - గుణముచేఁ -
బొడమెఁ గర్మేంద్రియములు
పుడమిఁ బంచవిధంబులై - కర్మవి -
స్ఫూర్తికిని నమశ్శివాయ. ౫౮

బలిసి వాక్కరపాదముల్ - పాయూప -
స్థలు నాఁగ నామములను
దలఁపుదురు తత్త్వజ్ఞులు - మిగులతా -
త్పర్యమున నమశ్శివాయ. ౫౯

వచియించుఁ బనులుచేయు - గమనించుఁ -
బ్రచురత విసర్జించును
అచట నానందించును - విషయంబు -
లై దంద్రను నమశ్శివాయ. ౬౦

కుముదహితుఁడు బృహస్పతి - క్షేత్రజ్ఞుఁ -
డమరు నీలగ్రీవుఁడు
గోమ రంతరింద్రియముల - కధిపతులు -
క్రమముగా నమశ్శివాయ. ౬౧

దిశలు మారుతభానులు - నశ్వినీ -
దేవతల్ వరుణుఁ డరయఁగ
విశద శ్రోత్రాదులకును - నధిపతుల్ -
వేర్వేఱ నమశ్శివాయ. ౬౨

దీపించు నగ్నీంద్రులు - విష్ణుప్ర -
జాపతుల్ మృత్యు వచట
నీ పంచకర్మేంద్రియ - కర్తలై -
యొసఁగుదురు నమశ్శివాయ ౬౩

మానసాదులు నాలుగు - ప్రాణపవ -
మానంబు లైదు కర్మ
జ్ఞానకరణములు విషయా - త్మలు నిర్వ -
దేనయ్యె నమశ్శివాయ. ౬౪

పంచభూతములు బలిసి - యొండొందు -
పంచీకృతం బగుచును
మించ సృష్టించి తౌర! - స్థూలప్ర -
పంచంబు నమశ్శివాయ. ౬౫

జ్ఞానకర్మేంద్రియములు - ధీమనః -
ప్రాణాదులును బదేడు
నైన దీసూక్ష్మసృష్టి - యని యంద్రు -
ధీనిధులు నమశ్శివాయ. ౬౬

ఈస్థూలసూక్ష్మములకు - సంభవ -
ప్రస్తార మగునవిద్య
నిస్తుల్యకారణమునై - జీవులకు -
నస్తి గను నమశ్శివాయ. ౬౭

దేహ త్రయంబుచేత - భువనసం -
దోహముల్ విస్తరించె
నూహింపఁగా నామరూ - పములచే -
నుప్పతిలు నమశ్శివాయ. ౮౮

కొన్నియు జరాయుజములు - నండములఁ -
గొన్ని సంభవ మయ్యెను
గొన్ని యుర్వీభవములు - తడిచేతఁ -
గొన్నయ్యె నమశ్శివాయ. ౮౯

ఈ నాల్గువిధములైన - భూతముల -
మానవాకృతి యుత్తమం
బైన దని యార్యు లంద్రు - నిర్మల -
జ్ఞానమున నమశ్శివాయ. ౭౦

ఈభవమునందెకానీ - మోక్షంబు -
నేభవంబునను లేదు
ప్రాభవము దెలియలేక - వ్యర్థుఁ డగుఁ -
బామరుఁడు నమశ్శివాయ. ౭౧

నరతిర్య గాదులందుఁ - బుట్టుచును -
మురికిబాధలకు లోనై
పరితపించుచు నుందురు - దుష్కర్మ -
పాలగుచు నమశ్శివాయ. ౭౨

కలయోనులను బుట్టుచు - స్వర్గనర
కములఁ బొందుచుఁ గుందుచు
నిలక డెంతయు లేక జా - ములచేత -
నలిగెదరు నమశ్శివాయ. ౭౩

తలపోయ నిల నెనుబది - నాల్గుల -
క్షలజాతముల జనించి
పొలసి యలమట నొందుచు - సుఖ మింత -
పొందరే నమశ్శివాయ. ౭౪

వసుధ మానవజన్మము - నెత్తగా -
వలసి కర్మాధీనుఁడై
పొసఁగ నీగర్భకూపం - బులఁ బడును -
దెసలేక నమశ్శివాయ. ౭౫

హర ! భవత్కృప గల్గిన - జ్ఞప్తిచే
నరయుచును డెందమునను
ధరఁ దొంటి భవబాధలు - క్రమముగాఁ -
దలపోయు నమశ్శివాయ. ౭౬

ఇఁకఁ జాలు నీపుట్టువుల్ - ఛీ ! వృథా -
యిఁకనైన భవునిఁ గొలిచి
యకలంకపద మొందెద - నంచు సా -
రెకుఁ దలఁచు నమశ్శివాయ. ౭౭

పాడము నెడ మాతృగర్భ - మున నిల్వఁ -
బడుటకును వ్యవధి లేక
పుడమిపై నూడిపడిన - మఱచి వా -
పోవు మును నమశ్శివాయ. ౭౮

తల్లిచనుబాలు గ్రోలి - బ్రతికి పో -
త్తిళ్ళ మలమూత్రములను
గ్రుల్లి పొర్లుచు నుండును - దుర్గంధ -
కూపమున నమశ్శివాయ. ౭౯

బాల్యమున నజ్ఞవృత్తిఁ - జిత్తచాం -
చల్యమున వర్తించును
లౌల్యమున యౌవనమున - దుర్విషయ -
లంబి యగు నమశ్శివాయ. ౮౦

అతిజరాభారమునను - బహుళసం -
స్మృతి మోహమును బాయకే
అతుకుగాఁ గర్మపాశ - బద్ధుఁడై -
వెత లొందు నమశ్శివాయ. ౮౧

అవివేకవర్తనంబు - లీలాటి -
వంచు నారసి మనుజుఁడు
సువివేకసరణియందు - నుల్లంబుఁ -
జొన్పవలె నమశ్శివాయ. ౮౨

పరతత్త్వవేదియైన - దేశికుని -
చరణాంబుజముల నొంది
యురుభక్తి సన్నుతోప - దేశంబు -
నొందవలె నమశ్శివాయ. ౮౩

తలిదండ్రి సతులు సుతులు - నేజన్మ -
ములనైనఁ గలరు హితులు
నెలమిఁ దనుఁ దెల్పుగురుఁడు - గల్గు టరు -
దిలలోన నమశ్శివాయ. ౮౪

మనుజభవమునసె గురుఁడు - సుజ్ఞాన -
మార్గంబుఁ జూపఁ గలఁడు
గనుక విద్యాభ్యాసికి - దేశికుఁడు -
గావలయు నమశ్శివాయ. ౮౫

గురుకరుణ విద్య లెన్ని - వేర్వేఱఁ -
గలుప నాత్మజ్ఞానము
నెఱుఁగరా దాత్మవిద్య - లేకున్నఁ -
బరమేశ ! నమశ్శివాయ. ౮౬

సదయుండు నిష్కాముఁడు - పరమార్థ -
విదుఁడైనగురువర్యుని
వెదకి తన్నుఁ గృతార్థునిం - జేయు మని -
వేడవలె నమశ్శివాయ. ౮౭

శరణార్థియగుచు గురునిఁ - బ్రార్థింపఁ -
గరుణించి తన్మహాత్మ్యం
డిరవుగా నభయ మొసఁగి - శిరముపైఁ -
గర ముంచు నమశ్శివాయ. ౮౮

ఓశిష్యతిలక! నీకుఁ - దత్త్వోప -
దేశ మొనరింతు నిపుడు
వాసిగా నాల్గుసాధ - నములు గల -
వాఁడ వను నమశ్శివాయ. ౮౯

వారకను సాధనచతు - ష్టయము గల -
వార లధికారు లండ్రు
ధీరు లొనరింతు రిట్లు - తత్త్వోప -
దేశంబు నమశ్శివాయ. ౯౦

ఇది నిత్య మది యనిత్యం - బని యెఱిఁగి -
మది వివేకించు టొకటి
త్రిదశైహికార్థసౌఖ్యం - బులఁ గోర -
నిది యొండు నమశ్శివాయ. ౯౧

సదమలం బగుశమాది - షట్కసం -
పదఁ గల్గి యుండు టొకటి
హృదిని మోక్షేచ్ఛమాత్ర - ముండుటే -
యిది యొండు నమశ్శివాయ. ౯౨

ఈచతుర్విధసాధనం - బులు గల్గి -
యాచార్యుకడను జేరి
యాచరింపఁగవలయును - శుశ్రూష -
లని చెప్పు నమశ్శివాయ. ౯౩

మనములోనఁ గళంకము - లేశమై -
నను లేక హరియు హరుఁడు
జనని జనకుఁడు గురుఁ డని - తలపోయు -
మని చెప్పు నమశ్శివాయ. ౯౪

తను ధన స్వాంతములు దే - శికుని సొ -
మ్మని నివేదన మొనర్చి
తను పరాధీనుఁ డగుచు - మెలఁగవలె -
నని పల్కు నమశ్శివాయ. ౯౫

ఏసరణి గురుసరణికి - సాటిలే -
దీసర్వజగములందు
ధీ సాక్షిగా నమ్ముమీ - యని తెల్పు -
ధృఢముగా నమశ్శివాయ. ౯౬

అటుల శిష్యునిమానసం - బరసి యు -
త్కట దయాదృష్టిఁ గాంచి
యట బ్రహ్మవిద్య గురుఁడు - దా నిచ్చె -
నని పల్కె నమశ్శివాయ. ౯౭

గురుఁడు శిష్యునితోడను - నీరీతి -
గురుభక్తిఁ జేసినంత
పరవి దేశికుఁ డప్పుడు - బోధింప -
సాగె నిటు నమశ్శివాయ. ౯౮

ఉరగంబు రజ్జు వందుఁ - గన్పించు -
తెఱఁగు నీబ్రహ్మ మందుఁ
బరఁగి యీవిశ్వ మెల్లఁ - గన్పట్టు -
భ్రాంతిచే నమశ్శివాయ. ౯౯

పరికింప రజ్జు వందు - సర్పం బ -
భావమై రజ్జు వున్న
తెఱఁగు లేనిప్రపంచమై - బ్రహ్మంబు -
దెలియు మనె నమశ్శివాయ. ౧౦౦

ఈవడువున సదుక్తులు - బోధించి -
కేవ లాత్మానుభవము
భావమునఁ బట్టునట్లు - పురికొల్పు -
పరమాత్మ నమశ్శివాయ. ౧౦౧

బ్రహ్మమందె జనించును - సర్వప్ర
పంచంబు నందె వెలయు
బ్రహ్మంబునందె కలియు - మిగులునది -
బ్రహ్మ మనె నమశ్శివాయ. ౧౦౨

అదె పరబ్రహ్మ మరయు - మది సత్య -
మది నిర్వికారతత్వ
మది పూర్ణ మది శుద్ధము - నది బ్రహ్మ -
మని తెల్పె నమశ్శివాయ. ౧౦౩

అదె విరించి ముకుందుఁడు - నదె శర్వుఁ -
డదియె విశ్వేశ్వరుండు
నదె పరాత్పరుఁ డంచును - వివరించు -
సదయుఁడై నమశ్శివాయ. ౧౦౪

తలపోయఁ దరముగాక - వాక్కుచేఁ -
బలుకంగ వశముగాక
తలఁ పెందు నిల్వఁబడునో - యది తాను -
తత్వ మను నమశ్శివాయ. ౧౦౫

మాయతో నది కూడఁగా - నీశ్వరుం -
డాయె; నటుల నవిద్యను
బాయకను జీవుఁ డయ్యె - నని తెల్పు -
పరమేశ ! నమశ్శివాయ. ౧౦౬

కారణోపాధి యీశుఁ - డయ్యె నీ -
కార్యంబు జీవుఁ డయ్యె
నారయఁగ ద్వివిధలక్ష - ణము లిట్టు -
లని తెల్పు నమశ్శివాయ ౧౦౭

సరస పిండాండకార్య - తత్త్వంబు -
లిరువదియు నాలు గయ్యె
వరుసఁ బరికింపు మనుచు - బోధించుఁ -
గరుణతో నమశ్శివాయ. ౧౦౮

సకలవ్యవహారములకు - హేతు వగు -
నకట కారణబీజము
నొకట కార్యాకారమై - విశ్వంబు -
నొనరె నను నమశ్శివాయ. ౧౦౯

పంచభూతములు మొదల - నొండొండు -
పంచభాగంబు లగుచుఁ
బంచవింశతితత్త్వము - లయ్యె భా -
వించు మనె నమశ్శివాయ. ౧౧౦

పదియు బాహ్యేంద్రియములు - ప్రాణాది -
పంచకము విషయంబులు
తుదిఁ జేరి కరణంబు లి - ర్వదినాల్గు -
దోఁచె నను నమశ్శివాయ. ౧౧౧

ఇవి మూఁడు తెఱఁగు లయ్యె - స్థూలసూ -
క్ష్మవిధకారణము లనఁగా
వివరింప జీవునకును - నెలవు భా -
వింపు మనె నమశ్శివాయ. ౧౧౨

స్థూలదేహాభిమాని - యై విశ్వ -
లీలముఖమున వసించి
యోలి జాగ్రదవస్థను - భోగింపు -
చుండె నను నమశ్శివాయ. ౧౧౩

తేజసూక్ష్మాంగసాభి - మానియై -
తైజసాఖ్యను గళమున
నోజఁ గల లనుభవించి - విహరించు -
చుండె నను నమశ్శివాయ. ౧౧౪

ఘనకారణాంగవశుఁడై - ప్రాజ్ఞుఁ డనఁ -
గా వక్షమున వసించి
యొనయు నిద్రావస్థను - భోగించు -
నని చెప్పు నమశ్శివాయ. ౧౧౫

తలిదండ్రి శుక్లశోణి - తములచే -
వెలయు నీ స్థూలతనువు
తలఁప నన్నమయకోశ - మగు నంచుఁ -
దెలిపె నిటు నమశ్శివాయ. ౧౧౬

ప్రాణాదిమారుతంబు - లీయైదుఁ -
ప్రాణమయకోశ మండ్రు
మానసము జ్ఞానేంద్రియ - ములు మనో -
మయ మండ్రు నమశ్శివాయ. ౧౧౭

మఱియు జ్ఞానేంద్రియములు - విజ్ఞాన -
మయకోశ మంద్రు దనకు
నితర మీకోశంబులు - దాఁ గాని -
దెలుఁగు మనె నమశ్శివాయ. ౧౧౮

మానుగను బ్రాణమయము - విజ్ఞాన -
మయ మనోమయము లరయఁ
బూని సూక్ష్మాంగ మయ్యె - నని యిట్లు -
బోధించె నమశ్శివాయ. ౧౧౯

మహిని గాఢాజ్ఞానము - నానంద -
మయకోశ మంద్రు బుధులు
మహిమ నిది కారణాంగ - మని తెల్పె -
మద్గురుఁడు నమశ్శివాయ. ౧౨౦

ఈవిధి చతుర్వింశతి - తత్వములు -
నీవుగా విన్నిటికిని
భావింపఁ బ్రత్యగాత్మ - వని తెల్పె -
వరగురుఁడు నమశ్శివాయ. ౧౨౧

ఈ మూఁడు దేహములకు - వివరింప -
నీ మూఁ డవస్థలకును
శ్రీ మించి వెల్గునట్టి - యాత్మ వని -
చెప్పె నిటు నమశ్శివాయ. ౧౨౨

విశ్వతైజసప్రాజ్ఞనా - మములచే -
వివశుఁడై త్రివిధగతుల
నశ్వరస్థితి సంసృతి - బద్ధుఁ డౌ -
వని తెల్పె నమశ్శివాయ. ౧౨౩

మాయావశిత్వమునను - మూఢుఁడై -
కాయంబె తా నంచును
శ్రేయఃపదముఁ గానకే - చెడిపోవు -
జీవుఁ డను నమశ్శివాయ. ౧౨౪

పంచకోశములకడను - నేతత్ప్రి -
పంచ బహిరంతరముల
నంచితస్ఫూర్తి వెలుఁగు - నదియు నీ -
వని తెల్పె నమశ్శివాయ. ౧౨౫

దేహేంద్రియములు గావు - ప్రాణసం -
దోహ మంతఃకరణము
దేహిగా విందులకును - సాక్షి వని -
తెలియఁదగు నమశ్శివాయ. ౧౨౬

వినుము వ్యష్టిసమష్టులు - భావించి -
కను మవిద్యామాయలు
నొనరఁ బిండాజాండము లు - సాధు లౌ -
నని చెప్పె నమశ్శివాయ. ౧౨౭

జీవేశ్వరోపాధుల - నిరసింప -
జీవశివు లైక్య మగుచుఁ
గేవ లాత్మయి వెల్గును - నీవు పరి -
కింపు మనె నమశ్శివాయ. ౧౨౮

ఘటతటాకములఁ ద్రోసి - పుచ్చినం -
తట జలం బేక మైన
యటులఁ బ్రత్యక్పరాత్మల - నైక్య మని -
దిటపఱిచె నమశ్శివాయ. ౧౨౯

నీవె బ్రహ్మం బైతివి - బ్రహ్మంబు -
నీ వైతి వని సోహమ్మ
భావానుభవము చేతఁ - జూడు మనె -
భక్తునకు నమశ్శివాయ. ౧౩౦

గాలికిం దూలిపోదు - వహ్నిచేఁ -
గాలఁబో దెప్పటికిని
నోలి నీటం దడియదు - బ్రహ్మ మని -
యొప్పించె నమశ్శివాయ. ౧౩౧

నీవు కామవికారముల్ - హృదయంబు -
గా వహంకృతిచిత్తముల్
గావు సాక్షి చిదాత్మవు - సత్యంబు -
గను మనియె నమశ్శివాయ. ౧౩౨

తను విం(ద్రియవికారముల్ - దోచిన -
ట్లనుమాన మింతె కానీ
యొనయ వెన్నటికి నిన్ను - నిర్మలుఁడ -
వని తెల్పె నమశ్శివాయ. ౧౩౩

ఎన్నితనువులు వచ్చినం - బోయినను -
నన్నిటికి మీాఁతె నీవు
చెన్నెసఁగుచుందు వనుచు - బోధించె -
సిద్ధముగ నమశ్శివాయ. ౧౩౪

నీవె బ్రహ్మం బనుచును - బల్కెడును -
మహావాక్యములు నాలుగు
భావింప దృష్టాంతమా - నని తెల్పె -
భద్రముగ నమశ్శివాయ. ౧౩౫

అందుఁ ద త్త్వ మసి బ్రహ్మ - మనుసన్మ -
హావాక్యసరణి మిగులఁ
జెందు నేకత్వంబున - విను మంచుఁ -
జెప్పె నిటు నమశ్శివాయ. ౧౩౬

అరయఁ ద త్త్వం పదముల - వాచ్యార్థ -
మిరవొందు జీవశివులు
పరవి నైక్యం బసి పదా - ర్థం బంచు -
నెఱిఁగించె నమశ్శివాయ. ౧౩౭

ఉభయవాచ్యార్థములను - గడద్రోయ -
సుభయ లక్ష్యార్థములకు
నభయత సద్వైక్యత్వము - సహజ మగు -
నని తెల్పె నమశ్శివాయ.

నిర్వికారి వజుండవు - సత్యంబు -
నిర్వికల్పుఁడవు నీవు
సర్వంబు నీయందునఁ - దోచు మై -
చాయఁగా నమశ్శివాయ.

నీవె నీవై యెప్పుడుఁ - బరికింప -
నీకంటె వేఱు లేక
కేవలానందసిద్ధిఁ - బొంది పరి -
కింపు మనె నమశ్శివాయ.

అనుదినం బిదియు నెదను - నిశ్చయం -
బలవఱచి సందేహము
నునుచకే ధ్యానింపుము - బ్రహ్మ మిా -
వని తెల్పె నమశ్శివాయ.

సకలసంశయరహితుఁడై - సర్వదా -
సచ్చిదానందరూప
మకలంకమూర్తి తానై - వెల్గు ననె -
వమలతను నమశ్శివాయ.



శ్రీ ఇంటూరి సీతయ్య దంపతులు

అనుపమాచలపూర్ణుఁడై - దివ్యసిం -
హాసనారూఢుఁ డగుచు
ఘనసదానందసిద్ధి - వెల్గొందు -
నని తెల్పె నమశ్శివాయ. ౧౪౩

నీవే చరాచరములు - విశ్వంబు -
నీ కన్య మేమి లేదు
పావనస్ఫూర్తితోను - బయలందు -
బ్రహ్మ మనె నమశ్శివాయ. ౧౪౪

తెలివిమాలినవాఁడనై - యీరీతిఁ -
బలికె నని ప్రాజ్ఞులందుఁ
దలఁపకను బ్రోవవలయు - నా కేమి -
దెలియునది నమశ్శివాయ. ౧౪౫

కన్నబిడ్డల పలుకులు - తండ్రులకు -
కర్ణపేయము లగుఁగదా
కన్నతండ్రివి నానుడుల్ - ప్రియమునఁ -
గని ప్రోవు నమశ్శివాయ. ౧౪౬

చదువఁబోవను వేదముల్ - జడుఁడనై -
చదువఁబోవను శాస్త్రముల్
వదరితిని వచ్చినట్లు - మన్నించి -
పద మిమ్ము నమశ్శివాయ. ౧౪౭

శరణు శ్రీకాశీశ్వరా - విశ్వేశ -
శరణు భవభయవినాశా!
శరణన్నపూర్ణేశ్వరా! నన్నెపుడుఁ -
గరుణింపు నమశ్శివాయ. ౧౪౮

శరణు సచ్చిత్సుఖాత్మ - జ్ఞానదా! -
శరణు సర్వజ్ఞమూర్తి!
శరణు భక్తాత్మవర్తీ! - నాయార్తి -
చల్లార్పు నమశ్శివాయ. ౧౪౯

శ్రీశేషగురునికృపను - గని పేరు -
దాసుఁడను బల్కునాఁడఁ
ఈశ! నను రక్షింపుము - శివ! నీకు -
దాసుఁడను నమశ్శివాయ. ౧౫౦

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః



ఓమ్

# శ్రీ రామ శతకము



కందపద్యములు

శ్రీమ న్నారీతోషణ
క్షేమంకర భక్తపాల - జితనీలాభ్ర
శ్యామలశరీర సుగుణో
ద్దామా వైకుంఠధామ - దశరథ రామా! ౧

శ్రీకామినీ మనోహర
నాకేశార్చితపదాబ్జ - నారాయణ నా
ళీకాసనాది వందిత
సాకేతపురీశ నాగ - శయనా! రామా! ౨

రత్నాన్వితభూషణ ముని
రత్నమనఃప్రమద జనక - రాజకుమారీ
రత్నప్రియ రాజశిరో
రత్న పరాత్పర మురారి - రాఘవ! రామా! 3

భండనజితరిపు రఘుకుల
మండన కోదండపాణి - మధుసూదన వే
దండార్తిహరణ దోర్బల
ఖండితశివచాప కంబు - కంధర! రామా! ౪

శక్రాదినిఖిలసురముని
చక్రార్చితపాదపద్మ - జలజాక్ష ! హరీ !
అక్రూరముఖ్యలక్షణ
చక్రాయుధ నన్నుఁ గృపను - సాఁకుము రామా ! ౫

శరనిధిగంభీర మహా
దురితగహన వీతిహోత్ర - దుర్జనశిక్షా !
పరమదయాకర ! నరవర
పరితాపవికారదూర - పావనరామా ! ౬

మానవరూప నిశాచర
కానన కాలాగ్నిహోత్ర - కమలాసనపం
చాననవందిత చంద్రని
భానన శృంగారసద్గు - ణార్ణవ రామా ! ౭

దుర్వారబాహుదర్ప య
నిర్వాచ్యాతిప్రభావ - నీరజనాభా !
గీర్వాణవర్గరక్షక
గర్వోన్మత్తుండ నన్నుఁ - గావుము రామా ! ౮

మందరధర చతురాస్యపు
రందరమునిబృందపోష - రవికులభూషా !
సుందరరూప దయాంబు వ
సుంధరపుత్రీవినోద - శుభకర రామా ! ౯

వందే కార్ముకపాణీ
వందే శృంగారమూర్తి - వందే శౌరీ!
వందే కుండలిశయనా!
వందే లోకైకనాథ - వందే రామా! ౧౦

రక్షించు భక్తవత్సల
రక్షించు భవార్తిహరణ - రాజీవాక్షా!
రక్షించు విహగవాహన
రక్షించు దయాపయోధి - రఘుకులరామా! ౧౧

విన్నప మాలింపుమ యా
పన్నశరణ్యా ధరిత్రి - భావింపఁగ నా
కన్న నఘాత్ములు గలరే?
మన్ననతో నన్నుఁ బ్రోవు - మా రఘురామా! ౧౨

ఫుల్లాబ్జనయన మచ్చి
త్తోల్లాసము పెంపుమీఱ - సురుతరరుచి రం
జిల్లుచు విచ్చేసి రమా
వల్లభ నను బ్రోవు భక్త - వత్సల రామా! ౧౩

మది నిలిపి భక్తితో మీ
పదయుగ్మముఁ గొలువలేని - పాపాత్ముఁడనై
తుదిలేని యనంతభవాం
బుధిఁ దేలుచునుంటి నన్నుఁ - బ్రోవుము రామా! ౧౪

ఏమాడ్కి నైన నైహిక
కామధ్వాంతం బణంచి కరుణింపుము సు
శ్యామలవిమలశరీరా!
కామితమందార! దైత్య - కంటక! రామా! ౧౫

కల్మషయుతగాఢతమో
గుల్మములోఁ జిక్కినాఁడఁ - గూడ దనక ని
ష్కల్మషునిఁగఁ జేయుము నను
వ్రేల్మిడి భవదవనగుణము - వెలయఁగ రామా! ౧౬

నీనామదవానలమునఁ
బూని భవాంభోధు లింకి - పోవు నటంచున్
నీనామ మనారతమును
బూనికతో సంస్మరింతుఁ - బ్రోవుము రామా! ౧౭

కింకిణులు మొరయ సన్మణి
కంకణకరరుచులు మెఱయఁ - గ్రక్కున ఫణిరా
ద్కంకణనుత! రాఁగదె నా
వంకకు సౌందర్య ముట్టి - పడఁగా రామా! ౧౮

కరి మకరి పెనఁగులాడఁగఁ
గరి దస్సి "కృపాళు నన్నుఁ - గావు" మటన్నన్
బరతెంచి చంపి మకరినిఁ,
గరి నేలినదేవ! భక్త - కల్పక రామా! ౧౯

జూదమున ధార్తరాష్ట్రసు
తాదులచే ద్రుపదతనయ - యవమతయై నీ
యాదరువుఁ గోరినంతనె
మోదముతో వలువ లిచ్చి - ప్రోవవె ? రామా! ౨౦

క్రూరాస్త్ర మపాండవముఁగ
వే రా నుత్తరయు నిన్ను - వేడినఁ గృప యిం
పారఁగ రక్షించితి వీ
వారా! యభిమన్యుసుతుని - నచ్యుత రామా! ౨౧

ఏసరణి మోక్ష మరయుదు ?
నేసరణి భవాంబురాశి - యింకును ? దండ్రీ !
ఏసరణి నిన్నుఁ గాంతు ? మ
జేసరణిఁ గృతార్థుఁడౌదు ? - నే నిల రామా! ౨౨

ఏ క్రియ నటుకులు బొక్కితి
వే క్రియ నెంగిలిఫలంబు - లిడఁ దింటివి నీ
వే క్రియఁ గుడిచితి మెతు కొం
డా క్రియ భుజియింపుమా శ్రీ - పావన రామా! ౨3

ఏ క్రియ గజేంద్రు నేలితి
వే క్రియఁ బ్రహ్లాదు కభయ - మిచ్చితి కృప నీ
వే క్రియ హరిణము నేలితి
వా క్రియ నన్నేలుమా శ్రీ - పావన రామా! ౨౪

విద్వద్వంద్య మనుష్య
గ్విద్వేషధ్వజ దశాస్య - విద్వేష హారీ!
అద్వయ జితనీలపయో
భృద్విలసద్గాత్ర బాహు - విక్రమ రామా! ౨౪౭

ఉరమున మణి విలసిల్లఁగ
శిరమున మకుటము ధరించి - శ్రీసహితుఁడవై
పరతెంచి మధుర మంజుల
తరభాషలఁ బల్కుమయ్య - దశరథరామా! ౨౪౮

అపరాధంబు లనేకము
చపలుఁడనై చేసినాను - చల మూనక నా
కపటంబుల లెక్కింపక
కృపతో రక్షింపు జాన - కీపతి రామా! ౨౪౯

దండధరుభయం బేల? య
ఖండస్థిరమోక్ష మొసఁగు - కమలాక్షుఁడు నా
దండను దయతోఁ గాపై
యుండఁగ నా కేమిచింత - లున్నవి రామా! ౨౫౦

శరణు పరాక్రమశాలీ
శరణు రమానాథ! సర్వ - జగదాధారా!
శరణు దయాపర శుభకర!
శరణు మహావీర! జనక - జాప్రియ రామా! ౨౫౧

నవకైరవచ్ఛదేక్షణ
నవతులసీపత్రదామ - నారదవినుతా
నవరత్నఖచితకుండల
నవచంద్రనిభాస్య! ధరణి - నాయక రామా! ౩౦

కటకట లేటి కొనర్తువు
కటితటి పీతాంబరంబు - కాంతులు మెఱయన్
నిటలాంచితతిలకముతోఁ
గుటిలాలక చేర రమ్ము - కోసలరామా! ౩౧

సురవరనుత హరి మురహర
నరహరి భవహరణ ధరణి - నాయక వరదా!
ఉరుతరకీర్తివిరాజిత
గిరిజాస్తుతనామ! జాన - కీపతి రామా! ౩౨

నీపదపద్మము లెప్పుడు
నేఁ బూజలొనర్తు వేడ్క - లింపలరఁగ నీ
రూపం బెప్పుడు చూతునొ?
ప్రాపై ననుఁ బ్రోవు భక్త - వత్సల రామా! ౩౩

ఏవేళ నిన్నుఁ జూతునొ?
యేవేళ స్వయంకృతాఘ - మెల్లఁ దొలఁగునో?
యేవేళ మోక్ష మబ్బునొ?
యేవేళఁ దరింతునో? హ - రీ! రఘురామా! ౩౪

సకలాఘనికృంతన మని
ప్రకటితముగ నీదుపాద _ భజనం బనిశం
బకలంకభ_క్తిఁ జేయుదు
వికచాంబుజనేత్ర ! కావ - వే రఘురామా! 3౫

ధర నొప్పుకా_ర్తవీర్యుని
కరములు వేయింటి నతికి - క్షత్రియవంశం
బిరువదొకమారు చెండితి
వఱి భార్గవరాముఁ డనఁగ - మాధవరామా ! 3౬

పరమమునీశ్వర సేవిత
చరణా ! వేదాంతవేద్య - సాకేతపురీ
శ్వర సుగుణాకర శ్రీధర
పరమపవిత్రా సురారి - భంజన రామా ! 3౭

అనుపమదోర్బ్బలఖండిత
దనుజస్తోమా ! మహీసు - తాశ్రిత రామా!
కనదరవిందదళాంబక
యనుదినము భజింతుఁ గరుణ - నరయుము రామా! 3౮

కనకమణిఖచితకుండల
కనకోదరజనక మోక్ష - కారణ చక్రీ !
కనకాక్షాసురసూదన
కనకాంబరధారి ! భ_క్త - కల్పక రామా ! 3౯

నిత్యానంద పరాత్పర
సత్యవ్రత నిగమరూప - సర్వేశ్వర ! యా
దిత్యకులవర్ధన ! దిగం
తాత్యంతయశఃప్రకాశ - యద్వయ రామా ! ౪౦

అన్యుల నెవ్వరిఁ గొల్చిన
నన్యాయ మటంచు నిన్నె - యర్చింతును న
న్నన్యుఁ డనక సాకుము రా
జన్యశిరోరత్న జనక - జాప్రియ రామా ! ౪౧

కంజాక్ష గరుడవాహన
మంజుమృదుస్వాదుభాష - మానుషవేషా !
కుంజరపాలక ! పాపవి
భంజన దయఁజూడు పతిత - పావన రామా ! ౪౨

రంజితపీతాంబరధర
మంజులవేషోత్పలాక్ష - మహిమాఢ్యత్మా !
కంజారివదన ! సద్గుణ
పుంజ యఘుం బుడిపి నన్నుఁ - బ్రోవుము రామా ! ౪3

శుభకర గిరిధర జలము
జ్నిభగాత్ర ! దయాపయోధి - నీరజనాభా !
యభము శుభంబు లెఱుంగక
యభిరతి ని న్నే భజింతు - నయ్యా ! రామా ! ౪౪

కోఁటికి శక్యమె జంభా
రాతికి శక్యంబుగాని - రక్షోవిభులన్
ఖ్యాతి జయింపఁగ? నెయ్యెడ
ధాతకు నీమహిమ లెన్నఁ - దరమా? రామా! ౭౪

ధర్మపరిపాల మాధవ
నిర్మలచారిత్ర నీల - నీరదగాత్రా!
కర్మభవపాశఖండన
దుర్మదఖలనాశ! సుజన - తోషణ రామా! ౭౫

మార్తాండవంశమండన
యార్తజనావన! చరాచ - రాత్మకమూర్తీ!
కీర్తింతు ని న్నెపుడు నా
యార్తినిఁ బోకార్చి కరుణ - నరయుము రామా! ౭౬

స్పర్శనభుక్పర్యంక సు
దర్శనశరఖడ్గచాప - ధారి! హరీ! నీ
దర్శనకాంక్షి ననుఁ బరా
మర్శించి తరింపఁజేయు - మా రఘురామా! ౭౭

సురసిద్ధసాధ్యవిద్యా
ధరకిన్నరగరుడయక్ష - తాపసముఖ్యుల్
నిరతం బెవన్ని నుతింతురో
యురవొందఁగ వానిఁ గొలుతు - నెప్పుడు రామా! ౭౮

దేవుఁ డని యెవనిపదరా
జీవంబుల నెల్లరుఁ భ - జింతురో యతనిఁ
భావించి యే నజస్రము
సేవింతును నిత్యమోక్ష - సిద్ధికి రామా ! ౫౦

అగజాత యెవనినామం
బగణితమహిమాభిరామ - మని నుతియించుఁ
దగ నే నానామము నే
పొగడుదు నహరహము నోరు - మూయక రామా ! ౫౧

మే లగురీతి నిజోదర
గోళమునం దెవఁ డజాండ - కోట్లను దాచెఁ
వాలాయంబుగ వానినె
యాలోకింపఁగ నుతింతు - ననిశము రామా ! ౫౨

లోకైకవంద్యు సజ్జన
లోకశరణ్యు నతభక్త - లోకనివాసుఁ
బ్రాకటభక్తి భజింతును
నా కాశ్రయ మిచ్చి ప్రోవ - నగధర రామా ! ౫౩

దిశలం దెవనియశం బా
శశిదినకరతారకముగ - సంవ్యాప్తంబై
విశదముగ వెల్గు నాతని
వశ మేకాఁగి భజింతు భక్తి - పథమున రామా ! ౫౪

కల్యాణమయశరీరా
కల్యాణయశోవిశాల - కనకదుకూలా!
కల్యాణగుణ జగత్త్రియ
కల్యాణప్రద భవార్తి - ఖండన రామా! ౪౪

రవి ప్రాగ్దిశ నుదయింపఁగ
ధవళమయూఖుండు కాంతి - దప్పెడుఁగుగాన
భవదభిరుచి సోఁకిన దు
ర్భవపాశము లెల్లఁ దెగును - రఘుకులరామా! ౪౬

కుముదాప్తుఁ డుద్భవింపఁగఁ
గుముదాంగన రుచులు మీఱి - కులుకుక్రియన్ నీ
విమలప్రభ సోఁకిన చి
త్తము నిర్మలమై రహించు - దశరథరామా! ౪౭

నారాయణ నీనామముఁ
బారాయణసేతుఁ బాప - పరిహారముగా
మీఱినదయ నీసాకా
త్కారము నా కొసఁగుమయ్య - తారకరామా! ౪౮

సనకసనందనముఖ్యులు
పనుపడి దురితౌఘకర్మ - పాశము దెగి ము
క్తినిఁ బొంది రెవనిసేనల
ననిశము నే నతనిఁ గొలుతు - నచ్యుత రామా! ౪౯

మానుగఁ బ్రాచేతసశుక
శౌనకకశ్యపవసిష్ఠ - సంయమిసంఘ
ధ్యాననిధానమ వని నిను
ధ్యానింతు నెఱింగి మోక్ష - దాయక రామా! ౬౦

కమలాధరిత్రు లెవ్వనిఁ
దమిమీఱ భజింతు, రెవని - తనుమధ్యమునన్
గౌమరారుఁ బీతవసనము
క్రమమున వినుతింతు నతని - ఖరహార రామా! ౬౧

పవనాశనవిద్వేషవరుఁ
డెవనికి సద్వాహమయ్యె - నేర్పడ భీమా
హావరిపుమర్దనుఁ డెవ్వం
డవనిం జింతింతు నతని - సద్వయ రామా! ౬౨

మరుదశనుం డెవనికి వి
స్ఫురదున్నతతల్ప మయ్యెఁ - బుష్పాయుధుఁడున్
బరమేష్ఠి యెవనిసుతులై
పరఁగిరి యే నతనిపదముఁ - బట్టుదు రామా! ౬౩

సురుచిరకౌస్తుభ మెవ్వని
యురమున విలసిల్లుఁ, జక్ర - మొప్పు నెవనికిం
గరమందు, నట్టివిభు నే
నిరతముఁ బూజింతు మేది - నీపతి రామా! ౬౪

భగవన్నామామృతమున
నగణితతాపత్రయాగ్ను లారకయున్నే ?
నగధర ! నీనామమునే
పొగడుదు భవతాప మార్చి - ప్రోవుము రామా ! ౬౫

నీనామమె జపతపములు
నీనామమె మంత్రరాశి నిఖిలమునీంద్రుల్
నీనామమె స్మరియింతురు
నీనామమె నాకు దిక్కు - నిత్యము రామా ! ౬౬

నీనామమె యజురుద్రులు
నీనామమె సురలు మునులు - నిఖిలజగంబుల్
నీనామమహిమ దెలియని
మానిసి భవబాధలందు - మడియును రామా ! ౬౭

నీనామమె ప్రహ్లాదుని
నీనామమె కరివరేణ్యు - నిర్ ఖట్వాంగుర్
నీనామమె రక్షించెను
నీనామమె నాకు రక్ష - నిజముగ రామా ! ౬౮

నీనామమె పాంచాలికి
నీనామమె పాండవులకు - నిష్కలుషులకున్
నీనామమె దిక్కయ్యెను
నీనామమె నాకు దిక్కు - నిజముగ రామా ! ౬౯

నీనామమె ముచికుందుని
నీనామమె ప్రోకుచేలు - నిఁ సుగ్రీవుఁ
నీనామంబె విభీషణు
నీనామమె బ్రోచె ధారుణీపతి రామా! ౭౦

నీనామమె సూక్తంబులు
నీనామమె నిగమరాశి - నీనామముతో
నేనామము సరిపోలదు
నీనామజపంబు ముక్తి - నిధి రఘురామా! ౭౧

నీనామమె నాప్రాణము
నీనామమె భుక్తిముక్తి - నిఖిలాధారా!
నీనామ మెపుడు దలఁచిన
మానుగ యమబాధ లన్ని - మలుగును రామా! ౭౨

నీనామజపసుధారస
పానం బొనరింప సర్వ - పాపము లుడుగుఁ
నీనామమహిమ లిట్లని
మానుగ వర్ణింపఁదరమె - మహిలో? రామా! ౭౩

జననియు జనకుఁడ వీవే
యనుజన్ముఁడ వగ్రజుఁడవు - నధిపుఁడ వీవే
ననుఁ బ్రోచు విభుఁడ వీవే
యని నిన్ను భజింతు నహర - హంబును రామా! ౭౪

ఘనముక్తా స్ఫోటతటం
బున నీటికణంబు పడిన - ముత్యం బగుచో
ప్పున నీనామముఁ జవిచూ
చినమాత్ర పవిత్ర మగును - చిత్తము రామా! ౭౫

ఇందిరతో జతగా మ
న్మందిరమున కరుగుదెంచి - మది రంజిలఁగా
నందెలు మొరయఁగ హరి నా
ముందర నృత్యం బొనర్పు - మ్రొక్కెద రామా! ౭౬

సింధురవరదా స్ఫురదర
విందచ్ఛదనేత్ర శౌర్య - విజితనరేంద్రా!
కుందవకుళసన్నిభరద
వందన మిదె గొనుము భక్త - వత్సల రామా! ౭౭

ఖద్యోతకోటితేజా
ప్రద్యుమ్నసహస్రరూప - రఘుకులభూపా!
ఆద్యంతశూన్యవిభవా
సుద్యుతికోటీర! కీర్తి - శోభిత రామా! ౭౮

విచ్చేయుము రామచంద్రా
విచ్చేయుము మహానుభావ - విక్రమదేవా!
విచ్చేయుము రవికులాగ్రణి
విచ్చేసి తరింపఁజేయ - వే రఘురామా! ౭౯

పద్మారిసన్నిభానన
పద్మాప్రియ పద్మహస్త - పద్మాక్ష హరీ!
పద్మాప్తవంశమండన
పద్మోదర పాహి పాహి - భవహర రామా! ౧౦

సుజనసమూహావశీకర
వృజినప్రచయాపహరణ - విశ్వాత్మ హరీ!
రజనీచరాన్వయాంతక
ద్విజవాహన! నన్నుఁ బ్రోవ - వే రఘురామా! ౧౧

కుక్షి నెలకొన్న జగముల
రక్షింప జనించినావు - రఘురాముఁడవై
పక్షిధ్వజ! నిజ మరసిన
నక్షరుఁడవు నీప్రభావ - మతులము రామా! ౧౨

విలసత్కాంచనమణిగణ
మిళితవిరాజితవిభూష - మేచకదేహా!
దళితజగత్కంటకదితి
కులనాయక! యభయ మిమ్ము - గొబ్బున రామా! ౧3

శశిమౌళివినుత చక్రాం
కుశకార్ముకపాణి సూర్య - కులభూపమణీ!
కుశలం బొసంగి నను నీ
కుశునివలెఁ బ్రేమ నేలు - కొనుమా రామా! ౧౪

శ్రీపతి సన్నుతగుణ ప్ర
ద్వీపతి కరుణాపయోధి - విక్రమజితలం
కాపతి నిత్యానమద్బ్ర
హ్మాపతి నినుఁ దలఁతు సారె - సారెకు రామా! ౮౫

భూధరనందనసన్నుత
భూధరధరి మధువిరామ - బుధరక్షక గం
గాధరకీర్తితనామా!
శ్రీధర మాం పాహి రాజ - శేఖర రామా! ౮౬

ఇంద్రార్చిత పాదాంబుజ
యింద్రారివిరామ రామ - యినకులసోమా!
యింద్రానుజధవళయశ
స్సాంద్ర! భవన్మహిమ లెన్న - శక్యమె! రామా! ౮౭

ఓభవపాశత్రుటనా
యోభానుకులావతంస - యోపరమాత్మా!
యోభార్గవీమనోహర
యోభక్తమనోభిరామ - యోరఘు రామా! ౮౮

నవ్యతరకాంచనాంబర
క్రవ్యాదాసురవినాశ - కమలాక్ష! హరీ!
అవ్యయ భువనత్రయసం
సేవ్య శరణు శరణు కావు - శ్రీరఘురామా! ౮౯

కరిరాజవరద రాఘవ
హరసురకమలాసనార్చ్య - తాంఘ్రి దయాళూ!
సురకంటకమురమర్దన
ధరణీజాత్మాభిరామ - దశరథరామా! ౯౦

అతిలోభిని గర్వితుఁడ న
నృతభాషణుఁడన్ ఖలుండ - నీచుండను నిన్
నుతిసేయనట్టి యధముఁడ
మతిహీనుఁడ నెట్లు నన్ను - మనుతువొ? రామా! ౯౧

అతిదుర్వర్తనపరుఁడను
నతిదుష్కర్ముఁడను దండ్రి - యఘబంధనసం
యుతుఁడ దురాచారుఁడ నీ
సుతునివలెన్ నన్నుఁ గరుణఁ - జూడుము రామా! ౯౨

పరిమత్తగర్వచిత్తుఁడ
దురితమనస్కుండ జడుఁడ - ద్రోహిని పాపా
చరణుఁడఁ గామాంధుఁడ నీ
కరుణకుఁ బాత్రుండ నన్నుఁ - గావుము రామా! ౯౩

క్రూరాత్ముఁడ నాశ్రితజన
దూరుఁడ నిన్నెఱుఁగలేని - దుస్సంగతుఁడన్
జోరుఁడ నీచుఁడ శైలో
ద్ధారా! ననుఁ గావు కరుణ - దశరథరామా! ౯౪

జలజాక్ష భక్తవత్సల
జలజాసనవినుతనామ - సంగరభీమా!
జలజారిమండలానన
తలఁచెద నీనామ మెపుడు - దయఁ గనురామా! ౯౫

మండితవిహగస్యందన
పండితసుజనస్తుతాఖ్య - పార్థివముఖ్యా!
దండితసురవిద్విషగణ
ఖండితభవపాశ మోక్ష - కారణ రామా! ౯౬

ఏనామముతోఁ బిలిచిన
నానామమె నీకుఁ గూర్చు - నన్న తలఁపుతో
నీనామభేద మెన్నుట
మానితి నీభేద మరయ - మాకే రామా! ౯౭

ఎవ రెన్ని పేళ్ళఁ గొన్నను
దవిలి నదీతోయ మెల్లఁ - దగ నొక్కటి గా
భువి నొప్పురీతి నొప్పెదు
వివిధాఖ్యల నీ వభేద - వృత్తిని రామా! ౯౮

శతకందపద్యముల నీ
స్తుతి మొదవ రచించినాఁడ - సీతాసుమన
శ్శతపత్రమిత్ర! కైకొను
మతులితమోక్షప్రదాత - హరి రఘురామా! ౯౯

పరఁగ యతిప్రాసలవిధ
మెఱుఁగను లక్షణ మెఱుంగ - నెసఁగినభక్తిన్
దొరలినపదములతో నీ
గురుమహిమలఁ బల్కినాఁడఁ - గోసలరామా! ౧౦౦

నాపల్కులందుఁ దప్పులు
ప్రాపుగ నెలకొన్న యేని - బద్మదళాక్షా!
నీపై భారం బునిచితి
నేపగిదిఁ దలంచి నన్ను - నేలెదో? రామా! ౧౦౧

అవనిఁ బులహారివంశో
ద్భవుఁడను బితృమాతృదైవ - భక్తిపరుఁడ నీ
కవనతుఁడఁ బీరుదాసుఁడ
ధవళేక్షణ! నన్నుఁ బ్రోవు - దశరథరామా! ౧౦౨

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః



(35)

ఓమ్

శ్రీ ఫిరోజి ఋషి గ్రంథావళి

# సాత్రాజితీయము

నాణె మగుపంచభూత - గుణముచేఁ -
ఘ్రాణ మేకం బగుచును
రాణించుఁ బంచగతుల - నని యంద్రు -
రసికు లిటు నమశ్శివాయ. ౫౩

పూని ప్రాణాపానముల్ - వ్యానం బు -
దాన మరయ సమానముగ్
మేని కాధార మని రీ - పంచపవ -
మానములు నమశ్శివాయ. ౫౪

మొనసి ప్రత్యేకభూత - సత్వగుణ -
మునను జ్ఞానేంద్రియములు
జనియించి నిజకర్మములను - మే లొప్పఁ -
గనుచుండు నమశ్శివాయ. ౫౫

అలకర్ణచర్మ నేత్ర జి - హ్వానా -
సలుగ బుద్ధీంద్రియములు
లలి పంచవిషయంబుల - వేర్వేఱఁ -
దెలిసికొను నమశ్శివాయ. ౫౬

విలసిల్లుభౌతికతమో - గుణముచే -
విషయములు ప్రభవించెను
దలఁప శబ్దస్పర్శరూ - పరసగం -
ధము లేను నమశ్శివాయ. ౫౭

తనరంగ శుద్ధస - త్వప్రధానాంగుల
మతి రజస్సత్త్వత - మస్సహితుల
జగదుద్భవస్థితి - సంహారకారుల
హంస విహంగ వృ - షాను గతుల
గురుతరసౌందర్య - కోమలాకారుల
స్తుతకమండల చక్ర - శూలధరులఁ
జెలఁగి సత్యవికుంఠ - శీతాద్రివాసుల
రుక్మనీలశ్వేత - రూపకులను

సర్వ సద్గుణభరితుల - శారదా ర
మా శివా ప్రాణనాథుల - మహితవిభుల
బ్రహ్మ విష్ణు మహేశ్వర - ప్రభుల నెపుడు
చేరి భజియింతు నిష్టార్థ - సిద్ధికొఱకు.

భువనములన్ సృజింపఁగను - బ్రోవ హరింపను నేర్పు శక్తికం
భవరుహ విష్ణుశర్వులకుఁ - బాలి నమర్చి సుఖంబు లిచ్చుచున్
సువిమల సత్త్వరైక్యపరి - శుద్ధవివేకవిభూతు లిచ్చు నా
సవినయ భారతీజలధి - జా గిరిజాంగనలన్ భజించెదన్.

అనయంబున్ బరిపూర్ణభక్తిని సదా - హ్లాదంబు చెన్నొందఁ జ
య్యన శ్రీరాముని సత్స్వరూప భజనా - త్యానందవార్ధిన్ నిమ
గ్న నిజస్వాంతము పొంగిపోవఁగఁ బ్లవం - గశ్రేణి కీర్తింపఁ బా
వనుఁడై సాధుచయంబు నేలుకొను నా-వాతాత్మజున్ గొల్చెదన్.

తనదేహమున గేహ - మున మోహమును సాహ
మును ద్రోహమును లేక - తనరువానిఁ
బెనుతాపమును బాప - మును బాప భువి నోపి
నిజరూపమును జూప - నెరయువాని
ననుకంప నెనయింప - ఘనసంపదలఁ బెంపఁ
దరియింప నొనరింపఁ - దగినవాని
భువియందు దివియందుఁ - బొలుపొందుచును సందు
లను గొందులను గ్రంది - యొనరువాని

మలినచలనయుతస్వాంత - కలన మణఁచి
తిరుపుమఱపుల జరపి సు - స్థిరము వఱపి
విమలతత్వార్థ మొసఁగిన - జమిలిశేష
గురువరేణ్యుని సద్భక్తిఁ - గొలుతు నెపుడు.

శ్రీ మహీశాంతర - క్షేమంకరోజ్జ్వల
సరస విదర్భదే - శంబునందు
వెలుఁగొందుశ్రీకొండ - వీటిసీమను మహా
లక్ష్మీవిలాస మె - లర్చు మిగులు
మాదలపురిలోను - మామహేశ్వరకృపా
పాంగవిస్ఫూర్తిచేఁ - బరగుచున్న
వంశంబులను గుబే - రాంశమై నాయక
మణి యనం దగి రాజ - మాన్యముగను

వరమహాపుణ్యకరమైన - వైశ్యకులము
నందు భద్రగుణోపేతుఁ - డై చెలంగుఁ
బొట్టి రామాభిధానుండు - పొలుపుమీఱ
నతనిసతి వీరమాంబ నా - నలరు భువిని.

ఆదంపతులకుఁ జిరపు
ణ్యోదయము లగుసుతులు నల్వు - రుదయించిరి యీ
మేదిని భద్రయశస్సం
పాదకులై సుగుణకాంతి - పరులై యొప్పన్.

మఱి యగ్రజుండు బాపయ
సరసులు దగ ముత్తయాను - జన్ము లతనికిన్
గరిమన్ రామయ లక్ష్మయ
లురుతేజులు విమలకీర్తి - యుతు లతులగుణుల్.

అందు నుదారసాహసమ - హావిభవంబున మించి సంతతా
నంద మెలర్పఁ బండితజ - నద్విజముఖ్యుల కీప్సితంబు చె
న్నొంద నొసంగుచున్ సురుచి-రోన్నతిఁ బొట్టికులాంబురాశిపూ
ర్ణేందుఁడనన్ వికాసమువ-హించె ఘనంబుగ ముత్తయాఖ్యుఁడున్

హరినామస్మరణప్రభూతపరమా - హ్లాదాభివృద్ధిన్ మహా
గురుభక్తుం డగుఁబీరుదాసుఁడని యో-గ్యుల్మెచ్చ వర్తించునన్
గరిమం బిల్చి బహూకరించి హరిము-ఖ్యప్రాభవంబెల్ల శ్రీ
కర మొప్పన్ గృతియక్షగానమున వే-డ్కన్ జెప్పుమా మెచ్చెదన్.

అని నిర్దేశించినఁ బా
వనుఁ డగు శ్రీరామదివ్య - వర్ణనమును నే
వినుతింపఁగోరి పల్కితి
నను శ్రీహరి వలుకఁజేయు - నటువలెఁ బ్రీతిన్.

సూత శౌనక వాల్మీకి - శుక వసిష్ఠ
నారద వ్యాసమునులకు - నతు లొనర్చి
కాళిదాస మయూర తి - క్కనకవిప్ర
ముఖులఁ గొనియాడెదను మది - ముద మెలర్ప.

గణము యతిప్రాసలు ల
క్షణసంగతు లే మెఱుంగ - సద్గురు నారా
యణుకరుణఁ బల్కెదను గవి
గణములు దప్పున్న దిద్దఁ - గా వలయుఁ గృపన్.

అని యిట్లభీష్టదేవతాచార్యప్రార్థనంబును సత్కవికీర్తనంబును గావించి నాయొనర్పంబూనినసాత్రాజితీ నాటకం బనుయక్ష గానంబు విరచింపఁ బరమానందకందళితహృదయుండ నైతిఁ గావునఁ దత్కథాక్రమం బెట్టిదనిన—

## ద్విపద

కుందమందారవ - కుళ హేమపుష్ప
చందనఖర్జూర - జంబీరపనస
భూరుహంబులచేతఁ - బొలుపొందునైమి
శారణ్యసంవాసు - లగుశౌనకాది

మునులకు సూతుండు - మును చెప్పినట్టు
తెనసి పరీక్షిన్న - రేంద్రున కొప్పి
శుకయోగివరుఁడు మం - జులత బోధించు
సకలంక మగునమ్మ - హాభాగవతము
వర దశమస్కంధ - భాగంబునందుఁ
బరఁగు శమంతకో - పాఖ్యాన మనెడి
హరికథాసారంబు - నాలించినంత
పరమనిర్వాణసం - పద నొందఁగలరు.

దరువు - సౌరాష్ట్రరాగము - ఆదితాళము

వినుము సత్రాజిత్తు - విష్వక్సేనునకుఁ గీ - డొనరించి
వినయముతో - ఘనభక్తితో - నెనసి కెరలి తన - తనయ
శమంతక - మణుల నొసఁగె మైత్రిని - మనుజేశ్వర! ॥ విను॥

హరియెడ నపరాధ - మరయఁ దానేమి చేసె - మరల
సత్రాజిత్తు - మణిఁ గూతు నెటు లిచ్చెఁ - దెలుఁగు తేటపడ -
నెఱిఁగింపు మునీ - శ్వర యనంగ సు - స్థిరమతి భూవర ॥వి॥

ఇనునకు భక్తుఁడై - హితమునఁ గొలువ నా - తనిసే
వలకుమెచ్చి - తడయక శమంతక - మణి నొసఁగిన నా - మణి
మెడ నొప్పఁగఁ - దను వెలింగె స - త్రాజిత్తుఁడు మఱి ॥ వి ॥

తనరు నమ్మణితోడ - ద్వారకానగరికిఁ - జను దేర దూర
మున - జను లది గనుంగొని - మణివికాస త - ద్ఘృణితిరోహితే-
క్షణులై సూర్యుం - డని శంకించిరి ॥ వినుము ॥

వార లచ్చెరువంది - వచ్చి శ్రీహరి కిట్లనిరి - నారా
యణ! శ్రీధర! ము - రారి! శౌరీ! ముకుంద! - వారిజాక్ష!
కం - సారి! మానమ - స్కార మిదె వి - జ్ఞాపన మొక్కటి॥

సురవిభు లపేక్షిం - తురుగద దేవేశ! నిన్ - బరికింప
యదుకులాం - తరగూఢమూర్తివి - యరయ నిఖిలజగ - దంత
రాత్మ యగు - హరి! భవదాకృతి - దర్శించుటకై ॥ వినుము ॥

నిగనిగకాంతులు ది - గంతము లావరింపఁ - దగ నరు
దెంచె నిదే - తరణియో విరించియో - మిగులుసరణిఁ జే -
రఁగవచ్చె నన్ - భగవంతుఁడు జను - లగువారిం గని ॥విను॥

మణియుతుఁ డైనస - త్రాజిత్తుగాని దిన - మణియుఁ
గాఁడని పల్క - మతి సత్యభామపుర - మణివాసుఁడు కా -
రణమూర్తి మహా - గుణగణకౌస్తుభ - మణి గోపాలుఁడు ॥విను॥

## ద్విపద

అంత సత్రాజిత్తుఁ - డనుపమశ్రీద
సంతోషమంగళా - చారసంచార
మైనస్వకీయగే - హంబున కరిగి
తాను భూసురులచే - తన్ నిజదైవ
మందిరం బందుఁ ద - న్మణి నుంచి నంత
నందునఁ బ్రతిదినం - బష్టబారువుల
కనక మొసంగు నీ - కరణి నీధరణి
జనపాలుఁ డేలిన - సరస నమ్మణియు

మఱి పూజ్యమానమై - పరఁగు నెల్లరును
దురితరోగారిష్ట - దుర్భిక్షభయము
మాని సుఖింతురు - మానవాధీశ !
మానుగ నొకమారు - మణినిఁ గృష్ణునకు
నిమ్మన్న హరి కాతఁ - డీక ధనేచ్ఛఁ
బొమ్మని చెప్పెను - బురుషోత్తమునకు
నీకున్న మీఁదట - నేమహా నటంచు
వ్యాకులితాత్ముఁడై - వర్తించువేళ
ననుజుఁ డైనప్రసేనుఁ - డామణిం గంఠ
మునఁ దాల్చి యడవికి - మురియుచు వేఁట
కై పోవ వాని ను - క్కడఁచి సింహంబు
దీపించు మణిఁగొని - తెంపునం బోజి
దాని వధించి యు - ద్ధతి జాంబవంతుఁ
డానందమున నమ్మ - హామణిం గాంచి
కొనిపోయి భూధర - గుహఁ జొచ్చి యందుఁ
దనముద్దుగారాబు - తనయకుం గేళి
కా కందుకంబుగాఁ - గావించినంత
వైకుంఠునకు నప - వాదంబు గలిగె.

మఱియు నిచ్చట సత్రాజిత్తుండు వేఁటకై యరిగిన నిజానుజుండు మగుడిరామికి మిగుల వితర్కించుచు శోకవ్యాకులితమానసుండై యుక్తాయుక్తంబులు దలంపక హరిపై లేనిపోనియపనింద మోపి యిట్లని పలికె——

దరువు - నాదనామక్రియరాగము - ఆదితాళము

మణి కంఠమునఁ దాల్చి - మాపాఁ డరణ్యము - నను వర్తింపఁగ న్యాయమా - యన్యాయమా - మణికొఱకై తమ్ముని వధించి నా - మణిఁ గొంపోయెను - మధుసూదనుఁ డిటు ॥ మణి ॥

హరికి మర్యాద లే - దని యొగ్గులాడిన - సరణి నాశౌరి యాలించి మదినుంచి - యెఱుఁగకున్న యెడ నీయపవాదము - పొరయఁగలిగె నే - వెరవునఁ బాయునో ? ॥ మణి ॥

అని వితర్కింపుచుఁ - జను దెంచె నాజాడ - వనవీథిం బొడగాంచెను - ధృతి మించెను - దనవా రందఱుఁ గనుగొన ధరఁ గూ - లినప్రసేను హయమును సింహంబును ॥ మణి ॥

మృగపతిఁ దునిమి య - రుగు భల్లూకముజాడఁ - దగిలి యాగుహ శౌరి - జిగిమీఱి - యగుపడఁజొచ్చెను - దగిలి వచ్చు తన - తెగలఁ గొండబిలము - మొగదల విడచెను॥

అతిసాహసమున నా - జానుబాహుఁ డైన శ్రీ - పతి నిరంతరనిరంధ్రము - నిబిడాంధము - నతిభయదంబై ప్రతిలేకుం డిన - వితతగుహాంతర వీధి సొచ్చె హరి ॥ మణి ॥

అరిగి యచ్చట నొక - యబల కెదుర వినోదా - కరకేళి కందుకంబుగా - ద్రేలం దగఁ - మణి గట్టినభా - సురసన్మణిఁ గనె - ధర సత్యభామా - పురిగోపాలుఁడు ॥ మణి ॥

కందార్థదరువులు

తిన్నగఁ బదములు మోపుచు
వెన్నుం డయ్యబలకడకు - విచ్చేసిన న
క్కన్నియగుండెలు ఝల్లనెఁ
బన్నుగ మఱి దానిదాది - పలుమొఱఁ బెట్టెన్ - ఆధ్వని
వినఁ - బడి చెవిముట్టెన్ - బలపరాక్రమజాంబవంతుఁ డ - ఖిల
జగత్ప్రభుఁ డనుచుఁ దెలియక - యలిగి ప్రాకృతమానవుం డని
తలఁచి హరితో రణముఁ జేసెను - జలము రెట్టించి - యిరువు
రపార - బలముల మించి ॥

విడఁబడి మాంసమునకుఁ బో
రెడు డేగలరీతి హుంక - రించి శరముల్
వడిఁ దరులఁ గరములను బద
పడి జయవాంఛలను శౌర్య - బలము దీపింప - హరిజాంబ -
వంతులు గసిపెంప - నలిగి యిరువదియెనిమిది దినం - బులు
పెనంగిరి యడిదములు తరు - వులు నిరిగినన్ వెనుకదీయక -
యలఘుపౌరుషమునను బోరిరి - హరిహరిభాతి నిద్దఱు మత్త-
కరికరి ఖ్యాతి ॥

పటురోషాహంకృతు లా
ర్భటములఁ బిడికిళ్ళపోట్లఁ - బవలున్ రేలున్
స్ఫుటసంగ్రామజయేచ్ఛన్
జటులత భల్లూకవిభుఁడుఁ - జక్రి యిరువురుఁ - బోరుచు నాత్రి
విక్రమశూరు - చటులతరముష్టిహతులను దు - ర్ఘటవిపజ్జర్జరిత

కాయవి - కటభయంకరమానసుండై - తటమటక్ దైన్యమున
నిట్లనె - నటవీచరేంద్రుఁ - డత్యార్తిన- య్యదుకులచంద్రు ॥

దేవా ! పురాణపురుషుఁడ
వీవిశ్వాధీశ్వరుండ - వీవే సకలం
బీవని తెలియు దఖిలభూ
తావలి ప్రాణప్రతాప - ధైర్యసత్వములు - విశ్వసర్గస్థైర్యనాశ
ములు - నీవకావె మునీంద్రదగణహృ - త్పావనుఁడ వలనాఁడు
సాయక - పావకంబును బఱపి జలనిధి - లావు నింకించి బంధిం
చితి - దేవాదిదేవా - దయాంభోని - ధీ! వాసుదేవా ! ॥

ఎవఁడు ప్రతాపద్యుతి దా
నవమత్తతమఃపటల మ - ణంచె సరోజా
తవిసరముఁ ద్రెంచుకరిగతి
నెవఁడు దశగ్రీవుశిరము - లెల్లను ద్రుంచెక్ - సకలబృందార
కులఁ బాలించెక్ - రవిసుధాకరతారకముగా - నెవఁ డొసంగె
విభీషణునకుక్ - వివిధలంకారాజ్యమును గృప - నెవఁడు
నన్నేలెను జగత్ప్రభుఁ - డవు నీవకావే - పరమకరు - ణాం
భోధి వీవే ॥

## ద్విపద

పరమపావన ! మూరు - పడి చేసి తెగ్గు
మఱి నేర మెన్నక - మన్నింపవలయు

నని యిట్లు స్థిరభ_క్తి - యతిశయిల్లఁగను
వినుతింప జాంబవం - తుని( గటాక్షించి
యతనితనూనిగ్ర - హనివారణముగఁ
దతసరోజాతహ - స్తంబున నతని
కాయంబు నిమిరి చ - క్కనిభాషణములఁ
బాయక భల్లూక - పతి కిట్టు లనియె
నీమణి నేను హ - రించినా ననుచుఁ
బామరుల్ చేయు నె - పంబు దప్పూటకు
మానుగ నీగుహా - మందిరంబునకు
నే నరుదెంచితి - నిది హేతు వనిన
విని సంతసించి వా - విరి జాంబవంతుఁ
డును మణి ముద్దుకూఁ - తును జాంబవతిని
గానుకగాఁ దెచ్చి - గరిమ నర్పించె
శ్రీనివాసునకు సు - స్థిరమతి నతఁడు.

హరివెంట మున్ను వచ్చిన
పరివారము బిలముఖమునఁ - బదిరెం డగువా
సరములు గృష్ణునిరాక కె
దురు గని వేసారి చనిరి - దుఃఖాత్మకులై.

దరువు

హరి నెట్లు చూచెద మకట! - యంచుఁ - బరిజనము
లేడ్చినా రొకట - నిజపురంబును బ్రవేశించి - తాము - హాజ
ముగాఁ బౌరులను గాంచి ॥ హరి ॥

దేవకీపితృబంధుగణము - రుక్మి - ణీవధూసుతమిత్రగణ ము - గుహఁ జొచ్చి హరి రాక చిక్కె - నంచు - బహువిషా దంబునను గ్రుక్కె ॥ హరి ॥

దుర్గమం బగుగుహాంతమును - శౌరి - నిర్గతుండై చేర వలెను - అనుచు నేఁడని పౌరులెల్ల - దుర్గం - గని మ్రొక్కి భక్తిరంజిల్ల ॥ హరి ॥

డోలాయమానమానసులై - రంత - జాలిచే సేవింప వశులై - గిరిజాత పలికెఁ దా మణితో - వచ్చు - హరి ము దంబున వధూమణితో ॥ హరి ॥

అంతలో యత్నంబుతోను - లక్ష్మీ - కాంతుండు విచ్చేసెఁ దాను - స్వవధూమణుల్ బెగడిచూడ - జాంబ - వతికన్యామణులతోడ - సత్యభామాపురీశ్వరునిఁ - గొలిచి - రత్యంత సంతోషకరుని ॥ హరి ॥

## ద్విపద

మణితోడఁ గన్యకా - మణితోడఁ జక్రి
రణజయుఁడై వచ్చి - రంజిల్లఁ గాంచి
పౌరు లానంద సం - భరితాత్ములైరి
శౌరి యంతట రాజ - సభకు నాసత్ర
జిత్తునిఁ బిలిపించి - చెలువుగాఁ దనదు
వృత్తాంత మంతయు - వినిపించి మణిని
నిచ్చిన నతఁడు గ్ర - హించి సిగ్గునను
బుచ్చుకొని పురికిఁ - బోయి వెఱగునను

మదిని బశ్చాత్తాప - మొదవంగ భయము
గదురంగ దుఃఖసా - గరమందుఁ గూలి
ఖలులదోషముఁబాపఁ - గా నోపునట్టి
జలజాక్షు నెడఁ గలు - షము గలదంచుఁ
బలికినదుష్టాత్మ - పాపంబునకును
గలదె ! పారం బని - కపటినై యేల
హరిమీద నిటులమి - థ్యాభియోగంబు
నెఱపితి ? దుష్టుఁడ - నీచుఁడ నర్థ
లోభుఁడ దుశ్చంచ - లుఁడ దురాత్ముండ
నీఘోరదురితంబు - నెటుల మన్నించు
జలజనాభుండు ప్ర - సన్నుఁడై యెటుల
నెలమితోఁ బాలించు - నెఱుఁగంగ రాదు
మణినిఁ గుమారికా - మణి నిచ్చి దివ్య
మణిధరుపాదముల్ - మఱి పట్టికొందు
నేని నే జీవింతు - నిది సదుపాయ
మౌ నన్యవృత్తిచే - నతఁడు దృప్తిపడ
డనుచు నీరీతి నే - కాంతస్థుఁ డగుచుఁ
దనమదిలోఁ బల్వి - ధముల యోచించి
తనకూఁతు సత్యభా - మను రతిరూపఁ
గొని వచ్చి మణితోడఁ - గూర్మి శ్రీహరికి
నిచ్చి నతుండైన - నిందిరాప్రియుఁడు
మెచ్చుగా మన్నించి - పుచ్చె నాతనిని.

అప్పుడు సత్యభామ యిట్లని పలికె—

దరువు - భైరవిరాగము - అటతాళము

మాతండ్రి యగుసత్రాజిత్తు - ఘన - నీతి గన్గొని విమల
చిత్తుఁ - డాతరిం బరిలబ్ధ శోభనుఁ - డై తదాయత నేత్రునకు
నన్ - బ్రీతి వనితామణిని మణినిన్ - ఖ్యాతినొసఁగెను హరికి
శౌరికి ॥ మా ॥

దనుజేంద్రారి శ్రీశౌరి - కృపా - వనరాశి లోకోప
కారి - నను విశాల యశోవిలాసుం - డనిమిషులు గడు సంత
సింపఁగ - ననుపమ శ్రీనీళాఁ బెండ్లా - డెను మహావిభవం
బెలర్పఁగ ॥ మా ॥

నను మెచ్చి మణియిచ్చినాఁడు - దిన - మణి నీకుఁ గృప
నల్లినాఁడు - మణులు మాకుం గలవు గన్యా - మణియె చాలు
నటంచు మరల - న్మణి నొసంగె సురేంద్రముఖసుర - గణము
లభినుతిసేయ శ్రీహరి ॥ మా ॥

అంత నక్కడ పాండుసుతులు - బల - వంతముగా జననీ
యుతులు - వింతగా లాక్షాలయమునం - దంతలో మరణించి
రను వృ - త్తాంతము న్విని రామకృష్ణులు - చింతతోఁ గరి
పురికిఁ జనిరట ॥ మా ॥

ధృతరాష్ట్ర విదుర గాంధారీ - గంగా - సుతకృపద్రో
ణులఁ జేరి - హితముగా దుఃఖోపశమనము - ధృతియొలర్పఁగఁ
జెప్పె నత్తఱి - శతమఖాదిసురుల్ నుతింపఁగ - సత్యభామ
పురికుఁ డగుహరి ॥ మా ॥

## ద్విపద

జననాథ! వినుమయ్య - శతధన్వుఁ డంత
మణి సత్యభామను - మును చెప్పినట్లు

దన కీయ లేదని - తగ వేది విపులఁ
గినిసి యక్రూరునిఁ - గృతవర్మఁ గూడి

హితవృత్తిచే మన - కిచ్చెద నంచు
నతఁడు సమ్మతిఁ జేసి - యది దప్పి మగుడ

జలజాక్షునకు నిచ్చి - శపథంబు దప్పె
ఖలుఁడు సత్రాజిత్తు - కడిమితో నతని

మణి నిమ్మటంచుఁ జ - మత్కృతిఁ జేసి
కణకతో హింసింపఁ - గాఁ దగునంచు

మంతనంబు లొనర్చి - మర్యాద మాని
పంతంబు దీపింపఁ - బగను సాధింపఁ

గటికివాఁ డటుపట్టి - ఖండించుపశువు
నటు లొక రేయి ని - ద్రావస్థ నున్న

తఱి నిలు సొచ్చి స - త్రాజిత్తుఁ బట్టి
నఱికి తదీయాంగ - నలు మొఱఁ బెట్ట

పెనులోభమునఁ జేసి - పెరికి యమ్మణిని
గొనిపోయె నాతఁడు - కుటిలాత్ముఁ డగుచు

తరుణికై పసిఁడికై - ధర మూఢజనులు
దురితదుష్కర్ములై - తుది నశించెదరు.

## గీతార్థములు

ఇటుల మృతుఁడైన తండ్రికై - యేడ్చి యేడ్చి
సత్యభామయుఁ బిత్రుమన - శ్శాంతి గోరి
తైలఘటమున శవ - ముంచి - దంతిపురికి
నరిగి సర్వజ్ఞుఁ డైన శ్రీ - హరిని గాంచి - మఱిసత్రాజిత్తు మర
ణము - నెఱిఁగించినన్ శ్రీ - హరిబలభద్రులు నిజము - పర
మేశ్వరు లయ్యు నిల - నరభావముల విలాపా - తురు లైరంతఁ
గలుషించి - హరి సత్యభా - మాయుతుఁడై మరలి ద్వారకా
పురికి - వేంచేసినన్ మ్రొక్కిరి పౌరు లెల్ల హరికి.

హరియు శతధన్వుఁ దుని మెద - నని వచింప
నది చెలిసికొని ప్రాణభ - యమున నతఁడు
తరలి కృతవర్మ యింటికిఁ - దనకుఁ దోడు
రమ్మనఁగ నాతఁ డిట్లనె - రాజసమున - నమ్మహనీయమూ
ర్తులు - శ్రీరామకృష్ణు - లిమ్మహిఁ జక్రవర్తులు - దొమ్మి సేయ
నెవఁ డోపుఁ - జామిమ్మ బంధుయుక్తుఁ డై - క్రమ్మి కంసుండు
గ్రుక్కఁడె - యమ్మాగధుఁడు భటసై - న్యమ్ముల్ విడి
పెక్కుతోయముల్ - దిక్కు ల్బాఱడె - నమ్ము హరిబల
శౌర్యముల్.

దరువు - సౌరాష్ట్రరాగము - ఆదితాళము

అని యుత్తరముఁ జెప్పిన విని - శతధన్వుఁ డార్తి -
నక్రూరునింటికిం జని - వనమాలితోడఁ బోర - ననికి సహాయుఁ
డవు గ - మ్మని చీర నక్రూరుఁడు హరిశౌర్య ముగ్గడించె ॥

వినుమా హరిబలధైర్యము - వర్ణింపఁదరమె - ఘనసు
ప్రతాపస్థైర్యము - దనర నెవ్వఁడు విశ్వ - మును సృజించుఁ
బోషించుఁ-దునుము నెవ్వానిచర్య- లను బ్రహ్మాదు లెఱుఁగరు॥

ఎవనిమాయ మోహించును- నెల్లలోకంబు- లెవనిలోన
వర్తించును - నెవఁ డేడేండ్లపాపఁడై - యెత్తెఁ గొనగోటఁ
గొండ - నెవఁడు గూటస్థుఁ డీశ్వరుఁ - డెవఁ డాద్యంతరహి
తుఁడు ॥ అని ॥

ఎవఁడు సర్వాంతరాత్ముఁడు - అజుఁ డప్రమేయుఁ -
డెవఁ డఖిలగుణాతీతుఁడు - ఎవఁ డట్టిసత్యపురా - ధివరుం
గోపాలమూర్తి - ని వినుతించెదఁగాని - భువిఁ బోర వెఱతు
ననెను ॥ అని ॥

## సీసార్థములు

అని యిటు లక్రూరుఁ - డానతిచ్చిన నమ్మ
హామణి నుంచెఁ దా - నతనిచెంత
వెఱగుపాటునఁ బటు - వేగాన్వితాశ్వంబు
నెక్కి వే శతధన్వుఁ - డేగె నపుడు
శతయోజనములదూరము - నంత రేవతీ - పతికృష్ణు లాప్రకా
రము - పతగేంద్రకేతనాలం - కృత మయినరథ మెక్కి యు -
ద్ధతి నేగి మిథిలాపురి భా - సితులై చేరఁగ నం - దనతిదూర
మున హయంబునన్ - డిగి పాఱెను - శతధన్వుఁడున్ భయం
బునన్.

పదచారియై తాను - బరుగిడఁ, బోకు పో
కు మటంచుఁ బంకజా - క్షుఁడు భయంక
రస్థితి వానిశి - రంబుఁ జక్రంబుచేఁ
దగిలి వ్రేయఁగ శత - ధన్వుఁ డీల్గె

నంతట వానిచేలము - నందు వెదకి శ - మంతము లేనిమూ
లము - నంతయుఁ దెలిసి యూరక - యంత మొందె శతధన్వుఁ
డి - చింతయునన రాముఁ డనె శ - మంత మపహరింపఁగ -
నెంతైన శతధన్వుఁ డే - పురిదాప నెవరి - కిచ్చె నితఁడు సా
మాన్యుఁడే.

దరువు - పంతువరాళిరాగము - ఆటతాళము

పురుషోత్తమ! చక్ర - ధర! నీ వరిగి మన - పురమున
వెదకుమంత - నేను - గరిమ జనకమహీ - వరుని దర్శింపఁగ -
నరిగివత్తు ననంతా - మఱియు వాంఛ జనించె నీవిఁక - మరలి
పొమ్మని చీరి రాముఁడు - సురుచిరం బగుమిథిలఁ జొచ్చిన -
నెఱిఁగి జనకుఁ డెదురు నడచెను ॥ పురు ॥

పరమానంద సం - భరితుఁ డగుచు నర్ఘ్య - పాద్యాది
విధు లొనర్చి - యంతఁ బరమభక్తి వివిధా - భరణాంబరం
బుల - నిరవుగ నర్పించి - గరిమతో నిట నుండుమన సం -
బరము మీఱఁగ నుండె నచ్చట - సురసుఖంబునఁ గొన్నిసం
వ - త్సరములు - బలరామమూర్తియు ॥ పురు ॥

విని యింతయును దుర్యో - ధనుఁడు మిథిలాపుర -
మున కరుదెంచఁగను - జనక - ధరణీవరుండు న - త్తఱి సన్మా

నించెను - మఱి మైత్రి మించఁగను - బరఁగ గదారణకౌశ
లముఁ జె - చ్చెరఁజలంబున నేర్చె నాహాల - ధరునిచే దుర్యో
ధనుఁడు దు - స్తరబలప్రౌఢిమ మెలర్పఁగ ॥ పురు ॥

అట శౌరి ద్వారకా - పురభేదనము కేగి - కుటిలుఁడౌ
శతధన్వుని - శిర స్త్రుటనము మణి లేకుం - డుట సత్యభామ
తో - స్ఫుటముగా ననె నిట్లని - ఘటితసత్త్వవధూమనఃప్రియ -
నటుఁడు దను గావునను హరి యం - తటను సత్రాజిత్తునకు
స - ద్గతిక్రియలు సేయించెఁ గడు సిరి ॥ పురు ॥

పగ నక్రూరకృతవర్మ లాశతధన్వుఁ - దెగటార్పుట
వినంగ - భీతిఁ - దెగఁబడి ద్వారకా - నగరము వెలువడి -
మిగుల దవ్వుఁ జనంగఁ- బోగిలి యక్రూరుండు లేమిని - నొగి
ననావృష్టికలుషంబులఁ - దగిలి యుత్పాతములఁ గడుహృ -
త్తాపములఁ బౌరులు గలంగిరి ॥ పురు ॥

వెఱచి వృద్ధజనుల్ హరితో నిట్లనిరి మా - మొఱ
వినవే శౌరి - కాశీ - శ్వరుఁ డేలు మహి వాన - గురియకు
న్నను ధరా - మరు శ్వఫల్కునునిఁ గోరి - యరయఁ దోడుక
పోయి గాందిని - య నెడు కన్యక నిచ్చి కాశీ - వరుఁడు సమ్మా
నింప నచ్చటఁ - గురిసె వానలు వసుధ నంతట ॥ పురు ॥

అతనితనయుఁ డైనయక్రూరుఁ డంతవాఁ - డు తపస్సం
పన్నుండు - మరలి - యతఁడు వచ్చెనేని - గతమై యుత్పాత
ముల్ - క్షితి వృష్టి గురియు మెండు - కుతుకమున రప్పించి
మము స - మ్మతిని మన్నించి రక్షించుము - హితముగను
సత్యభామాపుర - స్థితహరీ! వేణుగోపాలా ॥ పురు ॥

## కందార్థదర్వులు

అనవుడు వృద్ధులపల్కులు
విని కృష్ణుఁడు భటులఁ బంపి - వేగమె యక్రూ
రుని రావించియుఁ బూజిం
చెను గొన్నిప్రియోక్తు లాడి - శ్రీధరుఁ డెలమిన్ - సర్వజ్ఞుం
డై - సిరిమించి చెలిమిన్ - గని మృదుమధురవాక్యముల ని -
ట్లనియె నాశతధన్వుఁడును దాఁ - జను నెడన్ మణిఁ దెచ్చి నీ
గృహ - మునను దాచుట నిజము దెలిసెను - సత్రాజిత్తునకుఁ -
దనయులు లేమి మైత్రిచేఁ దనకు.

ఘనకార్యములను దీర్చిన
ధనము ఋణమును విభజించి - తగఁగొనియెద రా
తనిపుత్రిక లందఱుఁ దమ
జనకుఁడు దుర్మృతికిఁ జిక్కి - చనెఁ గావునను - ఆతనికిం గ్రి
యలు - జరుపఁగావలెను - మణిని నీవె యొసంగు మాయ-న్న
నను నమ్మడు సకలబాంధవు - లును గనుంగొనఁజేయునీదుభ-
వనమునం దపకీర్తికిల్బిష - సహితముగను - నఘములు గల్గు -
శాశ్వతముగాను.

వెలయ నిటు సామవచనం
బులఁ గృష్ణుఁడు పలికినంతఁ - బోరి నక్రూరుం
డలచేలబద్ధ మగుమణి
జలజాక్షున కిచ్చె నపుడె - సంతసమునను - బాంధవు లెల్ల -
వింతగాఁ గనను - జెలఁగి శ్రీహరి దెచ్చి చూపెను - లలిత

రుచిరలసద్దిగంతము - నలఘుతరతమస్ప్రవాంతము నలరుసన్మణి నాశమంతము - నలవడఁ జూపి - యీవిధ మూజనుల - కెల్లఁ దెలిపి.

హరి యక్రూరున కప్పుడె
గరిమఁ మణి నిచ్చె మగుడఁ - గరుణాన్వితుఁడై
పరమాత్ముఁ డీశ్వరుఁడు శ్రీ
హరి తన్మణి దెచ్చియిచ్చి - నట్టిచరితము - విని పఠించు - నంత సంతతము - నరులకును దోషదుర్యశముఁ - నఱికి నిశ్శ్రేయస మొనర్చును - మఱియు నంతట నొక్క-నాఁడా - హరికృపా గరిమఁ గొంతికా - మరుల నీక్షింప - వేడుకచే న - త్తఱి నిశ్చయింప.

దరువు - కల్యాణిరాగము - ఆటతాళము

పరఁగు సాత్యకిప్రముఖయాదవులెల్లఁ - బరివేష్టించి కొల్వఁగా - దామో - దరుఁ డింద్రప్రస్థన - గరమున కేతెంచెఁ - బరమానందము మీఱఁగా - నరయఁ ప్రాణంబులను గాంచిన - సరస నింద్రియముల తెఱంగునఁ బరమపురుషుం డైనశౌరిని - దురితదూరుని ॥ పరఁగు ॥

తనరఁ గౌఁగిలించు - కొనినశ్రీహరి దివ్య - తనుసంగమున నిర్గత - కల్మ - షనికాయులై ముకుం - దునిహాసభాసితా - నన మానందపూరిత - మనములను ననురాగముల ద - ర్శనముచేసిన యుధిష్ఠిరునకు - ననిలసూతికి మాధవుఁడు ప్రమొక్కి - మక్కువను దక్కి ॥ పరఁగు ॥

నరుని నాలింగన - స్ఫురణ సత్కరించి - చరణములకు బ్రొక్కినఁ - జక్రి - తిరిగి నకులసహ దేవుల గ్రుచ్చి యె - త్తి రుచిరంబుగఁ జిక్కిన - సరగునను నవరత్న సింహా - సనమునం దాసీనుఁడై శ్రీ - కరముగను రంజిల్లుచున్నంత - నిఁక నేమి చింత ॥

ఘనకచభారకుం - చనయై పెండ్లికూఁతు - రనఁ గ్రొత్త గూటఁజేసి - లజ్జా - వనతయై పాంచాలి వనజనా-భునకు వంద నము భక్తిఁజేసి - తనర సాత్యకి పాండవులచేఁ - బ్రణతుఁడై పీఠమునఁ గూర్చుం - డెను నుతింపుచు సత్యపుర వాసు - నాశ్రితోల్లాసు ॥ పరఁగు ॥

ద్విపద

తక్కినయనుచర - తతి వారిచేత
నక్కడఁ బూజిత - మై సుఖం బుండఁ
దిరముగా నత్త కుం - తీదేవికడకు
హరి యేగి మ్రొక్కి యి - ట్లనియెఁ దానపుడు
కొడుకులుఁ గోడండ్రు - గోరి నీయాజ్ఞ
నెడపక కలపను - లెల్ల సేయుదురె ?
యత్తా! భవన్మృదు - చిత్తం బెలర్ప
నుత్తమస్థితిగతు - లొప్పునే నీకు ?
అనవుడుఁ బ్రీతివి - హ్వలత నొందుచును
గనుఁగవ నుదకంబు - గ్రమ్మంగఁ గుంతి
హరి గద్గదస్వరం - బున సుబోధనుఁడు
పఱచిననెపముల - బాధలఁ దడవి

వినిపించి క్రమ్మఱ - వెన్నుని జేత
కొని గొప్పచేసి మ - క్కువ నింపుమీఱ
నన్ను నాకోడుకుల - నారయు మఱువ
వెన్నఁగ నీవు మా - పెన్నిధి వయ్య !
యెన్ని కష్టములైన - నిన్ను మ్మి మనుచు
నున్నాము దిక్కెవ్వ - రున్నారు మాకుఁ
బిన్నవాండ్రకును బ్రా - పింపఁగ నీవె
యెన్నటికైన నీ - వే మాకు దిక్కు
గా కన్య మేమి ? ని - క్కము సర్వభూత
లోకేశుఁడవు నీవు - నాకు దైవమవు
నావా రనెడిభ్రాంతి - భావన లేదు
కనుఁగొన్న నాభాగ్య - గరిమ యెట్టిదియో ?
మనమున దయఁబూని - మాచిక్కు లెల్లఁ
బాపుచుందువుగదా - పరమేశ ! నీవు
మాపాల నుండఁగా - మాకేమి కొఱత ?

దరువు - సౌరాష్ట్రరాగము - ఆదితాళము

సరసిజాక్ష ! కేశవ ! నారాయణ ! పరమేశ్వర ! కృష్ణా! హరి ! యనుచు యు - ధిష్ఠిరుఁ డిట్లని సు - స్థిరమతితో నీశ్వరునిఁ గొనియాడెను ॥ సరసిజాక్ష ॥

తెలియఁగలేరు నిస్తులభవదాకృతి - నెలమి నేక్రియఁ దోచునో - యల సనందనాదులు దమభావం - బుల గణింపలే - రలఘుతరాత్ముని ॥ సరసిజాక్ష ॥

అనుపమశుభచరిత్రుని నేఁడు మాచుట్టమం - చును
విలోకింపుచుంటి మీ - యనువున నల్పగుణాఢ్యుల మగుమా -
కును సచివుండ స - ఖుండ వైతి విటు ॥ సరసిజాక్ష ॥

అరయఁగఁ బూర్వకళే - బరముల నెంతతపము - దిర
ముగాఁ జేసినామొకో - సరసిజభవనుత ! సత్యభామపుర -
వర ! యని ధర్మజుఁ - డరుదుగ వేడెను ॥ సరసిజాక్ష ॥

ఈవిధంబునఁ బ్రార్థింపఁ - గృష్ణుఁ డలరి
రాజసుఖభోగియై ధర్మ - రాజు నంతి
పురములోఁ గొన్ని నెలలు సొం - పుగ వసించి
యుండె నందొక్కనాఁడు మ - హోన్నతముగ.

కందార్థములు

జవనాశ్వారూఢుండై
నవకంకటశరశరాస - నధరుండై మా
ధవుతోడ వేఁటకుం జని
సువిజయుఁ డాసక్తిఁగూల్చె - సూకరకరులన్ - శార్దూలభ -
ల్లూకసింహములన్ - వివిధమృగవ్రజా - న్వితకాననంబులఁ -
దవిలి గంధర్వబృం - దంబులు పాడంగ - సూకరకరులన్ -
శార్దూలభ - ల్లూకసింహములన్ ॥

మఱియొకట శరాహతమై
యొరగినమృగపంక్తి నెల్ల - నుర్వీశునకున్
బరువడి తెచ్చిరి సేవకు

లిరుగడలఁ నరునిఁగొల్చి - రింపుగఁ దరణి - యంతటఁ గడు-
నేచంగ దప్పిగొని - పారి డస్సి యమునకుఁ బోయి రమ్మహా
రథులు - నరనారాయణు లందు - న్వార్చి జలంబులను - నిర
వుగాఁ గ్రోలి యొక - పులినసీమఁ - బరఁగుచుండిరి పాయక ॥

## ద్విపద

అచ్చట నొప్పారు - నచ్యుతార్జునులు
ముచ్చటఁ గాంచిరి - మ్రోల నానదిని
గురులోలనీలసం - కులవీచులందు
సురుకచభారస - ముజ్జ్వలితాళి
మాలికఁ బాలేందు - మండలసుప్ర
భాళికఁ మారద - ర్పణసమగండ
పాలికఁ మిహిరుని - బాలిక నపుడు
మేలిమిబొమ్మగా - మెలఁగంగఁ జూచి
వనమాలి పంచిన - వచ్చి యర్జునుఁడు
వనిత కిట్లనియె నె - వ్వరిదాన వొంటి
నేమికారణమున - నిచ్చట నుంటి
వేమి నీయభిధాన - మెట్టిది కోర్కె
పరిణయకాంక్షచేఁ - బరఁగుచున్నట్టి
నెఱదోఁచె నీరాక - నెలఁత సిద్ధించెఁ
గాన నీచిత్తసం - కల్పంబుఁ జెపుమ
మానక తీర్చెద - మదగజయాన !

## దరువు

అనిన విజయునిదిక్కు గాంచి - కాళింది దాని - ట్లనియె
మక్కువ నెదలో మించి - విను నరవీరాగ్రణి ! నేభానుని -
తనయను నామంబునఁ గాళిందిని ॥ అనిన ॥

తరణి సంకల్పితగేహ నిందు - నదిలోఁ గంజాక్షు -
పరమాత్ము నీశ్వరునిముందు - వరుగాఁ గోరియు - సురుతపం
బు సు - స్థిరమతిఁ జేసితి - నోరుసిం గోరక ॥ అనిన ॥.

హరి యిందు వచ్చి నిన్నుఁ బ్రేమ - వరియించు నర -
ణ్యారతి ననుచు నాతోఁ బ్రేమ - సరగున మును మ - జ్జనకుఁడు
సెప్పిన - సరణిదియని యా - తరుణి చెప్ప విని ॥ అనిన ॥

నరుఁ డాపల్కులు శౌరితోడఁ - జెప్పిన సర్వే - శ్వరుఁడు
గావున ముదముతోడ - హరి హరిమధ్యను - నరదముపైఁ
గొని - మరలె సత్యపుర - వరగోపాలుఁడు ॥ అనిన ॥

## కందార్థములు

హరివిజయులు ధర్మజుకడ
కరుదెంచిరి ; వారు గోరి - నంతఁ బురం బ
త్తఱి మెచ్చ విశ్వకర్మయు
సురుచిత్రముగా రచించె - సుజ్జ్వలముగను - నింద్రునిఖాండ -
వోద్గహనమును - గరిమ ననలున కిచ్చుకోరిక - నరునిరథికునిఁ
జేసి యదుకుం - జరుఁడు సారథిగాఁ జెలంగుచు - మఱదితోఁ
జని ఖాండవంబు ద - హించనయ్యెడను - ననలుఁడు సంత -
సించి యింపుగను ॥

జయ మలర విజయునకు న
క్షయతూణీరము నభేద్య - కవచంబును ని
ర్భయగాండీవముఁ దేజో
మయరథరథ్యముల నిచ్చి - మఱియుఁ దనువాఁడుగ - దగ
వహ్నిశిఖా - చయబాధ దనకుఁ - నయముగను వారించిన
ధనం - జయున కొక్క సభఁ రచించెను - నియతి నాసభలోనఁ
గౌరవ - నేత గమనాగమనములను - నిలిపియుండుటయు -
జలస్థలీనిర్ణయమతియు ॥

## ద్విపద

అంతఁ గృష్ణుఁడు ధర్మ - జాదులఁ బాసి
సంతసంబునఁ దన్ను - సాత్యకిప్రముఖ
సహచరుల్ గొలువంగఁ - జనుదెంచె నపుడు
రహిమీఱఁ దనదుపు - రమునకు ; బంధు
జనుల కానందంబు - సమకూఱురీతి
ననురాగడోలాస - మారూఢుఁ డగుచు
సుదినంబునం దొక్క - శుభలగ్నమునను
ముదితుఁడై కాళింది - ముదితఁ బెండ్లాడె ;
మఱియు నవంతిభూ - మండలం బేలు
దొరలు విందానువిం - దు లనెడివార
లకట ! సుయోధను - నకు వశ్యు లగుచుఁ
దికమక రాజాధి - దేవికూఁతు రగు
ననుఁగుఁ జెల్లెలి వివా - హముసేయఁ గోరి
పనుపడులై స్వయం - వరముఁ జాటింప

నాలించి శ్రీహరి - యరసి బాంధవము
మేలుగా నాకన్య - మేనత్తకూఁతు
రగుటయుఁ దనుఁ గోరి - నదియాట దెలిసి
తగినవైభవముతోఁ - దా నేగి యచట
వరస్వయంవరమంట - పమునందు వెలయు
దొరలనెల్ల జయించి - దోశ్శక్తి మించి
వెలయఁ జేకొనె మిత్ర - విందను జికుర
లలితకాంతిజితరో - లంబను నపుడు;
కోమలి వినుమమ్మ - కోసల నేలు
భూమిశుఁ డొక్కఁడు - పొలుపొందు నగ్న
జిత్తుండు ఘనపుణ్య - శీలను నాగ్న
జిత్తినిఁ దనకూఁతుఁ - జెలఁగి పెండ్లాడ
వసుధేశు లేతేర - వాడికొమ్ములను
బసమించువాని నే - ర్పడ వీరగంధ
మును పోకఁగాఁ బాద - ములు దువ్వువాని
సమదభీకరగోవృ - షముల నేడింటి
సమకూర్చి తిగిచి లె - స్సగ బాహుశక్తి
నెవఁడు పట్టియుఁ గట్టు - నెలమి నాతండ
యువిదకు విభుఁడన - నొగి వానిఁ బట్టఁ
జాలకుండిరి భీతి - క్ష్మాపతు లెల్ల
నాలీల భగవంతుఁ - డైనకృష్ణుండు ॥

దరువు - ఆటతాళము

తరుణిరో! మురవైరిమహిమ - లెన్న - సురలకుఁ దర
ముగా దమ్మా - వరుసగోవృషముల జయించినవాఁడె యాశ

న్యకు విభుం డను - గరిమ శుభవాక్యంబు విని శ్రీ - హరియుఁ
గోసలపురికి వెడలెను ॥ తరుణిరో ॥

పరిచరావృతుఁ డగుచు శౌరి - చక్ర - ధరుఁడు విచ్చే
యఁ దాఁగోరి- సరగునను గోసలనృపుం డెదు - రరిగి తోడ్తోని
తెచ్చి పాద్యము- గరిమతో నిచ్చి యర్చించి - సురుచిరాసన
మునను జేర్చెను ॥ తరుణిరో ॥

ఆరాజకన్య మోదమున- దాన-వారి నటుగాంచి డెంద
మునఁ - గోరెఁ దనకు విభుం డటంచును - వారిజాక్షుఁడు
విష్ణుఁ డవ్యయుఁ - డారయ విభుం డౌటకును సమ - కూరెఁ
దొల్లిటినోముఫల మిది ॥ తరుణిరో ॥

కమలాకమలభవేశ - దిక్పా - లముఖులు సేవింతు
రాశ - సుమతులై యెవ్వానిసత్పద - కమలరజము శిరంబు
దాల్తురు - సమరసానందుఁ డవ్యక్తుఁడు - సత్యభామపురీశుఁ
డగుహరి ॥ తరుణిరో ॥

ఇట్లు నాగ్నజిత్తి - యొదను జింతించున
య్యెడను గృష్ణుఁ డన్న - రేంద్రుఁ గాంచి
నీరధరగభీర - నినదభాషణములఁ
బలికె మధురవాక్య - పటిమ వెలయ.

## ద్విపద

అన్యులఁ గాంక్షింప - రథిపతు లెందు
మాన్యత నే నీకు - మారికం గోరి

యడిగితి నిముష్మ క - న్యాశుల్కదులము
పుడమి నాయఁడమే మె - పుడు గాము తెలియు
మన విని నగ్నజి - త్తనియెఁ దా నిట్లు
వినయవిధేయుఁడై - విన్నపంబుగను

గన్యక గొనంగ లో - కత్రయంబునను
నన్య లోపుదు రెవ్వ - రంభోరువాత్తు !
నీకన్న ఘనుఁ డైన - నృపచంద్రుఁ డెవ్వఁ
డేకత సిరి నీమె - యిం బొంది యెపుడు

పరమపావని యనం - బరఁగుచు నుండె
సరసుఁడై గోవృష - సప్తక మెనసి
పట్టె కూల్చు నెవండు - వానికి ముద్దు
పట్టి నిచ్చెద నన్న - వసుధేశు లెల్ల
మదగర్వమున వచ్చి - మసలి తచ్ఛృంగఁ
బదహతి కోపక - పాఱె రియ్యెడను ॥

దరువు - ఆనందభైరవిరాగము - ఆటతాళము

సరసీజాయతదళలోచనా - పాపమోచనా ॥ సరసీ ॥

తరణి తమముఁ బాఱఁదోలు - కరణిని భీమాహవోర్వీ-
వరిచక్రంబును దోలినాఁడ - వాజిఁ గ్రీడావిలాసమున ॥ సరసీ ॥

ఘనశూరుఁడవు గోవృషంబుల - సప్తకమును సంగర
కేళిఁ ద్రుంచుమహాబల - యనుపమప్రకాశమునఁ జయ్యన
శీతాంశుబింబాస్యను - నను వున నిచ్చెద నని ప - ల్కిన
వాక్యంబు లాకర్ణించె ॥ సరసీ ॥

కనిరోఁ బూతనబకకంసారి - మధుసూదనుఁడు - కైట
భాదిఖలవిదారి - యెనసి ఘనకల్మషంబుల - ననుపమపౌరుషం
బుల - హానవగుణోన్మిషంబుల - నసమానగోవృషంబుల ॥సర॥

పటము చక్కగా బిగియించెను - జిత్రగతి వి - స్ఫుట
సప్తమూర్తులు వహించెను - జటులతఁ బట్టి విక్రమో - త్క
టమునం గర్కశముష్టిఁ గటతటమునం బడద్రొద్ది యీడ్చె నం-
తట వృషభంబులఁ ద్రుంచె - గిరితుల్య మయినవృషభంబుల-
నన్నిటిఁ గట్టి - సరిగా నీడ్చెను ముద మిమ్ముల - మురియుచు
నగ్నజిత్తుఁడు - మఱి నాగ్నజిత్తి నొసంగి - ధరణీశు లందఱు
మెచ్చఁ - బరిణయ మొనర్చె నపుడు ॥ సర ॥

ఆరాజతరుణు లానందంబునఁ - జెలంగ భూసు - రాశీ
ర్వాదంబు లక్కాలంబునఁ - జాగురితనృత్యముల భేరీమృదంగ
ముల మిన్నుభోరుకలగ - సత్యభామ - పురి వేణుగోపాల
మూర్తికి ॥ సర ॥

## ద్విపద

అంతట నాకోస - లాధీశ్వరుండు
పంతుగా నవ్వధూ - వరులఁ బూజించి
రథముపై నెక్కించి - రమ్యం బెలర్ప
విధియుక్తముగఁ బది - వేల ధేనువుల
నవదుకూలాభర - ణంబుల నొప్పు
యువతులు మూఁడువే - లుత్తమకరులు
రథము లనేకతు - రంగయూధములు
నధికంబుగా సుభ - టాదివస్తువుల

సరణిం బొసంగి య - య్యవసరమునను
గురువైభవముతోడఁ - గూరిమితోడఁ
అనుప నాకోసలు - పట్టికై తొల్లి
ఘనవృషభములచేఁ - గడు గాసిఁజెంది
వెఱచి పాఱిననృప - వీరు లెదిర్చి
మారిఁ దాక వారలన్ - బరిమార్చి నరుఁడు
శశబృందములను గే - సరి చంపురీతి
నశనికరక్ష-శశరా - హతుల నొప్పించి ;
పసమీఱె ద్వారకా - పట్టంబుఁ జేరి
కుశలం బెలర్ప ము - కుందుఁ డఖండ
విభవంబుతోడ వా - విరి నాగ్నజిత్తిఁ
బ్రభ మీఱఁ బెండ్లాడి - ప్రమద మింపొంద
స్వపురంబులోపల - సరసవిలాస
నిపుణుఁడై సుఖముండె - నీరజాక్షుండు
మారితోడ వైర మె - వ్వరికైనఁ దగదు
నరమాత్రుఁ డని కృష్ణు - నరయఁగా రాదు ॥

దరువు - త్రిపుటతాళము

మగువరో వినుమమ్మా మాధవుచరితముఁ- బొగడ శక్యమటమ్మా ॥ మగువరో ॥

జగములున్ వినుతింప - నగధరుండు గ్రమ్మఱన్ - సుగుణసముద్రభా - సురకేకయకుమారికన్ ॥ మగువరో ॥

వరభద్రకన్యను - సరవిఁ బెండ్లియాడెను - నరివర్గంబు
భీతిల్లఁగా - సురలం దఱిమి మున్ను - గరుడుఁ డమృతంబుఁ
గొన్న తెఱఁగున౯ - నరేశ్వరులఁ - బరిమార్చి విజయుఁడై ॥

వనజదళాక్షుఁడు - గొనితెచ్చె మద్రకన్య - కను సమద
మృగేక్షణ౯ - ఘనపుణ్యలక్షణ౯ - సునయవిచక్షణ౯ - వని
తామణిలక్షణ౯ - దనరం బెండ్లియాడెను ॥ మగువరొ ॥

ప్రియసతు లిటు రుక్మి - ణియు జాంబవతియు నెం..
తయు సత్యభామ లెలమి - నయమెలర్పఁగాఁ గాళిం - దియు
నాగ్నజిత్తియు భ - ద్రయు లక్షణ యనంగఁ - దగ నెన
మండ్రు సతులు ॥ మగువరొ ॥

అల నరకునిఁ ద్రుంచి - యానిరుద్ధకన్యామ - ణుల
సహస్రసంఖ్యలను-లలితరోహిణి మొద - లైనవారి౯ గ్రహించె-
నిల సత్యభామపురి - నిలయుఁ డైనగోపాలుఁడు ॥మగువరొ ॥

ధరకు హితసూనుఁ డైనయా - నరకు నేల
హరి వధించెను ? నరకుఁ డ - య్యతివగణము
నేల కారలఁ బెట్టె ? ము - నీంద్ర ! యని న
రేంద్రుఁ డడిగిన మగుడ ము - నీంద్రుఁ డనియె ॥

## ద్విపద

నరకదైత్యునిచేత - సురమాత యదితి
వరకుండలంబులు - వరుణుని ఛత్ర
మును మణిభూధర - మునునమరాద్రి
యును హరియింపఁబ - డిన వజ్రి వచ్చి

హరికిఁ జెప్పిన విని - యాయుపేంద్రుండు
నరకవధార్థమై - కెరలి ఖగేంద్ర
వాహనారూఢుఁడై - బయలుదేరఁ గని
సాహసం బొప్పఁగా - సత్య యిట్లనియె
దేవ ! నీ వలఘుఁడై - తేయులఁ ద్రుంచు
ప్రావీణ్యమును జూడ - బహుకాంక్ష గలిగెఁ
బ్రాణేశ ! ననుఁ బ్రాభ - వమున నీవెంట
రాణింపఁ గొనిపొమ్ము - రణవిలాసంబుఁ
గని వచ్చి నీవధూ - మణులకుం జెప్పుదుఁ
దనరంగ యుష్మత్ప్ర - తాపమహిమల
నన విని శౌరి ప్రి - యాంగన కిట్లు
లనియెను మృదువచ - నామృతం బొలుక ॥

దరువు - ఆటతాళము

రమణీమణి లీవిధమునఁ గోరికనేయఁ - గ్రమము గాదు తెలియ - సమద భృంగనికాయ ఝంకా - రములు గావు భయంకరోద - గ్రమదకరి బృంహితము లగుఁ గానీ - మృదు కీరవాణీ ॥ రమణీ ॥

అనిల నిర్గతకంజ వనరేణువులు గావు - మన మానం దము నొందఁగా- ఘనతురంగ వితాన పటురింఖాముఖోత్థాపిత పరాగ - మ్మున మనోవికలంబు నగు సుమ్మా - కనకంపు బొమ్మా ॥ రమణీ ॥

వర మరాళ రాజీ - వ సరస్తీరము గా - దరసి వినో
దింపఁగా - సురతరార్భట భీమరాత్రిం - చర మహాసైన్య
ములు బహుఁదు - స్తర కఠోరాకృతులఁ బరికించి - వెరగునను
మించి ॥ రమణీ ॥

కుముద సరోరుహ కుసుమ సుగంధాది - రమణీయ
ములు గావుగా - అమితరిపుగణశూలఖడ్గ గ - దాస్త్ర శస్త్ర
శరాదిసాధన - సమరముఖ మేడ నీ వేడ - సకియ నను వేడ ॥

కలహంసగమన యీకలహ గమనము మాని - నిలువు
నిలువు మిచ్చుట - వలదు నే వేగిరమె పోయి - వత్తునని సత్య
భామపురీ - నిలయుఁడగు మధుకైటభారాతి - పలికె నీరీతి॥ర॥

## గీతార్థము

అసురు లైన నేమి - యమరు లైన మఱేమి
భయము ? శావకోరు - బాహుదుర్గ
ములను దాగియుండ - మోసమే మిఁక నాకు
వత్తు నీదు వెంట - వాసుదేవ- నీసేవఁబాసి యోర్తునా - యనుచు
నంజలిఁ - జేసి నే తాళ నేర్తునా ? ॥

అని యివ్విధంబున సత్యభామయుఁ దనకు మ్రొక్కిన హరి
హస్తకంజంబులఁ గ్రుచ్చియెత్తి తోడుకొని విహగేంద్రారూ
ఢుండై యాకాశపథంబున నేగి శైలశస్త్రతోయదహన పవన
దుర్గమంబై మురదానవ పాశావృతంబైన ప్రాగ్జ్యోతిషనగరం
బును సమీపించి యప్పుడు—

## ద్విపద

గదచేత శైలదు - ర్గములు వగులఁగఁ
జదిపి శరంబుల - శస్త్రదుర్గములు
మొదలంట భంజించి - మొనసి చక్రమునఁ
జెదర జలానిల - శిఖిదుర్గములను
జెలఁగి నిశ్శేషంబుఁ - జేసి యామీఁదఁ
జలపట్టి మురదైత్యు - చటులోగ్ర పాశ
ములను దత్ప్రాకార - ముల గదాహతుల
నలినలిఁజేసి యం - త్రముల ఖండించె
నమర వైరుల హృద - యములు చలించి
భ్రమపడఁ గౌస్తుభా - భరణ భూషితుఁడు
శౌరి యప్పుడు పాంచ - జన్యంబు నిండఁ
బూరింపఁ బ్రళయ ప్ర - భూతకాలాంబు
ధర గర్జనంబువి - ధమునఁ దద్ఘోర
తరమహాధ్వని విని - తడయక పంచ
శరుఁడగు మురనిశా - చరుఁడంత నిద్ర
పరఁగ మేల్కని త్రుళ్ళి - పడి నీల్గి లేచి
యావులించి జలమ్ము - లార్చి వే వెడలి
తా వచ్చి శౌరిను - ద్ధతిని వీక్షించి ॥

దరువు - ఆదితాళము

తరుణీ మణి! వినవే - యీ చరితము భా - సురమైనది
కనవే ॥

హరిని గదిసి కల్పాంతానల మాసరణి మండి దుర్నిరీక్ష్యుఁడై బెరసి కరాళించుచుఁ జెచ్చెరఁ బంచముఖంబుల మురాసురుఁడు - గినిసి భూతపంచకుఁడై విశ్వంబును గ్రమింగం గబళించు పోలికను - ననలాభీలోత్కీల జాల కృత్తన శూలంబున-గరుడుని వైచెను ॥ తరుణీ ॥

భూనభోంతరాళంబు నిండఁగాఁ - దానార్చుచుఁ బరువడి బిరుసునఁ బగ-తో నెదిర్చి హరి హరి నిలునిలు మనినను-శ్రీనాథుఁడు రంజిల్లెఁ జెలంగుచు ॥ తరుణీ ॥

సుర లలర ఖగేంద్రునిపైఁ - బడ వచ్చిన శూలము శ్రీ - హరి నడుమనె తన - కరమునఁ గొని ముత్తునియలుగా-వేగిరమె విఱచి రోషానల మలరఁగ ॥ తరుణీ ॥

మురముఖముల శాతాశుగముల వడిఁ - బఱపి మెఱయ మురుడుం గదవైచిన- హరి గదచేఁ దద్గద చూర్ణంబై- విఱుగ నడఁచి క్రమ్మర సమరంబున ॥ తరుణీ ॥

దనుజుఁడు గేలెత్తుక వడిరాఁగాఁ - గని చక్రంబున వాని శిరము లై - దును ఖండించిన మును వజ్రాహతిఁ - దునిగి కూలు కొండలగతిఁ గూలెను ॥ తరుణీ ॥

మురుఁడు జలాంతరమునఁ గూలెనని ని - ర్జరులు పొగడి రానందంబున శ్రీ - హరియు సత్యభామ పురిశుండై - పరఁగె భక్తజనపాలన శీలుఁడు ॥ తరుణీ ॥

## ద్విపద

మురుని సూనులు శోక - మున మురాంతకునిఁ
బరిమార్తు మని బాహు - బలము దీపింప

నలిగి తామ్రుండును - నంతరిక్షుండు
బలిసి శ్రవణుండు వి - భావసుం డెనసి
యకట ! నభస్వతుఁ - డరుణుండు నాఁగఁ
బ్రకటిత శౌర్యవి - క్రములు క్రోధారు
ణాంబకు లగుచుఁ గా - లాంతకచోది
తంబైన ప్రళయ వా - త స్తబకంబు
పెంపున నరకుచేఁ - బ్రేరితు లగుచుఁ
దెంపునఁ బీఠు డై - తేయ సేనాధి
పతి పురస్సరు లౌచుఁ - బఱతెంచి హరిని
నతిరయంబునఁదాఁకి - యార్చి శరాసి
పరశు గదాంకుశ - పాశ త్రిశూల
కరవాల శక్తిము - ఖ్యము లగుసాధ
నములఁ బ్రయోగింప - నన్నింటినడుమ
నిముసంబులోఁ ద్రుత్తు - నియలు గావించి
ఘనభుజదండ వి - క్రమము దలిర్పఁ
గనలి శాతశిలీము - ఖంబుల ముంచె
ననిలోనఁ గాకగృ - ధ్రాశనంబుగను
దనుజారి దనుజుల - తలలు గంఠములు
నుదురు భుజంబులు - నోళ్ళు హస్తములు
నుదరముల్ నడుములు - నూరు పాదములు
నవయవంబులు దిల - లంతలై చెదరి
యవనిఁ బడంగూల్చె - నా నిశాచరుల.



శ్రీ పాట్రి వీరేశముగారు

దరువు - కాఫీరాగము

హారి శరజాల చక్రమునఁ - దన - పరిచరుల్ మడియఁ
కతమున - వెఱపు రోషంబు ముప్పిరిగొనఁ గౌస్తుభ - ధరుని
ధిక్కరించి - నరకుండు గ్రక్కున ॥ హారి ॥

నరకు సేయక నిశాచరుఁడు - దివ్యాం - బరకుండల
ముఖాలంకరుఁడు - గిరులఁబోలు గొప్పకరులు గర్జిల్లఁగ -
నరద మెక్కి సిం - హధ్వనితో వచ్చె ॥ హారి ॥

ధరణీసుతుఁడు వీక్షించె - మృగ - ధరమండలముపై
వసించె - వరతటిద్యుతవారి - ధరమో యనఁగ ఖగే - శ్వరుని
మూపునఁ బ్రభా - కరుఁడై వెలుఁగుహారిని ॥ హారి ॥

శరచాపశంఖచక్రములు - మించి - పరఁగ సత్యాత్రి
విక్రములు - మెఱయుచుండఁ జూచి - నరకుఁ డొప్పుచు భయం
కరదారుణాకృతి - నొరసి రణమునకు ॥ హారి ॥

అలుకతో గమకించువానిఁ - గని యి - మ్ములఁ దమ
కించక పూని - లలనామణి మహోజ్జ్వలసంభ్రమంబున - లలిత
సత్యపురీ - నిలయునిసరసను ॥ హారి ॥

ద్విపద

వేణి నమర్చి, నీ - వీగ్రంథి మెలిచి,
జాణయై భూషణ - జాలంబు మెఱయ
వదనేందుమండల - ప్రభలు నల్దెసలఁ
గదిసి పర్వఁగఁ గరా - గ్రమునఁ బయ్యెదను

జక్కఁగా దోఁపి భా - స్వద్వీరరసము
నుక్కుమీఱఁగ లేచి - యువతీలలామ
పరఁగ నాథునియగ్ర - భాగాన నిలిచి
మఱి నిశాచరుల దో - ర్మదము నణంపఁ
గోరి సిద్ధంబైన - కోమలిం జూచి
శౌరసాహసుఁడు మృదు - సల్లాపమునను
నవమోహనాంగి! దా - నవులను గెలువ
నవిరళదర్పమిం - పడరఁగ నేల
కణఁగి లేచితి విట్లు - గార్యశేముషిని
రణరంగమునకు సం - రంభమున నిపుడు
రమ్ము కార్ముకము గై - కొమ్ము కెంగేల
నిమ్ముగా నిది సగు - ణమ్మొనరింపు
మని సత్యభామకు - నంబుజేక్షణుఁడు
ఘనవీరదైత్యసం - ఘత్రాసనంబు
పరరాజబాహుగ - ర్వనిరాసనంబు
వరశరాసనముఁ దీ - వ్రముగ నందించె
నావిల్లు గైకొని - యద్భుతశక్తి
లావును దేజోవి - లాసప్రభూత
వీరప్రతాపంబు - వెలయంగ నసుర
వీరు లాలోకింప - విల్లు సంధించి
వీర మాఁడుదిరయైన - విధము దోఁపఁగను
వారక మొరయించె - వడి నారి దిగిచి
యరిసైన్యరింఖణా - ద్యాస్పదంబైన
గురునిస్వనంబు ది - క్కులు పిక్కటిల్ల.

దరువు - అటతాళము

తరుణీమణి చిత్రమైనది యీచరితంబు గోరి వినవే ॥ కలికున నంతకాకారులై విలసిల్లు - నరకాదివీరుల సరకుగొనక విరారి ॥ తరుణీ॥

కనకకంకణఝుణంఝుణనిస్వనంబులు - ఘనశింజినీధ్వని ననుకరింపఁగను - సాంద్ర - తనులసత్తాటంకమణిగణ - ధగధగద్యుతిజాలమును ద - ర్పణకపోలసుమండలరుచుల్ మొనసి యేకంబై వెలింగెను ॥ తరుణీ ॥

నిజపాండురాపాంగనిగనిగరోచుల - క్కజముగ శరజాలకాంతి నడంపఁగ - బాణ - వ్రజవిపాతఘుమంఘుమాయిత - సృజితనిస్వనముల నిశాచర - భుజబలాటోపాస్ఫటంబుల - గజిబిజిం బరపంగఁజేయుచు ॥ తరుణీ ॥

పటువీరశృంగారభయదరౌద్రాద్భుతో - త్కటతలు చెలఁగి చక్కని మెలంతుక యయ్యె - నాఁగ - నిటుల నిషువ్రం దొడుగుటయుఁ దిగు - చుటయు నేయుట యెఱుఁగరాకుం - డుటయు నని సేయుటయుఁ జూప - ట్టుట మహాద్భుతతర మొనర్చెను ॥ తరుణీ ॥

అరిని విలోకించు హరిని వీక్షింపుచు - నురుమూర్చ్ఛనలరించు - నురుకోపరాగోద్ధత - జాత - విరతభ్రుకుటియు మందహాసము - వీరశృంగారం బెలర్పఁగఁ - దరుణి కన్నుల కెంపు సొంపును - బరఁగఁ జండాస్త్రములఁ గురిసెను ॥ తరుణీ ॥

సరసాలోకముల్ - హరి దెస నెఱపు సం - గర ముగ్రస్థితి హేలా - గతి నొనర్చెను సత్య - భామ - యరినిశాచర

సైన్యముల దు - త్తుటుముగా ఖండితము లగుశే - ఖరగళం
బులు నెదలు నడుముల్ - కరము లూరులు జంఘు లంఘ్రులు ॥త

అలరుచుండెఁ బ్ర - త్యాలీఢమానము - నలికలలాట
ఘర్మాంబుబిందువులతోఁ - జూడ - సలలితజ్యానఖశరద్యుతి -
వెలయ లత్యాలోకనముతో - వలయకృతకార్ముకవిముక్తా -
వార్యశితవిశిఖౌఘములతో ॥ తరుణీ.

ఉరుహారారిమై - యొప్పునాబొమ్మల - పరిణయంబు
లకు - నరుగ నొల్లనిబాల - తా బ - వరమునకు నెటు
రాఁగడంగెను - బరపురుషులం జూడ వెఱచిన - గరిత రిపుల
గెలువ నెటోర్చెను - సరస సత్యపురీశుతోడను ॥ తరుణీ.

## ద్విపద

బంగరుయెన్నల నెక్క - భయపడుకోమ
లాంగి యేమాడ్కి వి - హంగేంద్రుమూపు
నెక్కె ? సందడిని స - హింపనిలేమ
యక్కలహాళికా - హాళ భేరికాది
భూరివాద్యముల నే - పొల్పున నోర్చెఁ ?
జారుమయూరపుం - జములకు నృత్య
మును గఱపుచు భార - మున డస్సి తొలఁగు
ననబోణి యేరీతి - నటియింప నేర్చె ?
నాలీఢమానాదు - లమరంగ నోర్చి
యాలంబులో నెట్టు - లసురులఁ ద్రుంచె ?

వీణఁ జక్కఁగఁ బట్టు - వెర వూనఁ బోని
జాణ యేచందానఁ - జాపంబుఁ బట్టె ?.
లతను బ్రమాకునఁ గూర్చు - వితమేని గనని
సతి గుణంబును శరా - సనపంక్తి నెటులఁ
గూర్చెను ? ముత్యంబు - గోని సరంబునను
గూర్చలేనిసఖి యే - కోలఁది బాణములఁ
జెలఁగి సంధించెను? - జిలుకకుఁ బద్య
ములు నేర్పఁజాలని - ముగుద యేసరణిఁ
దల గోయ నస్త్రమం - త్రము లెల్ల నేర్చె?
లలిత వాక్యాలాప - ములుగాక యెపుడుఁ
బెద్దగా మాటాడ - భీతిల్లుపడఁతి
తద్దయు సింహనా - దం బె ట్లొనర్చె ?
నన విలసిల్లుచు - నాసత్యభామ
యనిసేయుచుండె న - వ్వనితాలలామ.

## దరువు

ఆరణకేళీవి - హార మిట్లని చెప్ప - నేర్చెకైనఁ దరమే - జగతియందు - నేర్చెకైనఁ దరమే.

నారీగుణధ్వని - భూరిగర్జనముగా - నారయ సుర లెల్ల - సారంగపాళిగాఁ - జారుధను విం(ద్రునిధనుస్సుగ - వారిజాక్షుఁడు వారిధరముగఁ - దా రమణియుః బటిల్లతగ నిం - ద్రారి దావాగ్నియుత మనఁ దగె ॥ ఆరణ.

అమిత ప్రావృట్కా - లము సేసె విశిఖచ - యము పయ
శ్శీకరాళి - గాఁజేసెను - విమలేందుబింబమై యినబింబమై
యొప్పు - కమలాక్షీ ముఖమండలముసొంపు గమకింప - కొమరు
చేలాంచలము దనరెను - గామకేతువు ధూమకేతు వ - న
మదనపరిధిగ్రమై యుగాంతే - నపరిధి యనఁ నెలఁత చాపము ॥అ॥

అలరు ; సుధాప్రవాహంబై - యనలశిఖావిసరమై
తనరునింతి - సందర్శనము - లలి మోదదాయిగ్రమై - పలురోష
దాయిరమై - పాలతి గురియించును - ములుకులవర్షము -
వెలయుహారికిఁ నరకునకు ని - మ్మలను శృంగారవీరరస -
మ్ములు దలిర్పఁగ - సత్యపురీశ - న్నిలయుఁ డగుగోపాలు
తోడను ॥ ఆరణ కేళీ ॥

పిడుగులవడువున బెడిదపు
వడిఁ గోలలఁ దాఁకి దాన - వస్తోమంబుల్
వడి చెడి మడియఁ నిలువక
విడివడి రిపుబలము నరకు - వెనుకం జొచ్చెఁ.

## ద్విపద

ఆవేళఁ గంసారి - యామనోహారిని
భావించి సంతోష - భరితచిత్తుఁ డయి
సలలితేక్షణుఁ డయి - సరససల్లాప
ముల నాజిసన్నాహ - మును నివారించి
పలికె నీ రాక్షస - పతిసేన కొమ్మ !
తొలఁగె నీయనికిఁ బొం - దుగఁ గొమ్మ జయము

మెచ్చితిఁ గోరుము - మేలైనసొమ్ము
లిచ్చెదఁ గైకొను - మిందీవరాక్షి !
యని పల్క హృదయమో - హనదీపనముగ
నొనర సన్మానసం - యుక్తసల్లాప
ములఁ బ్రియురాలి ని - మ్ముగఁ జొద్దసేసి
చెలికరంబున నున్న - యలఘుబాణాస
నముఁ దాను గైకొన్న - నరకుఁ డయ్యెడను
గమలనాభునిదిక్కు - గాంచి యిట్లనియె.

## దరువు

తగవు గాదు శ్రీధర ! నీ కిది యని పగ నెదిర్చి పలికె - నరకుఁడు - మగువ లేచి మగవా రెదుటను - దన - మగతనములు చూపఁగ నగునా యిది ॥ తగవు.

జగడము మానుట మగతనమా యిటు మగువల దెసఁ జనరు - దనుజాలు - మగలకు మగలగుటకె వెగటొందకె - పగవారికె మొనదగిలి త్రుంతు రన ॥ తగవు.

నరకా ! నినుఁ దెగ - నఱకెదఁ గను మత్కరకార్ముక గళితా - శుగముల - నురుమూర్చెడ - భీకరకాయుఁడ ! నిర్జరకిన్నరసతు లలరఁగ హరి యనె ॥ తగవు.

హరి యిటు నరకాసురయోధులపైఁ - బఱపె శతఘ్ని యనఁగ - జెలఁగెడు - వరదివ్యాస్త్రము దానికి వారం - ద తొక్కపెట్టఁ దల్లడమందిరి ॥ తగవు.

శరఖండితతురగములు గదాజ - ర్జరితకరీంద్రములు - సువర్ణవ - పరిదళితాసుర - చరణమధ్యకర - శిరభుజోరుకంధరములు గూలెను ॥ తగవు.

సురరిపుయోధులు శూరులు దైన్యముఁ - బోరసి యుక్కడంగి - విచ్చిరి - హరిమ్రోలఁ నిలువంజాలక - పారిరి హాహానినదముల బెగడుచు ॥ తగవు.

కెరలి మొనసి నిర్జరభిద్యోధులు - గురుతరాస్త్రసమితిఁ - బఱపిన - మురవిరోధి మూఁడేసికోలలఁ - దుఱుము నేసె సంగరమున బ్రేల్మిడి ॥ తగవు.

చరణనఖంబులఁ బక్ష - చంచుతీవ్రాహతులం బన్ని - నట్టి - కరిసంఘంబులఁ గూల్చెను ఖగపతి - హరిని సత్యసుందరినిఁ మోయుచు ॥ తగవు.

గరుడపక్షపవన - గురుహతికిఁ గర్బురులు దాళలేక - మిగిలిన - యరిసైన్యము లనిఁ బాఱఁజూచి భా - సురసత్యాపురీశ్వరుఁడు వెలింగెను ॥ తగవు.

## ద్విపద

నిలువ నోపక యామి - నీచరు లెల్ల
గలఁగి పురికిఁ బాఱఁ - గా ధరాసుతుఁడు
మును గులిశాయుధ - మ్మును దిరస్కార
మొనరించునిజకర - మ్మున ఘనశక్తిఁ
గొని వడి నాగాంత - కుని వైవ నదియుఁ
బెనుమంట లెగయంగ - వే వచ్చి యతనిఁ

దాఁకిన విరిదండ - దాఁకిన ట్లగుట
పీఁకతో నతఁ డొప్పె - వీక్షింప మత్త
శుండాలముం బోలి - సుభగుండు హరియు
దండధరాకృతిం - దనరె ; నయ్యెడను
చెనుకోపమున మండి - భీకరోద్ధతిని
గనుఁగవ విస్ఫులిం - గములు రాలంగ
రక్కసఱేఁడు శూ - రత గజేంద్రంబు
నెక్కి రణంబున - నెదిరించె హరిని.

దరువు - మధ్యమావతిరాగము

నరకుఁ డావారణనాథు నెక్కి సంగరమున నెదిరించి - రోషించి - సరకుఁగొనక హరిఁ ద్రిశూలము నురువడిం బఱపిన ముకుందుఁడు - కఱకుగను జక్రంబు వైచెను మంట లెగయఁగ ॥ నరకు.

మండుచు దనుజులగుండె లవియ దిశల్ నిండ మ్రోయుచుఁ దాఁకెను - జండకరనిభరత్నమయనవకుండలాంచితమస్తకము వెను - కొండశిఖరమురీతిఁ గూలఁగ ఖండితం బొనరించె నరకుని ॥ నరకు.

వనమాలి తల ద్రుంచెనని నను బ్రోవుమని భూదేవిని వేడు - కొనురీతిగఁ జెనురొదఁ గదనావనిం గూ - లెను ధరాసుతుఁ డంత నమరులు - మునులు సత్యపురీశు హరినిఁ వినుతిఁ జేసిరి సంతసంబున ॥ నరకు.

## ద్విపద

శ్రీరమాధీశాయ - చిద్విలాసాయ !
కారుణ్యహృదయాయ - గరుడధ్వజాయ !

కౌస్తుభాభరణాయ - కనకచేలాయ !
నిస్తులవిభవాయ - నీరజాక్షాయ !

వితతప్రతాపాయ - వేదరూపాయ !
నతజనత్రాణాయ . నారాయణాయ !

సమరనిర్జితరాక్ష - సాయ నిత్యాయ
నమ ఇదం నమ ఇదం - నరకాంతకాయ

కనుగొంటి మీలోక - కంటకనరక
దనుజుండు గూలె నిం - తట సుఖం బుండు

మని పూలు గురిసిరి - హర్షంబు మీఱ
ననిమిషబ్రహ్మర్షు - లాకాశవీధి

నంతట భూదేవి - హరిఁ జూడ వచ్చి
సంతసంబున రత్న - సౌవర్ణకలిత

ఘనకుండలములు చ - క్కని వైజయంతి
వనమాలయును మఱి - వరుణప్రదత్త

మైనఛత్రంబు మ - హారత్న మొకటి
తాను సమర్పించి - తగ మ్రొక్కి భక్తిఁ

గరకమలంబుల - గరిమతో మోడ్చి
పరమపురుషు జగ - ద్గురు దీనబంధు

జగదేకపాలు ల - సద్గుణజాలు
నగణితాంతర్భావుఁ - డగుదేవదేవు
సురతరమహిమాఢ్యుఁ - గరుణాసముద్రుఁ
బరమాత్ము నీరీతిఁ - బ్రస్తుతిఁ జేసె.

దరువు - ఆదితాళము

పరమదయార్ద్రమతీ ! కమలాపతీ ! - సరసిజలోచన
దురితవిమోచన - వరసుధీపావన శరణాగతావన ॥ పరమ ॥

అనయము సకలభూతాంతరారామునకు - ననుపమా
నందునకు ననంతశక్తికి శరణు ॥ పరమ ॥

ఆదిమధ్యాంతములు లేనియాపరంధామునకు - వేదాంత
సారమైనవిభునకు నతులొనర్తు ॥ పరమ ॥

విశ్వదీపకునకు విశ్వరూపకునకు - విశ్వతోముఖునకు
విశ్వభరునకు శరణు ॥ పరమ ॥

సకలనిధానునకు సకలార్థపాత్రికి - నకలంకమూర్తికి
నాత్మేశునకు శరణు ॥ పరమ ॥

బ్రహ్మను గన్న మేటిపరమనిర్వాణపర - బ్రహ్మమునకుఁ
జిత్ప్రభావపూర్ణునకు శరణు ॥ పరమ ॥

నిర్మలాత్ముఁడు విశ్వనిర్మాణకుశలియై - నర్మిలి
వెలయు సనాతనాత్మునకు శరణు ॥ పరమ ॥

సత్యభామాపురీశాదిత్యకోటిప్రకాశ - సత్యభామాధీశ
సత్యపరేశ ! శరణు ॥ పరమ ॥

## ద్విపద

దేవదేవా ! నిత్య - పావనా ! నీవు
కేవలం బైనని - ష్కల్బిషాఖ్యుఁడవు

సృజియింపఁగా జగ - చ్ఛ్రేణుల కాది
నిజరజోగుణమును - నిగుడించినావు

తనర సత్వగుణప్ర - ధానుండ వగుచు
ననయంబుఁ బాలింతు - వఖిలలోకములఁ

బోరి తమోగుణముతో - భువనంబు లెల్లఁ
బరిమార్చె దౌర ! ని - ర్భరకాలమూర్తి !

పరమేశ్వరుఁడవు చి - ద్బ్రహ్మప్రధాన
పురుషుఁడ వజుఁడవు - పురుషోత్తముఁడవు

పరుఁడ వభ్రానిల - పావకాంభోర్వి
వరభూతతన్మాత్ర - వర్గంబు లింద్రి

యంబులు నధిదేవ - తావళి మాన
సంబును గర్త యై - సఁగ మహత్తత్వ

మును జరాచరసంఘ - ములును విశ్వంబు
లనుపమమూర్తి నీ - యందు జన్మించుఁ

బెంపొందు లయమొందు - భిన్నపద్ధతుల
నింపుగా నీమాయ - నెఱుఁగంగ నగునె ?

యదిగాక మానర - కాసురపుత్రుఁ
డుదితభయార్తుఁడై - యున్నవాఁ డితనిఁ

పరునిఁగాఁ జూడక - శరణార్థురీతిఁ
కరుణాకటాక్షవీ - క్షణ మొప్పఁ గనుము

కోడరి తండ్రి తెఱుంగు - దుడుకండు గాఁడు
కడు బాలకుండు లో - కక్రమం బెఱుఁగఁ

డాశ్రయహీనుండు - హరి ! నీపదాంబు
జాశ్రయుఁ డరయుమా - యభయం బొసంగి

దీనరక్షణ ! జగ - దీశ ! పరేశ !
శ్రీనాథ ! యనుచుఁ బ్రా - ర్థింప భూదేవి

హరియు భక్తావనుం - డగుట మన్నించి
నరకాసురాత్మజు - నకు భగదత్తు

నకు నభయం బిచ్చి - నానార్థవిభవ
నికరంబు లొసఁగి న - రకుమందిరమున

నివసించి వెన్నుండు - నెనరుతో వాని
నవనీవిభుఁడుగాఁగ - నభిషిక్తుఁ జేసెఁ

బదపడి నరకుచే - బద్ధలై కుములు
పదియాఱువేలభూ - పాలకన్యకల

సురుచిరతారుణ్య - సుందరాస్యలను
వరుసగా విడిపించి - వారు గామింపఁ

బరిణయం బాడెవై - భవ మొప్ప నంత
హరి సత్యభామాది - తరుణులం గూడి

ద్వారకాపురి కేగి - తగ సుఖం బుండె
పీరుదాసునిఁ బ్రోచు - శ్రీరమాధవుఁడు.

### ఫలశ్రుతి

పరఁగ సాత్రాజితీ - చరితంబు గోరి
ధరణి జనుల్ విన్నఁ - దగఁ బఠించినను

దురితంబు లెడఁబాసి - యురుతరైశ్వర్య
భరితులై సార్థక - చరితులై చిరము

సత్యభామాపురీ - శ్వరునిసత్కృపను
నిత్యశుభంబుల - నెగడుచుండెదరు.

సమాప్తము



ఓమ్

# పంచీకరణము



## గురుస్తోత్రము

గురు ర్బ్రహ్మా గురు ర్విష్ణు ర్గురు ర్దేవో మహేశ్వరః
గురురేవ పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥

అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా
చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః ॥

అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః ॥

చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం సచరాచరం
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః ॥

అనాదినిర్వికల్పపరబ్రహ్మమునందు నవ్యక్తతమ మైననమూల ప్రకృతి వ్యాపించియున్నందున సంకల్పరూపంబుగా నొకమహ త్తత్వంబు గల్గెను. ఆమహత్తత్వంబునం దధిష్ఠానశక్తివలన మహాదహంకారంబు గల్గెను. ఆయహంకారమునందుఁ ద్రిగుణా త్మక మైనమాయ గలిగెను. ఆమాయయందుఁ దన్నిజాంశ మైనయీశ్వరుఁడు ప్రతిఫలించి మాయాశబలబ్రహ్మ మాయెను. ఆమాయాశబలబ్రహ్మమునందుఁ బ్రణవరూపమైన ఓంకా రంబు గల్గెను. అందు "అకారము - ఉకారము - మకారము" అను మూఁడుమాత్రృకలు గల్గెను. అకారమున బ్రహ్మ పుట్టి

రజోగుణయుక్తుఁడై సర్వప్రపంచసృష్టికారకుఁ డయ్యెను. ఉకారమున విష్ణువు పుట్టి సత్వగుణయుక్తుఁడై సర్వలోకపరిపాలకుఁ డయ్యెను. మకారమున శివుఁడు పుట్టి తమోగుణయుక్తుఁడై సర్వభువనలయకారకుఁ డయ్యెను. అట్టి ఓంకారరూపమైన శబ్దతన్మాత్రయం దాకాశంబు గల్గెను. ఆకాశంబున స్పర్శతన్మాత్రంబున వాయువు గల్గెను. వాయువునందు రూపతన్మాత్రంబున నగ్ని గలిగెను. అగ్నియందు రసతన్మాత్రమున జలంబు గల్గెను. జలంబునందు గంధతన్మాత్రంబున భూమి గలిగెను. భూమియం దోషధులు గల్గెను. ఓషధులం దన్నంబు గలిగెను. అన్నమందు నరమృగపక్షిస్థావరజంగమాదు లుద్భవించెను. ఇవి యన్నియుం గూడి యీమహాప్రపంచ మయ్యెను.

## పంచీకరణలక్షణము

ఆకాశార్ధభాగము జ్ఞాతృత్వం బయ్యెను. తక్కినభాగము నాలుగుతునియలై వానియందు మిగిలిన వాయ్వగ్నిజలభూమ్యంశంబులం గూడి మనోబుద్ధి చిత్తాహంకారంబు లయ్యెను.

వాయువు నర్ధభాగము వ్యానం బయ్యెను. తక్కినభాగము నాల్గుఖండంబులై యాకాశాగ్నిజలభూమ్యంశంబులం గూడి సమానోదానప్రాణాపానంబు లయ్యెను.

అగ్నియొక్క అర్ధభాగము నేత్రం బయ్యెను. తక్కినభాగము నాలుగుఖండంబులై యాకాశవాయుజల భూమ్యంశములం గూడి శ్రోత్రత్వగ్జిహ్వాఘ్రాణంబు లయ్యెను.

జలార్ధభాగము రసం బయ్యెను. మిగిలినభాగము నాలుగు ఖండంబులై యాకాశవాయ్వగ్నిభూమ్యంశంబులం గూడి శబ్ద స్పర్శరూపగంధంబు లయ్యెను.

భూమియొక్క అర్ధభాగము పాయు వయ్యెను. తక్కినభాగము నాలుగుఖండంబులై యాకాశవాయ్వగ్నిజలాంశములఁ గూడి వాక్పాణిపాదోపస్థ లయ్యెను.

జ్ఞానమనోబుద్ధిచిత్తాహంకారములు - ఇవి యైదును ఆకాశపంచకము. సమానవ్యానోదానప్రాణాపానములు - ఇవి యైదును వాయుపంచకము. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములు - ఈయైదును జ్ఞానేంద్రియములు; అగ్నిపంచకము. శబ్దస్పర్శరూపరస గంధములు - ఇవి యైదును విషయములు; జలపంచకము. వాక్పాణిపాదోపస్థపాయువులు - ఈయైదును కర్మేంద్రియ ములు; భూమిపంచకము.

మానసాద్యంతఃకరణములు నాలుగు; ప్రాణాదివాయువు లైదు; శ్రోత్రాదిజ్ఞానేంద్రియము లైదు; శబ్దాదివిషయంబు లైదు; వాగాదికర్మేంద్రియము లైదు; ఈయిరువదినాలుగును గూడి స్థూలదేహ మగును.

జ్ఞానేంద్రియము లైదు; కర్మేంద్రియము లైదు; సమానాది వాయువు లైదు; మనోబుద్ధులు రెండు; ఈపదియేడును గూడి సప్తదశకలింగ మైనసూక్ష్మదేహ మగును.

ఈస్థూలసూక్ష్మముల రెండింటికిని జన్మకారణమైన అవిద్యయే కారణదేహము. మొదట జీవుఁడు స్థూలదేహాభిమానియై

విశ్వుఁ డనునామంబున ముఖమం దుండి జాగ్రదవస్థను భోగించును. సూక్ష్మదేహాభిమానియై తైజసుఁ డనునామంబునఁ గంఠమం దుండి స్వప్నావస్థను భోగించును. కారణదేహాభిమానియై ప్రాజ్ఞుఁ డనునామంబున వక్షస్థ్సలమందుండి సుషుప్త్యవస్థను భోగించును. ఈచతుర్వింశతితత్త్వాతీతుఁడై దేహత్రయవిలక్షణుఁడై అవస్థాత్రయసాక్షియై ప్రకాశింపుచున్న చిదాత్మయే తాను. అట్టితన్నుఁ దా నెఱుంగుటయే జీవన్ముక్తి.

## భూతగుణములు

అస్థి - మాంసము - చర్మము - నాళ్ళు - రోమములు - ఈయైదు భూమిగుణములు.

చొంగ - మూత్రము - పిత్తము - శుక్లము - శోణితము - ఈయైదును జలగుణములు.

ఆఁకలి - దప్పి - నిద్ర - ఆలస్యము - సంగమము - ఈయైదును అగ్నిగుణములు.

చాచుట - ముడుచుట - వణకుట - నడచుట - పరుగుట - ఈయైదును వాయుగుణములు.

కామము - మోహము - భయము - లజ్జ - లోభము - ఈయైదును ఆకాశగుణములు.

## పంచీకరణము

| | | | | |
|---|---|---|---|---|
| | | ఆకాశపంచకము | | |
| జ్ఞానము | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము |
| | | వాయుపంచకము | | |
| సమానము | వ్యానము | ఉదానము | ప్రాణము | అపానము |
| | | అగ్నిపంచకము | | |
| శ్రోత్రము | చర్మము | నేత్రము | జిహ్వ | ఘ్రాణము |
| | | జలపంచకము | | |
| శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము |
| | | భూమిపంచకము | | |
| వాక్కు | పాణి | పాదము | ఉపస్థ | పాయువు |
| ఆకాశాంశములు | వాయ్వంశములు | అగ్న్యంశములు | జలాంశములు | భూమ్యంశములు |

జ్ఞానము సమానవాయువుతోఁగూడి శ్రోత్రేంద్రియద్వారమున శబ్దమును గ్రహించుచు వాగింద్రియద్వారమున వచియించును. ఆజ్ఞానమే మనోరూపమై వ్యానవాయువుతోఁ గూడి చర్మేంద్రియద్వారమున స్పర్శను గ్రహించుచుఁ బాణీంద్రియద్వారమున నిచ్చిపుచ్చుకొనును. ఆజ్ఞానమే బుద్ధిరూపమై ఉదానవాయువుతోఁగూడి నేత్రేంద్రియద్వారమున రూపమును గ్రహించుచుఁ, బాదేంద్రియద్వారమున గమనము చేయును.

అజ్ఞానమే చిత్తరూపమై ప్రాణవాయువుతోఁగూడి జిహ్వేం ద్రియద్వారమున రసమును గ్రహించుచు నుపస్థేంద్రియద్వార మున నానందించును. అజ్ఞానమే అహంకారరూపమై అపాన వాయువుతోఁ గూడి ఘ్రాణేంద్రియద్వారమున గంధమును గ్రహించుచుఁ, బాయురింద్రియద్వారమున మలవిసర్జనము చేయును.

## షట్చక్రవివరణము

౧. ఆధారచక్రము గుదస్థానమం దుండును. దానికి రేకులు నాలుగు. అందు "వశషస" లనువర్ణంబు లుండును. భూమి భూతస్థానము. నాసికేంద్రియము కారణము. గణపతి అధిదేవత. అచ్చట హంసలు ౬౦౦ అర్పణము.

౨. ఆధారచక్రమునకు రెండంగుళములపైన ఉపస్థదగ్గఱ స్వాధి ష్ఠానచక్ర ముండును. దానికి రేకు లారు. అందు "బభమ యరల" అనువర్ణంబు లుండును. జలము భూతస్థానము. జిహ్వేంద్రియము కారణము. బ్రహ్మ అధిదేవత. అచ్చట హంసలు ౬౦౦౦ అర్పణము.

3. స్వాధిష్ఠానమునకు ఎనిమిది అంగుళములపైన నాభిదగ్గఱ మణిపూరకచక్ర ముండును. దానికి రేకులు పది. అందు "డఢణతథదధనపఫ" లనువర్ణంబు లుండును. అగ్ని భూత స్థానము. నేత్రేంద్రియము కారణము. మహావిష్ణువు అధిదేవత. అచ్చట హంసలు ౬౦౦౦ అర్పణము.

౪. మణిపూరకమునకు పదియంగుళములపైన వక్షస్థలము నందు అనాహతచక్ర ముండును. దానికి రేకులు పండ్రెండు. అందు "కఖగఘఙచఛజఝఞటఠ" లనువర్ణంబు లుండును. వాయువు భూతస్థానము. చర్మేంద్రియము కారణము. శివుం డధిదేవత. అచ్చట హంసలు ౬౦౦౦ అర్పణము.

౫. అనాహతమునకు ఎనిమిదంగుళములమీఁదఁ గంఠస్థానమున విశుద్ధచక్ర ముండును. దానికి రేకులు పదియాఱు. అందు "అఆఇఈఉఊఋౠఌౡఎఏఐఒఓఔఅంఅః" అనువర్ణంబు లుండును. ఆకాశము భూతస్థానము. శ్రోత్రేంద్రియము కారణము. జీవుం డధిదేవత. అచ్చట హంసలు ౧౦౦౦ అర్పణము.

౬. విశుద్ధమునకు ఆఱంగుళములపైన భ్రూమధ్యస్థానమున ఆజ్ఞేయచక్ర ముండును. దానికి రేకులు రెండు. అందు "హం క్షం" అనువర్ణంబు లుండును. మహత్తత్వము స్థానము. అంతఃకరణము కారణము. పరమాత్మ అధిదేవత. అచ్చట హంసలు ౧౦౦౦ అర్పణము.

౭. ఈయాఱుచక్రములకు మించి శిరోమధ్యమున బ్రహ్మరంధ్రస్థానమున సహస్రారచక్ర ముండును. దానికి రేకులు వేయి. అందు ఓంకారబీజాక్షర ముండును. గురుమూర్తి అధిదేవత. అచ్చట హంసలు ౧౦౦౦ అర్పణము.

## అధ్యాత్మము - అధిభూతము - అధిదైవము

**౧. ఆకాశపంచకమునకు:—**

జ్ఞానము భ్రూమధ్యస్థానమునం దుండుటే అధ్యాత్మము. సర్వేం

ద్రియగ్రహణశక్తిచేఁ బ్రకాశించుటయే అధిభూతము. ప్రత్యగాత్మయే అధిదైవము.

మనస్సు హృదయకమలమున నుండుటే అధ్యాత్మము. సంకల్పమే అధిభూతము. చంద్రుఁ డధిదైవము.

బుద్ధి నాభిస్థానమునం దుండుటే అధ్యాత్మము. నిశ్చయమే అధిభూతము. బృహస్పతి అధిదైవము.

చిత్తము కంఠస్థానమునం దుండుటే అధ్యాత్మము. విచారమే అధిభూతము. క్షేత్రజ్ఞుఁ డధిదైవము.

అహంకారము నోటియం దుండుటే అధ్యాత్మము. నేను అని అభిమానించుటయే అధిభూతము. రుద్రుఁ డధిదైవము.

౨. వాయుపంచకమునకు:—

సమానవాయువు నాభియం దుండుటే అధ్యాత్మము. భుజించినయన్నరసమును డెబ్బదిరెండువేలనాడులకుఁ బంచిపెట్టి సమపుష్టిగా నడిపించుటయే అధిభూతము. జయుఁ డధిదైవము.

వ్యానవాయువు శరీర మంతటను వ్యాపించియుండుటయే అధ్యాత్మము. శీతోష్ణస్పర్శగ్రహణరూపముగా సమస్తనాడులను, గిళ్ళను, నాడించుటయే అధిభూతము. విశ్వయోని అధిదైవము.

ఉదానవాయువు కంఠమున నుండుటయే అధ్యాత్మము. వైఖరీయుక్తమైనపలుకులు పలికించుటయే అధిభూతము. అజుఁ డధిదైవము.

ప్రాణవాయువు అధ్యాత్మము. హృదయకమల మధిష్ఠించి యుండుటయే అధిభూతము. విశిష్టుః డధిదైవము.

అపానవాయువు గుదస్థానమం దుండుటే అధ్యాత్మము. మల మూత్రత్యాగముగా నిశ్వసించుటయే అధిభూతము. విశ్వకర్త అధిదైవము.

౩. అగ్నిపంచకమునకు:—

శ్రోత్ర మధ్యాత్మము. శబ్దగ్రాహిక మధిభూతము. దిక్కు లధిదైవము. చర్మేంద్రియ మధ్యాత్మము. స్పర్శగ్రాహిక మధి భూతము. వాయు వధిదైవము.

నేత్ర మధ్యాత్మము. రూపగ్రాహిక మధిభూతము. సూర్యుఁ డధిదైవము.

జిహ్వేంద్రియ మధ్యాత్మము. రసగ్రాహిక మధిభూతము. వరుణుఁ డధిదైవము.

ఘ్రాణేంద్రియ మధ్యాత్మము. గంధగ్రాహిక మధిభూతము. అశ్విను లధిదైవము.

౪. భూమిపంచకమునకు:—

వాక్కు అధ్యాత్మము. వచన మధిభూతము. అగ్ని అధి దైవము.

పాణి అధ్యాత్మము. ఇచ్చిపుచ్చుకొనుటయే అధిభూతము. ఇంద్రుఁ డధిదైవము.

పాద మధ్యాత్మము. గమన మధిభూతము. విష్ణు వధిదైవము.

ఉపస్థ అధ్యాత్మము. ఆనంద మధిభూతము. బ్రహ్మ అధి దైవము.

పాయు వధ్యాత్మము. మలవిసర్జన మధిభూతము. మృత్యువు అధిదైవము.

## నేత్రపంచీకరణము - తారకోపాస్తి

అండాండము భూచక్రము. పిండాండము చరాచరములు. బ్రహ్మాండము బాహ్యమునకు సరి.

ఆత్మ(తన)యందు కనుగ్రుడ్డు అండాండము. బిందు వనెడిపాప పిండాండము. ఆపాపమధ్యమున వెలుఁగుకళ యే బ్రహ్మాండము. ఆకళలోని నిష్కళ యే బ్రహ్మము.

## మూర్తిత్రయవివరము

ఎఱుపు బ్రహ్మ - అకారము మాతృక - రజోగుణము. తెలుపు విష్ణువు - ఉకారము మాతృక - సత్వగుణము. నలుపు రుద్రుఁడు - మకారము మాతృక - తమోగుణము ఇదే హృదయకమలము. సంగమనిద్రాదు లిచ్చుటనే కలుగును.

## పంచభూతవివరము

పృథివి ఎఱుపు. ఉదకము తెలుపు. అగ్ని నలుపు. సునీల మైన

పాపే వాయువు. ఆపాపమధ్యమున వెలుఁగుకళయే ఆకాశము ఆకళలో నిష్కళయే బ్రహ్మము. అదే చిదాకాశము.

## త్రివేణీవివరము

పైనలుపు గంగ. సునీల మైనపాపయే యమున. ఆపాపమధ్యమున వెలిఁగేకళ సరస్వతి. ఇదే త్రివేణీసంగమము. త్రికూట స్థానము.

## పంచశక్తివివరము

ఎఱుపు ఆదిశక్తి. తెలుపు ఇచ్ఛాశక్తి. నలుపు క్రియాశక్తి. సునీల మైనపాపయే జ్ఞానశక్తి. పాపమధ్యమున వెలిఁగేకళ పరాశక్తి. ఆకళలో నిష్కళయే బ్రహ్మము.

## త్రినాడీవివరము

ఇడ ఎడమభాగము - జీవస్థానము. పింగళ కుడిభాగము - ఈశ్వరస్థానము. నడిమినాళము సుషుమ్న - బ్రహ్మస్థానము.

ఇంక నిశ్చయమార్గ మేలాగన్నఁ బైనలుపు ఇడ. సునీల మైన పాప బిందువే పింగళ. ఆపాపమధ్యమున లోపల వెలుపల జగత్తులనెల్లఁ బ్రకాశించుచున్నకళయే సుషుమ్న. అదే సహస్రారము. అదే బ్రహ్మరంధ్రము.

## త్రిమండలవివరము

నలుపు అగ్నిమండలము. సునీల మైనపాపయే సూర్యమండలము. ఆపాపమధ్యమునఁ బ్రకాశించుచున్నకళయే చంద్రమండలము.

## నాదబిందుకళావివరము

పైనీలమందే నాదము. సునీల మైనపాపయే బిందువు. నడుమ నీవారముపంటి సూక్ష్మరంధ్రమున జగద్వ్యాప్తమై వెలుపల లోపల సర్వపరిపూర్ణమై ప్రకాశించుచున్నదే సుషుమ్న. అదే భ్రూమధ్యము. అదే బ్రహ్మరంధ్రము. అదే ఆపోజ్యోతి. అదే ముక్తికాంత. అదే నీలతోయదమధ్యస్థ. అదే విద్యుల్లేఖ. అదే కోలాటపుమండపము. అదే ఊర్ధ్వకుండలిశక్తి. అదే ఉన్మని. అదే ఆత్మస్వరూపము. అదే ప్రత్యగాత్మ. అదే నీవు. ఈదేహేంద్రియాదిసర్వప్రపంచమును నీవు గావు. నీవే ఆస్వయం జ్యోతివి. నిన్ను నీవు ఆత్మయందుఁ గనవలెను.

## అనుభవప్రకరణము

నేత్రాంతమునఁ బ్రకాశించుచున్నతేజస్సు - హృదయస్థమై ఉచ్ఛ్వాసము చేయుచున్నప్రాణవాయువు - అంతఃకరణరూపమైనమనస్సు - ఈమూఁడును కూటస్థచైతన్య మైనహంసస్వరూపము. ఆస్వరూపమే తాను. అనఁగా అంతఃకరణరూపమైనమనస్సు - అధిష్ఠానచైతన్య మైనప్రాణవాయువు - అంతః

కరణప్రతిబింబమైన తేజస్సు- ఈమూఁడును గూటస్థమై "సోహం సోహం" అని స్మరించుచున్నవి. "సోహం" అనఁగా నిత్యనిరంజన మైనపరబ్రహ్మమే నేను అని భావము. కావున నోట జపించకుండఁ దనంతట తానే రేయింబవలు ౨౧౬౦౦ జపమగుచున్నది. కనుక అజపగాయత్రి యని పేరు వచ్చినది.

"దీర్ఘాస్థిమూర్ధపర్యంతం బ్రహ్మదండీతి కథ్యతే"

అనువచనప్రకారము ఆధారము మొదలుకొని ఆజ్ఞేయమువఱకుఁ గలవెన్ను పెద్దయెముక బ్రహ్మదండి యనఁబడుచున్నది. అది వీణాదండముగాను, దానికి ఆధారము మొదలాఱుచక్రములు మెట్లుగాను, ఆమీఁద ఇడాపింగళాసుషుమ్న లనునాడులు మూఁడు తంతువులుగాను, ఉన్నవిధము—

ఇడానాడి ఆధారకమలము మొదలుకొని యెడమపార్శ్వమున ఆజ్ఞేయపర్యంతము వచ్చి యక్కడ నున్నగంగానదినిఁ, జంద్రమండలమును, వ్యాపించి యెడమముక్కుగుండా ప్రాణవాయువు నుచ్ఛ్వసించును గనుకఁ జంద్రనాడి యనిపించుకొనును. పింగళానాడి ఆధారము మొదలుకొని కుడిభాగమున ఆజ్ఞేయపర్యంతము వచ్చి అక్కడ నున్నయమునానదిని, సూర్యమండలమును, వ్యాపించి కుడిముక్కుగుండా ప్రాణవాయువు నుచ్ఛ్వసించును గనుక సూర్యనాడి యనిపించుకొనును. సుషుమ్నానాడి ఆధారము మొదలుకొని కపాలపర్యంతము వచ్చి తిరిగి ఆజ్ఞేయమునకు వచ్చి యక్కడ నున్నసరస్వతీనదిని, అగ్నిమండలమును, వ్యాపించి భ్రూమధ్యమునఁ బ్రకాశించును

గనుక బ్రహ్మనాడి యనిపించుకొనును. ఈనాడీత్రయకూటస్థ చైతన్య మైనహకారము పురుషుఁడు. సకారము ప్రకృతి. ప్రకృతిపురుషులకు మధ్య అనుసంధానరూప మగుబిందువు గూడి హంస యన నొప్పెను. తా నైనహంస నిరాకారనిరంజన మైనపరిపూర్ణపరబ్రహ్మమునందు నైక్యమై యేకీభవించుటచేతఁ దానే బ్రహ్మ మాయెను. ఇందుకు "తత్త్వమసి" అనుసామ వేదమహావాక్యమే ప్రమాణము. అనఁగా తత్పదవాచ్యార్థ మీశ్వరుఁడు. త్వంపదవాచ్యార్థము జీవుఁడు. ఈరెండింటి కైక్యమే అసి పదము. ఈయుభయవాచ్యార్థములవలన సర్వజ్ఞ త్వాదిగుణములు గలయీశ్వరునకు- అహంకర్తృత్వ భోక్తృత్వ కించిద్జ్ఞత్వాదిగుణములు గలజీవునకు - ఐక్యము ఘటింపదు. ఘటతటాకావరణములఁ గడఁద్రోచి చూచినప్పు డారెంటి యందలిజల మేకీభవించినట్లు కారణోపాధియైన యీశ్వరునకుఁ గార్యోపాధియైనజీవునకు వ్యష్టిసమష్టిరూపము లైనపిండాండ బ్రహ్మాండోపాధులరెంటినిఁ గడఁద్రోచి యందు బ్రహ్మ చైతన్యమాత్ర మున్నట్లు భావించినప్పుడు తత్పదలక్ష్యార్థ మైనపరమాత్మకును, త్వంపదలక్ష్యార్థ మైనప్రత్యగాత్మకును, ఐక్యము సిద్ధించెను. కాన తత్ = ఆపరబ్రహ్మమే ; త్వం = నీవు; అసి = ఐతివి. అనఁగా నీవే బ్రహ్మ మైతివని తత్పదవాక్యార్థము. సర్వకాలములయందు, సమస్తవస్తువులయందుఁ, దనకు తానే మొదలునడుమచివరలు లేక నిండి నిబిడీకృతమై యున్న అచలపరిపూర్ణబ్రహ్మమునందుఁ జరాచరరూప మైనప్రపంచ మును, దేహేంద్రియాదిరూప మైనయెఱుకయును, ద్రాటి

యందుఁ బాము తోఁచినట్లు తోఁచి గురుకటాక్షముచే విచారించి చూచినప్పుడు త్రాటియందుఁ బాము లేనట్లు ఈమూలములేని గుర్తైతేఁగే శరీర మేమియు లేదు. అనఁగా ఆరోపించినజగత్తు అభావమై యున్నది. పరబ్రహ్మ మనఁగా ఉత్తబట్టబయలు. ఏమియు లేదు. ఈపరిపూర్ణముతప్ప నేమియు లేదని భావము.

## మహావాక్యవివరణము

### ౧ ప్రజ్ఞానం బ్రహ్మ

ఇది ఋగ్వేదవాక్యము. దేహేంద్రియాదిసర్వప్రపంచమును విచారించి నిరాకరించినప్పుడు మిగిలినది జ్ఞానము. జ్ఞానస్వరూప మనఁగా సర్వాధిష్ఠానశుద్ధచైతన్యమాత్ర మైనతాను కేవలపర బ్రహ్మ మైతినని భావము. అనఁగాఁ బ్రజ్ఞానస్వరూప మైననీవు దేహత్రయవిలక్షణమై ప్రకాశించుచున్నావు గనుక నీవే బ్రహ్మ మని యీవాక్యము ప్రతిపాదించుచున్నది.

### ౨ అహం బ్రహ్మాస్మి

ఇది యజుర్వేదవాక్యము. అనఁగా శరీరేంద్రియమనఃప్రాణా ధిష్ఠానమై విలక్షణప్రత్యగాత్మ యైననేను సర్వకాలముల యందు సమస్తవస్తువులయందు మొదలు కొన లేక నిండియున్న సర్వపరిపూర్ణబ్రహ్మ మైతినని యీవాక్యార్థము ప్రతిపాదించు చున్నది.

## 3 తత్త్వ మసి బ్రహ్మ

ఇది సామవేదవాక్యము. తత్పదవాచ్యార్థ మీశ్వరుఁడు. త్వం పదవాచ్యార్థము జీవుఁడు. అనఁగా వ్యష్టిసమష్టిభావము. వ్యష్టి అనఁగా దేనికది విడివిడిగానుండుట. సమష్టిఅనఁగా నన్నియుఁ గలసి యేకమైయుండుట. సమష్టిలో వ్యష్టి అంతర్భూత మేలాగన్న - విడి యగునేని వృక్షమును, పలువృక్షములు ములు గూడినప్పుడు వనమును, అయినట్లు వ్యష్టి దేహేంద్రియాధిష్ఠాన మైనది జీవుఁడు. సమష్టిదేహేంద్రియాధిష్ఠాన మైనది యీశ్వరుఁడు. వ్యష్టి అవిద్య. సమష్టి మాయ. అట్టి మాయయు, మాయాప్రతిబింబమును, మాయాధిష్ఠానచైతన్య మును, ఈమూఁడును గూడినది ఈశ్వరుఁడు. అవిద్యయు, అవిద్యాప్రతిబింబమును, అవిద్యాధిష్ఠానచైతన్యమును, ఈమూఁడును గూడినది జీవుఁడు. వ్యష్టిశరీరత్రయాభిమాని జీవుఁడు. సమష్టిశరీరత్రయాభిమాని యీశ్వరుఁడు. త్వంపదవాచ్యార్థ మైనజీవునకు - తత్పదవాచ్యార్థ మైనయీశ్వరునకు- ఐక్యమే అనిపదము. ఈవిధము లక్షించుట యేలాగన్న నొక్క దేశం బున, నొక్క కాలంబున, నొక్క రూపంబున, నొక్క వృత్తినుండు పురుషుఁడు వేఱొక్క దేశంబున, వేఱొక్క కాలంబున, వేఱొక్క రూపంబున, వేఱొక్క వృత్తి ననుసరించి యున్న పురుషుని ఏతద్దేశకాలరూపవృత్తులను లక్షింపక లక్షించిన నతఁడే యితఁ డనెడు నిశ్చయ మేర్పడుటయే యేకత్వము. ఇది జహ దజహల్లక్షణప్రకారము. జీవేశ్వరైక్య మిటువలెనే. ఈవాచ్యా ర్థము నిరాకరించి లక్షించువిధము - త్వంపదలక్ష్యార్థము ప్రత్య గాత్మ; తత్పదలక్ష్యార్థము పరమాత్మ; అన్నప్పుడు చిద్రూప

మైన దేహత్రయవిలక్షణము, నవస్థాత్రయసాక్షి పంచకోశవ్యతిరిక్తమైనకేవలప్రత్యగాత్మ. తత్పదలక్ష్యార్థమైనది పరమాత్మ. సమష్టి దేహత్రయపంచకోశపంచమహాభూతవిలక్షణమై, దేశకృతకాలకృతవస్తుకృతపరిచ్ఛేదశూన్యమై, స్వజాతీయవిజాతీయ స్వగతభేదరహితమై, సత్యజ్ఞానానంతస్వరూపమైనది పరమాత్మ. ఈరెండిటి నైక్యమే అసిపదము గనుక తత్ = ఆయొక్క నిరాకారమైనపరమాత్మ ; త్వం = ప్రత్యగాత్మయైననీవు ; అసి = ఐతివని యీవాక్యము ప్రతిపాదించుచున్నది.

౪. అయ మాత్మా బ్రహ్మ

ఇది అథర్వణవేదవాక్యము. అయం ఈతనువు ఇంద్రియమానసాదులకు విలక్షణముగాఁ బ్రకాశించుచున్నప్రత్యగాత్మ. సాక్షాత్తుగా ఆత్మ. ఈయాత్మయే వెనుకఁ జెప్పినరీతి విచారించినఁ గేవలాద్వితీయాపరోక్షస్వయంప్రకాశపరబ్రహ్మ మని యీవాక్యార్థము.

ఈనాల్గుమహావాక్యములు నీవే బ్రహ్మమని సప్రమాణముగా బోధించుచున్నవి. కనుక లవణాదిసప్తసముద్రములును, జంబూద్వీపాదిసప్తద్వీపములును, అతలాద్యధోలోకసప్తకమును, భూర్భువరాది ఊర్ధ్వలోకసప్తకమును, ఆలోకాధిపతులైన యింద్రాద్యష్టదిక్పాలకులును, సూర్యచంద్రాదినవగ్రహములును, నక్షత్రధ్రువాదిమండలములును, పృథివ్యాదిమహాభూతములును, అవ్యక్తమహదాదిసప్తావరణంబులును, జరాయు

జాండజస్వేదజోద్భిజ్జంబు లైనభూతకోటులును, గూడి యొక బ్రహ్మాండ మగుచున్నది. అట్టిబ్రహ్మాండము పంచభూతమయము. ఆపంచభూతములు తన్మాత్ర లైనశబ్దస్పర్శరూపరసగంధంబులు. వానియంతరమందు అవిద్యాధిష్ఠాన మైనతాను అంతఃకరణరూపమై పిండాండగోళకము లైనశ్రోత్రచర్మ నేత్రజిహ్వాఘ్రాణేంద్రియద్వారమునఁ దన్మాత్రజనిత మైనపంచభూతమయబ్రహ్మాండమై పరిణమించెను. ఆతీరుననే శబ్దాదిజనిత తన్మాత్రమైనబ్రహ్మాండము పిండాండ మైనశ్రోత్రాదిజ్ఞానేంద్రియద్వారమున లీనమై, యేకరూపమై, యంతఃకరణమయ్యెను. ఆయంతఃకరణము అవిద్యాప్రతిబింబమును గూడి ప్రత్యగాత్మ యయ్యెను. అది హంసస్వరూప మయ్యెను. ఆహంస నిరాకారమై బ్రహ్మాండమందు లీనమైనప్పుడు బ్రహ్మాండావరణము లేక నిరావరణనిరాకారనిశ్శబ్దమై పరబ్రహ్మ మయ్యె. ఇది యన్య మేదియు లేక యింద్రియాదిసర్వప్రపంచమును - సంకల్పరూప మైనమనస్సును - అగుచు ఆసంకల్పాదివాసనావృత్తిరహిత మైనప్పుడు మనోవృత్తి లేనిదై శుద్ధసత్వమై కూటస్థచైతన్య మైనది. ఆచైతన్య మేమనఁగా హంసయేకత్వ మైనప్పుడు నిరంతరసహజామనస్క మైనసమయము. దేహేంద్రియాదిప్రపంచ మంతయు నభావమై అద్వితీయాపరోక్షస్వయంప్రకాశ మైనతానే తానై రెండవది యేమియు లేక నిర్వికల్పమై పరబ్రహ్మమై యున్నతనయందు చరాచరాండపిండబ్రహ్మాండములకు స్థానభూతమై సనాతనమై యుండును. అట్టిప్రత్యగభిన్నపరబ్రహ్మచైతన్య మైనయెఱుక షోడశాక్షరీమంత్రార్థము. ఈయెఱుకరూప మైనసమస్తలోక

ములు నెండమావులయందు ఉదకము దోచినట్లు దోచఁబడు చున్నవి. కనుకఁ గలలోఁ దోచినశరీర మేలాగో ఆలాగే, యీమూలము లేని గుర్తైతేఁగే శరీరము. ఏమియు లేదు. ఈవిశ్వ మంతయు నభావమై కేవలాత్మయైన ద్వాదశాక్షరీ మంత్రార్థప్రయుక్తము. పరిపూర్ణము. స్వతస్సిద్ధము. ఇది సకల వేదాంతసిద్ధాంత మైనరహస్యము.

ఓం శాంతిః - సమాప్తము



ఓమ్

# స్వప్రకాశము



[ అచలసిద్ధాంతము ]

సీసపద్యములు

శ్రీమదవ్యయ నిర్వి - శేష నిశ్చల నిరా
మయ నిరాకార ని - ర్మల నిరీహ
నిరుపమ నిర్గుణ - నిష్కామ నిశ్చింత
నిష్కాశ నిర్ద్వంద్వ - నిష్కళంక
నిర్వ్యాజ నిర్బంధ - నిస్తాప నిష్కర్మ
నిర్దోష నిర్భయ - నిర్వికార
నిర్వాసనాసంగ - నిర్భేద నిర్భిన్న
నిస్తుల నిర్జర - నిర్విచార

నిత్య సత్య శుద్ధ - నిర్నాద కేవలా
ఖండ సర్వతోము - ఖామలాత్మ
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౧

శ్రీమించు నచలంబు - శివరామదీక్షితుల్
రాముడు గన్వయ - సోముఁ డగుచు
వర ద్వాదశాక్షరి - పరషోడశాక్షరి
భావముల్ గూర్చి ప్ర - బంధ మొందు
గావింప నదియు భా - గవతుల కృష్ణయ్య
కందార్థము లొనర్చి - పొందుపఱచెఁ
బత్పదార్థము ముఖ్య - తాత్పర్యయుతముగా
సీసపద్యంబులు - చేసి యిపుడు

సాంగముగ రచింప - సద్బుద్ధి వాడమెను
బరఁగుసర్వపూర్ణ - భావ మెల్ల ॥ స్వప్ర ॥ ౨

పరఁగు నీసంసార - బాధకుం దాళక
వరశిష్యుఁ డొకఁడు ని - ర్వక్రబుద్ధిఁ
బొలుపొందుసద్గురు - పుంగవుం గని మ్రొక్కి
తనపూర్వజన్మ స - త్కర్మమునను
దేవ! శుభప్రద - దివ్యమార్గ మొకండు
బోధింపవే పుణ్య - పురుష! యనిన
నతని శ్రద్ధావిన - యప్రవృత్తికిఁ జాల
హర్షించి కరుణాళుఁ - డగుటవలన

నమర విశదపఱతు - నచలమార్గము నీకు
భక్తితోడ వినుము - భక్త యనెను
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! 3

ముకుళితనిజకరాం - బుజయుగళుం డైన
శిష్యునిఁ బ్రేమ వీ - క్షించి గురుఁడు
నిరుపమానవిశేష - కరుణాసముద్రుఁడై
వరసుధామాధుర్య - వాక్యములను
నిర్మలానందుఁడై - నిజబోధమార్గంబు
విన్నవింపఁదొడంగె - విశ్రుతముగ
విను సంశయంబులు - విగతమగా పరిపూర్ణ
మొకటి లేని యెఱుక - యొకటి గలవు

ఎఱుక పూర్ణములను - నెఱిఁగి గుర్తును వీడు
మని యెఱుంగఁ బల్కె - తా మహాత్మ ! ॥ స్వ ॥

ప్రథమమందున శుద్ధ - పరిపూర్ణ భావంబు
రచియింతుఁ దదనంత - రమున నెఱుక
విధ మెఱింగింతును - విశదంబుగాఁ దుదిఁ
గుర్తును వినిపింతుఁ - గూర్మి వెలయ
విడువక మద్వాక్య - విధము మానసమున
హత్తించి చిత్తేంద్రి - యంబులం జ
లింపకుండితి వేని - యింపొందు విద్వత్స
భామధ్యమునఁ గని - బలికె యిట్టి

సరళి కెదురు లేదు - సరి యనునట్లు చే
సెద నటంచి వీర ! చిదచిదాత్మ
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౫

ఓ దేవదేవ! కృ - పోదధి! సద్భక్త
మందార! తా మింత - మహితవిభులు
గావునఁ దమరైన - ఘనసన్నిధానంబుఁ
జేరితి గురుపాద - సేవకొఱకుఁ
దనరుత్రిలోకంబు - లను విలోకింప మీ
పాటి పోల్పంగ నే - పాటివారు
లే రింతవారని - లెస్సగా నమ్మితి
మానసంబున నాదు - మనవి వినుఁడి

రొటుల వినుతు మన్న - నటు లాలకించెద
బోధచేయుమయ్య! - భూరికరుణ ॥ స్వప్ర ॥ ౬

బాహ్యాంతరేంద్రియ - బద్ధసమూహమా
నసులనైనను బ్రస - న్నాచలత్వ
మరయ నవిద్యామ - హాంధకారపటల
దూరులుగాఁ జేయు - వార లెల్ల
మీసన్నిధికిని వి - చ్చేసినఁ గని మహా
పరిశుద్ధసంపూర్ణ - భావసహిత
బోధోక్తులను ముఖ్య - సాధనసూక్తులఁ
దగినయుక్తులతోడ - నొగి వినంగ

వచ్చితిని భవత్ప్ర - భావంబు వెలయంగ
బుద్ధిహైన్య మెల్ల - దిద్దు మయ్య
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౭

ఉత్పత్తివిలయంబు - లొందుచు ననిశంబు
నామరూపక్రియా - నటన గల్గి
ప్రభవించు చైతన్య - భావ మించుక యెఱుం
గక నగేంద్రమురీతిఁ - గదల కెపుడుం
జననలయాద్యవ - స్థల నేమి చెందక
నామరూపక్రియా - నటన లేక
యలరారు బట్టబ - య లిదని వీక్షింపఁ
దగు; మనోవాగతీ - తంబు దెలియ

మఱి దురాశపడక - మర్మంబు గురుని చే
నరయు మనుచుఁ బల్కు - తౌర! దేవ ॥ స్వప్ర ॥

కరమొప్పఁ దెలివైన - కైవడి నుండును
సమత నెఱుంగ న - సాధ్య మగును
గణుతింప జ్ఞప్తి యే - క్రమమునఁ దెలియదు
తెలివికిఁ బ్రజ్ఞకుఁ - దెలియఁ గష్ట
మగుసుమీ; బట్టబ - యలు గుర్తు నెఱుఁగనే
యొఱుఁగదు తరుగదు - కరుగ దెపుడు
విరుగదు పెరుగదు - పరఁగదు తిరుగదు
కన దాలకింపదు - కాదు గాలి

యిట్టి దట్టి దనుచు - నెఱుఁగరానిది యంచు
విన్నవించి తౌర! విమలమూర్తి!
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య!

వచనంబులఁ దలంచి - వచియింప రానిది
కనుఁగొనఁ దృష్టికిఁ - గానరాని
దగుచు మతికి హృద - యంబున కందక
సతతంబు ములు మోపు - సందు లేక
పరఁగుచున్నది బట్ట - బయు లనం బరిపూర్ణ
నిర్వికార నిరస్త - నిర్గుణాత్మ
మై సర్వదేశంబు - లందు సమస్తవ
స్తువులం జరాచర - స్తోమములను

ననిశ మొక్కరీతి - నచలమై మఱి ద్వంద్వ
ములకుఁ గలఁగ దంచుఁ - దెలిపినావు ॥ స్వప్ర ॥

తనమహాత్వం బేమి - యును నెఱఁగింపదు
పలువికారంబులఁ - గలయ దెపుడు
పంచభూతమయప్ర - పంచకంబు నెఱుంగ
దేప్రభావంబుల - నెన్నఁబడదు
పసు లెగ్గులాడినఁ - బ్రతి పల్కఁగాఁ బోవ
దెలమి సంపూర్ణత - నెసఁగియుండుఁ
బుట్టని గిట్టని - బట్టబయలు కేవ
లాత్మ యనుచుఁ గొల్తు - రఖిలదివిజ

లేమని యనరాక - యేకమై యున్న దీ
గుట్టుఁ దెలియు మంటి - గురువరేణ్య!
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౧౧

హోమముల్ యోగముల్ - నీమముల్ దానముల్
ధర్మముల్ వ్రతములుఁ - గర్మములును
జపములు తపములు - సంధ్యాద్యనుష్ఠాన
ములు ప్రతిమార్చన - మ్ములు సమస్త
తీర్థయాత్రలు జన్మ - సార్థకమని యిచ్ఛ
యించి మానవు లొన - రించ బయలు
పలుక దెలియంగదు - పరఁగు సువర్ణాద్రి
యించుకైనను సంచ - లించనట్లు

నేను నీవు నాక - యాను గా దన నొక్క
తీరు నలరునంటి - వౌర దేవ ॥ స్వప్ర ॥ ౧౨

హెచ్చుతగ్గులు లేని - దెగ్గులగ్గులు లేని
దింతింత యనరాని - దెలుక లేని
దేవిచారము లేని - దేవిస్మయము గాని
దిబట్టబయలు మ - ఱెంత దనుచుఁ
దెలుఁపుదు పుత్ర! నేఁ - దెలుప నీవు వినంగ
నిది మహాశాస్త్రమా - నెందు కిపుడు
సకలలోకములందు - సకలార్థములయందు
నంతరంగభవాబ్ధి - యంతములను

సతత మొక్కరీతి - సంపూర్ణమై యుండె
నదిగో! యున్న దరయు - మంటి దేవ
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య!

అవనికంశిఖివాయు - వంబరాద్యఖిలత
త్వసమూత్మక మగుచై - తన్య మరయ
నఖిలప్రపంచక - మయ్యె దీనికి రాక
పోక లెందుఁ గలవా ? - పొందుమీఁట
బరిశుద్ధ మీఁబట్టు - బయ లది గాదన్న
వట్టిపల్కుగుసుమూ ! - భద్ర మొదవ
నఖిలాండకోటి బ్ర - హ్మాండభాండం బెల్లఁ
దనలోన వచ్చినఁ - జనిన మగుడి

పోఁడిమి చెడకుండఁ - బూర్ణమై యున్న దీ
యచల మనుచుఁ బల్కు - తౌర! దేవ ॥ స్వప్ర ॥

స్తనితసౌదామినీ - సజలాభ్రముల్ వృష్టిఁ
గురియఁ గూడుట పాయు - టెఱుఁగనట్టి
నింగివోలెను, ఝరీ - నిమ్నగాదిప్రవా
హము లెన్ని గలిసిన - నఖిలమైన
భూరిమీనాదికం - బులు పరంపరలుగాఁ
దనలోనఁ గలిగినఁ - జనిన రెండు
గుర్తు లేకుండి య - కూపార మింపొందు
నటువలెఁ, బరిపూర్ణ - మలరుచుండు

మృగజలంబు లట్లు - జగము లుండినఁ జన్న
నచల మెఱుఁగకుండు - నంటి వౌర !
స్వప్రకాశమాన - సదయ చిట్టింశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య !

అనువొందుచైతన్య - మైనట్టి భూతపం
చకము నీగుర్తుకే - చరణయుగము
నవలగ్నమై హృద - యముఁ గంఠమస్తకా
ద్యవయవాంగము నయ్యె - నవని మొదలు
చేసి యిట్లన్నింటఁ - జేఁగి గుర్తెఱుఁగును
నాకసంబు బయ ల - నంగ నొప్పు
దీమర్మ మెఱుఁగక - యిలఁ గొంద ఱాకాశ
మే పూర్ణమని పలి - చూపుచుంద్రు

దాన నీవు గుఱిని - ధ్యానంబు దప్పకు
మని యనుజ్ఞ యిచ్చి - నట్టిదేవ ॥ స్వప్ర ॥ ౧౬

భాస్కరుండు తమఃప్ర - భావ మెఱుంగునే ?
యతిరంజిత వనవా - తాశనుండు
పటుతరంబుగఁ జెదల్ - పట్టు టెఱుంగునే ?
దివము నిశిఁ నిశిఁ - దివము నెఱుఁగ
నగునె? లేమిని లేశ - మైన నెఱుంగునే ?
యబ్ధికన్యకఁ జని - తాన్న వితతి
ధరణి యెఱుంగునే ? తగ జన్మ విలయస్థి
తు లనుభవించు గు - ర్తును భవంబు

లయము స్థితియు లేని - బయ లల్లి తెలియదు
నమ్మ మంచుఁ దెలిపి - నావు దేవ
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౧౭

గుర్తుచే జనియించుఁ - గుతలప్రపంచంబు
మగుడి యాగుర్తుతో - మాసిపోవు
నిలువ దీబయ యున్నఁ - దెలివితో గాఁబోదు
తెలివితోఁ జనఁబోదు - తెల్వి నరయఁ
దనయందు లేశమై - తను లే దిదియు నిశ్చ
యంబగు నుండుండి - యట్టితెల్వి
దా నగు; నెఱుక త - త్త్వ మెఱుంగువస్తువు
నెఱుకని తెలియుమా - యెఱుక నెఱుఁగ

దిట్టి దట్టి దంచు - నెఱుఁగరా దీబయల్
గాంచు మంటి వధిక - కరుణతోడ ॥స్వప్ర॥ ౧౮

బీజమే భూజమై - రాజిల్ల నుదయించె
భూజమే బీజమై - తేజరిల్లె
బీజభూజములకుఁ - బృథివిలో వేఱొక్క
బీజ మున్నదని చె - ప్పినదురుక్తి;
వినరాదు కనరాదు - తనకుఁ దానే పుట్టుఁ
దనకుఁ దానే యేగుఁ - దడయ కిట్టి
విత్తుచెట్టులతీరుఁ - బృథివి యెఱుంగవ
ట్టుత్తదై లెఱుఁగదు - సత్తు చిత్తు
లనఁ జెలంగు రెంటి - వినరాదు కనరా ద
టంచుఁ దెల్పినట్టి - యమలమూర్తి
స్వప్రకాశమాన - సదయ చిత్రింశోక్తి
వంశపూ లక్ష్మణార్య - వర్యధుర్య! ౧౯

* గుర్తు - తెలివి - ఎఱుక; ఈమూటికి నొకేయర్థము.

పాలంబునను బీజ - సంభవం బయ్యెను
సాలకారణము బీ - జంబు నయ్యెఁ
బుడమిపై నివి రెండుఁ - బుట్టినగిట్టిన
విధ మెఱుంగకయుండు - పృథివిభంగి
నింపు మీఱ శరీర - మెఱుకల సదసత్తు
లను బ్రకృతిపురుషు - లను వచింప
సగుణనిర్గుణములఁ - జావుపుట్టుకలను
హెచ్చుతగ్గులను జీ - వేశ్వరులను

బంధమోక్షములను - బాపపుణ్యములను
బయ లెఱుంగ దనుచుఁ - బల్కినావు ॥స్వప్ర॥ ౨౦

తెలివియే దేహ మిం - ద్రియవిషయంబులుఁ
దెలివియే యాచార - ములుఁ గులములుఁ
దెలివియే శ్రుతిశాస్త్ర - ము లితిహాసాదులుఁ
దెలివియే నీ వేను - దెలిసికొనఁగఁ
దెలివియే తల్లిదం - డ్రులు దారపుత్రవ
ర్గంబులుఁ బుణ్యపా - పంబు లిలను
హరిహరబ్రహ్మలు - సుర నర వన సరి
త్తరు నగ మృగ ఖగ - తతులు నిఖిల

భూతములు సమస్త - మును మఱి తెలివిగాఁ
దెలియు మంచు నిజముఁ - దెలిపినావు
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౨౧

తెలివియే విద్యయుఁ - దెలివి యవిద్యయుఁ
దెలివియే నాదబిం - దులుఁ దలంపఁ
దెలివియే బ్రహ్మంబుఁ - దెలివియే ప్రకృతియుఁ
దెలివియే యానంద - విలసనంబుఁ
దెలివియే బంధంబుఁ - దెలివియే మోక్షంబుఁ
దెలివియే యిహాపర - ములు వచింపఁ
దెలివియే జ్ఞానంబుఁ - దెలివియే జ్ఞేయంబుఁ
దెలివియే జీవేశ్వ - రులు నిజంబు

సగుణనిర్గుణములు - సర్వంబుఁ దెలివియే
తెలివిఁ దెలియు మనుచుఁ - దెలిపినావు ॥స్వప్ర॥

సకలవికార వి - చారకామ్యాదుల
కెఱుక యాలయ మన - నెలమిఁ దనరు
నఖిలవిచిత్ర మా - నావమానములకుఁ
గోపాదులకుఁ దెల్వి - కూడ వెల్లి
తంతుపంతములకుఁ - దగఁ దెల్వి పుట్టిల్లు
నానాభ్రమల కెల్ల - నగర మెఱుక
కర్తృత్వభోక్తృత్వ - కార్యకారణముల
కెఱుక మూలము తానె - ధరణి యెల్ల

నఖిలరూపములను - నవలీలఁ గల్పింపఁ
దెలివి కారణ మని - తెల్పినావు
స్వప్రకాశమాన - సదయ చిత్రెంశెట్టె
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౨౩

మానుగ సకలంబు - దానయై తనకు న
య్యఖిలంబు వేఱని - యరయుచుండఁ
దలఁపోయఁ గ్రమ్మఱఁ - దాను భావింపుచో
సకలంబు నెఱిఁగెడి - సాక్షి యగుచు
నున్నా నటంచును - నూహించి తనయందె
తాను మోహముఁ జెందుఁ - దథ్య మనుచు
నెన్న ; నెన్నొవిధంబు - లెఱుక కార్యంబులు !
విన్నవారికి మహా - విస్మయంబు

మిథ్య తథ్య మంచుఁ - దథ్యంబు మిథ్యంచుఁ
బలుకు నెఱుక యనుచుఁ - బలికితౌర ॥స్వప్ర॥ ౨౪

ఓతనూభవ ! విను - మూర్ణనాభియుఁ దా జ
నించినపిదప సృ - జించు నొకర
దినముఁ హరించును - దిరముగా వెండియుఁ
దనలోని తంతుసం - తతులచేత
ఘనపట్టణంబులఁ - గట్టి యట్టె లయించు
నటువలె నీగుర్తు - నంతలోనె
తా నుద్భవించి యం - తటఁ గాంచు నఖిలాండ
కోటిబ్రహ్మాండసం - కులత నెల్లఁ

దత్క్షణమునఁ ద్రుంచి - తా వట్టె కనరాక
యెఱుక పోవు నంచుఁ - గఱపినావు
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౨౫

ఒనర మాతాపిత - లును గన జీవేశ్వ
రులు ధరిత్రీవ్యోమ - ములు వెలంగి
మఱి కల్మి లేములు - నెఱుకమఱపులును
స్వప్నజాగరములు - సరవి శుక్ల
శోణితంబులు నన్న - పానంబులు ప్రకృతి
పురుషులు సద్వ్యషూ - వరులు గాఁగ
నిన్ని తెఱంగుల - నింపారు నెఱుక చేఁ
బరిపూర్ణతత్వంబు - నెఱుఁగు మట్టి

తెలివిచేత నీవు - దెలిసిన తెలివిని
దీసివేయు మంచుఁ - దెలిపితావు ॥స్వప్ర॥ ౨౬.

తనరారు నొక దేహ - ధారిక ళేబరం
బున సకలావస్థ - లును జనించి
యంతలో మఱుమాయ - మగునట్టి తెన్నున
నకలంక మగుబయ - లందుఁ దోచు
లేనియెఱుక ; తన - లో నచలం బుండఁ
గని తనపూర్వాసం - గతి గ్రహించి
తనలేమి నిజమని - తలపోసి వే లేచి
యొకకొంతసేపైన - నుండలేక

సర్వముఁ దనవెంటఁ - జనుదేర మాయమై
యేగు నెఱుక ; దీని - నెఱుఁగు మంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౨౭

సొంపారుగాఢసు - షుప్తిలో మెలకువ
యేరీతిఁ దనకుఁ దా - నేగుదెంచు
నారీతి నెఱుకయు - వారక బయలందు
వావిరి తనకుఁ దా - నే వసించి
సుఖదుఃఖములచవిఁ - జూచుచుఁ బెరుగుచుఁ
దఱుఁగుచుఁ దనకుఁదా - నురిగిపోవు
నింతలో బయలున్న - దెఱిఁగిన నేలోక
మున నుండఁజాలక - పోవు నెఱుక;

యెఱుఁగకున్న వచ్చు - నెఱిఁగినఁ దనకుఁదాఁ
బోవునంచుఁ దెలిపి - నావు దేవ ॥ స్వప్ర ॥ ౨౮

కాయంబుఁ జూచుక - న్దోయి కాయమునకు
వేఱు గాకున్నయా - తీరు నెఱుక
యరయఁ గోహం క స్త్వ - మని తవ దాసోహ
మని సోహమని కనుం - గొనుచు నుండు
దేహంబుగా మఱి - దేహిగాఁ బ్రఖ్యాతిఁ
గనియు దేహము తాను - గాక యాత్మ
యైన వి.దేహియే - తా నంచుఁ దన్నుఁదాఁ
గనుచు జన్మవిశేష - మనుచుఁ దలఁచు

బహువిచిత్ర మెఱుక - పరికింప నేమిలే
దనుచుఁ దెలియఁజెప్పి - నట్టిదేవ
స్వప్రకాశమాన - సదయ చిట్టింశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య!

పరఁగఁ బిండాండంబు - విరివి బ్రహ్మాండంబు
రెండును ఘటితము నీ - రెంటిలోని
జీవాత్మపరమాత్మ - నా వెలసిన రెండ
హంబులు నాల్గుఖం - డంబు లేక
మై యఖండంబై మ - హాకృతితో నొప్పు
నెఱుక రూపం బిది - యీరహస్య
మెఱుఁగఁ జెప్పినవాఁడె - గురుఁడు దైవము తంఁడ్రి
గాన ఖండముగ న - ఖండముగను

గానుపించు నెఱుక - గనినమూలంబు లే
దనుచు నెఱుఁగఁబల్కి - నట్టిదేవ ॥ స్వప్ర ॥ ౩౦

అచల మొక్కటిదక్క - నన్య మైనక లేబ
రేంద్రియాద్యఖిలబ - హిఃప్రపంచ
మును సమస్తవికార - ములు వికల్పము లెల్లఁ
దెలియుమా యెఱుకగా - ధీరవర్య!
యెఱుకయే యచలంబు - నెఱుఁగుచున్నది చూడ
నెఱుక నెఱుంగ వే - ఱేమి లేద
యీరెంటి నెఱుఁగున - దెఱుకయే తనమూల
మెఱుఁగని దెఱుకయే - యెఱిఁగినంతఁ

దానె లేక పోవుఁ - దగ నీరహస్యంబు
విప్పి చెప్పినావు - విమలచరిత!
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౩౧

సుకృతదుష్కృతము లు - సుఖదుఃఖములు చాలఁ
బొరయుచుండు సతంబు - నెఱుక చేత
భ్రమపడువారికిఁ - బాపింప వెఱుకను
నెడసిన ఘనసంయ - మీశ్వరులను
నిజ మింత దెలియుమా - నీకు నే నాగామి
బోధ గావింతు స - ద్బుద్ధి వినుము
పాపలోపల నవ - స్ఫటికసంకాశమై
నట్టియాంపోజ్యోతి - యరయఁ బ్రత్య

గాత్మ యని గ్రహింపు - మద్దాని గుఱుతించి
యచల మెఱుఁగు మంటి - వార్యవినుత ॥ స్వప్ర ॥

మఱి విను మెఱు కన్న - మఱు పన్న గుఱు తన్న
దేహి యన్నను మంచి - తెలివి యన్నఁ
జైతన్య మన్నను - సాక్షి యన్నను మాయ
యన్న స్వయంజ్యోతి - యన్న స్ఫురణ
మన ద్రష్ట యన్నను - గనుఁగొను మెఱుకగా
నిది లేక యీ వేమి - యెఱుఁగ లేవు
మఱి చలాచలముల - మర్మం బెఱుఁగుసాక్షి
యెఱిఁగి తా లేనని - యేగు నెటకొ

యీవిధం బెఱింగి - యెఱుక చేఁ బరిపూర్ణ
మరయు మనుచుఁ గఱపి - నట్టిదేవ
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! 33

మనమున ననుమాన - మును మాని యాలింపు
మివిగాక గుర్తుపే - ల్మింకఁ గలవు
మతి యన బుద్ధినా - మటి యహంకృతి యన
మానస మనఁగఁ బ్ర - జ్ఞాన మనఁగ
నంతఃకరణ మన - నభిలాష యన భ్రాంతి
యనఁగ సంకల్పదృ - శ్యము లనంగఁ
వెలఁగుచుఁ దన్ను న - న్యుల నెఱుంగుచు సాక్షి
తానె సర్వంబుగాఁ - దనరుచుండుఁ

దనదుగుర్తు నెఱిఁగి - కనఁబడకుండు నీ
యెఱుక మర్మ మెల్ల - నెఱుఁగు మంటి ॥స్వప్ర॥

అతిభక్తితో విను - మన్య్య! యెఱుకను
బలికిరి సాక్షిగా - వత్స! యేను
నహము సాక్షి యనంగ - నానతిచ్చితి రెండు
వేఱన రా దొక్క - తీరుగాఁగఁ
వెలియంగ వలయు మా - టల భేద మని నమ్మ
మనరాని వినరాని - యరయరాని
యీబట్టబయలందు - నెలమితోఁ దనకుఁ దా
నేతెంచి క్రమ్మర - నేగుచుండు

నిన్నిపాటు లెఱుక - కేలాటిమార్పులే
దచలమునకు; దాని - నరయు మంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! 3౪౭

అనువొందు వన్నియ - లై దొక్కచోటను
గూటస్థ మైనయ - చోప్పేటు హృదయ
పద్మ మందురు జనుల్ - భావింప నెఱుక యం
దున్న దనుచు శ్రుతు - లొప్పఁ బల్కు
నదియె సహస్రార - మన నొప్పు నద్దానిఁ
గనుఁగొను టే మోక్ష - మనిరి బుధులు
వన్నె లన్నియు మీఱి - యున్న వస్తువుతీరు
నెన్నఁ డెఱుంగక - యెన్నొ గతులఁ

బలుకు నాగమములు - పామరు లచలంబుఁ
దెలియఁజాల రనుచుఁ - బలికినావు ॥స్వప్ర॥ 3౭

సులభ మార్గ మొకండు - గలదు మోక్షమునకుఁ
దెల్పెద వినుము సం - దియము లెల్లఁ
దొలఁగిపోవు నిజంబు - పలుకులయర్థంబు
పలుకులు వాసి ని - ల్వఁబడుచోటు
వారక నీ రెండుఁ - బరికింప నొకఁ డయ్యెఁ
దెలివి దేహము లయ్యెఁ - దెలిసికొనుము
తెలివి దేహముఁ బాసి - తిరముగాఁ దా నిల్వఁ
బడుచోటు పరిపూర్ణ - పదము చూవె

యెఱుకఁ దవిలి యచల - పరిపూర్ణభావంబు
నరయు మంచు బుద్ధి - గఱపినావు
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! 3౮

కరంగ సీయొఱుక సం - భవము నెఱుంగఁగా
నంబుజగర్భాదు - లైనసురలు
చాల రన నసుండు - సంగ్రహింపఁగలాఁడె?
వాఁ డెఱుంగుదు నంట - వట్టిమాట
యిది విచిత్రముగదా? - యిట్టివానికి రాక
పోకలు దప్పవు - పుడమిమీఁద
నణువ ంతేమియు లేక - యత్యంతభక్తి స
ద్గురుమూర్తిపాదపం - కరుహపూజ

సం బొనర్పలేని - నరులకు నచలంబు
తెలియ దంచు నిజము - తెలిపినావు ॥స్వప్ర॥ 3౮

ఎలమితో విను లేని - యొఱుక యీబయలందుఁ
దా నుద్భవించిన - తద్విధంబు
వంధ్యాకుమారుకై - వడి, గగనప్రసూ
నముగతి, ధనపతి - నగరమట్లు,
గొయ్యమానిసిపోల్కిఁ, - గుందేటికొమ్మట్లు,
మృగతృష్ణలో నీరు - పగిది, రజ్జు
సర్పము చందాన, - స్వప్నసౌఖ్యము రీతి,
భ్రాంతిచే నెఱుక సం - భవముఁగాంచు

బయలునందు; నిజము - పరికింప లేదురా
భ్రమఁ దొలంగి చూడ - వలయునంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! 3౯

ఎటులఁ జెప్పాట లేని యెఱుకని ప్రశ్నింపఁ
జెప్పెదఁ జెవియొగ్గి - శిష్య ! వినుము
లేని యాకాశ ప్ర - సూనంబు లేనిమృ
గాంబువు లేనివం - ధ్యాసుతుండు
లేనిధనదు రాజ - ధాని లేనిశశవి
షాణంబు లేనట్టి - స్వప్నసౌఖ్య
మున్నట్టులే విను - చుండు మత్తెఱఁగునఁ
బరిపూర్ణమున లేని - యెఱుకగూడ

నున్నయట్లు చెప్పు - చుండు రసత్యంబు
దీని నెఱుఁగు మంటి - దేశికవర ! ॥స్వప్ర॥ ౮౦

సలలితంబుగ గుర్తు - సంభవ మెట్లన్న
నారికేళములోని - నీరమట్లు
దనకుఁదాఁ బుట్టిన - యనువునఁ దిలకింపు
మెఱుక క్రమ్మఱ నెట్టు - లేగు ననిన
ద్విరదంబు మ్రింగిన - వెలగపండు తెఱంగు
దనకుఁదాఁ దెలియక - తఱిగిపోవు
గొనకొని పరిపూర్ణ - మును గాంచినంతనే
లేనట్టియెఱుక వి - లీన మగుచు

బలిమి తనకుఁ దానె - భస్మాసురుఁడు మ్రగ్గి
నట్లు మ్రగ్గు నంటి - వమలచరిత
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౮౧

గడియలో మోదంబు - గడియలో ఖేదంబు
గడియలోఁ గష్టసు - ఖంబు లొకటఁ
గలిగి వెంటనె పోవు - నిలువక యెచటికో
యిది విచిత్రముగదా - యెంచిచూడ
నింతమాత్రమె సుమీ - యెఱుకమూలం బెన్నఁ
దనకుఁ దానే వచ్చుఁ - దనకుఁ దానె
పోవు నమావాస్య - పూర్ణిమల విధాన
నీదేవభావంబు - నెంత వినుతు

సంశయంబు మాని - సర్వంబు బయలుగాఁ
జూడు మనుచుఁ ద్రోవఁ - జూపినావు ॥స్వప్ర॥

పొందుమీఱఁగ రాక - పోకలు లేకుండఁ
జెలఁగి యేకస్థితి - వెలుఁగునట్టి
యీబట్టబయలందు - నెఱుక యెల్లప్పుడు
రాకపోకలు గల్గి - ప్రతిమలోని
పెరుమాళ్లవలెఁ దోచుఁ - బరికింప బయలందు
లేక తోఁచినగుర్తు - లేనె లేదు
గురునిచే నీమర్మ - మెఱిఁగినవారికి
నిక్క మీయెఱుక హా - శిక్క యగుట

యింత దెలిసి యెఱుక - వింతలఁ జిక్కక
యచల మెఱుఁగు మంటి - వమలచరిత
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౮౩

సారెకు బుడగలు - జలములో నేర్పడి
యంతలోఁ దమకుఁ దా - మవియునట్టు
లెఱుకయుఁ దనకుఁదాఁ - బరిపూర్ణమందునఁ
గనుపించి తనకుఁ దాఁ - జనును బిదప
నచల మున్న తెఱంగు - నరసినంతనె తాను
దినమణిదీప్తి నె - దిర్చి తమము
నిలువఁజాలనిరీతిఁ - దోలఁగుచుఁ దనకల్మి
వృథ యని తనలేమి - విశద మనియుఁ

దెలిసికొని క్షణంబు - నిలుపక తా నేగు
నెఱుక మర్మ మింత - యెఱుఁగుమంటి॥స్వప్ర॥ ౪౪

పరికింపఁ దోలకరి - మెఱుపులకైవడి
జలములో బుద్బుద - సమితికరణి
నొప్పారువాడిమ - యూఖునికిరణజా
లములోన మెఱయునీ - లంబుపగిది
నంతలోఁ గనుపించు - నంతలోఁ గనుపింప
దొకరీతిఁ గలకాల - ముండఁ దెఱుక
తిలకింపఁ బగలురా - తిరివోలె నెచ్చోటఁ
దిరముగా నుండక - తిరుగుచుండు

నచల మట్లుగాక - యచలంబుగతి నొప్పు
ననుచుఁ దెలియఁబలికి - నట్టిదేవ
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౪౫

అంతట దీపించు - నచలంబులోఁ దెల్వి
తనకుఁ దానే పుట్టి - తగినరీతి
నఖిలావయవపుష్టి - నంది దేహత్రయ
వాసనాధిష్ఠాన - వశముఁ జెంది
దేహీయవం దగి - దీపించి పరిపూర్ణ
మును గాంచి తనకుఁ దాఁ - బోవు; నెఱుక
మఱు గిట్లు దెలిసిన - గుఱుతు నిల్వదు చూవె
పరిపూర్ణ మెప్పు డొక్క - భంగి నిఖిల

వస్తుసముదయముల - భాసిల్లుచుండును ;
దీని నెఱుఁగు మంటి - దేశికవర ! ॥స్వప్ర॥ ౮౬

ముదముతో విను తన - మూలంబు పరికింపఁ
దనతల్లిదండ్రులు - తథ్య మింత
వారిమూలం బెన్న - వారినిఁ గన్నట్టి
వారేసుమీ వేఱు - తీరు లేదు
తనకు వారికి భవ - స్థానంబు వేఱొక్కఁ
డున్నట్లు దలఁచుట - యొప్పు గాదు
దీనిరహస్యంబు - దెలియంగ బ్రహ్మాదు
లైనఁ జాలరు ; వారి - జాసనాండ

నికరసంభవంబు - నీవల్ల నావల్ల
నైన దనుచుఁ దెల్పి - నట్టిదేవ
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౮౭

కనుపింపనట్టిదా - నిని శూన్య మనవచ్చు
నచలంబు నిట్లని - యనుట తగదు
కనిపించుచున్న ది - కను మదే పరిపూర్ణ
మెఱుక లేనిది శూన్య - మెఱుక తలఁప
బయలందు లేమి నే - ర్పడ శూన్యమని తెల్పఁ
బడె నెఱుంగు మిదే న - భం బనంగ
నెఱుకనభములు దా - మేక మైనవు డాకప్పు?
సము బయ లెట్టు లే - కముగ నౌ

నచల మదిగో! చూడ - నగు, శూన్య మనరాదు;
దీనిమర్మ మెల్లఁ - దెలియు మంటి ॥ స్వప్ర॥ ౪౮

చూపట్టు నచలంబు - లోపలఁ బరికింప
మఱి లేదు గావున - నరయు మెఱుక
నే శూన్య మనుచు నా - కాశం బటంచును;
విశ్వంబు దీనిచే - వెలసె నయ్య!
యరయ నహంబన - దచలంబు దా నహ
ముదయించుటకుఁ బూర్వ - మున్నదగుట
నహ మున్నదో లేదో - యరయదు తలఁప దీ
యహమె విశ్వంబెల్ల - నహమె యెఱుక

తనదు గుట్టెఱింగి - తరలిపోవు నహంబు
దెలిసికొ మ్మటంచుఁ - దెలిపినావు
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౪౯

అత్యంతభక్తి నీ - వాలింపవలయు నా
వరణం బనంగ సం - బరముసుమ్మ
వఱి నిరావరణంబు - పరిపూర్ణమే యని
పెద్దలు సెప్పిరి - తద్ద, యొకటేఁగి
యావరణము మితం - బై విరాజిల్లు; ని
రావరణం బొప్పు - నమిత మగుచు;
నీ రెండు వేఱని - యెఱుఁగుమా? యావర
ణమున నిరావర - ణంబుఁ గాంచి

యావరణము వీడి - యచలప్రభావంబు
నరయు మనుచుఁ దెలిపి - నట్టిదేవ ॥ స్వప్ర ॥ ౫౦

అంతరిక్షము శూన్య - మని లోకు లందురు
భావింప నందుండి - వాయు వగ్ని
సలిలావనీభూత - సమితి యేర్పడె నంచుఁ
జీకాకుగాఁ జేసి - చెప్పినారు
ఛీ! వినరా దిట్టి - చెల్లనిమాటలు
గొడ్డురాలికి నెందు - బిడ్డ లేదు
వేడుకకోలకుఁ జె - ప్పినమాటయే కాని
పాటింపఁ గలదె? కుం - దేటికొమ్ము

లేనివిశ్వ మెల్ల - లేదని కనుఁగొన్న
వాని కెందు లేదు - హాని యంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౫౧

పరిపూర్ణమై యొప్పు - బయలందు లేనట్టి
గుర్తును గొందఱు - గొంతవఱకుఁ
గలదు లేదని పెక్కు - గతులఁ జెప్పఁగ నేల?
లేని దెప్పటికైన - లేనె లేదు
మొదటఁ గల్పన చేసి - పిదప లేదను టేమి ?
వెఱ్ఱిమాటలు చెవిఁ - బెట్ట వలదు
పూని యమేధ్యంబు - మేనినిండ నలంది
కడు రోఁతవడి వెండి - కడిగినట్లు

మొఱకు లన్నమాట - పరిపాటి సేయకు
మని యెఱుంగఁబల్కి - నట్టిదేవ ॥స్వప్ర॥ ౫౨

అన్నంబులోనిసూ - క్ష్మాంశంబు మన సయ్యె
నరయఁ దోయము ప్రాణ - మయ్యె ; వీని
నెఱుఁగుమ యీద్వయం - బెన్నఁడు గలియదో
నాఁడె యీయెఱుక వి - నాశ మగును
నీరెండు గలియుటే - యెఱుక యనంబడు
నివి రెండు లేకున్న - నెఱుక లేదు
తెలివికి మూలంబు - దెలుప లేనే లేదు
భ్రమపడఁ బోకుమా - వత్స ! యెఱుక

మాయగాఁ దలంచి - మలిమంతుఁడవు గమ్ము
శ్రేయ మెసఁగు నంటి - చిన్మయాత్మ !
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వగ్యధుర్య ! ౫౩

పసిబాలికలు రంగు - ప్రతిమల జతగూర్చి
తమవధూవరులచం - దమునఁ గూడి
పెండ్లిపేరంట్రముల్ - ప్రీతిఁ జేయఁగ వారి
తలిదండ్రు లది గని - తథ్య మనుచుఁ
దలఁతురే ? మదియందుఁ - దద్విధంబున నిన్ను
నీవు భావింపుము - నిజము దెలిసి
కల్లసంసారముల్ - గాంచి భూజను లుల్ల
సిల్లఁగ గురుమంత్ర - సిద్ధు లరసి

నిక్క మనుచుఁ దలఁప - నేర్తురే ? రెండైన
నిద యెఱుంగు మంటి - సదమలాత్మ ॥స్వప్ర॥ ౫౪

ఇంపుమీఱు శరీర - మెఱుఁకలు రెండింటి
లోన దాని నిదియు - దీని నదియుఁ
జెలఁగి సృజించు ; నీ - తెలివి మేనులు రెండు
మూలము లేక యే - లీల సృజన
మయ్యోను ? లేనెలే - వంటి నంటినిగాక
లేని మే నెఱుకలు - దేనిలోన
నిపు డున్నవో చూడు - మింపుగా ; లేనట్టి
మే నెఱుకలు రెండు - లేనివె యని

నమ్ము నీవు మదిని - నామాట లెస్సగా
నని యెఱుంగఁ బల్కు - నట్టిదేవ !
స్వప్రకాశమాన - సనయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౫౫

విను తెల్వి పనిసేయు - దనకుము తెలియుట
మఱచుట యివి రెండు - మఱి తెలివికిఁ
బను లౌను ; లేనిస్వ - ప్నము గల్గినప్పుడు
నీకుఁ గన్పడుదృశ్య - నివహ మెల్ల
నీవు మేల్కనినంత - నిలువని దేకదా ?
కల నిక్కమని యెట్లు - పలుకఁగలవు ?
కలయందు మెలఁకువ - గలయట్లు బయలందుఁ
దెలివి యున్న దటంచుఁ - దెలియవలయుఁ

గలయుఁ దెలివి రెండుఁ - గల్లలుగా నమ్మి
యచల మెఱుఁగవలయు - నంటి వౌర ॥స్వప్ర॥ ౫౭

పరికింప నొకయంకె - తరువాత బిందువుఁ
బెట్టినప్పుడు దాని - విలువ హెచ్చు
నటుగాక దానినే - యంకెముం దుంచిన
లెక్కకు రాక వ్యా - ర్థ మ్మగును
దలఁప బిందువుకు స్వ - తస్సిద్ధ మైనట్టి
విలువ యేమియు లేదు - తెలివి యిట్లె
యుండియు లేకుండు - నొప్పుగా నచలంబుఁ
గాంచి తన్ను వ్యాప్తి - గాఁ దలంచు

నన్నికడల వెలుఁగు - చున్నది యచలమే
యని యెఱుంగఁజెప్పి - నట్టి దేవ !
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౫౮

పరిపూర్ణ మైనట్టి - బయలులోపలఁ దెల్వి
తనకుఁ దానె జనించి - తనభవంబు
మూల మెట్టిదో దాని - మొద లెఱుంగఁ దలంచి
నంతనే తాను గ - ల్లగుట కిపుడు
కలదు దృష్టాంతంబు - దెలిపెద వినుము స్వ
ప్నంబులోఁ గన్న దృ - శ్యంబు లెల్ల
మెలఁకువ రాఁగానె - తిలకింప లేనట్లు
దన్నెఱింగిన గుర్తు - తానె లేదు

తెలివికలల తెఱఁగు - దెలిసి సద్గురుబోధ
బయ లెఱుఁగు మంటి - పరమపురుష ॥స్వప్ర॥ ౨౮

స్వచ్ఛమై మధురమై - సల్లలితంబై ప్ర
కాశించునదియె శ - ర్కర యటంచుఁ
దెలిసి చూచినరీతిఁ - దెలఁగి సమస్తలో
కాన్వితంబై తన - రారుచున్న
వది తెల్వి యనుచు నె - మ్మదిఁ గనుంగొనరాదె?
నామాట దృఢముగా - నమ్మవలదె?
యొఱుకచే నచలంబు - నెఱిఁగి యీయొఱుకను
నెఱుకచేతనె పట్టి - యొగురఁగొట్టు

మఖిల మెఱుకతోడ - నరుగుటే పరిపూర్ణ
మని యెఱుంగఁబల్కు - నట్టిదేవ
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౨౯

మరణంబు జననంబు - మఱి మేలుకొనుటయు
గాఢసుషుప్తిలోఁ - గ్రందుకొనుట
యివి నాల్గు సహజంబు - లిమ్ముగా నెఱుకకుఁ
గావున నిత్యంబు - గాదు తెలివి
యప్రమేయం బగు - నచలంబు కేవిచా
రములు మఱే వికల్పములు లేవు
మన్ననతో రెంటి - మర్మంబుఁ దేటగా
విన్నవించితి నీకు - విశ్రుతముగ

నెన్నఁడైన నెఱుక - యున్నట్లు చూడకు
మని యెఱుంగఁ బల్కు - తౌర దేవ! ॥స్వప్ర॥ ౬౦

ఎఱుకయుఁ గలఁ దోఁచు - పురుషుండు నీరెండు
నెఱుకగాఁగఁ దలంచి - యెఱుఁగవలయు
నెఱుకయే ధరియించు - నీవిశ్వరూప మం
తయుఁ గలఁ దోఁచు విం - తల తెఱంగు;
కలలో నిపురుషుండు - మెలఁకువఁ గన్నంత
నెటుల లేకుండునో - యటులె యెఱుక
యచలంబుఁ గనుఁగొన్న - యంతనే రూపఱు;
మెలఁకువ బయ లని - తెలియవలయు

నెఱుకపొందు వదలి - పరిపూర్ణమును జూడ
వలయు నంటి వౌర - భవ్యచరిత!
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౬౧

రమణీయ చిత్ర వ స్త్రప్రభాభాసిత
కుడ్యంబు లెటులఁ గ - గ్గొంటి వటుల
నెఱుకను బయలును - నీజగ మ్మంతను
దెలియుమా యూహతోఁ - దేటపడఁగఁ
దెలిసినంతనె భ్రాంతి - దొలఁగి వీడును మోహ
జగముల నారీతి - సలిపినంత
నిన్ను నీభువనంబు - లెన్న నీలాగని
తెలుప నెవ్వరికైనఁ - దేటపడదు

నీవు నేను లేని - నిఖల మేమియుఁ గాని
యచల మనుచుఁ దెలియు - మంటి వయ్య ॥స్వప్ర॥

మానుగా బయలులోఁ - లేనెఱు కొక్కటి
దోఁచి తన్నెఱిఁగిన - తోఁన మృషగ
డీ పోఫు నెటన్న - వినుము చేతులు తమ
పను లొనరించి మా - నిన తెఱంగు
నదిగాక నోరు యు - క్తాయు క్తములను భా
షించి తనంత చా - లించినట్లు;
కలలోని వింతలు - మెలఁకువం గనలేవు
వెలుఁగు బ్రోలఁ దమంబు - నిలువ నట్లు

బయ లెఱుంగునరుని - పను లెల్లఁ గల్లని
యెఱుఁగ వలయు నంటి - పరమపురుష
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౬3

మెలఁకువ నంటదు - కల; కల నంటదు
మెలఁకువ; నిజ మింత - దెలియవలయు
నీరెంటికై వడి - నెఱుకయు బయలును
నొకదాని నొకఁ డంట - కుండు నెపుడుఁ;
గలయెఱుకలు రెండుఁ - దలఁప మిథ్యలు చూవె
బయలు మెలఁకువ లె - ప్పటికి నుండు
నీరహస్య మెఱింగి - యెఱుకకలల రెంటి
విడువుము పరిపూర్ణ - విధ మెఱుంగు

మెఱిఁగినపుడె ము క్తి - కరతలామలకమై
యొప్పు నంచుఁ దెలియఁ - జెప్పినావు ॥స్వప్ర॥ ౬౪

అరయంగ మెలఁకువ - యెఱుఁగదు సుప్తిని
మెలఁకువ నెఱుఁగదు - చెలఁగి సుప్తి
యెఱుకమఱపులను - బరిపూర్ణ మెఱుఁగదు
మఱపుబయలు రెంటి - నెఱుఁగు గుర్తు
గురుకటాక్షముచేతఁ - బరఁగు నీరెంటిని
గుఱుతించి యచలంబు - తెఱఁగు దెలిపి
యవలీల నీగుర్తు - నవల కీడ్చినఁ జాలుఁ
బరులు నే ననుభేద - భావ మెడయు

నరయ నపుడె యచల - పరిపూర్ణతత్వంబు
దేటపడు నటంచుఁ - దెలిపినావు
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౬౫

పనిఁబూని సంకల్ప - మున లేని దయ్యాసం
కల్పంబు లోనఁ జూ - క్కముగఁ దోఁచి
యును దోఁచకయె చను - చుండు సంకల్పమే
తప్పని కనుఁగొన్న - తత్క్షణంబు
దానె లేనని పోవుఁ - దగ నసంకల్పమే
నిల్చు సంకల్పింప - నెలవు లేదు
సగుణనిర్గుణములు - సాక్షిపూర్ణంబులు
ద్వయ మద్వయం బను - తలఁపు లేదు

గాన నీకు నేను - గట్టిగాఁ జెల్పితి
నిక్క మెఱుఁగు మంటి - నిర్మలాత్మ ॥స్వప్ర॥ ౬౬

వివరింపఁ దనకుఁ దా - విడిపోవ దెఱుకయుఁ
బృథివి నెవ్వరు విడి - పింపలేరు
గురుఁ డొక్కరుఁడుదక్క - గురునకుఁ బరిచర్య
గావించి బోధ చొ - క్కముగ వినుచు
రాకపోకలు లేని - రాజమార్గము గాంచి
పరిపూర్ణతత్వంబు - నెఱిఁగినంత
నెఱుక ప్రమ్గు నిజంబు - హరినిఁ గలంగన్న
కరి ప్రమ్గినట్టు లీ - క్రమముఁ దెలియు

మని యెఱుంగఁ బల్క - నట్టికృపానిధీ!
నుతు లొనర్తు భక్తి - నతు లొనర్తు
స్వప్రకాశమాన - సదయ చిట్టింశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౬౭

మఱి పరోక్షం బైన - పరిపూర్ణ మపరోక్ష
మెట్లగు ? గురుకృప - నెనయకున్న
నపరోక్ష మగుగురు - కృప చక్కఁగాఁ గల్గి
నపుడు పరోక్షమై - నట్టిబయలు;
విపరీతబుద్ధిని - విడిచి శ్రద్ధాభక్తి
గురుమూర్తిపాదపం - కరుహములను
గొలుచుచు నీకీలు - దెలిసినంతనె లేని
యెఱుక ని న్నెడఁబాయు - నింత నిజము

పరమగురుని కృపకుఁ - బాత్రుండవై పరి
పూర్ణ మెఱుఁగు మంటి - పుణ్యచరిత "స్వప్ర" ౮౫

అరయ నే నెవ్వండ - నని జీవుఁ డనుచుండు
నేనె నే ననుచుండుఁ - బూని శివుఁడు
పరిపూర్ణ మీరీతిఁ - బలుకక యీవిశ్వ
మంతట నిండి తా - నలరుచుండు
నే ననుజీవుండు - లేనినాఁడు శివుండు
పరిపూర్ణతత్వ మె - ట్లెఱుఁగ నేర్చు ?
మానుగ జీవుఁడు - నే నని యనకున్న
శివుఁ డెట్లు దా ననుఁ ? - జెలఁగి రెంటి

భావ మెఱిఁగినంత - జీవేశు లొక్కటే
యగుదు రనుచుఁ దెలియు - మంటి దేవ !
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య !

ఘన మైనవటవృక్ష - మును బోలు మేనికిఁ
గలవు తొమ్మిదిరంధ్ర - ములు దలంప
వీనియం దొకరెంటి - లోన మల్కులు నాల్గు
నెలఁగు; నెఱుపు నల్పు - దెలుపు కళియు
నీనాలుగింటికిఁ - బైన నగ్రంబునఁ
బరఁగుఁ దూటొకటి; యం - దెఱుక యనెడు
పులుఁ గుండు; విను మత్తి - పులుఁగుల రెండింటి
గురుకృపాస్వధితిచేఁ - గూలనేసి

యఖిలమున వెలుంగు - నచలంబుఁ గనుమంచుఁ
బలికినావు గుట్టు - దెలిపినావు ॥స్వప్ర॥ ౭౦

దేహంబుతోడ నే - తెంచిన యీతెల్వి
తనువును దను వని - తన్నుఁ దాని
యనుచు నెఱుంగు; దే - హముఁ బాసినంతటఁ
దనువు నెఱుంగదు - త న్నెఱుఁగదు
తానె లేకుండును - దథ్య మింతయు వత్స!
యచల మున్నది నిక్క - మరసినంత
తనమాట దలపోయఁ - దనకె సిగ్గగుటచేఁ
దాను దేహాత్మలు - గా నటంచుఁ

బాటిపోవు నెఱుక - పరిపూర్ణ మొక్కటే
యన్ని యగుచు వెలుఁగు - నరయు మంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౭౧

గాలివానకుఁ జెట్టుఁ - గూలు నొకప్పుడు
వేఱొకప్పుడు చెడు - వి త్తనంబు
గాన నీ రెంటికిఁ - గడగండ్లు దప్పవు
ధరణి నీకడగండ్ల - నెఱుఁగకుండు
నీరీతి దేహాత్మ - లెసఁగినఁ బోయిన
బయ లెఱుంగకయుండు - భద్రగతుల
నిది యెల్ల గురుబోధ - నెఱిఁగి నిశ్చలబుద్ధి
భవనాశరహితస - త్పథము ద్రొక్కి

యెఱుకఁ దొలఁగి యచల - పరిపూర్ణ మెఱిఁగిన
వాఁడె ధన్యుఁ డనుచుఁ - బలికినావు ॥స్వప్ర॥ ౭౨

షణ్మతంబులవారు - స్వమతసమ్మత మైన
శాస్త్రమర్యాదల - సంతరించి
మితము దప్పక భిన్న - గతుల వాదించుచుఁ
దమతమమతము లు - త్తమము లనుచుఁ
జెప్పుచుందురు వీనిఁ - జెవిఁ జేర్పఁబోకుము
బుద్ధినిశ్చలత ని - ర్మల మగును
నిరుపమానప్రభా - పరిపూర్ణమై యొప్పు
నచలంబుఁ గాంచి స - త్యముగ నమ్మి

లేనియెఱుక లేనె - లేదని తలపోయు
మనుచు బోధచేసి - నట్టిదేవ!
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౭౩

వినుము కొందఱు దశ - విధనాదములయందు
నాకాశపంచక - మందుఁ జక్ర
షట్కంబునందు ల - క్ష్యధ్యానములయందుఁ
బరమహంసన నొప్పు - ప్రణవమందు
బుద్ధి నాటింతురు; - పుడమిఁ గొందఱు యోగ
పద్ధతి మే లంద్రు; - భజన లెస్స
యందురు గొందఱు; - గొందఱు సిద్ధప
ద్ధతుల వర్తింతురు - తగిన వనుచు

నరయ నిట్టి వెల్లఁ - గొఱగాని వని నమ్మి
యచల మొక్కఁ దాని - నరయు మంటి ॥స్వప్ర॥ ౨౪

పొందుగాఁ గొందఱు - భూతంబు లైదింటిఁ
బ్రథితి కెక్కిన వందు - రధికముగను
గర్మంబునే లెస్స - గాంతురు కొందఱు
పరికింపఁ గొందఱు - ప్రాణములను
శ్రేష్ఠంబు లని విశ్వ - సింతురు మఱి కొంద
ఱిం దేమి లేదని - యందు రరయ
నవివేకవాక్యంబు - లివి యెల్ల నన్నింటిఁ
గను మిట్లె యెవ్వ రే - మనిన నేమి!

ముందు బయలు గాంచి - యం దుంచ కెఱుకను
నెగురఁగొట్టు మంటి - గురువరేణ్య!
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౨౫

దేవుని నిన్ను నే - తీరైన దెలుఁగవు
నీ వెట్టివాఁడవో - నిక్క మెఱుఁగ
వైతి నీ కిట్టిదు - రాలాపబోధ లిం
కేటికి? దేవుని - నెఱుఁగు మిపుడు
నామరూపక్రియా - నటన మేమియు లేని
దేవునిలో నిన్ను - నీవు దెలిసి
యవ్వలితీరు న - న్నడుగుము దెల్పెద
నరుఁ డెల్లపుడుఁ దా నో - నర్పపనుల

లోఁ దెలిఁగి సేయు - టే తగు నిజ మిది
యెఱుఁగు మింత యంటి - గురువతంస ॥స్వప్ర॥ ౨౬

నాచెప్పినది నీకు - నచ్చిన నమ్ముము
లేకున్న మానుటే - లెస్స చూవె
నే నేమి చెప్పిన - నీ కేమి దోఁచునో
కానిపోని తెలంగుఁ - బూన వలదు
పంచాక్షరములఁ బ్ర - పంచంబు జనియించెఁ
బ్రణవ మున్న దటంచుఁ - బలుకు శ్రుతులు
మఱి యెఱుంగుము దాని - నెఱుకగా నీవది
దానిచే నచలత - త్వంబు నెల్ల

నెఱిఁగి యచలమందు - నెఱుక నిల్పకు మంచు
బోధచేసినట్టి - పుణ్యచరిత!
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౨౭

జడము గుర్తగు సర్వ - జగములు జడ మగు
నెఱిఁగింపఁ బరిపూర్ణ - మేమి గాదు
గుఱుతు జగంబు ల - స్థిరములు దలపోయఁ
బరిపూర్ణ మొకటె శా - శ్వతము చూవె
యేమార్పు లేనిది - యెందైనఁ గలయది
మఱి పీనితారత - మ్యంబు నెల్లఁ
దవిలి సద్గురుబోధ - నెవఁడు గుర్తించునో
మరలఁ బుట్టఁడు వాఁడు - ధరణిమీఁదఁ

దొంటి పగిది నితర - దుర్భవభ్రాంతులై
నట్లు గాదు చూడు - మంటి దేవ ॥స్వప్ర॥ ౭౮

తనువుగుర్తులు రెండు - దలఁప నేకం బంచు
ననఁగూడ దని కొంద - అజ్ఞవృత్తి
వాదింతు రిభువిం - బరికింప నీరెండుఁ
గడకు నొక్కటిగాఁగఁ - గానుపించి
వెండి కన్పింపవు - వినుము రెం డొక్కటే
యని యెఱుంగుట యొప్పు - నన్నిగతుల
ననుమాన మేటికి! - నందఱివాక్యముల్
వినక నే నానతి - చ్చిన తెఱంగు

ననిశ మొక్కరీతి - నలరు నీపరిపూర్ణ
మరయు మనుచుఁ బల్కి - నట్టిదేవ
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౭౯

కన్నులప్రక్కలఁ - దిన్నగా వ్రేళ్ళుంచి
భ్రూమధ్యమున దృష్టిఁ - బొందుపఱచి
యం దున్నవున్నది - చందురుకాంతిలో
నచల మున్నది నూడు - మందు రరయ
బయలు గా దది గుర్తు - పలుపోకలం బోవు
నిలుఁవదు మిథ్యగాఁ - దెలియు మెఱుక
యెన్ని శరీరంబు - లెత్తివచ్చిన నేమి?
పోయిన మఱియేమి - పోలుపు చెడక

యన్నికడల వెలుఁగు - చున్న దీయచలంబు
గాంచు మనుచు బుద్ధి - గఱపినావు ॥స్వప్ర॥ ౮౦

మానవు లంద ఱా - త్మానుభవం బైన
పరమపదం బని - పల్కు రిటుల
నది నమ్మకుము గుర్తు - నరయరా దెచ్చోట
ననుభవ మెవ్వరి - కైనఁ గల్ల;
యది గురుబోధగా - దచలంబునుం గాదు
విను మిదిగాక నే - విశదపఱతుఁ
దనుఁ దాఁ గనుటె మోక్ష - మని కొంద ఱందురు
వట్టిమాటలు సుమా - బయలునందు

లేదు గుర్తు తాను - లేఁడు విశ్వము లేదు
వట్టిభ్రాంతి యనుచుఁ - బలికినావు
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౮౧

మానుగా నీమాయ - లేని యహం బాయెఁ
గావునఁ దనకుఁ దా - నే విశాల
మైనంతఁ బరిపూర్ణ - మవలోకనము సేయ
మాయ యేమిటను లే - దాయెఁ దలఁప
మాయను గనుఁగొన్న - మాయకే కడుచిత్ర
మాయె సంశయమెల్లఁ - బోయె నేఁడు
మాయకు మూలంబు - మాయయే జగ మెల్ల
మాయయే తనుఁ గాంచి - మాయ మయ్యెఁ;

భ్రాంతి లేనిదాయెఁ - బరిపూర్ణ మైనట్టి
బట్టబయలు; సత్య - మిట్టి దంటి ॥ స్వప్ర ॥ ౮౨

ఉన్నది యచలంబు - మున్ను లేనియహంబు
లేనిప్రపంచంబు - మానసమునఁ
దనకుఁ దాఁ దలపోసి - తగఁ గాంచినప్పుడు
లేనట్టియీ రెండు - లేకయుండు
నవల లే దేమియు - నచలంబులోపల
లేనియహంబును - లేనిరీతిఁ
బూని చూచిననాఁడు - లేనిది కలదని
నీ వెట్లు చెప్పంగ - నేర్తువొక్కొ ?

యిటుల నెఱుక లేక - మటుమాయ మగుఁగాన
బయలు సత్య మనుచుఁ - బలికినావు
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౮౩

ఎఱుకయు నచలంబు - లెట్టివో తెప్పగా
గురుముఖంబున రెంటి - గు ర్తెఱింగి
యెఱుక లేనిది యంచు - సరిచేయకుండినఁ
బరిపూర్ణతత్వంబు - పట్టు వడదు
మొదల బిందువు దేహ - మునఁ బుట్టు ; బిందువు
చేత హృషీకాంగ - జాత మయ్యె ;
నిటుగాక యివి యెల్ల - నెట్లు పుట్టినయది
తెలుప బ్రహ్మకునైన - నలవిగాదు

గాన మూల మేమి - లేనట్టు భావించి
యచల మున్న దనుచు - నరయు మంటి ॥స్వప్ర॥ ౮౪

విను దేవుఁ డెవరికిఁ - గనరానివాఁ డని
నామరూపగుణజ - న్మక్రియాదు
లతనికి లేవని - మతిమంతు లనుమాట
బయలున కొప్పు సం - దియము వలదు
రూఢిగా గుణనామ - రూపాదికము లున్న
యెఱుకను వినఁబోకు - మెన్నఁబోకు
మంతట గుర్తున్న - దని యజ్ఞు లందురు
నమ్మకు మెఱుక యం - తటను లేదు

కనఁగ నచ్చటచటఁ - గనుపించి వేపోవు
నంత టున్న దొక్క - యచల మంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౮౫

బయలు నభం బని - భయపెట్టెదరు గొంద
అంతమాత్రమున భ - యంబు వలదు
బయలందు శబ్దంబు - పనుపడిన ట్లైన
బయ లంబరం బని - పలుకవచ్చు
నీకు దుర్భ్రమ యేల - నినదంబు లేదాయె
బయ లంబరము గాదు - ప్రథితి గన్న
పరిపూర్ణ మని నమ్ము - పరికించి తెల్వోని
నమ్మకు మెడయుము - నెమ్మనమున

నెఱుక మిథ్య యచల - పరిపూర్ణమే సత్య
మని యెఱుంగఁ బల్కె - నట్టిదేవ ॥స్వప్ర॥ ౮౬

నీకలలోపల - నిను నన్ను లోకులఁ
బలులోకములఁ గాంచి - భ్రమయ నేల ?
మదపాంగవీక్షణ - మహిమచే మేలుకువ
గైకొని కల మిథ్య - గా నొనర్చి
యరిగెద వెచటికో - యఖిలంబు నీతోడ
నరుదెంచు నెచటికో - యరయు మింత
బయ లెఱుకల రెంటి - భావంబుఁ దెలిపితి
నీ కిందుఁ గలగుట్టు - నిక్కముగను

దెలిసినంతమీఁదఁ - దెలివి శూన్యం బని
యచలతత్త్వ మెల్ల - నరయు మంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౮౭

అది యిది నేను నీ - వని చెప్పఁబడునది
ప్రాణమా ? దేహమా ? మానసంబ ?
యింద్రియదళకమా ? యే మది చెప్పుము
సంశయం బేల ? ని - జంబు దెలుప
నిది రీతిగాదు నీ - వది వినలే దెన్నఁ
డిదె పరిపూర్ణంబు - మొదలె తెఱంగి
యవలీలఁ గని లేని - యహమును దేహేంద్రి
యంబులు లేనెలే - వంచుఁ దలఁచి

గురునికరుణ వడసి - పరికింపు మచలప్ర
భావ మని యెఱుంగఁ - బల్కినావు ॥స్వప్ర॥ ౮౮

వినుము వత్స ! ప్రపంచ - మును నిన్ను నన్ను ని
జం బని యెఱిఁగెడు - జ్ఞప్తిచేత
ననువుగాఁ బరిపూర్ణ - మును గాంచి యిన్నింటి
నెఱిఁగినయెఱుకను - దొఱఁగవలయు
నిదియే వివేకంబు - మది నింత దెలియుము
మఱి వీని నన్నింటి - నెఱిఁగినట్టి
యెఱుకను బయలని - యెఱిఁగింపఁగా రాదు
బయ లుండ నెఱుక య - బద్ధ మగును

నిరుపమానమహిమ - నెగడి యెల్లెడ నొప్పు
నచల మదిగొ చూడు - మంటి దేవ !
స్వప్రకాశమాన - సదయ చిత్సౌంశిష్ట
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౮౯

ధనబలవిద్యాప్ర - తాపధైర్యంబులు
సదమలగుణరూప - సంపదలును
స్వప్నదృశ్యంబుల - వంటివి; పురుషుండు
గలఁ గన్న వివిధసం - ఘటనములను
మేల్కొనెనేని యే - మియుఁ గన లేకుండుఁ
దెలుప నేటికి? కల - మెలఁకువలను
నెఱుకబయళ్ళకు - సరిపడ జతగూర్చి
కలయెఱుకలు రెండుఁ - గల్ల లనుచు

సద్గురూపదేశ - సరణి గ్రహించు టే
ముక్తిమార్గ మంటి - పుణ్యచరిత ॥స్వప్ర॥ ౯౨

పసుపడి యీవట్టి - బయలు నీ వియ్యెడఁ
గలుగుట గాంచి ని - క్కముగ నెఱుక
నేనని నీవని - నిఖిలజంతుమయప్ర
పంచ మని యవలో - కించి పిదప
నెఱుకను విడనాడు - మీ పవార్చిశ మిది
యేమఱి కున్నంతె - నింపు మీఱ
బ్రహ్మవిష్ణుమహేశ్వ - రత్రిదశేంద్రాది
బృందారకులను నే - వించుతలఁపు

వారయఁబోదు నీకుఁ - బరిపూర్ణుఁడవు నీవు
తెలియు మింత యనుచుఁ - దెలిపినావు
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౯౩

అచల మున్నది చూడు - మదిగొ లే దనకుము
తెలియును నాకని - పలుకవలదు
తెలియఁగా నీ కది - సులభసాధ్యము గాదు
శబ్దాదితన్మాత్ర - సమితిగాని
యాద్యంతములుగాని - యరయ లేనిది గాన
దానికి సాటి యెం - దైన లేదు
పరిపూర్ణ మెఱుకచే - నెఱఁగి యాయెఱుకను
బాఱఁదోలుము చెంతఁ - జేరకుండ

నీకు నచలసిద్ధి - నిత్యంబుగాఁ గల్గు
నని వచించినాఁడ - నమలచరిత ॥స్వప్ర॥ ౯౨

పట్టుగాఁ జూపట్టు - నట్టి దిట్టి దటంచుఁ
బలుకరా కుండుము - బట్టబయలు
చూడరా కుండిన - శూన్యం బనఁగ వచ్చుఁ
బ్రత్యక్షముగఁ దోచుఁ - బలుక వశమె ?
యెపుడైన బయలునం - దెఱుక చొరంబోదు
చొచ్చినఁ గడు నొచ్చి - చచ్చిపోవు
నటుగాన గుర్తు లే - దనవచ్చు నచలంబు
ననరాదు పరిపూర్ణ - మనవరతము

నిలిచి యొప్పుచుండు - నిలువదు దీనియం
దెఱుక; యీరహస్య - మెఱుఁగు మంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౯3

అనుపమ పరిపూర్ణ - మనిన నెట్లుండునో
తెలిసినయా తెల్వి - నిలువ లేక
బయటికిం జను; తన్నుఁ - బరికించుకొన గుర్తు
తనకుఁ దా మిథ్యగాఁ - గనఁగనయ్యె.
నెఱుకయందు జనించు - నీప్రపంచం బెల్ల
లేనియెఱుకరీతి - లేక యరుగు
నెఱుక యున్నప్పుడే - యెఱుకయు నీవిశ్వ
ము ను లేనియెఱుకకుఁ - గనుఁగొనంగ

నెంతో చిత్ర మయ్యె - నేమని తెల్పుదు
ననుచు బోధచేసి - నట్టిదేవ ॥స్వప్ర॥ ౯౪

గురుఁడు చూపకయున్నఁ - బరిపూర్ణ మేరీతి
ననువుగాఁ దనకుఁ బ్ర - త్యక్ష మగును
గురుఁడు చూపునయేనిఁ - బరిపూర్ణ మపుడె ప్ర
త్యక్ష మగును దెల్వి - యరుగుఁ దుదకు
నెఱుక సన్నపిఱుంద - నేదిరా ప్రత్యక్ష
మెఱిఁగి యిట్టిట్టిదం - చెఱుఁగువారు
పరమపదంబన - బయలన గురుగుహ్య
మన గోప్యమన బ్రహ్మ - మనఁగ నచల

మన ననంత మనఁగ - నన్నింటి నొకటిగా
నెఱిఁగి యట్టియెఱుకఁ - దొఱఁగు మంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౯౫

భవనాశములు లేని - బట్టబయు లటంచు
మొదట దీనికి నామ - మొదవలేదు
చైతన్య ముదయించి - సంతసంబునఁ బేరు
పెట్టి యీబయలందు - గుట్టు చెడక
తడ వుండఁజాలక - తా నష్టి తెగటారు
గగనప్రసూనంబు - కరణి నొప్పఁ
బుట్టిచచ్చుచు వెండి - పుట్టిగిట్టుచు నుండు
నెలుక యీకడగండ్లఁ - బొరయకుండ

బయలు గాంచినంతఁ - బరుగెత్తి పోవురా
నిజ మెఱుంగు మంటి - నిర్మలాత్మ ॥స్వప్ర॥ ౯౬

కాయస్వరూపంబు - గాని దహాంభావ
మును లేని యఖిలభూ - జనులు చేరి
వినఁగ సోహం సోహ - మని పల్కుచున్నను
వ్యామోహపడనిది - హర్షశోక
ములు లేని దచలంబు - మొద లెఱుంగుమ యిట్టు
లరసినఁ దదను గు - ర్తరుగవలెను
మొనసి కోహం కస్త్వ - మనుచు వక్కాణించు
దేహి దేహంబులఁ - దెలియనట్టి

యచల మదిగో చూచి - యనయంబు దృఢముగా
నమ్మి మింతె చాలు - నంటి దేవ
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౯౭

చెలఁగి యేవస్తువు - చేతదేహం బను
చెట్టు పుట్టుచునుండెఁ - జెప్పనేల!
యావస్తువే దాని - కరయఁగా బీజము
దానినే సాక్షినా - ద్రష్ట యనఁగ
భావింపు మెఱుకనాఁ - బడు నిదే స్పష్టము;
నిశ్చలబుద్ధిఁ జిం - తింతువేని
నెఱుకను బరిపూర్ణ - మెఱుఁగనట్లు ధరిత్రి
నెఱుఁగదు మఱి బీజ - వృక్షములను

జెప్పినాఁడ నచల - సిద్ధాంత మిట్లని;
యెఱుఁగవలయు నంటి - గురువరేణ్య ॥స్వప్ర॥

పోలుపుగా నేపరి - పూర్ణంబు కాయంబు
లోపల వెలి నిండి - దీపితముగఁ
దఱుఁ గేమి లేకుండుఁ - దత్పరిపూర్ణమే
విశ్వంబులోపల - వెలుపలందుఁ
బిక్కటిల్లుచు సర్వ - దిక్కుల నిండి యు
న్నది దానియందె యు - న్నవి తలంపఁ
దనువు జగంబులు - దలఁప లేనివి చూపె
పరిపూర్ణబోధ ని - ల్పిఱఁగినంత

జగము తనువు రూప - సంపద లెడఁబాసి
పోవునంచుఁ బల్కె - నావు దేవ
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౯౯

తెలి వస్తు సకలంబు - దెలియుట; మఱు పస్తుఁ
దెలివిచే నవి వేఱ - తెలియకుంటె;
యెప్పటి కీరెంటి - నెఱుఁగనిదే బయ
లిది నీ వెఱింగి యీ - యొఱుక మఱవు।
మిత్తఱేఁ దెలివి నే - యుత్తరించినవైనఁ
బైమాట నెఱుఁగ నె - వ్వాండు గలఁడు?
తెలి వచలం బని - ధిక్కరించెద వీవు
పరిపూర్ణమైన నే - ర్పడఁగ నాకుఁ

జూపు మవ్యయముగ - శూన్య మెట్లగపడు?
నవి యెఱుంగఁ బల్కి - నట్టిదేవ ॥స్వప్ర॥ ౧౦౦

ఎందఱు లేదన్న - నీక్షింప నగుఁగదా?
నేఁ దెలిసెద నన్న - నే ననునది
బయల నిల్వదుగదా? పరికింప నే దీని
వెనుకఁగదా? నాకు - వెదకిచూడ
మూల మిదే కాని - పూని వేఱొక్కటి
లేదనుట హుళక్కి - లే దహంబు
సకలవస్తువిషయ - సాక్షిత్వములకుఁ దా
నొకరూపమై యుంట - నూహసేయ

నెల్లపనులు భ్రాంతి - యొఱుక మూలము లేని
దెందు లేని దనుచు - నెఱుఁగు మంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౧౦౧

సత్యమై నిత్యమై - సర్వసంపూర్ణమై
పరఁగు నెల్లప్పుడు - బట్టబయలు
పరికింప దీనికి - వ్యతిరేకముగ నుండు
నెఱుక యెచ్చోట ను - స్థిరము గాదు
గురుకృపచే నింత - యెఱిఁగి యెఱుక యస
త్యం బని నమ్మిన - నంతె చాలుఁ
దలఁప నిత్యానిత్య - ముల నిర్ణయ మెఱింగి
నిత్యుఁడై నిజబోధ - నెగడునట్టి

వాని కెవఁడు సాటి - వసుధలో లేఁడని
చాటిచెప్పినావు - సదయహృదయ ॥స్వప్ర॥ ౧౦౨

ఈపరిపూర్ణంబు - లోపలఁ దోఁచిన
యెఱుక స్వప్నమువంటి - దెఱుఁగఁ గల్ల
తనమర్మ మిట్లని - తానె తెల్పినఁ దెల్వి
తన్నెఱుంగు నపేక్షఁ - దగులఁబోదు
దీని నేమఱవద్దు - దేశికునాజ్ఞను
జవదాట వలదు లే - శంబుగూడ
నెఱుక యీవడువున - నెఱిఁగి పోయినమీఁదఁ
బరిపూర్ణ మొకటె ను - స్థిరత నొప్పు

మొదలు చివర లేని - దది మనోవాగతీ
త మని తెల్పినట్టి - తత్వవేద్య
స్వప్రకాశమాన - సదయ చిట్టింశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౧౦౩

ఘనవిపత్ప్రద మగు జననలయాదుల
ననిశం బెఱుంగక - యలరునట్టి
యీబట్టబయలులో - నెడపక తను దానె
తప్పక కనవచ్చి - త్యాగ నెఱుక
కాఁ గానరాక యు - త్తమపరిపూర్ణప్ర
భావంబుఁ గనలేక - పాఱిపోవు
నెయ్యెడ బయ లున్న - నెఱిఁగి తా లేకుండుఁ
బరమసద్గురుబోధ - వలన నింత

యెఱిఁగినంతలోనె - పరిపూర్ణసంసిద్ధి
గలుగు నంచుఁగృపను - దెలిపినావు ॥స్వప్ర॥ ౧౦౪

తగు సరసాన్న మిం - పుగ శుక్లమగు రసం
బెన్న శోణిత మగు - నెలమి మీఱ
రెం డేక మైనంతఁ - బిండమై తను వంచు
నెఱిఁగింపఁబడు నందు - నెఱుక గలిగి
నదె మాయచూపె; పెం - పొదవ మూలము లేని
దిది నమ్మినావు నె - మ్మదిని నీవు
పరిపూర్ణ మున్నది - పరికించి యీలేని
దెప్పుడు లేదని - యెఱిఁగినంత

చాలు నదియె నీకుఁ - జాల మే లొనరించు
నని యెఱుంగఁబల్కి - నట్టిదేవ
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౧౦౫

పసిఁడినా బహువిధా - భరణంబు; లినుమునాఁ
జటులాసిహలాది - సాధనంబు;
లనువొంద నిత్తడి - యనఁ బాత్రసామగ్రి;
యంగం బనఁగ నవ - యవచయంబు;
గాంతారమున వృక్ష - సంతతి; వసుధనా
ధనరాశి; ముళ్లనాఁ - దత్వసమితి;
భువనంబునా సర్వ - భూతసంతానంబు;
శైలం బనఁగ శిలా - సముదయంబు;

గుర్తనంగఁ దత్వ - కులసమన్విత మిట్టు
లరయు మెఱుకె విశ్వ - మంటి దేవ! ॥స్వప్ర॥

కను మోయి మాయావి - కారంబు భావింప
జనకునిజశరకో - శంబునుండి
మాతృగర్భముఁ జొచ్చి - మాఱురూపంబున
జన్మించె నవయవ - సంచయంబు
జనితమై భువిమీఁద - వినుచు గ్రహించుచుఁ
గనుఁగొంచుఁ దినుచు మూర్కొనుచుఁ జనుచు
వచ్చుచుఁ బల్కుచు - వర్ణాశ్రమోచిత
కర్మముల్ సేయుచుఁ - గ్రమముతోడ

ననుదినైధమాన - మగునిట్టితనువు చే
బయలు గాంచి మాయఁ - బాయ మంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్య ధుర్య! ౮౩

విను మహాంకృతి లేశ - మును లేనిపరిపూర్ణ
మున లేక తనకుఁ దా - జననమంది
తనమాయచేఁ దానె - తనువు జగంబులై
పరిణమించినయహం - భావ మరయ
నెండమావులవంటి - దిది యసత్యమునుమా!
ప్రజ లాడు గజిబిజి - పలుకు లెల్ల
విని నచ్చినట్లుండు - మనసుఁద్ధతి మార్చి
మఱి నీనిజస్థితి - నెఱుఁగవలయు

నిందు కచల బోధ - మెంతయుఁ దగియుండు
ననుచుఁ గఱపినాఁడ - వమలచరిత ॥స్వప్ర॥ ౧౦౮

ఇది యున్న దిది యున్న - దిది యున్న దనువాక్య
ములచేతఁ బరిపూర్ణ - మును నెఱింగి
యిది లేని దిది లేని - దిది లేని దనిపల్కు
తెలివిచేఁ దెలివిని - దెలియ వలయు
నింకఁ బై నున్నది - యెఱుఁగు టేలా గన్న
వినుము సంభవనాశ - విరహిత మగు
రాజమార్గం బిది - రాత్రిందివంబులం
దప్రమత్తత నుండు - మచలబుద్ధి

నాదునిశ్చయోక్తి - నమ్ము మిది యింతు
వనుచు నెఱుఁగఁ బల్కు - నట్టిదేవ
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౧౧౯

ఎఱుఁగ ననెడునది - యెఱుకయే యెఱుఁగుడు
నని తన్నుఁ బయలఁ గాం - చునది యెఱుకె
బయ లెఱింగినయంతఁ - బాఱిపోయెడునది
యెఱుకయే యీయాత్మ - మెఱేఁగి నరుఁడు
సత్యమై బుద్ధమై - నిత్యమై శుద్ధమై
రాణించునిర్గుణ - బ్రహ్మపదము
దెలిసి యా తెలివిని - దేశికోత్తమమంత్ర
కుద్దాలమునఁ ద్రవ్వి - కూల్పవలయు

నెఱుకె చదువు వినుము - నెఱుకయే శంకించు
నెఱుకె తుదకు లేక - యేగు నంటి ॥ స్వప్ర ॥

పరిపూర్ణ మేచదు - వెఱుఁగదు లేనెఱు
కెన్నటికైన బై - లున్న దనుచు
నెఱేఁగినఁ దనలేమి - యెఱేఁగి మాయం బగు;
చూపుల నుండున - స్తువును మఱియుఁ
జూపులఁ గాంచున - స్తువులును జూపులుఁ
దెలివిగా నీమదిఁ - దెలియు మింత
చూపులు లేనట్టి - శుద్ధనిర్గుణతత్త్వ
మేది గాంచదు తెల్వి - లేదు గనుక

కంటిపాపలందుఁ - గలకాంతి యాత్మని
కొండ అందు రదియు - గుర్తె యంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౧౧౧

పంకజాప్తుని రాఁక - పరికించినంతనే
నిముసమైనఁ దమంబు - నిలువలేక
యరుగుచందంబున _ ననుపమదేశిక
కరుణాకటాక్షవీ _ క్షణము నొంది
గురుభక్తిపరులైన - పరమభక్తులఁ గాంచి
భయపడి యెఱుక తాఁ - బాఱిపోవు
సందేహపడకుము - సకలశాస్త్రపురాణ
వేదార్థముల నెల్ల - వెదకి చూడ

నెఱుక కానరాదు - పరమార్థ మిది వత్స!
తెలియు మింత యనుచుఁ - దెలిపినావు ॥స్వప్ర॥

పరికింపఁ దెలివియే - పంచకోశంబులు
తెలివె భూతంబులఁ - దెలియుచుండుఁ
దెలివె సమస్తంబు - దెలివియే తెల్విని
దెలియు నీ తెల్విని - దెలియు వేతె
తెలివి యున్నదె? చూడఁ - గలదని వాదించు
వారికి నరకమే - ప్రాప్త మగును
వారక సద్గురు - పాదసేవాపర
తంత్రులై యచలత - త్వంబు దెలిసి

యెఱుక విడిచినట్టి - వరమనీషుల కెందు
నెఱుక లేదు దీని - నెఱుఁగు మంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౧౧౩

శ్రీగురుమంత్రంబు - చేత రూపఱిపోవు
నెఱుకను బయలును - నెఱిఁగి యెఱిఁగి
యెఱుకయే బయలని - యెంచుపాపాత్ముల
మార్గంబు సరిగాదు - మానవులయు
నేల నీ కిది వృథా - యెఱుక యేమాత్రము
లేనిమార్గంబును - బూను టొప్పు
గురుకటాక్షము చేతఁ - బరిపూర్ణము నెఱింగి
యీ తెలిసిన తెల్వి - నెప్పటికిని

నెఱుఁగఁబోకు మింతె - యీనిశ్చయము నీకు
గట్టిపఱతు నంటి - కలితహృదయ ! ॥స్వప్ర॥

మరణసుషుప్తులఁ - బొరసినవారికి
భిన్నుఁడై యుండు మే - ల్కొన్నవాఁడు
మృతుఁడైనపురుషుండు - మేల్కొన్నపురుషునిఁ
గలఁ గన్నపురుషునిఁ - దెలియలేఁడు
మఱి నిద్రఁగూరిన - పురుషుఁ డిట్టులఁగాక
కలమెలంకువలఁ దాఁ - గనుచునుండు
నిరుపురకును జన్మ - మరణముల్ దప్పవు
కాని సద్గురుమూర్తి - కరుణవలన

మేలుకొన్నవారు - మేదినీస్థలియందుఁ
దిరిగి పుట్టకుందు - రెఱుఁగు మంటి
స్వప్రకాశమాన - సదయ చిద్రింశక్తి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౧౧౫

తిలకింపఁ దెలివికిఁ - దెలివియే కొడుకులు
తెలివియే తల్లిదం - డ్రులు దలంపఁ
దెలివియే యన్యులు - దెలివియే తగుమూల
మరయఁ దెల్వికి మూల - మచల మనుచు
నెట్లు చెప్పుదు ? నెందు - నెఱుక లేక ప్రపంచ
మేమియు లేదోయి - యెఱుక లేని
యీయుత్తబట్టబై - లిత్తఱిఁ బొడఁగాంచి
తెలివి తా లే నని - తొలఁగినంత

నవలిమాట నేను - నందును బరిపూర్ణ
మదియె తెలియు మంటి - మార్యవినుత ! ॥స్వప్ర॥

అరయఁగా లేదు లే - దనుచు నెందఱు గూడి
వాదించినను లేక - పోదు బయలు
పోదు పోదని యొక్క - మొగి నంద ఱేకమై
వాదించినను నిల్వఁ - బోదు తెలివి
నిజ మెచ్చుటను దెల్వి - నిలువదు గావున
నచలభావజ్ఞుల - యక్కటికముఁ
బడసి యెఱుకయొక్క - పాదు పెకల్చెదు
విధ మెఱింగినఁ దెల్వి - విడిచిపోవుఁ

బూని యచల మెఱిఁగి - లేని మేనెఱుకలఁ
దిరిగి కనకు మంటి - పరమపురుష !
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౧౧౭

నామరూపక్రియా - నటనాదు లెవ్వియుఁ
బరిపూర్ణమునను జూ - పట్టఁబోవు
నిజము విచారించి - నీ విం తదెలియుము
నామరూపక్రియా - స్తోమ మెల్లఁ
గర మొప్ప నెఱుకలోఁ - గలదు వీక్షింపుమా
పరమపావన మైన - బయలెఱుకలఁ
గాంచి చూడకుము నే - శోధించి పలుమాఱు
వినఁజెప్పి తిది గాక - వేఱుత్రోవ

యెదియు లేదు ముక్తి - కిత్రోవ యొక్కటే
తగిన జెఱఁగు మంటి - తత్త్వవేద్య! ॥స్వప్ర॥

నామాట లెస్సగా - నీమదిం దెలియుము
చులకనపలుకుగాఁ - దలఁపవలదు
పలుమాఱు గురుమూర్తి - వచియింప విను టొప్పు
లేకున్నఁ జదువుట - లెస్స సతము
మొదట నిను గాంచి యే - మూఁడుమాటలు నీకుఁ
జెవినాటునట్లు నేఁ - జెప్పినానో
యట్టిమాటలు నీవు - గట్టిగా మది నిల్పి
మఱవకుండుము వాని - మహిమవలన

నీదుకోర్కు లెల్ల - నిజము సిద్ధించును
విశ్వసింపు మనుచు - విరిచినావు
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౧౧౯

మంత్రరాజంబు శ్రీ - షద్ద్వాదశాక్షరీ
మంత్ర మాలింపుము - మానితముగ
నిది యుత్తమయ లని - యింతకంటె మఱేమి
దెలుప లే దనుటయే - దీనియర్థ
మదిగాక విను షోడ - శాక్షరీమంత్రంబు
నత్యంత ఘనకుతూ - హాల మెలర్ప
మొనసి గుర్తు నెఱుంగు - తను వేమి లేదని
తలంచుటే దీని త - త్త్వంబుచూవె

మహిమ నొప్పునిట్టి - మంత్రద్వయార్థంబు
నెఱిఁగినట్టివారు - గురువు లంటి ॥స్వప్ర॥

అన్నంబు భుజియింప - నాఁకలి విమలపా
నీయంబు గ్రోలిన - నీరువట్టు
మాఁనుగ రోగంబు - మంచియౌషధసేవఁ
దమివు వెలుఁగున - సమసినట్టు
లీబోధ నీచెవి - కెక్కినయంతనే
మఱి నిల్వఁజాల దీ - యెఱుక క్షణము
పరమార్థ మిది దీని - మఱవకు మెఱుకను
మఱువుము పరిపూర్ణ - మెఱుక గాదు

మఱపు గాదు దివ్య - మహిమాన్వితం బిది
తెలియు మనుచుఁ గృపను దెలిపినావు
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౧౨౧

సదమలగుణపూత - చరితుఁడై శిష్యుండు
సవినయభయభక్తి - సహితుఁడగుచు
సద్గురుప్రభునకు - శరణాగతుం డయి
త్రివిధప్రసాదల - బ్ధవరుఁ డగుచు
భవనాశములు లేని - పరమదివ్యపదంబుఁ
గని నిర్వికారుఁడై - క్రాలునేని
జగతిలో వానికి - సాటి పోల్పంగ నె
వ్వరు లేరు నీవు త - త్స్వరణిఁ దెలిసి

స్వపర భేద ముడిగి - సర్వభూతములందు
ననయ మొక్కరీతి - నలరు మంటి ॥స్వప్ర॥ ౧౨౨

భవనాశములు లేని - బయలు తత్త్వ మెఱింగి
భవనాశములు రెండు - వడయునట్టి
దెఱుకని లెస్సగా - నెద దృఢంబై యుండు
దనఁక నీ పీసుమం - త్రము జపించు
మా వివేకగుణాఢ్య! - మఱువక; లేనిది
లేదన్న దోషంబు - గాదు చూడ
లేని దెన్నటికైన - లేదని తెలియుము
పరిపూర్ణ మెన్న ని - ప్పగిదిఁగాక

సర్వపూర్ణ మగుచు - సంకల్ప రహితమై
యలరుచున్న దంటి - వమలచరిత!
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౧౨౩

తనుచిత్తములు ప్రాణ - ధనములు గురునకుఁ
దద్దయు భక్తితో - ధారవోసి
చొక్కి చతుర్విధ - శుశ్రూష లొప్పంగఁ
జేయుచు సద్గురు శ్రీకరాంఘ్రి
జలము కాశీగంగ - సదృశం బనుచు దేశి
కునిఁ గన్న విశ్వేశుఁ - డనుచుఁ దలఁచి
యతఁ డుపదేశించు - నది తారకం బని
యెన్నుచు నతఁ డెందు - నున్న నదియె

కాశి యదె ప్రయాగ - గయ యదె భద్రాద్రి
యదియె యనుచుఁ దలఁపు - మంటి దేవ ॥స్వప్ర॥

పూర్ణకుంభముఁ దెచ్చి - ముందటఁ బెట్టించి
చూపించిన ట్టెల్ల - చోట్ల నిండి
యున్నట్టిబయలు ప్ర - సన్నంబు గావించి
వివిధమాయాగుణ - వృత్తితోడ
నటియించుచున్న యీ - కుటిలంపుగుర్తును
నవలీల విడిపించి - తివి మహాత్మ !
సంశయంబులు దీఱె - సంకల్ప ముడిగె ని
స్సంకల్ప మరయ సా - క్షాత్కరించె

నచలమునను లేని - యాగుర్తు నెఱిఁగించి
యెఱుక లేని దనుచు - నెఱిఁగి మంటి
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య ! ౧౨౫

లలితఖండాఖండ - చలన మించుక లేక
నిండిన బ్రహ్మంబు - నుండఁ గాంచి
చిజ్జడంబులను జ - ర్చింపక నీమది
లోకవాసనల ని - రాకరించి
యెండలోఁ దనరారు - దండి చీఁకటిభంగి
ననృతకాయము లేక - యలరునట్టు
లెఱుగ జగంబుల - నెఱుఁగుము లేవని
తోఁచియున్నట్టులఁ - దోఁచరాక

బయలు గాంచినంతఁ - బాఱిపోవు హుళక్కి
దెలియు మింత యనుచుఁ - దెలిపినావు ॥స్వప్ర॥

అచలసిద్ధాంతంబు - నతిసంగ్రహంబుగ
వినిపింతుఁ దుదిమాట - వినుము వత్స!
యెప్పుడైన నెందైన - నెఱుక లేనిది చూవె
కలయట్లు చూపట్టుఁ - గాని కల్ల
పరిపూర్ణ మరయ స - ర్వవ్యాప్త మసమాన
మవ్యయ మాదిమ - ధ్యాంతశూన్య
మెఱుకయే బయ లని - యెఱిఁగింపఁబోకుము
గుఱుతింపు మిం దున్న - గూఢభావ

మెఱుక యెపుడు నాస్తి - పరిపూర్ణ మెపు డస్తి
యని యెఱుంగు మంటి - వార్యవినుత!
స్వప్రకాశమాన - సదయ చిట్టెంశెట్టి
వంశ్య లక్ష్మణార్య - వర్యధుర్య! ౧౨౮

అరయ మద్గురుపుంగవుఁ - డైన శేష
గురుని గురుఁడైన లక్ష్మణ - కోవిదునకు
నంకిత మొనర్చి పేరుదా - సాహ్వయుండ
వ్రాసితిని " స్వప్రకాశము " - వాసి కెక్క.

ఇది పఠించిన వ్రాసిన - నెలమి విన్న
నచలపరిపూర్ణతత్త్వర - హస్య మెల్ల
గ్రాహ్య మగుఁ; గాన నీగ్రంథ - రాజ, మవని
నారవిసుధాంశుతారమై - యలరుఁ గాత !

పరమపదవిహారీ - భక్తహృత్తాపహారీ !
నిరుపమ పరమాత్మా - నిత్యసంవిన్మహాత్మా !
నిరఘువిమలభావా - నిర్విశేషప్రభావా !
భరితభువనసీమా - భద్రశైలేశధామా !

ఓం శాంతిః - సమాప్తము



ఓమ్

# ఆచార్యశతకము



తేటగీతి పద్యములు

శ్రీమదవ్యయ కేవలా - చింత్య విమల
సచ్చిదానందపూర్ణ శ - శ్వత్ప్రకాశ
తారకబ్రహ్మ శ్రీరామ - తత్వవేద్య
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

నీదు మహనీయపరతత్వ - నిర్ణయంబు
సాంగముగ నేను మీకృప - సంగ్రహించి
స్వానుభవమార్గమున నుపా - సన మొనర్తు
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

వివిధమాయాగుణాన్విత - విషయసంగ
సౌఖ్యభోగానురక్తులై - సకలజనులు
నీప్రభావంబు గన లేరు - నిక్కముగను
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

పంచవింశతిభావంబు - మించి తనరు
ఘనత షడ్వింశతిస్వప్ర - కాశ మరయఁ
దరమె? నీకృప నొందని - నరుల కవని
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

జననమరణప్రవాహమ - స్సంకటంబు
వారయకుండఁ దనర్పుసం - పూర్ణమోక్ష
సిద్ధి గల్గునె నీకృపఁ - జెందకుండ
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౫

జన్మసంతతిచే మున్ను - చాల విసిగి
నేఁడు భవదీయచరణస - న్నిధి వసించి
పరసుఖానందతత్త్వైక్య - పరుఁడ నైతి
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౬

విశ్వతోముఖ విశ్వాత్మ - విశ్వసాక్షి
విశ్వపూజిత విశ్వేశ - విశ్వరూప
విశ్వకారణ విశ్వరా - డ్విశ్వభరణ!
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౭

ఎన్ని విధముల వివరించి - యెంచి చూడఁ
బరమపావన మైననీ - కరుణ లేక
యవ్యయానందపదసౌఖ్య - మరయఁ గలరె?
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౮

అండపిండాండబ్రహ్మాండ - ఖాండ మెల్ల
నిండి నిబిడీకృతంబై య - ఖండితముగ
మండితంబై వెలుంగు ని - ర్మలచిదాత్మ!
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౯

దీప్యమాన షడంబుజా - తీత మైన
సలలితసహస్రదళముల - సారసమునఁ
బూజ గావింతు నీపదాం - భోజములకు
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

నిస్తరంగపయోరాశి - నెగడుభంగి
నలరునీయందు సకలచ - రాచరములు
వీచితతులగతిం దోఁచి - విశ్వ మయ్యె
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

నీవు నిర్మలమై యొప్పు - కేవలాత్మ
వైననీయందు జనియించె - జ్ఞానశక్తి;
యందుకతన జగద్రూప - మై వెలుంగు
దస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

సర్వభూతమయుండవై - సర్వరూప
ధరుఁడవై సర్వసంకల్ప - కరుఁడ వగుచు
విశ్వరూపంబుచే నొప్పు - శశ్వదాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

అఖిలవస్తువ్రజంబు నీ - యందుఁ దోఁచు
నఖిలవస్తువులందు నీ - వలరు దగుట
సగుణరూపుండ వనఁదగు - సర్వసాక్షి
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

సకలగుణములు సకలదృ - శ్యనివహములు
నీవు గావని భావించి - నిర్మలాత్మ
గాఁగఁ దలఁచినవారికే - కలదు సౌఖ్య
మస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౧౫

ప్రకృతిపురుషులకైవడి - వికృతవిశ్వ
దాకృతి వహించి బహువిధ - ప్రాకృతార్థ
ములకు మిగిలి యఖండమై - యలరుదేవ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౧౬

అలరు నీయందధిష్ఠాన - మగునవిద్య;
యందు బింబితప్రణవమై - యది యకార
కన దుకార మకార సం - కలిత మయ్యె
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౧౭

విధి నకారంబునందు శ్రీ - విభు నుకార
మందు ధూర్జటిని మకార - మందుఁ బొడమఁ
జేసి మూర్తిత్రయాకృతిఁ - జెంది యున్న
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౧౮

జలజగర్భుఁడు రాజసాం - శంబు, హరియు
సాత్వికాంశంబు, పార్వతీ - సఖుఁడు తామ
సాంశముం గాఁగ నియమించి - నట్టిదేవ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౧౯

చెలఁగి సర్వప్రపంచస్సృ - ష్టిస్థితిలయ
కారకత్వాధిపత్యముల్ - గల్గి సర్వ
శ క్తిమంతుండ వగుచు ని - శ్చలత నొప్పు
దస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

ఊర్ణనాభివిధంబున - నుజ్జ్వలముఁగ
నలరుచుండి సమస్తభూ - తాళి కెల్లఁ
దగ నుపాదానకారణం - బగుచిదాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

అఖిలపతి వగునీకు న - వ్యాకృతముగ
నమరునానందమయకోశ - మగు సమస్త
మైనభూతసమష్టి య - జ్ఞానవితతి
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

అరయ బ్రహ్మపిపీలికా - ద్యంత మైన
జంతుతతు లవయవములౌ - జగదుదయల
యస్థితుల్ క్రియ లౌ నిగ - మార్థ మిదియ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

అలరు సత్వప్రధానమై - నట్టిమాయ
యం దధిష్ఠానశ క్తిచే - నరయ నీవు
ప్రతిఫలింతువు ఘటజలా - భ్రంబుపగిది
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య!

సరవి నీవ్యష్టి సూక్ష్మాంగ - స్వప్నమునకుఁ
దైజసుం డభిమానినై - తనర సూక్ష్మ
దేహసుప్తి విశిష్టతఁ - దేజరిల్లు
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౦

అట్టిపరమేశ్వరుఁడ వగు - నాత్మ వీవు
దలఁప హైరణ్యగర్భసూ - త్రాత్మకుఁ డన
జీవతతి కుపాస్యుండవై - చెలఁగునట్టి
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౧

సర్వభూతాత్మకుం డగు - సాక్షి వీవు
సర్వపరిపూర్ణుఁడవు నీవు - సచ్చిదాత్మ
నామరూపంబులును లేవు - నటన లేదు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౨

అఖిలగుణధర్మకర్మ రూ - న్యాత్మ! లసద
ఖండఘనసచ్చిదానంద! - కల్పనాద్య
తీత! పూర్ణపరబ్రహ్మ! - దేవదేవ!
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౩

సురుచిరసమష్టికారణ - స్థూలసూక్ష్మ
తను వుపాధివిశిష్టత్వ - మునను నీవు
రమణ నవ్యాకృతుఁ డనఁ జొ - క్కముగ నొప్పు
దస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౪

మహదవచ్ఛిన్న చైతన్య - మహిమవలన
నారవగుణకనాకమై - యలరు దాన
మించి వెలుఁగువిరాణ్ణిప్వ - పంచదేవ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! 3౦

వియదవచ్ఛిన్న చైతన్య - విపులమహిమ
స్పర్శగుణకసమీరమై - సమత నొప్పు
దానికి విలక్షణంబౌచి - దాత్మపూర్ణ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! 3౧

మరుదవచ్ఛిన్నచైతన్య - మహిమవలన
రూపగుణకకృశాను వు - ద్దీపితముగ
నమరుఁ గాన విలక్షణం - బై వెలుంగు
దస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! 3౨

వహ్న్యవచ్ఛిన్న చైతన్య - వశతఁ జేసి
రసగుణకతోయమై సము - ల్లసిలు భూత
మున కతీతంబుగా వెల్గు - ఘనచిదాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! 33

సలిలవచ్ఛిన్నచైతన్య - శక్తివలన
గంధగుణకధరిత్రి చొ - క్కముగఁ బొడమె
నరయఁ దన్మాత్రపంచభూ - తాంత మైన
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! 3౪

అలరు సత్త్వగుణార్ధంబు - వలనఁ బొడమె
దిక్ప్రచేతోఽనిలేనభూ - దేవతాళి
సంయుతజ్ఞానవిషయార్థ - సాక్షియైన
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౩౫

శేషసత్త్వాశకలసమ - ష్టిని జనించు
గ్లావిధీశ్వరక్షేత్రజ్ఞ - దేవతాన్వి
త చతురంతఃకరణ సమం - తరచిదాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౩౬

తన్నభోఽంతరజోగుణా - ర్థప్రసక్తి
వలనఁ బొడముశిఖీంద్రమా - భర్తృమృత్యు
ధాతృయుతకర్మవిషయాళిఁ - దగుల కలరు
దస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౩౭

శేషితరజోగుణసమష్టి - చే విశిష్ట
విశ్వపతి విశ్వయోన్యజ - విజయదేవ
తాన్వితసమీరపంచకా - ద్యత్యతీత !
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౩౮

జ్ఞానకర్మాంతరింద్రియ - చయచతుర్ద
శకమరుత్పంచకాన్విత - ప్రకటసూత్మ
దేహ మగుదాని మిగిలి య - తీత మైన
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౩౯

సరవి నీవ్యష్టి సూక్ష్మాంగ - స్వప్నమునకుఁ
దైజసుం డభిమానివై - తనర సూక్ష్మ
దేహసృష్టి విశిష్టతఁ - దేజరిల్లు
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౦

అట్టిపరమేశ్వరుఁడ వగు - నాత్మ వీవు
దలఁప హైరణ్యగర్భసూ - త్రాత్మకుఁ డన
జీవతతి కుపాస్యుండవై - చెలఁగునట్టి
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౧

సర్వభూతాత్మకుం డగు - సాక్షి వీవు
సర్వపరిపూర్ణుఁడవు నీవు - సచ్చిదాత్మ
నామరూపంబులును లేవు - నటన లేదు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౨

అఖిలగుణధర్మకర్మశూ - న్యాత్మ! లసద
ఖండఘనసచ్చిదానంద! - కల్పనాద్య
తీత! పూర్ణపరబ్రహ్మ! - దేవదేవ!
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౩

సురుచిరసమష్టికారణ - స్థూలసూక్ష్మ
తను వుపాధివిశిష్టత్వ - మునను నీవు
రమణ నవ్యాకృతుఁ డనఁ జొ - క్కముగ నొప్పు
దస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౪

మఱి హిరణ్యోదరుఁడు విరా - ట్పురుషుఁ డనఁగఁ
బ్రాణికోటి కుపాస్యుండ - వై చిదాత్మ
వై ప్రకాశించుపూర్ణద - యాంతరంగ!
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౫

చెలఁగి యజ్ఞానవశమున - జీవుఁ డనఁగ
నీశ్వరోపాసకుండై చ - లించునట్లు
దోపుదవు నీ వవిద్యాయు - తుండవౌయన
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౬

వెలయ జీవేశ్వరత్వ మ - విద్య విద్య
లందు శశవిషాణమును వం - ధ్యాతనూజు
గగనకుసుమంబునుం బోలి - కానుపించు
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౭

రజ్జుసర్పభ్రమం బాసి - రజ్జు వెఱఁగి
జీవభావంబు కడఁద్రోసి - కేవలాత్మ
గాఁ బరబ్రహ్మ నీయందుఁ - గలియునయ్య
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౮

కలశనీరదములను ద - ద్గతజలంబు
బయటఁ ద్రోసి నభఃప్రతి - ఫలము లేమి
జీవశివు లేక మగుఁబూర్ణ - భావమైన
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౪౯

మూఁడుత్రోవలనడుమను - ముఖ్య మైన
సరణి నేతెంచి ఘనసహ - స్రారశిఖర
మున విరాజిల నిను మోద - మునను గంటి
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౫౦

నీలతోయదమధ్యస్థ - నిర్మలప్ర
కాశ నిష్ఖండ పర నిర్వి - కార మగుచుఁ
దనరుపరమాత్మ నినుఁ బ్రమో - దమునఁ గంటి
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౫౧

ద్విదళచక్రంబునను మహో - ద్దీపితముగ
వనిలమానససంయుతం - బై వెలుంగు
పరమహంసతత్వం బనఁ - బరఁగుచుండు
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౫౨

పంచభూతములకు ము క్తి - పంచకమున
మించి తనరు త్రికూటమం - దంచితముగ
దీపితప్రత్యగాత్మస్వ - రూప మైన
యస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౫౩

అమలశశిమండలాగ్రమం - దమృతవృష్టి
గురియ నవటఁ జతుష్పీఠ - గోపితాస
నమున విలసిల్లుచిత్కళా - ర్ణవపరాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౫౪

పరనదీత్రయసంగమాం - తరహిరణ్య
హర్మ్యమందున రత్నసిం - హాసనమున
సురుచిరంబుగ విలసిల్లు - పరచిదాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౫౫

నాదబిందుకళాగ్రపూ - ర్ణ ప్రకాశ
తను నిరంతరనిర్మలా - ద్వయనిరస్త
మగుచు వెలుఁగొందుఘనకేవ - లాత్మ వీవ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౫౬

అంతరత్రిపుటాత్మసౌ - ధాంతరమున
సద్రుచిరహంసతూలికా - శయనమందు
నస్మృతకాంతావినోదోత్స - వమున వెలుఁగు
దస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౫౭

పంచకోశవిలక్షణ - ప్రత్యగాత్మ
వై యవస్థాత్రితయసాక్షి - వై గురుండ
వై ప్రకాశించుసర్వదే - వాదిదేవ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౫౮

సర్వభూతాంతరాత్మక - సర్వరూప
సర్వతోముఖ సర్వాత్మ - సర్వసాక్షి
సర్వకారణ సర్వేశ - సర్వపాల
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౫౯

పంచవింశతితత్వప్ర - పంచమునకు
నంటి వెలుఁగొందు బ్రహ్మము - మింటిపగిదిఁ;
దలఁప నాబ్రహ్మ మీవయై - తనరుచుందు
వస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౬౦

అఖిలరూపంబు నగుచుఁ జ - రాచరాది
వస్తుతతికి వేఱగుచు స - మస్తలోక
ములను వ్యాపించి వెలుఁగొందు - ముక్తిదాత
వస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౬౧

నిఖిలగుణనామరూపక - నిర్ణయములు
సకలధర్మకర్మక్రియా - చరణములును
లేశ మైనను నీయందు - లేవు చూడ
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౬౨

సర్వదేశంబులందున - సర్వ మైన
భూతములను జరాచర - వ్రాతమందు
నిత్యమై నిండి విలసిల్లు - సత్యమూర్తి
వస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౬౩

ఏకనాకము జగతి న - నేకవస్తు
సమితి సంగతి భిన్నరూ - పములఁ దోఁచు
న ట్లఖిలజీవగుణములం - దలరుచుందు
వస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౬౪

ఘటజలప్రతిబింబయు - గ్మంబునకు వి
లక్షణత నొప్పు కలశాంత - రిక్ష మరయ
నది మహాకాశ మగు; నట్టు - లరయుచుండు
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౭౬

కడఁగి కారణస్థూలసూ - క్ష్మంబు లనఁగ
నతులితప్రత్యగాత్మను - హాత్మ లనఁగఁ
దనరునద్వయపరిపూర్ణ - తత్వ మీవె
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౭౭

అలరు వ్యష్టిసమష్టిదే - హములఁ బ్రకృతి
పురుషులను జీవశివుల సం - పూర్ణదృష్టి
నరసి నంతట నేకమై - యలరుచుండు
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౭౮

సద్వివేకత వీక్షించి - సమరసైక్య
పరత దీపింపఁ బరమాత్మ - ప్రత్యగాత్మ
భేదహార మైనయద్వయా - భిన్నపూర్ణ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౭౯

మకుటమండలకేయూర - మహితహార
నామరూపంబులం ద్రోచి - హేమ మొక్క
టని విలోకించినట్లు ని - న్నరయువలయు
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౮౦

ఘటగృహంబులఁ ద్రోచి త - ద్గతనభంబు
నేక మని కాంచినట్లు జీ - వేశభేద
మును నిషేధించి దృగ్బ్రహ్మ - మన వెలుంగు
దస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౨౦

బహుళతరకార్యకారణో - పాధియుగళ
మును దొలంగినజీవేశు - లును దొలఁగుదు
రంతఁ బరిపూర్ణచైతన్య - మగుదు వీవె
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౨౧

వ్యష్టికాయాద్యవస్థాత్ర - యమున విశ్వ
తైజసప్రాజ్ఞనామచై - తన్య మైన
త్వంపదమునకు వాచ్యార్థ - తత్వ మీవె
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౨౨

పరఁగ ముమ్మేనులను మూఁడ - వస్థలందుఁ
దనరుసాక్షికూటస్థచై - తన్య మైన
త్వంపదమునకు లక్ష్యార్థ - తత్వ మీవె
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౨3

ఆసమష్టిశరీరత్ర - యంబునందుఁ
దగ నవిద్యాన్వితేశచై - తన్య మైన
తత్పదమునకు వాచ్యార్థ - తత్వ మీవె
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౨౪

అద్వయానంతసత్యస్వ -యంప్రకాశ
మహితదృగ్బ్రహ్మచైతన్య - మాత్రమైన
తత్పదమునకు లక్ష్యార్థ - తత్వ మీవె
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౭౫

ఒక్కగతి నొక్కచో నుండు - నొకని వేఱు
గతిని వేఱొక్కచో నుండఁ - గాంచినంత
నతఁ డితం డని యన్నట్టు - నైక్య మాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౭౬

ఇది జహాదజహల్లక్షణం - బి ట్లవిద్య
యనెడుమిథ్యాంగభూతంబు - లైనయుభయ
వాచ్యరూపంబు గాక య - వాచ్య మగుదు
వస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౭౭

ద్వివిధలక్ష్యార్థయుక్తసం - దీప్యమాన
మైనచైతన్యముల నైక్య - మరసి చూడ
'నసి'పదార్థంబు నీ వౌదు - వాత్మరూప
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౭౮

తత్వమస్యప్రమేయస - త్యప్రకాశ
నిత్యనిర్మలనిర్వాణ - నిష్కళంక
పరమపరిపూర్ణనిర్గుణ - బ్రహ్మతత్వ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౭౯

గగనమందున నీలంబు - కరణి రజ్జు
వం దహిభ్రమరీతి నీ - యందు నిఖిల
జీవమయమై ప్రకాశించుఁ - జెలఁగి విశ్వ
మస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౨౦

అరయ మృగతృష్ణలో జల - మట్టు లజ్ఞ
వశత నీయందు సవికల్ప - వస్తువితతి
విశ్వరూపంబుచే నొప్పు - శశ్వదాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౨౧

అరయ జీవుఁ డజ్ఞానమా - యావివశతఁ
బుడమిఁ బుట్టి జీవభ్రాంతి - పోయినంత
స్వస్వరూపజ్ఞుఁడై వెల్గు - సర్వసాక్షి
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౨౨

రజ్జువందు సర్పభ్రాంతి - రహిత మైన
రజ్జు వైనట్లు జీవుఁ డజ్ఞ - భ్రాంతి దొలఁగ
నద్వయాఖండపరిపూర్ణుఁ - డై వెలుంగు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౨౩

తాను దేహేంద్రియప్రాణ - మానసాది
దృశ్యదృగ్భ్రమరహితుఁడై - దృగ్విలక్ష
ణావ్యయానందపరిపూర్ణుఁ - డై వెలుంగు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౨౪

సలలితంబుగఁ బంచకో - శంబు లాత్మ
యని గణింతురు గొంద ఱ - త్యజ్ఞవృత్తిఁ
బరమశుద్ధుండ వైనని - న్నెఱుఁగ లేక
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౮౫

పంచభూతంబులఁ విలో - కించి కొంద
ఱాత్మగాఁగ నెఱుంగుదు - రంచితముగ
మూఢులై కాంచనేర రీ - గూఢభావ
మస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౮౬

శ్రవణకరణంబుచే సర్వ - శబ్దములను
దిరముగా విభజించుచోఁ - దెలియఁబడిన
తెలివి యగు దీవు తెలవికిఁ - దెలవి యగుదు
వస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౮౭

విరివిగాఁ ద్వగ్విషయముచే - వివిధమైన
స్పర్శగుణముల నెల్ల వి - మర్శ నెఱుఁగు
నట్టియెఱుకకు నెఱుకయా - నవ్యయాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౮౮

అక్షికరణంబుచే సర్వ - మైనరూప
ముల విమర్శించు తెలివికిఁ - దెలివి యైన
తెలివి వడసిననిత్యని - ర్మలపరాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౮౯

మహిని జిహ్వేంద్రియముచే స - మస్తమైన
రసముల వివేకవృత్తి నే - ర్పఱచి యెఱుఁగు
నెఱుక చే నెఱుకఁ దోలంగు - పరమపురుష
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౯౦

నాసికేంద్రియమునను నా - నాపరిమ
ళముల వేర్వేఱ గుర్తించి - క్రమ మెఱింగి
తెలియు తెలివి యే సత్యకే - వలపరాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౯౧

ఉదయనాశస్థితులు లేక - యొక్కరీతి
సర్వసంభవమైన సం - క్షయము లైన
నక్షయంబై వెలుంగున - వ్యయపరాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౯౨

ఏకమై నిర్వికారమై - ప్రాకటముగ
నిర్వికల్పనిరంజన - నిష్ప్రపంచ
నిరుపమాననిరాకార - పరత నొప్పు
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౯3

అవ్యయాఖండ కేవలా - ద్యంతరహిత
నిర్విశేష నిరాలంబ - నిర్విచార
నిర్మల నిరస్తనిస్తేజ - నిష్ప్రమేయ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౯౪

నిర్మలానందవారాశి - నిండి పరఁగు
మారుతతరంగములరీతి - మానసేంద్రి
యాదిసర్వప్రపంచమై - యలరుచుండు
వస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౯౫

భూషణము లెల్ల హేమమై - పొసఁగునట్లు
ప్రాణమానసకరణప్ర - పంచ మెల్ల
నీవయై యొప్పుచుందువు - నిక్క మింత
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౯౬

లేనివిశ్వం బవిద్యయు - లేనె లేవు
పూని యీనిశ్చయము గల - పురుషులకును
ప్రకృతియావరణము గాదు - పావనాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౯౭

ఘటము నావరణం బైన - ఘటనభం బ
నఁగ మహన్నభ మన నొప్పి - నట్లుపాధి
యావరణమున నాత్మ య - నాత్మ యయ్యె
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౯౮

మఱి ఘటము దొలంగిన నభో - మాత్రమైన
గతి నజాండావరణము ని - ర్గతము గాఁగ
నట నిరావరణం బందు - నైక్య మగుదు
వస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౯౯

చూపులకుఁ గానరానిది - రూపులకును
దలఁపులకు నందనిది యెట్లు - దలఁపరాక
పరమమై పూర్ణమైన దా - బ్రహ్మ మీవె
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౦౦

వినదు ముట్టదు సేయదు - కనదు చనదు
రాఁకపోఁకల వర్ణింప - రా దభేద
మై యఖండమై యలరుబ్ర - హ్మంబ వీవె
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య! ౧౦౧

నిరుపమాన నిరాకాశ - నిర్గుణాత్మ
నిర్విశేష నిరాధార - నిశ్శరీర
నిష్కళ బ్రహ్మ నిష్కళ - నిర్వినాద
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౦౨

అనుపమానప్రభావ బా - హ్యాంతరాత్మ
నిర్మలానంద నిగమోప - నిషదతీత
నిర్గుణబ్రహ్మ నిస్సంగ - నిశ్చలాత్మ
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౦3

అచలమై తనరారునీ - యందు నరయ
నచలితాంబుజగర్భాండ - సంఘ మెల్లఁ
బుట్టలేదు పిఱుందను - గిట్టలేదు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౦౪

శాకపోకలు లేక ని - రంతరంబు
నేకమై యుండు. నీయం ద - నేక మగుచు
నేమి వచ్చెను గ్రమ్మఱ - నేమి పోయె ?
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౦౫

అరయ మున్నిటిలోపల - నంబుచరము
లెన్ని పుట్టినఁ గిట్టిన - నెఱుఁగనట్టు
లెఱుఁగ దీవిశ్వమును బయ - లించుకైన
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౦౬

ఎఱుక జాగ్రదవస్థయు - నెఱుక స్వప్న
మెఱుకె సుప్తియుఁ దుర్యంబు - నెఱుక సర్వ
మెఱుకఁ ద్రోచిన సుజనుల - కేమి లేదు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౦౭

వెలయు సచరాచర మగు నీ - విశ్వ మెల్ల
నెఱుకయం దుద్భవిలెఁ బోవు - నెఱుకయంద
బయలు కీజాడ యేమియుఁ - బట్టలేదు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౦౮

లేనిగుర్తు ప్రపంచంబు - లేనిబట్ట
బయలులో నున్నయట్లు దాఁ - బరఁగి తోఁచె
నెండమావులనీ రని - యెఱిఁగినట్టు
లస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౦౯

వసుధ వంధ్యాకుమారుని - పగిది; నభ
సుమముకై వడి; రజ్జుస - ర్పము తెఱంగు
శశముకొమ్మట్లు బయలందు - నెసఁగుఁ దెల్పె
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య !

లేనివంధ్యాతనూజుఁడు - లేనిశశవి
షాణ మున్నటులం దోఁచి - లేనియట్లు
లేనియెఱుకయు లేక వి - లీన మయ్యె
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య !

ఒకటివలపల బిందువు - నుంచినపుడు
పెరుగు; దానినే దాపలఁ - బెట్ట లెక్క
మిథ్య యగు; నొక టుండియుఁ - దథ్య మింత
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య !

అప్పుడీటెనఁ బైదాని - యట్లు బట్ట
బయలు గని తాను గలిగియుఁ - బరఁగఁ దెల్పె
తనకుఁ దా నేమి లేదాయెఁ - దక్షిణమున
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య !

తరణియందున లేనిదే - తమము వచ్చి
యినునికాంతిఁ గనుంగొని - యేగినట్లు
బయలు పొడఁగాంచి గుర్తెడఁ - బాసి పోవ
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య !

కలయు మేల్కొనఁ గలలో వి - కల్ప మెఱుక
గలిగియుండినఁ బరికింపఁ - గానరాని
పగిది గుర్తుండి లేదాయె - బయలు గాంచి
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౧౫

ఇనుఁ డెఱుంగునె తిమిరంబు - నెంచిచూడఁ
బుట్టుగిట్టుల రాపాడు - నట్టిగుర్తు
నెఱుఁగకుండును బరిపూర్ణ - మేవిధమున
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౧౬

పొంద దేమిటి కందదు - డెందములను
నందు నిండున ననరాక - సందుసందు
నంది యందక నిండియు - న్నట్టిబయలు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౧౭

పుట్టి దెన్నఁడు గిట్టదు - చట్టురీతి
కొట్టుతిట్టు లెఱుంగదు - గుర్తు దెలియ
దట్టి దిట్టిది యనరాని - బట్టబయలు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౧౮

పట్టు పస లేదు దేనిచేఁ - బట్టువడదు
వట్టిమాయల కెన్నఁడు - వశము గాదు
వట్టి దిది గట్టి దిది చూడ - బట్టబయలు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౧౯

కా దవిద్యయు విద్యయుఁ - గాదు ప్రకృతి
పురుషులును గాదు సాక్షిత్వ - పూర్ణములును
గాదు కా దున్న దేమియుఁ - గానిబయలు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య !

కాదు సగుణంబు నగుణంబు - గాదు నిర్ద్వ
యద్వయంబును గాదు చ - లాచలములు
గాదు కా దన్న దెన్నఁడు - గానిబయలు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య !

జ్ఞాన మజ్ఞానమును లే వ - ఖండఖండ
బంధమోక్షము జీవేశ - భావ మరయ
లేవు లేనివి తనలోన - లేనిబయలు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య !

రాని దేమియుఁ గానిది - పోని దేమి
లేని దానికిఁ బరికింప - రాని దదియు
తాను నే నన దే మన - రానిబయలు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య !

లేని యెఱుక ప్రపంచము - లేని నేర్పు
దెలిసినప్పుడె తానయై - తేజరిల్లుఁ
బరఁగఁ జూపట్టు నీయుత్త - బట్టబయలు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య !

వాక్కు కందదు మనసుకుఁ - జిక్కఁబోదు
చేతలకుఁ బట్టువడదు వీ - క్షింపరాదు
విశ్వ మంతయుఁ దానెయై - వెలుఁగుబయలు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౨౫

సర్వభూతంబులం దోచు - సర్వభూత
ములకు వేఱుగా నుండు ని - స్తులము బయలు
నిఖిలము నశించుఁగాక తా - నిలిచియుండు
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౨౬

అఖిల విశ్వంబు దనరూప - మైనయదియుఁ
దలఁప నేమియుఁ గాకుండఁ - దనరునదియు
నైనబయ లిట్టిదని చెప్ప - నలవి యగునె
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౨౭

మొనసి ముమ్మూర్తులకుఁ దాను - మూల మగుచు
విశ్వశకటంబు నడపుచు - విశ్వమునకుఁ
దనకు సంబంధమే లేక - తనరు బయలు
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౨౮

సూనృతమహావచనసత్ప్ర - సూనవితతి
మాల్యముగఁ గూర్చి విభజించి - మఱి సమర్ప
ణంబు చేసితిఁ గైకొని - నన్నుఁ బ్రోవు
మస్మదాచార్య రామచం - ద్రార్యవర్య ! ౧౨౯

పులహారికులాబ్ధిచంద్రుఁడై - పొందు మీఱ
నస్మదాచార్యశతకంబు - ననువుపఱచి
పీరుదాసుండు రచియించెఁ - బ్రేమ వెలయ
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య !

శ్రీద భద్రధరాధర - శిఖరమందు
నలరు రామపరబ్రహ్మ - మస్మదార్య
దేశికుండై పరాత్పరుఁ - దెలిపె నట్టి
అస్మదాచార్య రామచం - ద్రార్యవర్య !

ఈశతకముం బఠించిన - నెలమి విన్న
వ్రాసినను సిరి మోక్షంబు - వసుధఁ గలుగుఁ
గాన నాచంద్రరవితార - కముగ నెసఁగు
నస్మదాచార్య రామచం - ద్రార్యవర్య !

ఓం శాంతిః - సమాప్తము.



ఓమ్

# తత్త్వసంగ్రహము



## కృత్యాదికము

శ్రీరామప్రభుపాదపద్మయుగళీ - సేవాభిలాషుండనై
యారాధింతు నిరంతరం బఖిలభూ - తాంతర్బహిర్వ్యాప్తవి
స్ఫారంబై యచలంబునై వెలుఁగుశ - శ్వచ్చిత్స్వయంజ్యోతి యా
త్మారామప్రభుఁ డైనభద్రగిరిరా - మస్వామి నన్ బ్రోవుతన్.

పాయక శౌరివక్షమున - భాసిలునట్టిరమాలలామయున్
గాయజవైరియర్ధతను - గాంతి వహించినశైలకన్యయున్
దోయభవాసనాననము - డూకొని రంజిలువాగ్వధూటియున్
శ్రీయుఁ జిరాయువున్ సకల-సిద్ధులఁ గూర్మి నొసంగి ప్రోవుతన్.

తారకనామమంత్రజప - తత్పరుఁడై నిరతంబు భక్తుఁడై
వాఱఁగఁ దన్నుఁదా మఱచి-బాహ్యమెఱుంగక నిర్వికారుఁడై
తారక రామనామమధు - పానవిలోలతఁ జిక్కి సొక్కి సా
మీరి నన్ గృపాపరత-మించి యభీష్టము లిచ్చి ప్రోవుతన్.

మోదకహస్తునిఁ బరమా
హ్లాదుని విఘ్నావనీధ - రౌఘశతారున్
వేదార్థోపనిషత్ప్రతి
పాదకు నీశ్వరు గణాధి - పతి నర్చింతున్.

వ్యాసనారదవాల్మీకి - వామదేవ
జనకసూతవిశ్వామిత్ర - సనకధౌమ్య
శుకవసిష్ఠాదిసంయమి - ప్రకరములను
నెమ్మి భజియింతుఁ దత్వమ - నీషఁ గోరి.

ఘనసంస్కృతాంధ్రకవులను
వినుతించియు భాగవతుల - వేడి యజస్రం
బనఘు లగునార్యులను మదిఁ
గొనియాడెద నిష్టసిద్ధి - కుశల మెలర్పన్.

పరిపూర్ణనిర్గుణ - బ్రహ్మచైతన్యప్ర
భాసితుఁ డుపనిష - ద్బ్రహ్మగురుఁడు
తత్కృపాపాంగసం - దర్శనలబ్ధుండు
రంగరాజార్యులు - రమణ దనరెఁ
దద్గురుపాదచిం - తాతత్పరుఁడు ధాత్రి
లలితచిట్టెంశెట్టి - లక్ష్మణార్యుఁ
డాగురుసుప్రసా - దాఖండఘనసచ్చి
దానందమయుఁడు శే - షార్యతిలకుఁ

డామహాత్మునికరుణాక - టాక్షమునను
రమ్యతరరాజయోగసా - రము గ్రహించి
స్వస్వరూపానుసంధాన - సరణి దెలిసి
ప్రకటముగఁ గూర్తుఁ దత్వసం - గ్రహము నేఁడు.

అని యి ట్లభీష్టదేవతాప్రార్థనంబును బరమభాగవత కీర్తనంబును సంస్కృతాంధ్రకవివందనంబును గావించి నాయొనర్పం బూనిన తత్వసంగ్రహంబునందుఁ దొలుదొల్త మద్గురువంశ చరితానుక్రమం బభివర్ణించెద—

సేతువు మొదలుగా - శీతశైలముదాఁక
వాసి కెక్కినధరా - భాగమునను
ధర్మప్రపూర్ణవి - దర్భదేశమునందు
సంతతశ్రీవిలా - సమున మించి
వన్నె మీఱినసత్య - భామాపురంబులో
నెలకొని కీర్తికి - నిలయ మగుచు
భూసురాద్యన్వయ - పుంజంబులందున
సత్పుణ్యలక్ష్మీప్ర - సన్నదివ్య

వైభవంబులఁ జెన్నొందు - వైశ్యకులము
ప్రాభవంబున నూటయి - బ్బంద్రుగోత్ర
ములను నుతికెక్కి శ్రీమించి - ముఖ్య మగుచు
సూర్యకులగోత్ర మలరు వి - స్ఫూర్జితముగ.

రమణీయసూర్యకులగో
త్రమును బవిత్రం బొనర్చి - తనరె ధరన్ శ్రీ
జమిలిసదన్వయ మబ్ధిని
హిమధామునికరణి గురుకు - లేంద్రుం డొదవన్.

జమిలిసదన్వయంబునను - జన్మము నొందినవారిలోపలన్
విమలచరిత్రుఁడన్ ఘనవి - వేకధనుండు మహాగుణాఢ్యుఁడున్
గుముదవనాళికిన్ బ్రియస - ఖుం డగుచందురుఁ డుద్భవించునా
క్రమమునసంభవించిగురు- కాంతివహించెను గూనయాఖ్యుడున్.

ఆగూనయాఖ్యునకు నెం
తో కౌతుక మెసఁగ సద్వ - ధూమణి వరల
క్ష్మీకర యగునచ్చమ్మకుఁ
బ్రాకటముగఁ బోలిశెట్టి - బాళి జనించెన్.

ధృతికిన్ ధర్మనగేంద్రతుల్యుఁ డగుఁ గీ - ర్తిన్ భద్రశుంభద్గుణో
న్నతికిన్ భోజుఁడనన్ జెలంగు మఱి దా- నఖ్యాతికిన్ గర్ణుఁడౌ
స్థితికిన్ మించుఁ గుబేరునిన్ ఘనతర - శ్రీవైభవోపేతసం
గతికిన్ శక్రుఁడనన్ వెలింగె రవిసం- కాశుండు పోలాఖ్యుఁడున్.

ఆపోలయ్యయుబుత్తెమాంబయను భా-ర్యన్గూడి యింపొందహృ
ద్దీపప్రౌఢిని మున్ను తద్దశరథా - ధీశుండు గన్నట్లు ని
ష్పాపైకవ్రతు లార్యసేవకులు స - ద్భక్తిప్రపూర్ణుల్ మహా
నైపుణ్యుల్ నలమంద్రదు పుత్రులను స-న్మార్గస్థితింగాంచెదాన్.

అందు——

సుగుణస్తోముఁ డుదారశీలుఁడు యశ- శ్శోభాదిగంతుండు శాం
తగరిష్ఠుండు మహాగుణాఢ్యుఁడు మనో-ధైర్యప్రభూతుండు దా
భగవద్భక్తుఁడు సాహసాదికదయా - భావుండు మేధావి దే
వగురోర్వీసురపాదసేవకుఁడు దె- ల్పన్ బిచ్చయాఖ్యుం డిలన్.

గురుసౌజన్యవదాన్యచిత్తుఁడు గత - క్రోధుండు కారుణ్యభా
స్వరసద్భద్రగుణాకరుండు బుధవి - శ్వాసుండు సన్మాన్యసుం
దరలావణ్యకళాధురంధరుఁడు నౌ - దార్యప్రశీలుండు పూ
ర్ణపరిపూర్ణుండు ద్వితీయనందనుఁడు సు-బ్రహ్మణ్యనాముండొగిన్.

పరమజ్ఞానవివేకసద్వినయుసౌ - భాగ్యప్రపూర్ణుండు భా
సురసత్కీర్తి దిశావృతుండు కనక - శ్రీణీధరేంద్రాభసు
స్థిరధీరుండు మహామనీషి సకల - శ్రేయస్కరుం డిందిరా
వరసేవాపరుఁ డాతృతీయజుఁడు చె-ప్పన్ లక్ష్మణాఖ్యుండొగిన్

సకలాగమోపని - షత్సారసంగ్రహ
సదమలజ్ఞానల - సద్వివేకి
యనుదినస్వాభావి - కాఖండసచ్చిదా
నందాపరోక్షని - ర్ద్వందశుద్ధ
బుద్ధనిరాలంబ - పూర్ణపరబ్రహ్మ
తత్వతత్పరనిజాం - తర్మనీషి
సుశ్లోకచరితుండు - సుగుణవితానుండు
శాంతశమదమాది - షట్కయుతుఁడు

సలలితాష్టాంగయోగాది - సాధకుండు
సదమలాత్మసమాధిని - ష్ఠాగరిష్ఠుఁ
డార్యనుతుఁడు చతుర్థని - జాత్మజుండు
శేషయార్యుం డనంగ బ్ర - సిద్ధి కెక్కె.

ఆశేష దేశికేంద్రున
కే శిష్యుఁడ నగుచు సేవ - లింపుదలిర్పఁ
జేసి సతము తన్మహాదుప
దేశంబున బ్రహ్మనిష్ఠ - ధీరతఁ గంటిఁ.

తొల్లి బ్రహ్మ నార - దునకు నాత్మజ్ఞాన
మెఱుఁగఁ బల్కినట్టు - లెఱుఁగ నాకుఁ
బరమగురుఁడు దెల్పు - పద్ధతి వినిపింతు
సంగ్రహించి తత్వ - సంగ్రహంబు.

## ద్విపద

శ్రీరామతత్వవి - శేషంబు దెలియఁ
గోరినవాఁడు స - ద్గురుపాదసేవ
నమ్మికతోఁ జాల - నాళ్ళు గావింప
నెమ్మిఁ గటాక్షించి - నెనరు దీపింపఁ
జెలఁగి పద్మాసనా - సీనునిం జేసి
తొలిజన్మకర్మంబు - దొలఁగ నాతనికి
నొదల దక్షిణ - హస్తంబుఁ జేర్చి
మోదంబుతో నిట్లు - బోధించు గురుఁడు
నీవు భూమియుఁ గావు - నీ రగ్ని గాడ్పు
గావు నభంబును - గా వింద్రియములు
గాయంబు ప్రాణముల్ - గావు మనంబు
మాయావికారముల్ - మఱియుఁ గా వరయ

నిన్నింటి నంటక - యేకమై వెలుఁగు
సన్నుతపరమాత్మ - సాక్షివి నీవు
నిన్ను నీ వెలుఁగుచే - నిత్యమోక్షంబు
పన్నుగా భావించు - పద్ధతి నీకుఁ
గ్రమముగా నెఱిఁగింతు - ఘనతత్వబోధ
విమల మాను మనంబు - వేడ్కతో వినుము;

సాధనసంపద్వి - చారఘనుండు
బోధకర్హుం డగుఁ - బుణ్యచారిత్ర!
బ్రహ్మంబు నిత్య మీ - ప్రాకృతం బైన
బ్రహ్మాండ మెల్ల న - శ్వర మంచు మదిని
మొనసి భావించుటే - మొదటిసాధనము
విను మైహికము లైన - విషయసౌఖ్యముల
నమరలోకమున రం - భాదిభోగముల
భ్రమలంచు వమనాశ - నము నిచ్ఛగింప
కుండినక్రియఁ గోర - కుండుటే మఱియు
రెండవసాధన - రీతి పాటింపఁ
బొసఁగ బాహ్యేంద్రియం - బుల నిగ్రహింప
నెసఁగు దమం బన - నెలమితో నంత
రింద్రియంబుల నిగ్ర - హించుటే శమము
సాంద్రత సర్వోప - శాంత్యుపరతియు
సుఖదుఃఖములకు నో - ర్పుటయుఁ దితిక్ష
ముఖలక్షణంబు లి - మ్ముగఁ గల్గియుంట
వివరింప నిదియు మూఁ - డవసాధనంబు
దవిలి తాపత్రయ - దవవహ్నిఁ గ్రాఁగి

మ్రుచ్చు లార్గురు వెంట - మునుకొని తరుమ
విచ్చలవిడిఁ బాఱు - విధమునం దోఁచి
కాఱుటడవిని వ్యా- ఘ్రంబు పైకొనఁగ
మీఱినభయముతోఁ - బాఱుచందమున
నింతయుపద్రవం - బేకకాలమున
మంతనంబునఁ బొంది - మఱి యార్తి తెంపు
నినుమడింపఁగ దేశి - కేంద్రుని పాద
వనజాతములఁ గొల్చు - వాంఛయుం గలుగఁ
గనుఁగొన నిదియు నా - ల్గవసాధనంబు
విను మీచతుష్టయం - బను వొప్పఁ గలిగి
తనమూల మెట్టిదో - తలపోయవలయుఁ
దనువు హృషీకసం - తానంబు నాయు
మఱి శుక్లశోణిత - మయ మైన తనువు
పరికింప మలమూత్ర - పలలాస్థిరోమ
జాలరూపమ్మ న - సహ్యంపుఁగొంప
మూల మాలోకింప - ముట్టంటుబోఁకి
పుట్టినదేహముల్ - గిట్టుటకొఱకె
గిట్టుట క్రమ్మఱఁ - బుట్టుటకొఱకె
కాని నిల్కడ యెందుఁ - గానంగలేము
పూని యీసంసార - భోగంబులందు
నెద్ది నిత్యం బని - యెన్నంగఁదగును ?
దద్దయు నేక్రియఁ - దలఁచి చూచినను
నరుచియహా విత్త మ - హాంకృతి మనసు
మఱి యాశ వపువు కో - మలబాల్యయౌవ

నము లతివలు వార్ధ - కమును గాలమును
దమి నిట్టివస్తుసం - తతిని భావింప
నేవి మేలని సంగ్ర - హింపంగఁదగును ?
వావిరి వివిధచిం - తావితానములఁ
బెనఁగొన్నవట్టిదం - థన మైనధనము
వినుము దుర్వృత్తికిఁ - బెట్టినపేరు
మదకారణము లోభ - మయ మవివేక
సదన మాపదల కా - శ్రయము దుర్వ్యథల
కుదు రగుదుస్సంగ - కుటిలవర్ధనము
తదుపరి కర్మబం - ధన మిట్టిధనము
తాపత్రయాగ్ని కిం - ధన మైనధనము
కోపమూలంబుగాఁ - గొమరొప్పుధనము
పరనింద నొందని - బహుళభాగ్యుండు
మఱి తన్నుఁ బొగడని - మహితశూరుండు
జనులఁ జక్కఁగఁ బ్రోచు - జనపాలకుండు
గనుఁగొన భువిలోనఁ - గన్పించు టరుదు
చిత్త మెన్నఁగ మహా - చింతాభరంబు
రిత్తకోరికలతో - మత్తిల్లుచుండు
నాయు వస్థిరము మ - హాపేలవంబు
తోయజాగ్రస్థిత - తోయకణంబు
సరణి విద్యుల్లతా - చలనంబుభంగిఁ
బోరి నీటిపైఁ దోచు - బుడగలరీతి
బహుస్వల్పకాల మీ - బ్రదుకులు చూడ
మహి మురియుదు రల్ప - మతు లైననరులు;

విను మహంకారంబు విధ - మెట్టిదనిన
ఘనమోహమునఁ బుట్టి - కడిమిఁ బెంపగుచు
నేను నాయది యని - నేను మే మనుచు
బూని పైకొని మీఱి - పోవుచునుండు
నెనసి యహంకార - మెందాక వృద్ధిఁ
దనరు నందాక నె - క్కొను నాశ మీఱి
జలదబృందము మింట - సాంద్రమై తోప
సలలితకుటజముం - జరి విజృంభించు
తెఱఁగున దుర్దోష - దృష్ట మైనట్టి
నిరసనచిత్తంబు - నిజగురుసేవఁ
గోరక తిరుగును - గుటిలప్రవృత్తి
దూరదేశం బైన - పారంబు లేక
యూరక యిల్లిల్లు - నొగిఁ దిరుగాడుఁ
గాని సజ్జనులను - గలియంగఁ బోదు
హానికార్యము లైన - నత్యర్థ మనును,
వెనుకముం దరయక - వెఱ్ఱిజ్ఞానంబు
ననువున నెట్టిచో - నైన లేశంబు
ఫల మొందలేదు గో - ష్పగ నిధు లొంది
యలరుచుండిన హృద - యమ్మునఁ దృప్తి
పొందదు ధరనుండి - పొసఁగఁ బాతాళ
మొంది యచ్చటనుండి - యుర్వికి మఱలుఁ
గ్రూరతజ్జువిశిష్ట - రూపకాష్ఠంబు
తీరున మన మిట్లు - దిరుగుచునుండు

నామనంబునఁ దృష్ణ - యావిర్భవించుఁ
గాఢాంధకార మె - క్కస మౌచుఁ దోప
దానిలో దోషముల్ - దగఁ బుట్టుచుండు
నానావిధములు పుం- ఖానుపుంఖమ్ము
లరయ సంసారదో - షానేకతతులు
మఱి తృష్ణయే దీర్ఘ - మని పెద్ద లందు
రంతఃపురములోని - యధిపున కైన
నెంతైన సంకట - మొనయంగఁ జేయుఁ
గానఁ గఱకుకత్తి - కంటెను నాయ
సానలంబునకంటె - నశనిపాతికంటె
బహుదారుణం బౌచుఁ - బరఁగు నీతృష్ణ
మిహిరబింబము నాక్ర - మించినరాహు
వన వసియించి పా - యకను వేధించుఁ
గనకాద్రితుల్యు లై- నను శూరులైన
విదిత మింతయుఁ దృష్ణ - విడువంగవలయు
నది దొలంగినవాఁడె - యనఘాత్ముఁ డరయఁ
జీము నెత్తురు గ్రంధి - చిదుకుచునుండు
సామూలచర్మమాం - సస్నాయుమజ్జ
ములయందుఁ బెన్నర - ములచిక్కు లల్లి
మలమూత్రముల నిండి - మాఁగుచునుండు
మిగుల వికారధ - ర్మ యగుదేహంబు
తగఁ దాపరోగని - ధానంబు చూపె
యీపెద్దవపువుల - కెందు సుఖంబు ?
నీచపుబాముల - నిండారుడొక్క

ముదిమికాలం బైన - ముదిమితో నొప్పఁ
గదిసి పక్వం బైనఁ - గాలంబు నొందుఁ
జేదవానికి నైనఁ - బృథివిపతి కైన
నాదట సమము దే - హాదుల కిట్లు
సహజంబు లవి యింద్ర - జాలంబు వారి
వహాపంక్తి విద్యుదా - వళియట్టు లస్థి
రములు విధ్వస్తగే - హములు గళేబ
రముల కాసింతురు - విమతులౌ జనులు
బాల్యంబునం దాస - పట్టుగాఁ దగిలి
లౌల్యభావము దుర్బ - లము దైన్యజాడ్య
మఱియు నవాచ్యంబు - మఱి యజ్ఞవృత్తి
యతినిద్ర మూత్రమ - లాన్వితాంగుండు
దన్నుఁ దా నెఱుఁగక - తన్నుకొంటయును
గ్రన్ననఁ గదలిపోఁ - గాళ్ళును రాక
గురుజనశిక్షల - కుం జాలఁ గుంది
యెరియుచు నీరీతి - నెన్నఁగారాని
యిడుమలఁ గుడుచుచు - నిటు బాల్యదశను
గడపు నిం దింతసు - ఖం బేమి గలదు ?
పుడమిఁ బుట్టినదాది - పొలియునందాక
గుడుచుచుండును నిట్టి - యిడుమ లన్నింటి
నెప్పు డీతనువున - కెటులఁ జూచినను
దిప్పలు పొందుచుఁ - దిరుగంగవలసె
నెక్కడి తలిదండ్రు - లెక్కడి బిడ్డ
లెక్కడి సోదరు - లెక్కడి భార్య

పలుక

లెక్కడి బాంధవు - లెక్కడి మిత్రు
లెక్కడి సంపద - లెక్కడి గృహము
లెక్కడి విభవంబు - లెక్కడి భోగ
మెక్కడి సంతోష - మెక్కడి సుఖము
తాను బోయెడివేళఁ - దనవెంటఁ దూదకు
మైలైన రాఁబోదు - మేదినియందు
ముప్పునఁ గఫవాత - ములును బైత్యంబు
గప్పినవేళను - గాబరాపడుచు
దిక్కుదోఁచక చాల - దీనత నొంది
చిక్కుచు నింద్రియ - స్మృతి దప్పువేళ
శమనుకింకరు లంకు - శంబుల నొంచి
శ్రమపెట్టి కాలపా - శంబులఁ గట్టి
కొనిపోవువేళ ది - క్కులు పాఱఁజూచి
వెనుకముంగలఁ దన - వెంట నెవ్వారు
రారైరి దిక్కెవ్వ - రా దేవ యంచు
బోరున విలపింపఁ - బోరి కాలభటులు
గదలచే మోదుచుఁ - గరవాలములను
జదుపుచు నిలువునఁ - జంపివేయుచును
శూలంబులను గ్రుచ్చి - సురియల మొత్తి
నేలం బడంగూర్చి - కాలఁ దన్నుచును
నివి మొదలైనట్టి - యిడుమలం బెట్టి
తవిలి బాధింపంగఁ - దల్లడిల్లుచును
సుడివడి మతిదప్పి - సొమ్మసిల్లఁగను
గడువడిఁ గొంపోయి - కాలునానతిని

కారవం బనుమహా - నారకంబునను
వారక పడఁద్రోయఁ - బడరానిబాధ
లనుభవించెద రిదే - యైహికఫలము
తను వెత్తుటయె రోఁత - తలపోసిచూడ
సారహీనం బైన - సంసారసుఖము
గోరి మూఢాత్ములు - ధారుణిమీఁదఁ
బుట్టుచుఁ గిట్టుచుఁ - బోలుపేమి లేక
యిట్టిపెన్బాధల - నెరియుచుండెదరు;
కలవాదమునఁ గూలు - కరిణియుం బోలె
వలయందుఁ జిక్కిన - వనమృగం బట్లు
పెనుచిక్కమునఁ బడ్డ - పికముచందమున
మొనసి గాలము గ్రుచ్చు - కొను మీన మట్లు
కుడితిలోఁ బడి తన్ను - కొనుమూషకంబు
వడువునఁ జిచ్చులోఁ - బడి శలభంబు
మాడిపోయినరీతి - మనుజు లెవ్వలను
బోడిమి చెడి భవాం - బుధి నీద లేరు;
గావున సద్గురు - కారుణ్య మొంది
పావనులై మోక్ష - పదము నొందెదరు ॥

### సీసార్థములు

గురుఁడు విరించియు - గురుఁడు విష్ణుండును
గురుఁడు మహేశుండు - గురుఁడు పరుఁడు
గురుఁ డనంతుండు స - ద్గురుఁడు బ్రహ్మంబును
గురుఁడు చరాచర - గురుఁడు తలఁప

గురుఁడే లోకాతిరిక్తుఁడు - సర్వదా పరమగురుఁడే నిర్వాణ
యుక్తుఁడు - గురుఁడే సమస్తశ్రేయ - స్కరుఁడు బ్రహ్మాత్మ
విద్యా - కరుఁడు తత్త్వార్థసంప - త్కరుఁడు శుద్ధుండు బుద్ధుఁ
డు - గురుఁడే వేదాంతవేద్యుఁడు - సర్వేంద్రియప్ర - హరుఁ
డకలంకుఁ డాద్యుఁడు ॥ ౧

తలఁప గుకారంబు - తమసైకమాయయౌ
నరయ రుకారమ - య్యది హరించు
ఘనగురుశబ్దంబు - కలుషాపహారణంబు
దనరు భవార్ణవో - త్తారకంబు
గురుతత్త్వ మాలోకించుమీ - జన్మపావనము - గురువాక్య
మాకర్ణించుమీ - గురుపాదోదకము గోదా - వరితోయ మని
యెంచి - స్థిరభక్తిఁ గ్రోలినట్టి - నరులు పవిత్రు లౌదురు -
గురువరేణ్యు నుతించుమీ - గురుసుప్రసాద - మిరవొందఁగా
భుజించుమీ ॥ ౨

అనఁగ శిష్యుండు బ్ర - హ్మానందభరితుఁడై
గురుపాదములకు గ్ర - క్కున శిరంబు
మోపి తా సాష్టాంగ - ముగ వందనముఁజేసి
గురువర్య! యే నెట్టి - గుణుతు గల్గి
యున్నాఁడనో తెల్పవే - యింతటు మహి - మోన్నతిఁ గరు
ణింపవే - పన్నుగా నెందుకై యు - త్పన్న మైతినో తిరిగి -
వన్నెమా రెందుఁ గలిగు - చున్నానో యీవిశ్వ ము-
త్పన్నమునకు మూలము - నెన్నఁగాఁ దెలియ - కున్నది
యింతకాలము ॥ 3

స్థిరభక్తితో నిట్లు - శిష్యుండు ప్రార్థింపఁ
గరుణాకటాక్షసం - కలితుఁ డగుచు
దేశికుఁ డాశిష్య - తిలకంబునకు నిట్లు
దెలియ నాదేశించెఁ - దేటపడఁగ

వినరా యీసృష్టిమూలముఁ - జెప్పెదఁ దెలిసి - మనరా బ్ర
హ్మానుకూలము - మును నిర్వికల్పబ్రహ్మ - మున సంకల్ప
రూపముగఁ - దనరారి యొకమహ - త్తత్వ ముత్పన్న మయ్యె -
ఘనత నమ్మహాతత్వము - న న్మహదహం - కారము వొడమె
సత్యము ॥ ౪

ఆయహంకృతిఁ ద్రిగు - ణాత్మక మైనమా
యయు మాయచేఁ దన్ని - జాంశ మైన
యీశుండు దలఁప మా - యాశబలబ్రహ్మ
మనఁగఁ బ్రతిఫలించె - నతనియందు

నారవగుణకమునై - మి న్నుద్భవించె - నందు స్పర్శగుణకము
నై - వారక జనియించె స - మీరము; రూపగుణక - మై
రంజిల్లెను వహ్ని - యారసగుణకమునై - వారి సంభవ
మయ్యెను - నందున గంధ - పూరమునై పుడమి యయ్యెను॥

చంపకోత్పలవృత్తార్థములు

అంబరపావ - ౦చి యందుఁ బరి -
పూర్ణత నోషధు లుద్భవించె నిం
శ్రీ
పడో ...ందు నన్న ముద -
యంబగు నందుఁ జరాచరాదులుఁ

బోడమిన నింతయుం బలిసి -
పొందుగ విశ్వము నయ్యె, నందుఁ దా
నెడపక యంతరిక్షము ప్ర -
హిండితమై బహిః రంతరంబులను -

అనాదిమ - ధ్వాంత మిమ్ములను - సంతతము నొకరీతి నిరు
పమ - శాంతనిర్గుణనిష్కళంకని - తాంతనిశ్చలనిర్వికారా -
చింత్యపై రంజిలు పరాత్మ - యొందుఁ జూచినను - నిబిడీకృత
మై - పొంది పొందకయు॥

ఆరయ మాతృకాన్వితస -
దాత్మక మైనతదీయనిర్మలోం
కారమునం దకారము ను -
కారమకారము లుద్భవించెఁ బెం
పార నకారమాతృకను -
బద్మభవుండు రజోగుణాన్వితుం
డై రహిఁ మించి పుట్టి భువ
నావళిసంభవ॥ హేతుకర్తయునై -

చక్రియు సర్వో - పేతభర్తయునై - ఖ్యాతిమీర నుకారమున
సం - జాతుఁడై యల రఖిలభూత - వ్రాతపోషణకారణుఁడై -
భూతనేతస్థవితపదకం - జాతయుగళుఁడై - నిజదాసవ్రాత
మంగళుఁడై ॥ తిరిగి
బూనిశో వ్రా

కలిత మకారబీజమునఁ -
గామరిపుండు జనించి తామసో

జ్వాలకరుఁడై జగన్నిచయ -
సంక్షయకారకుఁడై చెలంగె నిం
పలరఁ ద్రిమూర్తు లొచుఁ ద్రిగు -
ణాత్మకు లయ్యుఁ ద్రిశక్తియుక్తులై
తలఁపఁ ద్రివర్ణమాతృక గ -
త ప్రథితాకృతులై దనర్పఁగను -

సచ్చిన్మయ - మోద మొప్పఁగను - నాదబిందుకళాంతమై
ని - ర్వాదనిర్మలదివ్యపథమై - వాదభేదవివర్జనంబై - బోధ
రూపకమయ్యుఁ బూర్ణ - భావరంజనమై - త్రిమూర్త్యాది -
దేవభావనమై ॥ ౘా

మఱియుఁ బంచీకరణలక్షణం బెట్లనిన -
మఱి గగనార్ధభాగము క్ర -
మంబునఁ జెల్వయు నయ్యె నాసగం
బరయఁగ నాల్గుఖండములు -
నై యనలానిలతోయభూములన్
సరగునఁ గూడి బుద్ధిమన -
సామతిహంకృతు లయ్యె; మారుతం
బరతగ వ్యానమయ్యె నొక -
యర్ధము నాల్గువి ॥ ధంబులై తగను -

అంబరహావ - కాంబుభూములును - సంబంధమున సమా - నం
బుదానం బహ - నంబు ప్రాణంబు ల - నం బరఁగి యేను -
మారుతంబులును - మిగిలి యల - రాయూధముగను ॥ ౯

కనదనలార్ధభాగమును -
గన్గవరై మిగులర్ధభాగముఁ
దనర నభోనిలాంబువసు -
ధాయుతమై నలుఖండముల్ దగఁ
గొనకొని కర్ణత్వక్ రసన -
ఘ్రాణము లయ్యె; జలార్ధభాగముఁ
ఘనరస మయ్యెఁ దక్కినస -
గంబు చతుశ్శక॥ లంబులై యొగిని

ఖశిఖసమీరంబులుఁ ధరణి - సరవి గూడుక శబ్దరూప -
స్పరిశగంధము లైదు విషయము - లరయ నిన్నిటికతీతంబై -
పరమతత్వము ప్రబలుచుండును - పరిపూర్ణ మగుచు - దిక్కులు
నిండి - నిరుపమం బగుచు॥ ౧౦

ధరణియు నర్ధభాగము ప -
దంపడి పాయువు నయ్యెఁ బైసగం
బరయఁగ నాల్గుఖండములు -
నై గగనానిల వహ్నితోయముల్
వరుసగఁగూడి వాక్కుకర -
పాదభగంబులునై చెలంగె నీ
యిరువదినాల్గుతత్వముల -
కెన్నవిలక్షణ॥ మై వెలుంగుచును -

బ్రత్యగాత్మ - నీవై యొప్పుచును - గేవలముగఁ దెలియు
మనాత్మా - త్మావివేకముఁ జేసి యంత - ర్భావమున బ్రహ్మో

త్మతో సమ - భావముఁ స్వాభావికముగా - నిరతానందమును-
బొందుము సాక్షా - త్పరమమోక్షమును ॥ ౧౧

ఆపరిశుద్ధమై వెలుఁగు -
సత్చిదాత్మయుఁ గారణంబుగా
నోపినఁ గార్యహేతు వగు -
చున్నమనంబును హృత్పయోజసం
దీపితవృత్తిఁ గల్పనలఁ -
దేలుచునుండుశశాంకుఁడుఁ విభుం
డై పరిపూర్ణతఁ దనర -
నవ్వెలబుద్ధియు ॥ నాభివాసమునై -

యచ్చట సదా - నటదుల్లాసమునై - ప్రాభవంబుగ నిశ్చ
యము తేజోభరంబై కమలగర్భుఁడు సాభిలాషత దాని కధి
విభుఁ - డై భరించుఁ దదీయభావా - తీతుఁడై చెలఁగుఁ -
బరాత్మ వి - ఖ్యాతుఁడై వెలుఁగు ॥ ౧౨

చెలువుగఁ గంఠసీమ నివ -
సించి విచారవశంబునఁ సదా
యలరుచు భోగభాగ్యముల -
నాదట నెంచుచు నెప్పుడుఁ సము
జ్జ్వలముగఁ జిత్తముండు సహ -
జంబుగ జీవుఁ డధీశుఁడై తగుఁ ;
దలఁపఁగ నాస్యగహ్వరప -
దంబున హాంకృతి ॥ వాసమై మఱియు -

నభిమానవి - లాసానుసరియు - నై సమస్తమునన్ జరింపను.
మానతీశుఁ డధీశుఁ డచ్చట - భాసిలంగఁ దదంతరింద్రియ.
రాశి నంటక జేసియై పర - మాత్మ చెన్నొందు - సంతతకేవ.
లాత్మ నే పొందు ॥
౧౩

మత్తేభవృత్తార్థములు.

అల నాభీవివరంబునన్ నిలిచి యో -
ప్పారున్ సమానానిలం
బలరన్ డెబ్బదిరెండువే ల్నరము ల -
ల్లాడంగ భుక్తాన్నమం
జులసారంబును బంచిపెట్టి సమవి -
స్ఫూర్తిన్ దగంబ్రోచు ని
మ్ముల నాథుండు జయుండుగాఁగ నెగడున్ ॥
మోదిం చుదానంబును -

గంధరసీమఁ - బాదుకొని నిత్యమును - సాదరంబుగ వైఖ
రీయుత - వేదతుల్యము లైనపల్కుల - నూది పలుకంజేయ
నజుఁడా - హ్లాదముగ నధిదైవ మచ్చట - నుండుట దెలియఁ
గను - బరతత్వ ము - ఖండమై వెలయఁగను ॥ ౧౪

అమరన్ వ్యానసమీరణం బెపుడు న -
ర్వాంగంబులన్ వ్యాప్తమై
సమశీతోష్ణపుస్పర్శలం దెలియుచున్ -
సంపూర్ణమై కీళ్ళ నా

శము లాడింపఁగ విశ్వయోనివిభుఁడౌ -
లావణ్య మింపార ని
త్యము నిష్కర్మము నిష్కళంకపరమా ॥
త్మారామతత్వంబును -

బ్రహ్మానంద - పూరకూపారంబును - ఘోరమాయారూప
నామవి - కారదుష్కర్మగుణధర్మవి - చారకరసంపారనీరధి -
కారణం బని తెలిసి మోక్ష - ద్వారముఁ దీసియును -
పొందుము నిరా - కారము డాసియును ॥ ౧౫

అరయఁ బ్రాణవాయు - వధ్యాత్మమన నొప్పి
హృదయకమలమందు - విదితవృత్తి
నధివసించియుండు - నట విశిష్టుం డధి
దైవ మనఁగఁ దద్ద - దనరుచుండు. ౧౬

తగ నపానవాయువు గుద - స్థానమందుఁ
జొక్కముగ నుండి మలమూత్ర - శుక్లములను
నిచ్చలు బహిర్గత మొనర్చు - నెగడు నచట
విదితముగ నధిదైవమై - విశ్వకర్త. ౧౭

పంచపాది శార్దూలవృత్తార్థములు.

ఆకర్ణింపుము సన్మతీ! శ్రవణ మ -
ధ్యాత్మంబు దెల్పెఁ రవం
బాకర్ణించుటయే హ్యాపషిక మగు నిం -
పారఁ దిశల్ కర్తగా

వీఁకన్ జన్మము స్పర్శలం దెలియు తీ -
విన్ వాతముకా నాథు డౌ
నాకారంబును గాంచుకన్నులకుఁ గం -
జాప్తుం డధీశుం డగున్
జోకన్ జిహ్వా రసంబులం దెలియ నిం॥
చు న్వారి రాజో పతి -

వాక్కుకు విషయ - ము న్వచనం బున్నతి - నన్వితంబుగ శిఖి
యధీశ్వరుఁ - డు న్వెసం గరములకు దాన మొ - గి న్విభుం
డింద్రుండు వెలయుఁ ద్రి - తన్వులకు సువిలక్షణంబుగ - సాక్షి
యై రంజిల్లఁగా - నీవైన ప్ర - త్యక్షాత్మవనఁ జెల్లఁగా॥ ౧౨

మీఁటన్ బాదగుణం బగున్ గమనమున్ -
మేలొంద వైకుంఠుఁ డా
ధారుం డౌను; గుదంబు కొప్పు మలమూ -
త్రత్యాగనిశ్వాస లిం
పారన్ మృత్యువు గర్తయై యొసఁగు; గు -
హ్యంబందు నానందసం
చారంబే విషయంబు తద్విభుఁడు భా -
పానాథుఁడై యొప్పు; దు
ర్వారజ్ఞానసుకర్మకేంద్రియములన్ ॥
రంజిల్లఁగాఁ జేయుచున్ -

బ్రకృతిగుణ - పుంజంబులను ద్రోయుచున్ - మంజులంబై
వెలయునాలు - కంజములపై వేయిరేకుల - కంజమున

విల్లొందునిత్యాని - రంజనం బగుసచ్చిదాత్మా - రామతత్వముఁ
గాంచుము - నిత్యముఁ బరం - ధాముని సేవించుము ॥ ౧౯

## కీర్తన

ముదముతో నీవిశ్వమూలము వినరా - నెమ్మదిలో - స్థైర్య
మున నిర్వృల నంది మనరా ॥
పంచభూతము లైదు ప్రత్యేకముగను - శ్రీ -
మించి సత్వగుణార్ధ మెసఁగ నందునను ॥ ౧
ఆకాశానిలార్కాప్పృథ్వ్యశ్వినీసురులు - సం -
కాశింప శ్రోత్రాదికరణోద్భవములు ॥ ౨
సవిశేష మయినట్టిసత్వార్ధమునను - నిం -
దువిరించి క్షేత్రజ్ఞరుద్రులతోను ॥ 3
అల మనోబుద్ధిహంకారచిత్తములు - ని -
మ్మల సమష్టిభావం బొందె లోకములు ॥ ౪
పరఁగ నవ్వియదాదిపంచకమునను - మిం -
చి రజోగుణార్ధంబుచేఁ దోరముగను ॥ ౫
అనలేంద్రవిధుమృత్యుజామర్త్యయుతమై - స -
య్యపాన్మఖకర్మేంద్రియములుఁ జనితమై ॥ ౬
అల శేషరజోగుణార్ధసమష్టి - నా -
వలన విశిష్టాదిదైవసంసృష్టి ॥ ౭
ప్రాణాపానోదానవ్యానసమానా - ది -
నానాభూతోపాధిష్ఠానవిధానా ॥ ౮

భాసురభద్రాద్రివాసా శ్రీరామా - పీ -
ద్దాసపోషణ శేషగురుసార్వభౌమా ॥ ౯

కీర్తన _ జంపెతాళము

ఇది సూక్ష్మకాయంబు నిది ప్రకృతిలింగంబు _
నిదియె స్వప్నం బనుచు _ నెన్నుదురు బుధులు ॥ ౧

మొదట పంచప్రాణముల్ జ్ఞానకర్మేంద్రి -
యదశకంబున బుద్ధి - యెద వెసం గూడి ॥ ౨

చను వెనయ సప్తదశకలింగ మగు దేహ -
మును సమష్టిసమస్త - మును వ్యష్టి యొకటి ॥ ౩

మఱియు నీవ్యష్టిసమష్టిస్వప్నంబులును -
సరియవస్థ లగు సూక్ష్మాంగస్వప్నములఁ ॥ ౪

అల ప్రాజ్ఞుఁ డభిమానియై ప్రతిభాసికుం _
డెలమి తైజసస్వప్న - కలిపితుం డనఁగా ॥ ౫

వితతసమష్టిసూక్ష్మతనుస్వప్నవిశిష్ట -
రతుఁ డైనయీశ్వరుఁ - డతులతేజమునఁ ॥ ౬

నిండి హైరణ్యగర్భుం డనఁగ సూత్రాత్మ -
కుం డన సకలజీ - వోపాసకుఁ డనఁ ॥ ౭

శ్రీశేషగురుస్వప్ర - కాశ మొందియుఁ బీరు _
దాసునకు బోధించెఁ _ దత్వసంగ్రహము ॥ ౮

కీర్తన - శుద్ధకాంభోదిరాగము.

పాంచభౌతికప్రపంచక్రమంబు వర్ణించవేరా - యీప్ర - పంచసృష్టికిఁ బూర్వాపరములం దల రాత్మఁ - గాంచవేరా ॥ పాంచ ॥

నినదగుణక మైననింగియు రవశబ్దగుణకమైన - ప్రభం - జనము నినాదస్పర్శాకృతిగుణకాగ్నిసన్నిధాన ॥ పాంచ ॥

వరశబ్దస్పర్శరూపరసగుణక మయ్యెఁ - బరఁగునీరు - శబ్ద - స్పర్శస్వరూపగం - ధరసగుణము లైదు ధరణితీరు ॥ పాంచ ॥

ఇవి పంచీకృతము ల - య్యు మహాస్థూలంబులై యివి యభివ్యక్తములై - నట్టి - యవిరళ మైనమహాభూతముల విశ్వ మయ్యె విధ్యుక్తములై॥ పాంచ ॥

ఈరేడు లోకము లేర్పడి విహరించుసచరాదులు - పొల్పు - మీఱఁ దత్ప్రాణాధారాన్నపానప్ర - పూరఘట పటాదులు ॥ పాంచ ॥

ప్రభవింపఁగా నింతపట్టున స్థూలప్ర - పంచ మయ్యెను వీనికి - విశ్వ - దభిముఖవ్యష్టిసమష్ట్యాత్మకజాగ రావస్థ యగు నునికి ॥ పాంచ ॥

అలరు నీవ్యష్టిస్థూలాంగజాగరణావ - స్థలయందు నిర వొందుచుఁ - దేజ - రిలు లింగదేహోపా - ధికుఁ డైనతైజసుఁ - డెలమి వ్యాప్తిని నొందుచు ॥ పాంచ ॥

అనయము చిదాభాసుఁడన వ్యావహారికుఁ - డన విశ్వుఁ
డన స్వగత! - భళి - యన హిరణ్యగర్భుఁడగువిభుఁడు విశిష్ట -
తను విగ్రహజాగ్రత! ॥ పాంచ ॥

దండిగా విశిష్టుం డైనవై రాజ - సుం డనఁగాఁ జెలఁగి
సర్వా - త్ముం డన వైశ్వాన - రుండన విరాట్పురుషుం డనఁగా
మెలఁగి ॥ పాంచ ॥

అనువొందునఖిలలోకారాధ్యుఁడై నిరం - జనుఁడై
ప్రకాశించుచుఁ - గనుం - గొన ఘృతాన్వితసుధ - యనువున
నాత్మభా - వన చేసి సిరి మించఁగా ॥ పాంచ ॥

శ్రీశేషగురుఁ డాత్మ - శిష్యున కిటు లుపదేశము
గావించెను - బీరు - దాసుఁడై యాత్మవి - లాస మరసి నిజ -
దాసుఁడై సేవించెను ॥ పాంచ ॥

కీర్తన - ఏకతాళము.

వితతసర్వేశ్వరుఁ డైనశ్రీవిష్ణుమూర్తికి - నవ్యా -
కృతమై మహానందమయకోశం బగుపూర్తికి ॥ వితత ॥

అరయ సకలభూతసమష్ట్యజ్ఞానంబును - నిరం -
తరకారణకాయముం దమోమయంబును ॥ వితత ॥

అది మహాసుషుప్త్యవస్థయు నబ్జభవాదిగా - శ్రేయః -
ప్రదముగాఁ దృణపర్యంతము ప్రపంచము ప్రోదిగా ॥ వితత ॥

సకలభూతము లవయవంబులు జగదుత్పత్తియు - స్థితినా -
శకములు వ్యాపారములు శశ్వత్సంపత్తియు॥ వితత ॥

నిగమశాస్త్రంబులును శ్వాసము లగు నింపుమీఱి - జొక్క -
మఁగ సత్వప్రధానావిద్య తగ నందుఁ జేర ॥ వితత ॥

ప్రతిబింబించియును మేఘసంగతజలంబుల - మేఘ -
యుతనక్షత్రవియచ్ఛాయ యునికి యిమ్ముల ॥ వితత ॥

జీవుం డగు మఱి యాతం డవిద్యావశంబున - నావి -
ర్భావస్థూలతనువాసన సంభావసుఖంబున ॥ వితత ॥

అతఁడు ప్రాజ్ఞుఁడనఁగా నానందమయుఁ డనఁగా - మహో -
న్నతపారమార్థికుఁ డనంగ ధృతి రంజిల్లెనుగా ॥ వితత ॥

చారువ్యష్టికారణశరీరవాసుఁడై - చిక్క -
భూరిసుషుప్తి సుఖానుభూతి సరసుఁడై ॥ వితత ॥

అతులావిద్యయు నవిద్యాప్రతిబింబంబును - దలం -
పతదధీనచైతన్యసంయుతజీవంబును ॥ వితత ॥

మఱియు నాజీవున కానందమయసంజ్ఞకంబు - నయ్యెఁ -
బరఁగ వ్యష్టిజ్ఞానంబు కారణశరీరంబు ॥ వితత ॥

అగణితసుషుప్త్యవస్థ యగునారెంటికి - నభిమా -
నిగ వెల్గొం దతండు ప్రాజ్ఞుం డగు నిన్నింటికి ॥ వితత ॥

వాసిగ నతని కీజీవత్వము పర్యాప్తము - గామిం -
జేసి తవాదృష్టసహాయవిశేషపూర్వకము ॥ వితత ॥

మీఱి సూక్ష్మాంగసృష్టిప్రకార మెఱిఁగింతుఁ - దనివి -
దీర విను మని చెప్పిన సుధీరు సేవింతు ॥ వితత ॥

భాసురభద్రాచలాధివాసాత్మారామా - చిద్వి -
లాస శ్రీశేషగురుపీఠదాసాభిరామా ॥ వితత ॥

కీర్తన - ఏకతాళము.

పరిపూర్ణ మైనదృగ్బ్రహ్మతత్వంబు - మే -
దురవిశ్వరూపమై తోచె సత్యంబు ॥ పరి ॥

దారువు పురుషుఁడై త్రా డురగంబై - యిం -
పార శుక్తియు వెండి యైన విధంబై ॥ పరి ॥

మరుమరీచికలు నిర్మల మైనజలము - నా
తెఱఁగు మిన్న సితమై పరఁగు నగ్గలము ॥ పరి ॥

పరసాద్వయామలసచ్చిదానంద - త -
త్పరమాత్మతత్వభాసురమై చెన్నొంద ॥ పరి ॥

ఆపరమాత్మ మాయావరమునను - దా -
దాపున సజ్జడదుఃఖాత్మకమును ॥ పరి ॥

జగములై చూపట్టు జనముల కెల్ల - గ -
ట్టిగ నద్వైతజ్ఞానదృష్టి శోభిల్ల ॥ పరి ॥

వరపండితులు పూర్ణనిరుపమానంత - సు -
స్థిర కేవలాత్మగాఁ బరికింతు రంత ॥ పరి ॥

వరుసతో నిది యభావం బైనమాయా - భా -
స్వరసంవిదఖండపరతత్వమాయ ॥ పరి ॥

కరుణతో శ్రీశేషగురుఁ డెఱిఁగింప - నీ -
ధరఁ బీరుదాసుఁ డీశ్వరుని సేవింప ॥ పరి ॥

## ద్విపదార్థములు

ఇంద్రియంబుల నిగ్ర - హించి ప్రాణముల
సాంద్రత నురుమాన - సంబునఁ గూర్చి
హంస యనఁగ నొప్పు - నక్షరద్వయము
హంసతత్వంబును - నరయఁగా వలయు
ననిశంబుఁ బద్మాస - నాసీనుఁ డగుచుఁ
గనుచూపు నాసికా - గ్రంబున నిలిపి
యెనసి యింద్రియముల - నెటు వోవనీక
మనసుచేఁ దిరముగా - మఱి లాగిపట్టి ॥
మునుకొని ప్రాణమాదిగా - దశవిధపవన - ముల వికృతు
లొందనీయక - యునిచియుఁ జొక్కముగను గామాదిగఁ -
బెనుసంకల్పద - శనముగ హృదయము - గని నిశ్చలంబు
గావించి - హృన్మారుతము - లను హంసమంత్రమునఁ గూర్చి॥

జపియింపు మీదట - స్వాంతనభంబు
నుపరి బిందువు తొల్ల - కుండఁ బొందించి
మఱి నాదకళల స - మ్మతిని వీక్షించి
పరిపూర్ణదృగ్బ్రహ్మ - పద మందవలయు
లలి నాదబిందుక - ళల కాది యగుచు
వెలయఁ దద్ద్రష్టయై - వివిధదృశ్యార్థ
సాక్షియై వెల్గొందు - సచ్చిత్స్వరూప
సాక్షాత్పరాత్మ యె - సఁగ హాకారంబు
లక్షితతనురింద్రియ - ప్రాణహృదాది - లక్షణదృశ్యదృఙ్మయ-
విక్షేపత్రిగుణాన్వితో - పేక్షవికారియుఁ బ్ర - త్యక్షజడా

త్మయు నా - ద్యక్షమనాదిప్రకృతి - యక్షరాక్షరాకృతియు
సకార మగున - న్మోక్షువిముఖవతియు ॥

పొలుపుగా వినుము త - త్పురుషప్రకృతుల
కలితతాదాత్మ్యసం - గతమధ్యబిందు
వమరు హంస యనంగ - నలరు జీవుండు
సమరున్మనస్కుండై - సర్వదా వెలయు
నిటు నిర్వికారుం డ - యినపూరుషునకుఁ
జటులజడాత్మయై - చనుప్రకృతికిఁ
గదిసి ప్రత్యేకంబు - గాను గర్తృత్వ
ముదితభోక్తృత్వాది - యుక్తసంసార

పదము ఘటింప దారీతి - హకారస్వరూ - పకుఁ డైనయాత్మ,
డున్నతి - సదమలాత్మఘునశక్తి యైనను - ప్రద నకారసం.
బంధపరస్పర - తాదాత్మ్యధ్యానరూపము - నణా గూడి సచ్చి.
న్మోద హంసస్వరూపము ॥

తవిలి జీవుఁడు నవ - ద్వారపురమున
నివసించి యింద్రియా - నీకహృత్ప్రాణ
సహితుఁడై చారుపం - జరమధ్యమందు
రహి వెల్గుపుల్గు తె - ఱంగునఁ జిక్కి
వెడలునుపాయంబు - విదితంబు గాక
కడఁగి తా వివిధభో - గములందు మునిఁగి
క్రీడించుహంస క - గ్నిష్టోమము లాగి
నాడు పక్షంబులు - నలరునోంకార

ముసు మౌళిఁ ద్రినేత్రముసు - వదనసరోజ - ముసు రుద్ర రుద్రాణులును - ఘనచరణమై - యొనర సాహస్ర - దినకరనవ రం - జనమై వెలయుచు - ననలంబు దాపువులను - దైలంబు తిలలం - దున వ్యాప్త మైనలాగుననను ॥

అతులామృతము మధ్య - నాజ్య మున్నట్లు
వితతపుష్పసుగంధ - విధమున బ్రహ్మ

మాదిగా స్తంబ ప - ర్యంతంబు సర్వ
భేదభూతములందుఁ - బెంపొంది హృదయ

కమల మధిష్ఠించి - గరిమ రంజిల్లు
సమతఁ దత్ప్రాగ్దిశా - చ్ఛందంబునందుఁ

దగురీతి నాగ్నేయ - దళమున నిద్ర
మిగిలి యాలస్యాదు - లాగి యామ్యపత్ర

సుగతకార్యశేముషియు - నైరృతిదళమునం - దగిలి యక
లుషబుద్ధియు - జిగి పశ్చిమదళముఖమునఁ గ్రీడ యొ - సఁగు
వాయవ్యద - ళగమనబుద్ధియు - సొగసుసౌమ్యదళంబున -
సమరతిప్రీతి - యు గడించు సమ్మదంబున ॥

లలిత మాసీశాన్య - దళమున ద్రవ్య
కలితదానంబు పం- కజమధ్యమమున

వైరాగ్య మలరు న - వ్వలఁ గేసరమున
వారకజాగ్రద - వస్థయుఁ గర్ణి

కను గలగల్గులిం - గమున సుషుప్తి
యెనయుచు నుండు నె - య్యెడఁ బద్మదళిన

మగు నప్పు డారవ - మగువిలీనంబు
నగుఁ దుర్య మానాద - మద్ది యాధార

మాదిగ బ్రహ్మరంధ్రము - పర్యంతము బ్రహ్మ - మోదమై
శుద్ధస్ఫటికము - సూది మోప నెడ - మాదట లేకను - పాదుగ
నిండుక - మీఁద వెలుంగును - నదియే పరమాత్మతత్వము.
రహస్య మంత్రము - విదితయోగీంద్రహృద్యము ॥

పరమదేశికసత్కృ - పావిశేషమున
సరసతత్వోపదే - శవివేకదృష్టి

వలన హంసైక్యసు - స్థలము సుషుమ్న
నిలయ మటంచు వ - ర్ణింతురు బుధులు

సకలభూతహృదంబు - జాతంబులందు
నకలంకపవనమ - నోన్వితం బగుచుఁ

బూని హంసార్థంబు - బొసఁగ నిట్లతఁడె
యే నను కీలు తా - నిది యెల్లఁ దెలిసి

లీన మైనంత కేవలాత్మై - క్యానుసం - ధానసంపూర్ణనిశ్చల.
నానాదృశ్యవి - తానవర్జితని - ధాననిర్వికా - ల్పానంతంబై.
మానావమానదూరమై - యలరారు సత్య - జ్ఞానానంద
మపారమై ॥

పరతత్త్వమస్యాది - వాక్యతాత్పర్య
మరయుచు ఘటపటా - ద్యావరణముల

నిరసించి తద్గత - నీర మొక్కటిగఁ
బరికించువిధమునఁ - బరఁగుజీవేశ్వ

రోపాధియుగళంబు - సుచితవివేక
రూపదృష్టిని గడఁ - ద్రోచి తన్నెఱిఁగి

పరిపూర్ణనిర్గుణ - బ్రహ్మంబు గాఁగఁ
బరమమోక్షసుఖాను - భవసద్విభూతిఁ

బొరసి భవాంబురాశినిఁ - దరించి సతము - సిరిమీఱి మనుము
వాసినీ - గురుఁ డిట్లని సత్కరుణించినయీ - పరతత్త్వార్థము -
సరణి దెలిసి - విరచించినాఁడ మెప్పుగా - బుధవరులు హర్షో -
త్కరమున నెనరు గుప్పగా ॥

ఫలశ్రుతి

ఈతత్వసంగ్రహము ధర
జీతలమున నెవ్వరయిన - నియతాత్మకులై
ప్రీతిఁ వినినఁ బఠించిన
నేతఱి సిరి సుఖము మోక్ష - మేర్పడఁ గలుగుఁ.

తనరఁ భద్రగిరీంద్రవాసుఁ డగునా -
శ్రీరామభద్రుండు స
య్యనఘ కారుణ్యకటాక్షవీక్షణముతో -
నాచార్యరూపస్థితిఁ

గనుపించెన్ గురుశేషయాహ్వయుఁ డపాం -
గస్ఫూర్తిఁ దత్వార్థభా
వనుఁ జేసెన్ నను నిత్యమోక్షపదతా -
త్పర్యంబు సిద్ధింపఁగన్.

ఇది గద్యంబు మహాద్వితీయపరమో -
క్షేశుం డఖండప్రభా
స్పదుఁ డారామకృపానులబ్ధకవితా -
భావోన్నతిన్ దత్వసం
పద మీరాన్ బులహారివంశభవుఁ డా -
ప్పన్ బీరుదాసాఖ్యుఁ డ
భ్యుదయస్ఫూర్తి రచించెఁ దత్వవిదు లో -
హో యంచుఁ గీర్తింపఁగన్

ఓం శాంతిః సమాప్తము.



ఓమ్

# ప్రహ్లాద చరిత్ర

కీర్తన - సావేరిరాగము - అటతాళము

నరహరి ప్రహ్లాదవరదుఁ డైనకథ - నరవర! వినుము నేను. యోగీ - శ్వరుఁ డగుశుకుఁ డది పరమమోక్షము శ్రేయ - స్కరము చెప్పఁబూనెను ॥ గరిమకంటకవనాం - తరమునఁ జం దనతరు వుద్భవించిన - తెఱఁగున నుదయించి - హరిపదాంబుజ యుగము చేతస్సరసిజంబున నిల్పి యన్యము - మఱచి పరమ ధ్యాననిష్ఠ న - సురగణంబునఁ బెరుగుచుండెను ॥ నరహరి ॥

పరఁగ నార్యులఁ గన్న భక్తునికైవడి - శరణని ప్రణుతిం చును-నిరం - తరము సమస్తభూతచయంబునం దొక్క - తెఱఁ గున భావించును - దీనులఁ బ్రోవఁ - గరుణారసము నించును - దల్లులుగా ని - తరభామినులఁ గాంచును - సఖులందు సో - దర భావమున మించును - దైవములంచు - గురువుల సేవించును- సత్యంబు నే - మఱక ప్రవర్తించును - గులరూపసుం - దర ముల వర్జించును - విద్యార్థాహాం - కరముల నిరసించును - నింద్రియవిష - యరతి విసర్జించును - నురుతరభవ్యవ - యో బలప్రాభవ - భరితుఁ డయ్యును గాఁడూ - దన్గరివంచితుఁడు గాఁడు - తరుణీముఖభోగంబు లెన్నియుఁ బోరయనుండిన సక్తి నొందఁడు - సరససద్గుణసంఘమును విస్ఫురితప్రహ్లాదుని వరించెను ॥ నరహరి ॥

అరు దైవనిర్జరులందుఁ బ్రహ్లాదుని - సరియైనగుణశాలుల - నెందుఁ - బరికింప లేమని ప్రస్తుతింతురు భవ్య - తరసౌజన్య లీలలఁ - గేశవ ధ్యాన - పరతంత్రుఁ డగుతన్నును - శ్రీపతి చేరి - చరియించిన ట్లున్నను - జెలికాండ్ర నె - వ్వరిఁ గూడ రాకుండును - దనమ్రోల నీ - శ్వరుఁ డాడిన ట్లున్నను - బాలురతోడ - మఱచు నాడఁగఁ దానును - దనతోడ శ్రీ - హరి పల్కినట్లున్నను - మాఱుపలుకఁ-బర భాషలకు మానును- జిత్తమునందు - సురవంద్యు తలఁపోనును - మఱచి సమస్తముఁ- బరికింప వెఱచును - సరసిజాక్షునిపాద - స్మరణామృతమ్మున- భరితుఁడై యైహికముఁ బూనఁడు - సురవిరోధిసుతుండు జడ మతి - కరణి నుండును జడత లేకను-బరమభాగవతస్థితిన్ ॥ నర॥

మఱి వనములఁ గ్రోలుచున్ - దినుచు సంభాషింపు - చును హాసలీలాదులన్ - నిద్రఁ - జనుచుఁ జరింపుచుఁ గనుచు సతము జనా - ర్దనపాదాబ్జాతంబులన్ గని తత్సుధా - శనసం ధానుఁడయ్యును - నేతద్విశ్వ - మునను విస్ఫురమాఁ డయ్యును- మాధవాపా - సనవినిశ్చితుఁ డయ్యెను - భగవద్భా - వన నిరూఢుఁ డయ్యెను - నొకచోటన్ బ్రే - మను గీర్తనసేయును - వేటొండు లే - దని హరిమయ మయ్యెను - అని నవ్వు రం - జనసుహ్వాంతుఁ డయ్యెను - శ్రీధరుఁ డబ్బె - నని యుబ్బి నుతి సేయును - వనజాక్షు నొకచోటఁ - బలుకుఁ బ్రణయహర్ష - జనితబాష్పజీ - వనయుతపులకుఁ డ - య్యెను నిమీలిత నేత్రుఁడై యొక - యనువునను దన్మయత నుండును - మనము నన్యాక్తంబు గానీ - కను ముకుందాక్తమతి యయ్యెను ॥నర॥

జలజలోచనపాద - జలజసేవైకని - శ్చలమోక్ష భా
వంబున- సద - మలుఁ డప్రమత్తుఁ డి- మ్ముల సంసరణదూరుఁ-
డలఘుచరిత్రంబునఁ - గర్మబంధలతాలవిత్రుండును - భాగ
వత- తిలకుఁ డశత్రుండును- దైతేయవం- శలసత్పవిత్రుండును-
బుద్ధైకవ - ర్యులకు సన్మిత్రుండును - సద్గుణమం - జుల
వనచైత్రుండును - దుర్గుణారణ్య- ముల కగ్నిహోత్రుండును -
అజ్ఞానని - స్తులతమోభానుండును - వైష్ణవభక్తి - కలితచరి
త్రుండును - లలితసౌజన్యవి - లాసుఁ డైనపుత్రు - నలఘు
వివేకవిద్యాభ్యాస మొనరింప- వలయు వీఁ డజ్ఞతను జనునిం-
బలెఁ జరించెడు వీని నీతికు - శలునిగాఁ జదివింపుఁడని గురు -
వులగు చండామార్కు-లను గనె ॥ నరహరి ॥ ౪

సురవైరి తనప్రియసూను నొప్పగించి - సరసతఁ జదువు
మోయి - మన - గురువులకడఁ జదువుకొను మని ప్రహ్లాదుఁ -
గటిపిన నతఁడు వోయి - యీడైనయ - సురసుతులను
గొందఱ - ఆచార్యులు- సరసత్వమున నందఱ - బఠింపిం-
చిరి ప్రహ్లాదు సాదరం - బుగఁ బాఠయో - గ్యరతిశాస్త్రము
లఱ దురం - తంబుగ విని - మరలఁ జదువు ముందఱ - నిత్య
రమా - వరభక్తి మన మెత్తైటం - గనఁ జెప్పున- ట్లు రచించు
బల్గొందఱ - వారలతో వే - మఱు వచింపఁడు శ్రీధరుఁ -
స్మరియించుతలఁపున - శాస్త్రముల్ మృషలని - పరికించుఁ
గాని తా - త్పర్యము నుంచఁడు - వరుసఁ గొన్ని దినంబు లరి
గిన - తటి సుతుఁ బరీక్షింపఁగోరి య- సురవిభుఁడు రావించెఁ
బుత్రుని - గురువులను విద్యావిశేషము ॥ నరహరి ॥ ౫

చేరఁజీరి కుమారా! రమ్మని సుకు- మారు వాత్సల్యం
బున - గురువు- లేరీతిఁ జదివించి రెన్ని శాస్త్రములు వి- ద్యార
సికత్వంబున - నీ కెయ్యది - నేరుపు గల దింపుగాఁ - జెప్పు
మన్నఁ గు - మారుఁ డిట్లనె సొంపుగా - భువి నెల్లశ - రీర
ధారుల కిమ్ముగా - గృహ మనునంధ - కారకూపములోను
గాఁ - ద్రెళ్లఁగ లేక - మీకు మే మని లెస్సగా- మనోభ్రమ-
మీఱ భిన్నత నెన్నఁగా - వర్తిల్లక- వారిజాసనుఁ డాదిగాఁ-
దృణపర్యంత - మారయ సత్యంబుగా - శ్రీహరి చిదా - కార
మయమని బాగుగా - నారాయణునిపా - దారవిందములక్ష
మ - నోరథ ముంచి తా - రడవి నుండుట మేలు - ధీరులకు
నని పలికినట్టికు - మారువచనంబుల్ విరోధము - లై రహింప
సురారి విని యొ- వ్వార లిటు గఱపి రనుమనమున ॥నర॥ ౬

కనుఁగొనఁ జిత్రమయ్యెను - నాతండ్రి యీ - పెను
బుద్ధి నీలోనను - మఱి నీ - కును దోచెనో యన్య - లును
దుర్నీతులు బోధించినవారో యేరైనను - ఈదనుజాళి - కిని
జక్రి యేపట్లను - వైరి యాత- నిని వర్ణింపఁగ నీకును- దగునే
యోరీ - తనయా! సురలనైనను - దిక్పాలుర - నని బాధించు
టయైనను - విద్యాధర - మునిసిద్ధముఖ్యులను - వేధించుట -
యును గంధర్వాదులను - స్రుక్కించు టొ - ప్పును హరి గిరి
యంచును - జెడనేల మూ - ఢునిభంగి నజ్ఞతను - అనుతండ్రి
మాటల - కును బురోహితునిఁ గ- న్గొని ప్రహ్లాదుఁడు నిట్టు-
లనియె మోహవిదార - మొనరఁజేసియు నేవిభునియం-
దునను దత్పరులై యెఱుక గ - ల్గినపురుషు లన్యులును
దారని - యను నవిద్యయుఁ గాసి దాత్మని ॥ నరహరి ॥ ౭

అనయమాయాకృత మైనయసద్గ్రాహ్య - మును గానఁ
బడునట్టియా - పరమాత్మున కేను బ్రమొక్కెద - విను కొంద
అజ్ఞులు - ఘనమోహమునఁ బుట్టియుఁ - గులరూపయా -
వనసౌభాగ్యములను - పరులు దా - రనుభ్రమ నొంది
యిలను - బ్రజ్ఞాల - భ్యని నాత్మవాక్యులను - బల్కనేర -
కను మూఢచిత్తులును - బ్రహ్మాదిదే - వనికురుంబములను -
దక్క నన్య - లును జూడ నిమ్ములను - నేర్తురె మెప్పు - డిను
మయప్రాంతంబును - గడిసి పా - యనటు నామనంబును -
వనజలోచనుసన్ని - ధిని దైవయోగము - నను విలీనమగుచు -
న్నది భూసురో త్తమ - వసరుహాసవ మానుమధుపము - చను నె
మాతులములకు నటు లీ - వనజనాభుకథామృతముఁ గ్రో -
లినమనం బితరంబుఁ గ్రోలునె ॥ నరహరి ॥ ౮

అన విని కోపము - నను జండామార్కుఁ డం - తను
బ్రహ్లాదునిఁ గాంచియు - ధిక్క - రణమునఁ బంచశ - రద్వ
యస్కుఁడ వగునీ - వణుమాత్రమై మించియు - బాలుఁడవై
చె - ప్పినశాస్త్రముల నెంచియుఁ - జెప్పవు తర్క - మున నిటు
వాదించియు - దానవనాయ - కునిమ్రోల నెదిరించియు - మా
కవమాన - మును దద్ద గావించియు - వర్తించితి - దనుజా
న్వయ మడంచియుఁ - బోసంగినవి - ష్ణునిఁ బూని కీర్తించియుఁ -
గంటకము చం - దనముల నుదయించియు - నున్నట్లు పుట్టిన
వీని శిక్షించియు - వినఁ జెప్పరాదు దం - డనమునఁగాని
చ - క్కనసేయరాదు పాపనిఁ జదివించెద - మనుచు నృపుస
న్నిధిని దోలంగి - చనుచుఁ బ్రహ్లాదునకు నేకత - మునను
వివిధంబులుగఁ జదివిం - చినను నీతికుశలుం డగునని ॥ నర ॥ ౯

దాపుసామభేద - దానదండచతు - రోపాయములం
దెలిపి - మఱి వి - ద్యాపూర్ణుఁ డయ్యె నీ - పాపఁ డంచు దయఁ-
జూపి సంప్రీతిఁగొలిపి - వైరిచరిత్రా - లాపము బోడసూపకు-
మామక శాస్త్రా - లాపములను మాపకుఁ - దైత్యాన్వయ -
దీపకుఁ గని విప్రుఁడు - మన్నా! హరిక - థాపురాణములను
దేపకు - నసురేంద్రున - కేపటూక్తులు సెప్పకు - మనుచు
బుద్ధి - నోపి యధిపుప్రాపుకుఁ - దోడుకరాఁగా - శ్రీపతి
హృత్ స్థాపకు - నెడపని హరిచిం - తాపరత్వసుదీపకు - నాపద్మ
గర్భాదు - లరయ రానిచిత్స్వ - రూప విష్ణుభ క్తి - రూఢ
మైనవాని - వే పొడమినది మొదలుగాఁ జి - త్తంబుఁ గేశవుఁ
జేర్చువానినిఁ - బాపదూరుని మ్రొక్కుమని కుల - దీపు జన
కుని డాయఁద్రోసెను ॥ నర ॥ ౧౦

సురవైరి నీతనూ - జుని శిక్షించితి నే ని - తరపక్ష
ములఁ బాపితి - నీతి - పరుఁ డయ్యె నితనిచా - తురి విద్యా
బలమును - బరికింపు రక్షోధిప! - యని పలికిన - గురుసుతు
వచనంబును - విని దానవే - శ్వరుఁ డతిమోదంబును - ముప్పిరి
గొన - గురునమస్కారంబును - జేసి నిలువ - వరసుతు నంకం
బును - జేర్చి ముద్దిడి - బరువయ్యె డెందంబును - బహుకా
లంబు - జరిగె నేశాస్త్రంబును - బఠింపిం - చిరి యేయేయం
శంబును - గురుపుంగవులు - విరచింపుపద్యంబును - సార్థక
ముగ - నెఱుపుప్రమోదంబును - మఱి నిన్ను మెచ్చర - సుర
బాలకులు నే - ర్తురు గ్రంథార్థంబులు - పరివారిలోపల -
సుచరిత నీతిమతి వాదం - చున్నవాఁడ భవత్ప్రతాపము -

గలుపు మనఁ దండ్రికిఁ గుమారుఁడు - హరి మదిం దలపోసి యిట్లనె ॥ నరహరి ॥ ౧౧

గురువుల్ నను జదివిం - చిరి నేఁ జదివితి భా - సుర ధర్మార్థమాదిగా - శాస్త్ర - సరసార్థములు బహు - చదివితి నేఁ దండ్రి - సారమెల్లను బ్రోదిగా - వచియింతుఁ గళే - బరము లసత్యంబును - శ్రవణంబు నే - మఱనిదాసత్వంబును - వందనము శ్రీ - హరిపాదార్చనంబును - సేవయు నాత్మ - యెఱుక కీర్తనంబును - దొమ్మిది భక్తి - సరణుల ధ్యానయుతం బును - సర్వాత్మ శ్రీ - ధరు నమ్మి నిరతంబును - సద్వృత్తిచేఁ - జరియింప భద్రంబును - అనుచు దైత్యే - శ్వర! తలఁతు నిత్యంబును - దరుణిం గోరుషండు - కరణి నంధేందూదయం బు - సరణి విస్తారబ - ధిరశంఖారావము - లెఱఁగు నీరిక్త సంసరణము - లగయఁగా హరిభక్తివిరహిత - కరణములు వ్యర్థములు శౌరికిఁ - గాని తను వది దారు వనఁదగు ॥ నర ॥ ౧౨

వనజాక్షు నుడువుర - సన రసనయు జనా - ర్దనునిఁ గన్గొనుకన్నులు - గనులు - దనుజారికిని మ్రొక్కు - తల యౌదల మాధ - వుని నాలించువీనులు - వీనులు - సురా - వనుఁ జెందుచిత్తంబును - చిత్తము హరి వలఁ - గొను నంఘ్రియుగం బును - నంఘ్రులు శ్రీధ - రుని నుతించుదినంబును - దినము గేశ - వుని వర్ణించుపాఠంబును - పాఠము సతము - వనమాలి రూపంబును - దెల్పెడిగురుం - డును గురుఁ డనయంబును - సరోజనా - భునిసన్నిధానంబును - జేరు మనెడు - జనకుండు జనకుండును - వనమాలిపూజసే - యనికరముల్ కరములె -

ఘనమహీరుహశాఖ - ఖచితదర్వులుగాక - వనజనేత్రుని వినుతి సేయని - వదనముల్ వదనంబె ఢమఢమ - నినదయుత మగు ఢక్క గాకని - జనకునకుఁ బ్రహ్లాదుఁ డనియెను ॥ నర ॥ ౧౩

హరికిఁ బ్రదక్షిణ - మమరఁ గావింపని - చరణముల్ నిన ధారుణీ - జన్ధా - వరమూలము లనఁగఁ - బరఁగువాసు దేవ - చరితంబునుం జేకొని - వినలేనిపా - మరుల శ్రుతియు శ్రుతియే _ గవాక్షసు - షిర మగు తత్ప్రతియే - నేత్రములు శ్రీ - ధరునిసిజాకృతియే - కనలేనితి - మిర నేత్రసంస్థితియే - శిఖిపింఛాక్షు - లరయ దుస్సంస్మృతియే _ ము_క్తి యటంచుఁ జరియించుజనతతి యే - లాగునఁ బొందు - మఱి ముందు సద్గతి యే _ రికైన శ్రీ _ హరిచింతనోన్నతియే - తరియించుట కును శ్రీ - కరముఖ్యకారణ - మిరవొందుజీవనో _ క్షర మాసంభోగము - తరుణీసుతవిత్తాశ్వరథకుం _ జరపశుక్షేత్రాది సంప - ద్భరితరాజ్యశ్రీ దలఁప న - శ్వరము నమ్మకు స్వప్న సమ మనె ॥ నరహరి ॥ ౧౪

భవసంకటాంబుధ - రవితతి విచ్చునె - సువిధుసేవా సమీరము - లేక - వివిధదుష్కృతమహా _ ర్ణవము లింకునె హరి - స్తవవహ్నిప్రభాపూరము - లేక విపద్ధ్వాం - తవిదూర మగునె జనా - ర్దనుచింతన - రవిరుచి లేక యనా - రతనిష్క- ళం - క విమలమోక్షధనా - గత మౌనె కే - శవుభ_క్తి సిద్ధాంజనా _ ధికత లేక దా _ నవనాథ ! కంజాసనా - దుల కైనను - శివకర మని పల్క నా - పల్కులు ముల్క - లవి ధమునఁ జెవినాట నా _ ద్భుచును గార్చి - చ్చువలెఁ మం

డుచు వేగ నా - దివిజారి గురుతనూ - భవుని ధిక్కరించి - యవమతచరితంబు - లు వినిపించితి విటు - సవరణా నీతిశా స్త్రార్థ - ప్రవిదుఁ జేసెదనంచుఁ గొని చని - తవిలి యర్భకుఁ గుటిలతఁ గఱపి - తివి యహో బ్రాహ్మణాకృతి వనె ॥ నర ॥

అన విని శుక్రనం - దనుఁ డిట్టు లనియె నో - దనుజ నాయక ! యేమను - విద్వి - షునికథ నెప్పను - విను నీపా దములాన - తనర మిత్రుల మయ్యును - శత్రులమూ నీ - తన యుని నిటు సేయను - నావుడు గురు - తనయుని క్షమియిం చెను - నసు రేంద్రుఁ డం - తను దనూజునితో డను - అనియె నొజ్జ - లును జెప్పలే దైనను - శౌర్యకనుము చె - ప్పినవారి నామ్రోలను - నావిని తండ్రి - కినిఁ బ్రహ్లాదుఁడు వల్కెను - మోహాంధంబు - నను జిక్క కడ లేకను - దుర్విషయాస - క్తిని గృహవ్రతు లయ్యును - జచ్చుచుఁ బుట్టు - చును జెడు జడులకును - వనమాలిచింతనం - బును గల్గ నేర్చునె - కనఁగ నన్యులు బోధిం - చిననైన స్వేచ్ఛనై - నను వనంబుల కొప్పఁ జనినను - మొనసి యంధుని నంధుఁ డూతం - గొని యభీష్టా ర్థంబుఁ గాంచని - యనువునం దలపోయ నజ్ఞులు ॥ నర ॥ ౧౬

పలుకర్మబద్ధులై - తలఁపరు శౌరినిఁ - దలఁతు రెండుఁ బూతమై - నను - జ్వాల మైనశ్రీపాద - జలజరజోభిషిక్తులు దుష్కర్మవిచ్ఛిత్రమై - వేదశాస్త్ర - ములచే నెఱుఁగఁబడెను - దనుజేంద్ర వె - క్కులు పల్క నేల్లెడను - నేల యీగా - ధలు బుద్ధి హారి కిడను - భక్తినావ - వలనఁగాక చెడను - దుర్బుద్ధి వ - ర్తిల దాటగాఁ గడను - సతీసుతమీ - నలసిత మేర్పడను-

గామక్రోధ - ములతరగలనడను - సంసరణోగ్ర - జలధి గడు
వఁబడను - నిల నసాధ్యమని - పలికినసుతునకు - నలిగి తొడల
మీఁద , నిలువనీయక త్రోసి - యులికి వేడిమిచూపులను
మం - ట లెగయఁగ మంత్రులను గని యీ - ఖలుఁడు పినతండ్రిని
వధించిన - చలము నుంచక విష్ణుఁ దలఁకొను ॥ నర ॥ ౧౭

అనుజునిఁ గిటిరూపై చం - పినపాపరాధి శ్రీ - శునిఁ దద్ద
గొనియాడుచు - మాధ - వున కతిభక్తుఁడై - చును వెఱ
పింత లే - క నెదిర్చి మాటాడుచు - నున్నాఁ డిట్టి - జనక
ద్రోహిని మీరు నా - సూనుం డంచు - ననుమానింపక వేగ
నా - యానతిఁ బూని - కొనిపోయి వధియించి నా - మోను ం
గనుఁడు - తనయుఁడై వర్తించి నా - పక్షము నింది౦ - చెను
దండ్రినై యున్న నా - కహితు శౌరి - వినుతించు వలదన్న
నా - తనువున వ్యాధి - తనయాకృతిని బుట్టినాఁ - డియ్యెడ
వీనిఁ - దునిమి రండు పొండు నా - విని పెక్కుండ్రు - దనుజ
వీరు లంత నా - మున శూలహస్తు ల - య్యును వక్రము
ల్దెఱచు - కొని బొబ్బలిడుచు ను - క్కున హుంకరించుచు -
మొనసి శస్త్రాస్త్రముల శూలము - లను దదంగము గ్రుచ్చి
నాటిం - చినను గ్రూరతఁ దండ్రిఁ గని వల - దనఁడు నెనరించు
కయు లేకను ॥ నరహరి ॥ ౧౮

పదుగురు రక్కసుల్ - గదిసి శూలములను - జదుప
నర్భకునంగము - ర క్త - మొదవ దొక్కించుక - యదరదు
నులియదు - చెదర దస్థిసంఘము - కందదు మృదు - వదన
వారిజంబును - దగ్గదు దృగా - స్పదరుచివిభవంబును - నెదలోఁ

బొడ్డ - మదు దీనభావంబును - దానవులు ద - న్నదలించి యుగ్రంబును - మించిరయుఁ గ్రుమ్మఁ - ద్రిదశారిసుతుఁ డం తను - మాటిమాటి - కి దనుజౌఘభంజను - వినీలనీ - రద గాత్రు మునిరంజను - సద్భక్తవ - రదుఁ బిల్చు ననిశంబును - మది నెంచుఁగాని యా - పద నూని కన్నుల - నుదకంబు నిం పం - డుదితభీరుఁడు గాఁడు - కదలిపాఱఁడు చేతు లొడ్డఁడు- గదిసి బంధుజనాళి వేఁడఁడు - సదయతను ననుఁ గావ రేయని- సఖులఁ జీరఁడు తండ్రి దూరఁడు ॥ నరహరి ॥ ౧౯

అరయ సదాత్మక - మై యిట్టిదట్టిదం - చెఱిఁగింపఁగా రాకను - భవ్య - తరపరబ్రహ్మంబు - దానై మనంబు శ్రీ - హరియం దైక్యత జొకను - నొనర్చి స - త్పరమానందముఁ జెందెను - దన్మయుఁడైన - మఱి ప్రహ్లాదుని నెందును - నిశా చరే - శ్వరుఁడు భటులచేతను - గావించుదు - ర్భరహింసా కర్మంబును - దుర్జనప్రయు - క్తరతిసత్కారంబును - గలివిఫ లంబై - యదుగుట గని యంతను - శూలముల గ - ర్భురులు గాయము గ్రుక్కను - జక్కడ నె - త్తురు గ్రమ్మ దింటై నను - నొవ్వఁడు నాతో - హరిపక్షు మిఁకఁ బూనను - బూనితి ననఁ - డరుదయ్యె ననుశంకను - గరుణింతలేక ర - క్కసఱేఁడు కొమరునిఁ - గరియూథములచేఁ ద్రొక్కఁగఁ జేయు నొకసారి - యురగములచేఁ గఱవఁజేయును - గెరలి మంటలఁద్రోయఁ బన్నును - గరళ మొక్కెడ నిడఁగ నిచ్చును - శరధిలోఁ బడ వైచి ముంచును ॥ నర ॥ ౨౦

ఒకవేళ దైత్యరా - జకుమారు వివిధబా - ధకము
లొందఁ జేయును - రక్షో - నికరంబుచే శైల - ప్రకరంబుపై
పాను - నికరంబులం ద్రోయును - నెండల నుంచి - యొకవేళ
నలయించును - వర్షమునం దిం - చుక కారుణ్యము లేకను -
నిలువంగఁబె - ట్టి కరాళం బగుమాయను - బెగడించు శా -
తకుతారములచేతను - నొప్పించు మా - నక యుర్విఁ బాతిం
చును - నవరంధ్రంబు - లొకట బంధనసేయును - బెనువాత
ము - నకు నభిముఖుఁ గావించును - అకట! నీరన్నమి - డక
నిగ్రహించును - నొకవేళఁ గళలచే - నొగిలింపఁ బంచును -
అకలుషుం డగునందనుని సై - పక మహాక్రోధంబుచేతను - వికల
మానసుఁడై యొనర్చెను - వివిధమారణకర్మముల నని ॥ నర ॥

సురవైరి కోపవి - స్ఫురణచే నర్భకుఁ - బరిమార్పఁగా
లేకను - జింతా - పరుఁడై చిత్తములోనఁ - బరిపరివిధముల -
శరధి ముంచితి వీఁకను - వీనిఁ గొండ - చఱులలోఁ ద్రోయిం
చితి - శస్త్రాస్త్రని - కరములఁ బొడిపించితిఁ - దనుపుఁ మద -
కరులచేఁ ద్రొక్కించితిఁ - గార్చిచ్చునం - దురవడిఁ ద్రోయిం
చితిఁ - గ్రోధమున ని - ష్ఠురత ధిక్కరించితి - మిక్కిలిబాధ -
పఱచి ఘాటి శపించితి - నిష్కరుణఁ గఃసరి తద్ద నలయించితి-
నిజమాయభీ - కరశక్తి వెలిపించితి - మఱి యేమిచిత్రమో -
మడియకుండుటకు ని - ద్ధర జీవనౌషధ - మెఱుఁగఁ డెవ్వరు
దిక్కు - తరలఁ డేయిడుములకుఁ దేజము - దఱుగ కెప్పటి
కంటె మిక్కిలి - మెఱయుచును దిగులొందఁ డే నె - త్తెఱఁ
గునను వధియింతు ననుకొనె ॥ నరహరి ॥ ౨౨

దనుజనాయకుఁడు డెం - దమున వీనిమహాత్వ - ము
దివ్య మది యెట్టిదో - రౌద్ర - మున నే నొనర్పబాము.
లను నొవ్వఁ డిటు వీని - మనస దెంతగట్టిదో - వీఁడట్లుగా.
వునఁ దపస్సంపన్నుఁడు - వీఁ డిందు నే - యనువున భయ
మొందఁడు - వీనితో నా - కును వినాశమయ్యెడు - నని చిం
తించి - పెనుభీతిచే ఖిన్నుఁడు - నై క్రిందుగ - న్గొనుచుఁ
దత్రపన్నుఁడు - గాకయున్నఁ - గని రాజుతో నప్పుడు - చం
డామార్క - లనె నిట్లు మీరెన్నఁడు - నెవ్వరిచే వం - చన
నొందలే దిప్పుడు - మనమున దిగులేల - యనిమిషేంద్రాదుల.
నని గెల్చి సర్వభు - వనము లేలునీకుఁ - గనుఁగొనఁ వీఁ డెంత
వీనివ - చనములకుఁ గలతపడ నేటికి - దనుజనాయక మరల
బాలకుఁ - బనుపు సుమతి నొనర్తు మనఁగను ॥ నరహరి ॥ ౨౩

దనుజేంద్రుఁడు గురు - తనయునితోఁ బ్రహ్లా - దునకు
గృహస్థులగు - నృపా - గ్రణులకుఁ జెప్పఁద - గినత్రివర్గముఁ
జెప్పు - మను డటులం జెలఁగు - ప్రహ్లాదము - ఖ్యసకుఁ
దెలిపినంతను - రాగద్వేష - గుణవికారముచేతను - విషయా
సక్తి - నెనసి యట్లుగాకను - ధర్మాదులు - తన కగ్రాహ్య
మటంచును - లౌకార్థరం - జనభేదమే గాకను - ఆత్మభేద.
మును లే దనర్థమును - సర్వార్థక - ల్పనము సేయుటెల్లను.
దిగ్భ్రమ మిది - యని నిశ్చయించియును - దన కాచార్యులు
బోధిం - చినశాస్త్రమును దథ్య - మనక నిజగురువుల్ గృ - హ
స్థకర్మాచరణ - మున కరుగునెడ నాటలకు ర - మ్మనుచు
దానవసుతులు పిలువఁగ - దనుజరాజసుతుండు వారలఁ - గని
విశేషమనీష యొప్పఁగ ॥ నరహరి ॥ ౨౪

చదివింప రోజ్జలు - చదువు మంచిది మీకుఁ - జదువు
సెప్పెద వినుఁడు - తోర - మొదవునంచు నృపత - నూదయుఁ
డసురత - నూదయాళి కపుడు - బాలకులార - యుదయలయ
ములకును - నీతనువులు - తుదముట్టఁ జాలకను - వెతలొందు
న - భ్యుదయ మేమిలేకను - గురుఁడు మోహా - స్పదుఁడై
యర్థచయుంబును - నెందు సుఖ - ప్రదమంచుఁ గల్పనను -
జెప్పును గ్రాహ్య - మిది గాదు శ్రుతులందును - మే లెఱుఁ
గింతు - విదితంబుగా మీకును - సకలభూతస - ముదయభవ
ములందును - సదయధర్మార్థా - చరణకారణ మైన - పొదలు
మానవభవం - బును దుర్లభంబందు - నధికపురుషత్వంబు
దుర్గమ - మదియు శతవర్షపరిమిత మగుఁ - దదనుజీవితకాల
మును నియ - తంబునై యుండు నం దర్ధము ॥ నరహరి॥ ౨౫

అరయుంగఁ దిమిరబం - ధుర మైననిశాకృ - తి రహి
సుషుప్త్యాదిగాఁ - జరా - చరముల రిత్తయై - యురుగుఁ బం
చాశద్వ - త్సరములందుఁ బాదుగాఁ - గైశోరసుం - దరకౌ
మారప్రాయమును - గడవఁగా వ - త్సరముల్ వింశతియును-
గడమసంవ - త్సరముల్ త్రింశతియందును - నింద్రియత - త్పర
దురవగాహంబును - నైనకామా - ద్యరిషడ్వర్గముచేతను -
జిక్కి వానిఁ - బరిహరింపఁగలేకను - వ్యాత్పిద్యదు - స్తర
మైనతృష్ణకును - లోనై భటత - స్కరవాణిజ్యంబులను -
అరయఁ బ్రాణహాని - యైనసమర్థింపు - చు రహస్యబోధచా-
తురివిశేషంబులఁ - దరుణీసుతహితవిత్తగోతతి - ధరణీముఖసం
సారసింధూ - త్తరణ మొందక తంతుచయమునఁ - బురుగు
పోలికఁ జిక్కువడియెను ॥ నరహరి ॥ ౨౬

వినుఁడు గృహస్థుఁ డ - ల్లన నిజకృతకర్మ - ఘనపాశ
బద్ధుఁడయి - ప్రేమ - మున శిశ్నోదరా - ద్యనృతసుఖమ్ములం -
దున మదోన్మత్తుఁడయి - స్వకుటుంబపో - షణపారవశ్యం
బున - వైరాగ్యవర్ధనభక్తిమార్గంబునఁ - జనలేక యెం -
దును స్వపరభేదంబున - నజ్ఞధ్వాంత - మున వసించుఁ గావునఁ -
గౌమారవే - ళను ధీవిశేషంబున - భాగవతధ - ర్మనియత
చిత్తంబున - సలుపందగు - నవభీష్టముగఁ బొందిన - దుఃఖ
ములరీ - తిని సుఖంబులు గాంచిన - నైనయుఁ గాలానుస -
రణమునఁ; గావునఁ - జనదు వృథాయాస - మున నాయుర్వ్య
యమునే - య నపవర్గముఁ జెందఁగ జనా - ర్దనభజనమున
నంబుజోదరుఁ - డును సమస్తాత్మేశ్వరుఁడు పా - వనుఁడు
నిర్వాణప్రదుం డగు ॥ నరహరి ॥ ౨౭

కనరే గృహస్థులై - మనవారు వెఱ్ఱులై - మనిన విఫల
తనము - సంస - రణపాశబద్ధులై - మును గలయోనులం -
దునఁ జొచ్చి యనుదినము - గర్భావస్థ - లను బురుషుఁడు
ధరను - దేహియై పు - ట్టును దన్నెఱుంగకను - గర్మతంత్ర -
మునఁ గడముట్టకను - జన్మశత - మునకై మఱి దీనను -
శ్రేయస్కీర్తు - లును లేవు; జగమునను - బుట్టిపుట్టి - యును
గిట్టిగిట్టియును - బొరలనేల - మనము పుట్టుచావును - లేని
మార్గ - మును నన్వేషింపఁగను - ఘన మైనబుద్ధియా -
గర్వాంధుఁడై దేహ - మును బెంచి బాలాలో - కనబద్ధమా
నస - మునను వేలానిస్సరణలవ - మును గనక సత్పండితుఁడు
భా - మినులకుం గ్రీడామృగం బగు - వినరె హీనస్థితి విచి
త్రము ॥ నరహరి ॥ ౨౮

దనుజులు విషయవ - ర్తనులు పొత్తు వలదు - మనము మోక్షాస క్తిని - జనా - ర్దను సేవింతము సుధీ - జనులఁ గూడి బాల్య - మున సుజ్ఞానర క్తిని - నింద్రియవశు - లు నగుదాన ఫలమును - వైకుంఠభ - జన మశక్యం బగును - గావలయు మా - కని యంటి రేనియును - వినుండు భూ - తనిచయేశ్వ రుండును - నిర్వాణచి - ద్ఘనపరబ్రహ్మంబును - కడపల నొ - ప్పినచరాచరములును - స్థూలసూక్ష్మ - తను జీవాళియం దును - గుజలాగ్ని వా - యునభోభూతములందును - మొనసి భూతవికార - ము లగుఘటపటాదు - లను గుణసామ్యమ - యినప్రధానంబునం - దున గుణవ్యతిరిక్తమహదా - దిని రజ స్సత్వతమోగుణంబు - లను జగద్బాహ్యాంతరంగము - లను బరబ్రహ్మము వెలుంగును ॥ నర ॥ ౨౬

అమలానందరూ - ప మనాద్యంత మచిం - త్యము పర మేశ్వరుఁడు - త్రైగు - ణ్యమయమాయాంతర్హి - తైశ్వర్యుఁడై వ్యా - ప్తమును వ్యాపకరూపుఁడు - నై ద్రష్టదృ - శ్యమును భో క్తభోగ్యుఁడు - నై యనిర్దే - శ్యమున వికల్పితుఁడు - నగుఁ దత్కార - ణమున నహముఁ విదుఁడు - సమస్తభూ - తములందు మీ రిప్డుడు - కృపానుస్వాం - తము సత్యముగ నిల్పుఁడు - నిల్పిన శ్రీ - రమణుండు ముదమందెడు - హరి పురుషో - త్తముఁ డనంతుఁ డాఢ్యుఁడు - మోదింప ని - త్యము మీకు మేలయ్యెడుఁ - గమలనేత్రునిపాద - కమలచింతనా మృ - తముఁ గ్రోలి పారవ - శ్యము నొందితిమయేనిఁ - దమకు దైవవశమున నిరభీ - ష్టములుగా సిద్ధించు నిర్వా - ణమును నేల త్రివర్గమును ద్రిగు - ణములు మాయాకల్పితం బనె ॥నర॥

వినుఁడు నిస్త్రైగుణ్య - మునఁ బరమాత్మ రైయై - తనదు
హరికి సర్వము - సమ - ర్పణము సేయుట మేలు - పరతత్త్వజ్ఞో
దయ - మున స్వపరభావము - లేక పురుషుం - డును యోగా
భ్యాసంబున - నాత్మవికల్ప - మున భేదభావంబున - స్వప్నము
నందుఁ - గనువిశేషముచాడ్పున - విశ్వము మిథ్య - యని
నమ్మఁడు మనంబున - నని ప్రహ్లాదుఁ - డనె వెండి యీతీరున.
నరుండు దా - నును మిత్రభావంబున - మెలఁగుచు నార - దు
నకు హరి యొప్పిదమున - మును వ్యాఖ్యాన - మును జేసె
నామోదంబున - వనజాక్షుభక్తిచ - రణరజోనిర్మల - తనులు
మహాకిం - చను లేకాంతులు సాధు - జనులెపో యీజ్ఞాన
మును భా - వనము సేయఁగ నేర్తు రెద ము - న్ననఘుఁ డగు
నారదునియనుకం - పను గ్రహించిన దీవిజ్ఞానము ॥ నరహరి ॥

ఘన మైనపరమభా - గవతధర్మము వింటి - ననుడు
రాక్షసబాలురు - వెఱ - పున దైత్యరాజనం - దనునితో
శుక్రసూ - నునికడఁ బలుమాఱులు - ననేకశా - స్త్రనిచయ
మును విన్నను - లేఁడు గురుం - డును వేఱొకఁ డెందును -
రాజశాల - కును శ్రీకంఠునకై నను - జొరఁగా వెలికిఁ - జన
రాదు మఱి నీకును - నెవ్వఁడు సెప్పె - ననఘా! చెప్పుము
మాకును - సేవింతుము - నిను భక్తితో మేమును - నీకింత
చ - క్కనిహృద్విశాసంబును - నేక్రియఁ గల్గె - వినిపింపుమని
వేడ్కను - అనవుడు సూరిరం - జనుఁ డైనప్రహ్లాద - ఘనుఁడు
నారదునివ - చనములు దలఁచి యిటు - లనియె మజ్జనకుండు
సని తెం - పునఁ దపంబును మందరాగం - బున నొనర్పెడితఱిని
సురలుగ - దనుజులతో వని కేగుదేరఁగ ॥ నరహరి ॥ ౩౨

సురగణాటోపముఁ జూచి పోరలేక _ వెఱపున స్వస్థే
మలు _ డించి - తరుణీపుత్రవి - త్తంబుల దిగనాడి - యరిగిరి
దితిసుతులు - పైకొనుచు ని - ర్జరులు భండారంబును -
జూఱంగొని - యరుదేర శక్రుండును - జొచ్చి యంతః - పుర
మున మన్మాతను - బిట్టదలించి - చెఱఁగొని పేఁబోవను -
బులుఁగురీతి - మొఱఁబెట్టి వాపోవను - నారదుం డ - త్తఱిఁ
గని యిట్లాడెను - నాకాధీశ - సురలం దధికముఁగను _ శోభిల్లి
యీ - కరణి నసురకాంతను - బరఁగ నీగర్భిణిఁ బట్టనేల నా-
తురత విడువుమన _ సురమునితో నయ్యా - మరవరుం డిట్ల
నియె దానవ _ వరుని వీర్యముచేత నీమెయు _ దరమున జనిం
చినశిశువుఁ బవి - ధారఁ ద్రుంపక విడుతునే యన ॥ నర ॥ 33

అనిన నిర్జరేంద్రునితో మునీంద్రుఁ డి _ ట్లనియె లీలా
వతికి - గర్భ - జనితుఁడు లోకప్ర - శస్తభాగవతుఁ - డనిమి
షమునితతికి - మిత్రుఁ డవైరి - జనసాంతరంబునను - బొడమిన
జనా - ర్దనభక్తియుక్తుండును - రణాటోప - మున సాధనంబు
లను - జావఁడు భవ - ద్ఘనదోర్బలమునకును - నిర్బాధ్యుఁ
డౌ - నని విని మన్నించెను - దాను రమాధీ _ శునకు సద్భ
క్తుండును - గావున నార _ దునకు వలఁగొని యేగెను - బర
మానంద _ మున దివంబునకును - మునిపతి పుత్రీభా - వనఁజేసి
యూరడిం - చి నిజాశ్రమాంతర _ మున నుంచి నీభర్త _ యును
దపోమహిమచే రాఁగలఁ-డనియు నీ వందాక నిట నీ - మనసు
నచ్చినరీతి నుండుమ - యనుచుఁ గూరిమి నిల్పె నప్పుడు ॥నర॥

మునివరునకుఁ బరిచ - ర్యనొనర్చుచుండె నా - ధుని
రాకఁ గోరుచును - నున్నం - తను గర్భస్థుఁడ నగు - ననుఁ
గూర్చి మాతల్లి - కిని దయమీఱుచును _ ధర్మతత్వ - మును
బ్రహ్మజ్ఞానంబును - నుపదేశింప - విని బహుకాలంబును .
గడచుకత _ మున భామినియాటను - గురిలేక త _ ప్పను
మఱచి యదేనును - నారదమహా - మునిదయ నాయందును .
గల్గునిమిత్త - మున నదిమొదలుగను - హృదయమునందు .
మునిమత మంతయును - మఱవలేనై _ తిని నొకనాఁడైనను -
వినుఁడు నాపల్కులు - విశ్వసించితిరేని - వనితలకైన డిం .
భకులకైన నెఱుం - గనగు మేలు భవాబ్ధితారక - మును
దపస్విమతం బనుచు సుర - మునిసదుక్తివిధంబు బాలుర - కును
దయఁ బ్రహ్లాదుఁ డిట్లనె ॥ నరహరి ॥ 3౫

అరయ నీశ్వరమూర్తి - యైనకాలము చేతఁ - దరుపు
గల్గుఫలము - నకుఁ బరజన్మసంస్థాన - వర్ధనాపక్షీణ - పరిపాక
నిర్మూలము - ప్రాపించిన - తెఱఁగునఁ దనువులకును - గాని
షడూర్మ్మ - లిరవొందు నాత్మకును _ లేవు గానఁ _ బరమాత్మ
నిత్యుండును - క్షేత్రజ్ఞుండు - పరిశుద్ధుఁ డమృతుండును -
గగనాదుల కా _ కరుఁడు నిష్క్రియుండును - నాద్యుఁడు
చరా - చరసృష్టిహేతువును - వ్యాపకుండు - పరిపూర్ణతే
జుండును - నిస్సంగుఁడు _ పరమానందమయుండును -బరతత్వ
మొక్కటి - ప్రజ్ఞాయుతము లగు - సరసత నాత్మల - గుణ
ములు పంద్రెండు _ నెఱుఁగుచును దేహాదులందునఁ - బరఁగి
మోహాస్పదము లగువి - స్ఫురదహంకారమమకారము -
లురుమతిం దెగటార్పవలె నని ॥ నరహరి ॥ 3౬

ఎలమిఁ బసిండిగ - నులు గలతావున - లలి హేమమే శంబుల - సము - జ్జ్వలవహ్ని యోగము - వలనఁ బుటంబిడి- యిలఁ గరంగి శిలామల - హేమకారుఁ - డలరుహిరణ్యం బును - గైకొనునటు - వలె నాత్మకృత్యంబును - గారణ కార్య - ముల నెఱింగెడినేర్పును - గలుగువాఁ డొడల నాత్మఁ గాంచఁగను - సదుపాయము - వలనఁ జిద్బ్రహ్మంబును- బడయఁగఁజాలుఁ - దొలిమూలప్రకృతియును - మహదహం - బులు పంచతన్మాత్ర లను - నష్టప్రకృ - తులు గుణత్రయంబును- మలయుసత్వరజ_స్త - మములు ప్రకృతివని - యలకర్మేంద్రి యంబు - లైనవాక్కరపాద - ములు గుదోపస్థలును ద్వక్ దృ - క్కులును గర్ణరసనఘ్రాణం - బు లనుజ్ఞానేంద్రి యము లైదును - భూతములతో మనసు గూడఁగ ॥ నర ॥ ३२

అమరు షోడశవికా - రము లని కపిలాది - యమిపుంగ వులచేతను - నిర్ణి - తము లయ్యె నటు సాక్షి - త్వమున నిరు పదేహ - నములాత్మనిత్యంబును - గూడియుండుఁ - గ్రమ మునఁ బెక్కింటను - గాఁచువ శరీ - రము లయ్యె నందునను- స్థావరజం - గమరూపము లయ్యెను - మూలప్రకృ - తిముఖ వర్గములకును - వేత్తై వజ్రో - ఘముల సొచ్చి యందును - సూత్రంబుచం - దమున నిన్నిటిలోనను - వసియించి భా - సము నైనయాత్మకును - జన్మస్థితినా - శము లన్ని గల వం చును - దమి గేసుమిథ్యాత - త్వరులు గాక వివే - కమనం బుతో శరీ - రమున నాత్మ నరయఁ - గొమరు నాత్మకు నవ స్థలు గ - ల్గునటుదోచునవస్థలును లే - వు మఱి జాగ్రత్స్వప్న సు_ప్తుల - సమత నెఱిఁగివదే చిదాత్మని ॥ నరహరి ॥ ३३

భ్రమసంసృతికర్మ - బద్ధ మజ్ఞకార - ణము గుణబుద్ధి
కిని - సాధ - కము కలవంటిది - గాని నిక్కముగా ద - సమ
విషయాళికిని - మనస్సంభ - వము లిట్టిస్వప్నమును - జాగర
ణము - సమము నిర్గుణంబును - నైనసద్ద్ర - వ్యమ్రము గుణా
శ్రయమునను - నుత్పత్తినా - శములు గల్గినట్లును - దోచును
విచా - రమున లేనివయ్యును - త్రైగుణ్యాత్మ - కము లగు
కర్మములకును - జనకాజ్ఞాన - తిమిరసమూహమును - ఘన
మైనజ్ఞా - న మనుభానునిచేతను - సమయించి కర్మనా - శము
చేసి భగవత్పా - దములు గనుట మేలు - దైత్యనందనులార.
ప్రమదమునను సమస్తలాభా - ర్పణ మొనర్చెడి సాధుజనసం.
గమును గురుసేవయుఁ బరేశప్ర - తిమసమారాధనము శుభ
దము ॥ నరహరి ॥ ౩౯

హరితత్పరత్వము - నచ్యుతునందలి - సరసప్రేమ
యును - దామో - దరుగుణకర్మక - థానామకీర్తన - హరి
పాదసేవయును - కమలాధీ - శ్వరునిపూజనంబును - మొద
లైనయీ - పరమవిజ్ఞానంబును - వైరాగ్యో - పరతిసాధనం
బును - నైనభక్త - పరధర్మంబులందును - రతియును జరా.
చరభూతంబులందును - భగవంతుఁ డీ - శ్వరుఁ డాత్మ గలఁ
డంచును - సన్మానము - నెఱపుచుఁ గామంబును - క్రోధమో
హము - త్సరలోభమదములను - బోరిఁగొల్చి యింద్రియం.
బులను బంధించి శ్రీ - ధరుభక్తి సేయ మా - ధవుగతి సిద్ధించుఁ.
బరఁగ హరిలీలావతార - ప్రకటశౌర్యకథాగుణంబుల - గరిమ
విని పులకించి కేశవ - వరద నారాయణ యటంచును ॥ నర॥

వనజాక్షునిమరులు - కొని యాడుఁ బాడును - గొని
యాడు మదిలోనను - హరి - కనిపించినా డంచు - వినుతించు
వాసుదే - వుని భక్తిసేయంగను - భవబంధమో - చనుఁడై
యజ్ఞానంబును - దూలించి వి - ష్ణునిసాయుజ్యము నొందును -
గావున రాగా - దినియుక్తచిత్తుండును - నైనశరీరి - యును
సంసృతిప్రహాదంబును - నతిక్రమిం - చును హరిధ్యానమునను -
బరబ్రహ్మ - మునఁ గైవల్యసుఖంబును - బొందింపనో - ననుచు
సాధుజనులును - దెలియుదురు - వనమాలిభజనంబును - మనకు
దుస్తరము గా - దని సర్వప్రాణహృ - ద్వనజాంతర్యామి
య - య్యు నభముక్రియ నుండు - నెనయు విషయసుఖంబుచే
న - య్యెడిది లే దస్థిరప్రాణుల - యినమనుష్యుల కెందు
వ్యర్థము - లనదగుఁ మమకారమదములు ॥ నరహరి ॥ ౪౧

అతిచంచలం బైన - సుతదారహితబంధు - ప్రతతి రాజ్య
కోశము - మంత్రి - స్తుతభృత్యమణిమంది - రతురంగమాతంగ-
కుతలాదికైశ్వర్యము - నిష్ఫల మగుఁ - క్రతుముఖపుణ్యం
బును - జేసినఁ గల్గు - తతస్వర్గభోగంబును - బుణ్యక్షీణ - గతికిఁ
గారణంబును - గాన నరుండు - క్షితి నే విద్వాంసుఁడను -
ననునభిమాన - గతిని సుకర్మంబుచు - నొనర్చి సం - చితము
లమోఘంబును - నానొప్పున - హితఫలము లొందును -
గర్మము నిరీ - ప్సితుఁడై సేయఁదగును - మతిఁగోరి చేసిన -
మతిదుఃఖములు గల్గు - ధృతి పురుషుండు సం - గతభోగార్థ
మపే - క్షితుఁడగుఁ దేహం బనిత్యము - మృతవపుః శున
కాదులుం దిను - నతులకర్మలఁ జేయు దేహియు - హితముగా
గురుకర్మబద్ధత ॥ నర ॥ ౪౨

లలితకర్మానుకూ - లము లైనశరీర - ములు దాల్చి
వెండియును - భ్రాంతి - వలన జీవుఁడు కర్మ - కలితకళేబర.
ములను విస్తరించును - అజ్ఞానస - మ్మిళితతంత్రములును.
ధర్మార్థకామ - ములు త్రివర్గంబులును - బ్రజ్ఞానైక - సుల
భంబు మోక్షంబును - ముక్తిప్రదుఁ - డలరు ముకుందుం
డును - సర్వభూత - ములకు నాత్మేశుండును - బ్రియుండు
దన - వలన నైనవిశ్వంబును - మహాభూత - ములతో జీవసం
జ్ఞను - వెలయునిష్కా - ములయి హృద్గతుండును - జలజా
క్షునిభక్తి - సంశ్రయింపఁగా - వలయుదైత్యదే - వభుజంగ
గంధర్వ - కులధరాజనులందు శ్రీవై - కుంఠపాదసరోజయుగ
మును - సలక్షుభక్తి భజింప ధన్యత - వెలయు నెవ్వండైన
నని మఱి ॥ నరహరి ॥ ౪౩

దనుజడింభకులతోఁ - డను బ్రహ్లాదుఁడు వెండి - యను
భగవంతుఁడును - దెల్పఁ - గను వ్రతయజ్ఞము - లను శౌచ
శీలము - లను దానతపములను - జిక్కఁడు సద్భ - క్తిని
జిక్కునక్రియను - వాసుదేవుఁ - డని సిద్ధముగఁ జెప్పెను.
భూసురత్వ - మును నిర్జరత్వమును - జాలవు జనా - ర్దను
కృప నొందఁగను - నధికశాంత - మును హరి మెప్పించును.
సద్భక్తి చా - లినభంగి గుణరంజను - లార! యక్ష - దనుజ
భుజఁగులైనను - మృగాభీరాం - గనశూద్రశబరులును - జెనటి
జీవులైన - శ్రీహరిసర్వభు - వనరూపుఁ డంచుఁ బా - వన
మోక్ష మొందుదు - రని మనకు లోఁబడెడుమార్గము - లను
వచింపుదు రమృతపదసర - ణిని వచింపరు గురువు లజ్ఞత -
మునిఁగి మన మిటు గుంద నేటికి ॥ నరహరి ॥ ౪౪

మనకుఁ బఠింపిం - చినపుస్తకములు వీ - డ్కొని రెండు తత్వముసు - జెప్పె - దను బొందు వినరో - ల్లనివారు కర్మ బంధనముపాలై చెడను - గావున నాడ - మనము శ్రీజనార్దను - హరిశుభయశం - బును బఠింతము వేడ్కను - వీడుద మిఁక - దనుజులసంగంబును - గూడుదము వి - ష్ణుసిభక్తకోటులను - వి త్తము సంస - రణమహాపటలంబును - వ్రచ్చుదము వృ - జిన కామవర్గంబును - నిత్తము చిత్త - మును ముకుందునకును - బొందుదము చి - ద్ఘననిర్వాణసుఖంబును - మనకు మేలగు నిటు - లని రహస్యంబున - దనుజేంద్రతనయుఁ డా - దనుజ బాలురతోను - నెనసి యన్యైర్యొడల మోక్షస - రణిని. బోధించినను వారలు - మొనసి గురుశిక్షితము లగుచదువు - లను వదలి హరిభక్తులై రిటు ॥ వరహరి ॥ ౪౫౯

హరిపాదభక్తిత - త్పరులై యుండుట మది - నెఱిఁగి మగుడి వచ్చియు - రక్షో - గురునందనుఁడు వేగ - సురవైరి కనెనిట్ల - సురసూనులనుగూర్చియు - లోలోన ద - బ్బర లంచు నాశిక్షను - మఱపించి యం - దఱ మోక్షయత్తులను - జేసె మనకు - దొరకొనె మోసంబును - నీదక్షత _ మెఱయఁ జక్కన గాఁగను - నిశాచరే - శ్వర ! కావింపవలెను - నెప్పుడు రమా _ వరుగాథలు మాకును _ జెప్పుమని యెం _ ల్లర యివి చదువంగను _ నుల్లంబు లుం - తురు దైత్యసూనులును - నేక్షణమైన - సరసిజాక్షునికథను - మఱువఁడు లేశమున్ _ గరిమ నేఁజెప్పిన _ చరితలు నొడువఁడు - చెనటిపల్కు లని - ధర పవిత్రం బైనరజనీ - చరకులంబునఁ బుట్టెఁగద వె - క్కుడు జనించినరీతి దనుజే - శ్వర! మఱెక్కడిసుతునిఁ గంటివి ॥౪౬౦॥

అనవుడు శుక్రనం _ దనునిచేఁ బుత్రువ - లనివిరోధో క్తులును _ వీను _ ల నసిధారలై పో _ కిన మండి దెబ్బఁ ది. సినఫణీంద్రునివలెను - బవనప్రేరి - తనితాంతాగ్ని క్రియను. రోషోగ్రభీ _ షణయుతచిత్తుండును - నిజసూనుమా - రణసం రంభకుండును - బటురక్తలో _ చనుఁడై సుతు రావించెను. నిర్దయుఁడై ను - న్ననసేయు టే మానెను - అశనితుల్య - ఘన కఠినోక్తులను - వదల్చుచుఁ _ దనయు సద్గుణసదను - సజ్ఞాన కా - ననవహ్నినుతసుజను - వనమాలి సత్పాద - వనజాత యుగళోపా - సనసుధాపానచి - త్తునిఁ బ్రహ్లాదుని ధిక్కరణ మొనర్చి హిరణ్యకశ్యపుఁ _ డును బలికె గగనమున మచ్చా సనమునను గాక రవి యధికము - గను వెలుఁగ వెలుచురా యనె విను ॥ నరహరి ॥ ౮౭

అనుకూలుఁడై గాక - యఖిలావసరములం - దును విరోధంబునను _ అనిలుఁ - డును పీవ వెలుచు మె - ల్లన మత్ప్రతాపాగ్ని - కిని స్వేచ్ఛావశమునను - వహ్నియు వెలుం - గను వెలుచుఁ నాకును _ మదాదేశ - ము నతిక్ర మించియును - దండధరుం - డును బ్రాణులను జంపను-వెలుచు నాగ్రమో_ లను శిర మెత్తఁగను - శక్రుఁడు వెలు - చురు సుర యక్షులును _ గిన్నరహయా _ ననఖగోరగులును - నాకుఁ వెలుతు - రన వెలువ పీ వెందును - నీకేపి దిక్కని లోకపాలు రును - మొనసి విద్వేషుల - య్యును మామకాజ్ఞోల్లం - ఘన సేయ నోడుదు _ రనుపమరోషాగ్ని - కిని జగత్త్రితయమ్ముఁ వికంపం - బునను భీతిల్లఁగ మదుక్తిఁ - వినక సాహంకారివై చెడి - చనఁగనుంటివి దుర్మతీ! యనె ॥ నరహరి ॥ ౮౮

ఘనముగఁ బద్మనా - భుని సన్నుతించెదవు - మును సురేంద్రాదులను - నాల - మునఁ దెగటార్పఁగఁ - దను వీరుఁ డగు నేని - నను నెదిరింప లేకను - దాఁగుట యేల - కనిపింపఁగా రాకను - నాచార్యోక్తి - మును మాన్పి బాలురకును - గైవ ల్యాస - క్తినిఁ బుట్టించి నీవును - వాచాలత్వ - మును జూపి వైకుంఠును - వర్ణింతు వీ - దనుజాన్వయవిధంబును - జెఱచి తివి నీ - చునిఁ గులద్రోహి నినుఁ - ద్రుంచి వంశ - మును నిర్దోషము సేతును - సర్వదిశ - లను జయించినాఁడను - మును నీకు దిక్కెవ్వ - రను నోరిశక్రాదు - లును దిగ్భూపతులెల్ల - నను దిక్కనుచుఁ గొల్తు - రనయము జగములను బలయు తుఁ - డనఁగ వీరుఁడనై మహాబలు - లను జయించితి నెవ్వరి బల - మ్మనను నాడెదో ప్రతిరిపుఁడవై ॥ నరహరి ॥ ౪౯

అను జనకునకు మె - ల్లన వినయంబుతో - డను సుతుఁ డిట్లనెను - దిక్కు - లును గాలంబు నేది - క్కున లేకుండుఁ గల్గు - మును దిగాది యగుచును - నేదిక్కు లేని - జనుల కెది దిక్కయ్యెను - దిక్కదియె నా - కును దండ్రి యీయె డను - గాలాకృతు - లను గల్గి యున్నింటను - గుణాశ్రయుఁ డ - యినవిభుఁ డంతటను - బలేంద్రియ - ఘనప్రభావాత్ముఁ డును - నై వినోద - మున నెల్లజగములను - గల్పించుఁ బా- లన సేయుఁ బొలియించును - అచ్యుతుఁ డన్ని - టను నన్ని రూపులను - నెనసియుండఁగలఁడు - మనసు సమంబుగా - నొనరింపు త్రోవద - ప్పినమానసంబుకం - టెను విరోధులు లేరు నీమన - మును వశంబును జేయు మయ్య - దనుజభావము వీడుమయ్య - విను మెవరు మేటాడరయ్య ॥ నరహరి ॥ ౫౦

జనక! గడియలో - నను భువనము లన్ని - టిని
జయించినవాఁడవు - హృషీ - కనికరమును మనం - బును
గెల్వఁజాలవు - నిసుఁ బీడించును బాయవు - బలవద్ద్వేష -
లును గల రావ్వరును - భిన్నులఁ గావిం- చినజీవతతిలోనను-
నీకు విరోధి - యును లేఁ డొక్కఁడైనను - నసురేంద్ర! పా-
లనసేయు ధీరతను - ఖండింపుము - పెనుకర్మబంధంబును -
వీడుము సంస - రణము నీషణంబులను - నిల్పుము జనా - ర్దను
భక్తి మదిలోనను - నావుడుఁ బ్రహ్లా-దునకు దైత్యవిభుండును-
దునిమిన మడిసెద - నని కంపింపక ఘోరి - చెనటి నిష్ఠురో
క్తు -ల ననుం గుంపింతు చా - వునకుఁ దెంపరివై పదరెదవు -
విను జగన్నాథుండు నాకం - బెను గలండే భూతకోటుల -
కును విభుం డొక్కఁడును లేఁడనె ॥ నరహరి ॥ ౫౧

మును మద్భ్రాతను వధిం - చిన నే వెదకితిఁ బల్మా -
రును నాజనార్దను నీ - విశ్వ - మున లేఁడు మఱి వాఁడెం -
దునఁ గలఁ డోరి రమే- యునువున నుండును నీ - వాఁ డెట్టిజా-
డను నిట కేతెంచును - నుక్కడంచె-దను నిన్ను నావిష్ణును -
బ్రేలెద వీలా - గున వానిబంటుగను - నావిని దైత్యేం -
ద్రునకు భాగవతుండును - ఆనందాశ్రు - కణసిక్తనేత్రుండును-
గోప మింత - యును లేక నిశ్శంకను - నెదఁ మధుసూ -
దనునిఁ దలంచియును - నమస్కార - మొనరించి యిటు లనెను-
వనరాశిఁ గలఁడు గా - డ్పునఁ గలం డంబర - మునఁ గలఁ
డవని వ - హ్నినిఁ గలఁ డంతట - నినశశిగ్రహ తారకములం-
దున దిశల నిశలం బగళ్ళం - దునఁ ద్రిమూర్తులఁ గలఁడు
ప్రణవం - బునఁ గలఁడు విశ్వమున హరి యనె ॥ నర ॥ ౫౨

కలఁడు త్రిలింగవ్య - క్తులయందు నన్నిటఁ - గలఁ
డీశ్వరుఁడు జనక - వెదక - వలసినపని లేదు - తిలకింప నీనాయె -
డలను వెలుఁగును గనుక - నిందుఁ గలఁ డం - దుల లేఁడని
చెప్పను - సంశయింప - వలదు హరి విశ్వంబును - బొంది
యుండెం - దులను భావించినను - దనుజేంద్ర! యి - మ్మూలఁ
గలఁ డీక్రియను - సర్వరూప - ముల హరి గలఁ డంచును -
బ్రహ్లాదుండు - పలుక మహోన్మత్తతను - హరి యెందెం - దు
లను లేఁడని నందను - నలిగి గర్జింప ను - జ్జ్వలనృసింహాకృతి -
నిలఁ జరాచరగర్భ - ముల నన్నిదిశలందు - వెలయు నుద్దండ
ప్రభావము - నలవడఁగ నయ్యవసరంబునఁ - బలికె రక్కస
రేఁడు డింభక - జలజనేత్రుఁడు సర్వమయుఁడని ॥ నర ॥ ౫౩

హరి సర్వాకృతులం ద - లరు నంచుఁ బలికెద - వుర
యీ స్తంభమునను - మఱి క - న్పఱుపఁగలవె నీ - హరిని గిరినిఁ
గను - పఱుపకుండినయంతను - మేదినిపై నీ - శిరముఁ
ద్రుంచివైతును - నీ కాయ పు - సురులు మెక్క నిత్తును -
అయ్యెడ దామో - దరుఁ డడ్డపడ నీకును - వచ్చునె యనఁ -
బరమభాగవతుండును - నైనట్టి శ్రీ - ధరునిజభక్తుండును -
బ్రహ్లాదుండు - మరలఁ దా నిట్లనెను - విరించి మొదలు మఱి
తృణపర్యంతమును - విశ్వాత్ముఁడై - వరలుఁ బరేశుండును -
బరికింప నీ స్తంభాం - తరమున నుండఁడె - గరిమ నీ స్తంభాంత -
ర్గతుఁడై యుండుటకు - నరమ రేమియు లేదు కన్నుల - కఱవు
దీరఁగఁ దోఁచు రూపో - త్కరముగా నన విని మహోగ్ర -
స్ఫురణ శౌర్యోద్ధతిని లేచెను ॥ నరహరి ॥ ౫౪

కినుక గద్దియను డి - గ్గనుఱికి యొరఁబె - ట్టినఖడ్గంబుఁ
గేలను - దాల్చి - యును ఝళిపించుచు - గుణనిధి యగు
ప్రహ్లా - దుని ధిక్కరించుచును - డింభక మూఢ - వినరా నీవిష్ణుం
డును - జగద్రూపుఁ - డని భాషించెద వైనను-నిందుఁ గలఁడే -
యని మదోద్రేకంబును - మించఁగా నా - దనుజేంద్రుఁ డఱ
చేతను - వ్రేసెను విశ్వ - జనదృగ్భీషణదంభమును - నత్యు
గ్రని - స్వనితప్రభాశుంభమును - స్తంభంబును - ఘనరోషా
వేశమునను - మహాద్భుతత్వ - మున విస్రంభమనను - బెను
హుంకరించి బా - లుని ధిక్కరించి యిం - దునఁ జూపుమని
కన - త్కనకకంకణాని - స్వనములుఁ నిండార దిగ్వా - రణ
రదనభేదనబలిష్ఠం - బు నగుహస్తంబునను వ్రేసిన - ధ్వనికి
దశదిశ లదరె నప్పుడు ॥ నరహరి ॥ ౫౫

మఱి చిట్లిపడి మిణుం - గురులు చిటచిటల దు - ర్భరమై
పెటపెటపగిలి - మహా - త్తరవిపుల స్తంభాం - తరమునఁ బ్రళ
యావ - సరమునఁ బొడమి మిగిలి - మహాజంఝా - మరుదుపే
తముగను - బలాహకా - ఘరహి నిర్గతముగను - పరిసాంద్ర
ని - ష్ఠురదుస్సహంబుగను - నిర్ఘాతని - కరనిస్స్వానాభంబును -
నగుచు భయంకరఛటచ్ఛటలంచును - స్ఫుటస్ఫుటో - గ్రరత
పుంజంబులును - దుర్వారబం - ధురముగ నెగయుచును -
భూవ్యోమము - హారాంతరాళంబును - నిరవకాశ మొనర్చి -
నిండినఁగని చె - చ్చెర దోదూయమాన - చిత్తులై వెఱగంది -
పరవశతను విరించివాసవ - వరుణవహ్ని పవనముఖచరా - చర
జగద్బ్రహ్మాండభాండము - నెఱఁ బగిలి పరిస్ఫోటితంబుగ ॥నర॥

కలితపంకేజయు - గళనికాశసము - జ్వలచక్రచాప
హల - కులిశజలచరరేఖాంకి - తలసత్పాదతలుం - డలఘుది
గిభప్రబల - శుండాదండ - లలితోరుస్తంభుండును - ఘణం
ఘణా - తులమణికింకిణులును - మొరయుకాంచీ - వలయవల
యితంబును - పీతాంబరము - వెలయుకటితటుండును - నిమ్న
గావ - ర్తులనాభీవివరుండును - ముష్టిపరిమి - తలసన్మధ్యుం
డును - గరళ - శకులా - చలపమువిశాలోరుండును - నిశాట
ధై - ర్యలతాలవిత్రుండును - ఖలదనుజేంద్రోర - స్థలవిభేదన
మహో- జ్జ్వలలాంగూలుండు ని - శ్చలధైర్యధుర్యుఁడు - కులిశ
నిభము లరాతిగహన - జ్వలనకీలాభములు సుజనా - వలి
దృగైకచకోరశశి రే - ఖలన వెలిఁగెడునిశితనఖరుఁడు ॥ నర ॥

తనరుశంఖసుద - ర్శనగదాప్రముఖసా - ధనసమాకలి
తుండును - నుత్తుం - గనగేంద్రకఠినశృం - గనిభవీరోగ్రగరం-
జనభుజార్గళుండును - నవమంజీర - మణిపుంజరాజితుఁడు -
కేయూరకం - కణహారకిరీటుఁడు - హారాదిభూ - షణసదలం
కృతుఁడు - త్రివళీయుత - ఘనకంబుకంధరుఁడు - రోషావేశ -
మునఁ జలితాధరుఁడు - విద్యుల్లతా - ఘునిభదంష్ట్రాంకురుఁడు-
కాలహాలతా - శనకీలాభరసజ్ఞుఁడు - మేరుమంద - రనగగుహా
సమాస్యుఁడు - ఘననాశికాభీలాం - తనిబిడనిశ్వాసా - త్యని
లోష్ణతప్తమై - వనిరాశిఘూర్ణిల్ల - నొనరఁబూర్వాద్రిసల్లలితా-
రుణసుమండలసదృశపృథులో - చనము లలర బలారిధనురుప-
మనవభ్రూభయదముఖ మడరఁగ ॥ నరహరి ॥ గీ॥

లలితగండశైల - తులితనిష్ఠురగండ - స్థలయుగళోన్న
తుండు - మహో - జ్జ్వలసంధ్యారుణధాతు - జలదమాలిక
నిభా - మలసటాచ్ఛటయుతుండు - శంఖాభని - శ్చలితోర్ధ్వ
కర్ణుండును - సుధాంభోధి - చలితకల్లోలుండును - శీకరాకృ -
తిలసత్కేసరుండును - శశిమయూఖ - విలసద్దారకచుండును -
గర్జానినద - దళితదిగ్గజకర్ణుండును - దుర్లోక్యధ-వళనగ దేహుం
డును - ఘోరాసుర - కులగర్వాపహుండును - బ్రహ్మాదనుత -
విలసచ్చరితుండును - బలుఁడు హేమకశ్య - పవధార్థమై
ని - స్తులవీరరసమహా - త్కలితప్రభావుండై - యలఘుతరనర
సింహదేవుం - డావిర్భవించినఁ గన్గొని - యిలను నరమూర్తి
గా దిది కే - వలము హరిమూర్తి గా దిది యని ॥ నరహరి ॥

నరరూపమును గే - సరిరూప మున్నది - హరిమాయా
రచిత మిది - యగును - వరభక్తుం డాడిన - కరణి సర్వగతత్వ -
మిరవొందఁగా నారిదిఁ - దలఁచి యిందు - నరసింహరూపమును -
దాల్చియును శ్రీ - ధరుఁడు శిక్షింపఁగను - విచ్చేసెనీ - హరి
చేత మృతి నాకును - సిద్ధంబైనఁ - బోరి మద్విక్రమంబును -
బెంపును సురలం - దఱు వీక్షింపఁ జరింతును - హరింతును -
హరి నాజిని జయింతును - నటంచు ని - ర్భరదృఢచిత్తంబు
నను - గద యెత్తి త - త్తరమున నార్చుచును - బరువడి
భయదకే - సరిని డగ్గఱుమత్త - కరిచందమున నిశా - చర
కుంజరుండును - వరలునరసింహ దేవునకు నె - దురుగ నడచి
తదీయ మగుది - వ్యరుచి సన్నిధి దావశిఖ డ - గ్గఱినఖద్యో
తంబువడువున ॥ నరహరి ౬౦

కనలుచుఁ గ ర్తవ్యా - క ర్తవ్యమూఢుఁడు - గను నుండ
నిర్గతమై - న దీ - ప్తిని యుగాంతకాల - మున మున్న జాండ
భాం - డనిరోధకాత్మకమై - యున్న తమిస్ర - మును లోక
త్రయంబును - గలిగించు వే - ళను సాత్త్వికతేజమును - నిధిగా
నొ - ప్పినవిష్ణునికడను - దీపించు నె - వను తామసుల నేర్పును-
జననాయక - దనుజేంద్రుఁ డంతటను - నుద్దండంబు - గను
గదాదండంబును - ద్రిప్పుచు ద్రే - సిన నరసింహుండును - నహిఁ
డేగ ప - ట్టినగతి వానిం బట్టెను - దనుజేంద్రుఁ డంత నే -
ర్పునఁ దప్పించుకొని - కినుక గాఢబలం - బునఁ గుప్పించి
నాక - మున కెగసి పక్షికులరాజచ - రణాగళితభుజగంబు
లెఱుఁగున - మొనసి వేగమ తలఁగియు న్నిజ - ఘనభుజాటో
పం బెలర్పఁగ ॥ నరహరి ॥ ౬౧

సురవైరియుగ్రత - నరసింహుఁ డాఁకిన - వెఱచెనంచుఁ
దలంచఁగా - సురని - కరము లంబుదవి - సరముల డాఁగి
నృ - హరి జయము భజించఁగా - నిరీక్షింపఁ - గను రణదక్షు
తను - అసివర్మంబు - లును దాల్చి చలమునను - భూనభంబు-
లను విచిత్రముగను - లంఘనని - పుణత లాఘవంబులను -
గరాళివ - దనుఁడై యాకసమునను - సాళువమురీ - తిని సంచ
రింపఁగను - బంచాస్యపం - జనితాగ్నికీలలును - సందు లేకుం-
డను భూనభం బెల్లను - బెనుగ్రమ్మఁగ దంష్ట్రా - భీలధగధగ
దీ - ప్తి నసురేంద్రుకన్ను - లును నంధములు గాఁగ - ఘన
తటిన్నిభనఖరుచులు నె - క్కొన సటల్ ఝుళిపించి గర్జన -
మునఁ గనుల్ సారించి వడిఁ జెం - గున నను దైత్యుని నొడిసి
పట్టెను ॥ నరహరి ॥ ౬౨

పరకుసేయక యతి - త్వరగతిఁ బన్నగే - శ్వరుఁడు మూషకంబును - నోడయు - తెఱఁగున నరకే - సరి పట్టుకొన నిశా - చరుఁడు ప్రాణభయంబును - గదురఁగ లోన - ఖరతర జిహ్వనకుఁ- బాలితభక్త - వరనికరాంహ్వానకు - నంతట ఖగే: శ్వరుఁ డహిం జీల్చుటకుఁ - గైకొన్న ట్లి - సురుని నూరుల కడకుఁ - జేర్చి నఖని - సరముల గ్రుచ్చి ఘనకు - లిశదృఢ తను - సురరాడగ్ని యమకు - బేరాదిని - ర్జరసాధుజనకంటకు- హేమకశిపు - నురముఁ జించె ఘనకు - ఠాఠాభన - ఖరముల నంతంతకు - మజ్జె రుధిరము నిరం - తరముగ వర్షింప - ఖర తరనాసికో - దరముల ద్రవచ్చెను - గురుతరాంత్రౌఘములు గొని కం - ధరమునను మాలలుగఁ జేసెను - దఱిగివైచెను మాంసఖండము - లురుగతుల దుష్టాత్ము నప్పుడు ॥ నరహరి ॥

ఒనరంగ నరరూప - మును దగుమృగరూప - మును గాని నరసింహుఁడై - రాత్రి - యును దివంబును గాకుం - డిన సంధ్యాసమయము - నను మహోగ్రరంహుఁడై - యంతరంగ- మును బాహ్యమును గాకను - సభాద్వార - మున భూనభం బులును - గానియూరు - లను ప్రాణసహితంబును - ప్రాణ రహిత - మును గాని నఖములను - జగత్కంట - కుని బాధిత సుజను - వధించె ద - హనకీలాననుండును - గరాళభీ - షణ దీర్ఘజిహ్వుండును - శోణితపంకా - రుణితకేసరుండును - ఘన కుంభికుంభద - ళన మొనర్చి యేతెం - చినమృగేంద్రుఁబోలి- దనుజేంద్రహృదయభే - దన మొనర్పఁగఁ దద్రుధిరమం - టిన నఖంబులు సాంధ్యరాగా - రుణిమ శశిరేఖలపోలుపుఁ గనె ననిమిషావళిమనము లలరఁగ ॥ నరహరి ॥ ౬౪

తనకష్టైదుర నాయు - ధంబులు గొని రణం - బునకుఁ
దత్తరంబున - నెదు - ర్కొనురక్కసులఁ జెక్కం - డ్రను
జక్రాదిసా - ధనముల నాసమయమున - నుక్కడగిం - చెను
సాహస్రంబులను - రణసంరంభ - మును జాలించి యంతను -
దృష్టి జేప - మును భీకరంబుగను - సభాసింహా - సనమునఁ
గూర్చుండెను - మహోగ్రుండ - యిననరసింహుండును - గరా
శవ - దనముతో నొప్పఁగను - వెలిచిరి సుర - గణములు
వీక్షింపను - ఖగనాగచా - రణసిద్ధాదులందును - విను మొక
రును సమీ - పింపరు భీతిసురాం - గనలు కుసుమవర్ష - మును
గురియించిరి - నొనర మింటను సురవిమానము - లును
హాయాస్యులగాన మచ్చర - పణఁతు లాటలు దివ్యభేరీ -
ధ్వనులు దిక్కులం బిక్కటిల్లెను ॥ నరహరి ॥ ౬౫

హరివిధీంద్రపుర - స్సరు లగువిబుధకి - న్నరపన్నగ
సిద్ధులు - విద్యా - ధరగంధర్వకిం - పురుషచారణయక్ష -
గరుడసాధ్యముఖ్యులు - ప్రజాపతులు - నరహరిసుదర్శనము -
నొనర్పఁగ - నరుదెంచి కరయుగము - ముకుళించి భ - క్తిరతి
నమస్కారముఁ - గావించి శ్రీ - నరసింహునిఁ బ్రియము -
మోదమ్ముగ - దుర నుతించునవసరము - నం దజేంద్రా -
మరముఖులు స్తవము - నొనర్పఁ దొ - డరి సమస్తవిశ్వము -
ఘనలీలాచా - తురిఁ గల్పించి రక్షణము - హర మొనర్చు
మహత్తరశ - క్తికిని నిత్య - పరిపూర్ణజ్యోతికిఁ - బావనమూర్తికి-
నిరుపమానందునకు నక్షర - పురుషున కనాదిమధ్యాంతున -
కరుణాకోటివిలాసయుతునకుఁ - బరమునకు నన్నుతు లొనర్చిరి
॥ నరహరి ॥ ౬౬

నరసింహా నీక్రియ - హరవిధీంద్రముఖ - సురలు వేలు
వేలును - బెక్కు - తెఱంగుల వినుతించి - తీవ్రరోషము
మాన్పు - తెరు వేమియును లేకను - నృసింహా డ - గ్గఱ
జేర నిందిరను - బిలిచి నీవు - హరి కిల్లాల వాటను - హరి
సేవాత - త్వరచిత్త వగు దీవును - హరిరోషాప - హర
మొనర్పు మన్నను - రమయుఁ బ్రాణే - శ్వరుని డాయంగను -
నరిగి ప్రళ - యరవిబింబ మగుచు - గాని ముఖము - వరశశి
బింబమును - గాదు చూడ్కి - స్ఫురదగ్ని సంఘమును - బరి
కింప నగుఁగాని - పరమప్రసాదభా - సురము గాదు వీరో - గ్ర
రుచి నొప్పునే కాని - సరసకరుణాస్ఫూ - ర్తి గాదు - స్ఫురణభీ
షణదంష్ట్ర తీక్ష్ణరు - చిరము గప్పెడుఁగాని మంజుల - దరహా
సితవదనంబు గాదనె ॥ నరహరి ॥ ౬౭

ఖరనఖనృసింహావి - గ్రహ మగుఁగాని సుం - దరవిగ్ర
హము గాదని - స్త్రీలు - పరికింప రాదని - హరిచేత మున్ను
వి - న్నది కన్నదియు లేదని - యిటుల నృకే - సరిభీషరూ
పంబును - వీక్షింప నిం - దిరతోఁ బల్కుచున్నను - శంకించి శాం
తరతుఁ డైనమీఁదను - బ్రసన్నత్వ - మురుఘటించు నంచును -
నున్నంతను - బరమేష్ఠి యయ్యెడను - దేవునిరోషో - త్కరము
నివారింపను - శక్యము గా ది - తరుల కంచును ద్వరను -
బ్రహ్లాదు డ - గ్గఱకుఁ జేరి నీవును - నరహరికోపని - స్ఫురణ
మాన్పు మనఁ - బరమభాగవతశే - ఖరుఁడైన బాలుఁడు - కర
ములఁ ముకుళించి మెల్లన - నరిగి వినయవివేకముల శ్రీ -
హరికి సాష్టాంగప్రణామము - లాచరించిన భక్తవశుఁడగు
॥ నరహరి ॥ ౬౮

పరమదయాళుఁడు - హరి భక్తబాంధవుఁ - డరయ
నల్పుఁడ స్తుతిని - సేతు - వెఱపు లేక నే - నెఱిఁగినంత నీ -
స్మరణచే సద్గతినిఁ - బొందఁగలఁ డి - ద్ధరను బాలిశుఁడైనను.
సకలవిశ్వం - భర! నీయాజ్ఞ శిరమునను - బూని సేయు -
గరుడసిద్ధసాధ్యులును - బ్రహ్మాదిని - ర్జరులు భీతిచేతను -
గాంచి నీభీ - కరరూపమును డాయను - వెఱగందుచుం - డిరి
మాను రోషంబును - నీచారుసుం - దరవిగ్రహంబులను - మం
గళశుభ - కరములు గా కెందును - బరికింపఁగా భీతి - కర
ములు గావు భీ - కరముగ ముల్లోక - కంటకుఁ డగునిశా -
చరునిఁ ద్రుంచితి సాధుమతులకు - నరుస మొదవెను; దీఱ నీ
వవ - తరణమొందినకార్య మిఁక స - త్కరుణ శాంతాకృతినిఁ
బొందుము ॥నరహరి॥ ౭౧

ఖరదంష్ట్రాభ్రుకుటిభీ - కరసటనఖయు ను - ద్ధురగర్జ
నారావయు - దీర్ఘ - తరాంత్రమాలికయు - నరుణాక్షియు
నగునీ - యురునరసింహాకృతియు - వీక్షించి నే - వెఱవ దు
ర్వారంబును - సంసారాగ్ని - ఖరమునకుఁ వెఱతును - భవ
దంఘ్రిభ - క్తునిఁగాఁ జేయవె నన్నును - మ్రొక్కెద శ్రీ-
ధర! సర్వయోనులను - బుట్టుచు సుఖ - విరతిదుఃఖరతంబును-
గలిగి కళే - బరమునఁ బ్రేమంబునను - బటుమోహా-తురతఁ
భ్రమించుచును - నున్ననాకుఁ - బరదేవతవు నీవును - బర
మాప్తుఁడవు చూడ - బ్రహ్మగీతములనఁ - గర మొప్పునీస -
చ్చరితంబు లెల్లను - మఱి పఠింపుచు రాగసుఖములఁ - దఱిగి
సంసృతి దొలఁగ యుష్మ - చ్చరణదాసులఁ జేరి కొలిచెదఁ -
బరమపురుష! మహానుభావా! ॥ నర ॥ ౭౨

అనఘాత్మ నీయంశ - మైనవానికి నీద - యను గాలం
బుచేతను - ప్రేరే - పణచేఁ గర్మమయ- మును ప్రధానలింగ-
మును నైనచిత్తంబును - మాయ సృజిం - చునవిద్యాన్వితం
బును - నైనవికార - మున వేదకర్మంబును - సంసృతిమయ -
మును నైనయామనరంబును - నిను సేవింప - క నియమించి
తరింపను - భక్తుఁ డొక్కం - డును లేఁడు నీప్రజ్ఞను - నిర్జిత
బుద్ధి - గుణుఁడవు నీవల్లను - వశకార్యసా - ధనశక్తికాలం
బును - మాయను గూడి - యును షోడశసంజ్ఞను - నొనరు
వికారం బ - యినసంసారచక్ర - మును జేయుచుండుఁ గా -
వున సంసరణతాపా - త్యనలసంతప్తమతి నగువ - న్నను
దయఁగా రక్షింపు సంపద - లను జిరాయువు సౌఖ్య మెల్లరు -
జనులు గోరుదు రవి సతం బని ॥ నర ॥ ౭౩

పరఁగుత్రిలోకాధి - పత్యము మాతండ్రి - స్థిరమని
దురహంకారుఁడై - నిమిషాం - తరమున మడిసె దే - వర
వారిచే నేఁడు - ధరను నిరాధారుఁడై - కావున లోకో -
త్తరవైభవంబులును - జీవితము ల - స్థిరమని యెఱుఁగఁ
దగును - గాలాకృతుఁడౌ - నురుక్రమునిచేతను - దళితము
లగుఁ - దిరము గా వెవ్వియును - వేయేల ని - తర మే
నొల్ల నిఁకను - నేను నీకిం - కరుఁడనై సేవింతును - విరించి
శం - కరశక్రాదులకైనను - హరి నీమహోద్దామ - కరముచే
నభయము - గరుణసేయవు నే న - సురడింభకుండను - మఱి
యుఁ దామసకులభవుండను-గురురజోగుణయుతుఁడ మామక-
శిరముపై నీకరసరోజముఁ - గరుణఁజేర్పుట యెంతచిత్రము
॥ నరహరి ॥ ౭౪

పరికింప సుజనులౌ - వనజభవాదులం - దురు దుర్మ్రతు
లము మాయందు - సేవా - పరత స్వపక్షవి - పక్షముల్ లేక
ని - ర్జరతరుగతిఁ జెన్నొందు - చుఁ సత్ఫలో - త్కరము
లొసంగుచును - నుందువు దుస్సం - సరణకూపములోనను -
గూలెడిమూఢా - సురులం దే నొక్కండను - నారదమునీ -
శ్వరుని కటాక్షముననను - నెఱింగి నీ - కరుణకుఁ బాత్రుండను-
నైతి నన్నుఁ - బరిపాలించి ప్రేమను - సుజ్జనకునిఁ-బొరిగొంట
నాయందును - గరుణఁజూపు - నెఱిగాదు దుష్టులను - బరి
మార్చి శిష్టులఁ - బరిపాలించుట నీకు - గరిమ నైజగుణంబు -
గుణవిశ్వమును నీవు - బొరిబొరిఁ సృజియించియుఁ దదం -
తరనివాసుఁడ వగుచు హేతు - స్ఫురణభూత గుణాన్వితుఁడ
వై - హరణపోషణములను జేతువు ॥ నరహరి ॥ ౨౫

మును సదసత్కా - రణకార్యాత్మకం - బు నగువిశ్వ
మునకు - సత్కా - రణము నీవ నీ - మాయను నేను వాఁ-
డనుబుద్ధి మూఢునకుఁ- దోచునీకం- బెను వేఱొం డెద్దియును-
లేదు బీజ - మున వస్తుమాత్రంబును - భూతసాత్మ్యం- బును
మహీజమునందును - నీలత్వాది - ఘనవర్ణములు గల్గును -
నాచందంబు - నను విశ్వంబునకును - నీయందు జ- ననప్రభా
స్థితులును - నాశంబుఁ గ - ల్గును; నీ ప్రపంచంబును - నీలో
నిల్పు - కొని మఱి ప్రళయవేళను - వనరాశిఁ గుండలిం -
ద్రునిపై శయనించి -యును నిద్రిక్కయుండవ - య్యు నిజ
సుఖానుభూ - తిని సుషుప్తనిచంద మొప్పఁగ - నెనసి యోగ
నిమీలితాక్షుల - మొనసి నిశ్చలనిర్మలనిరం - జనసుపూర్ణ
సమాధి నుందువు ॥ నరహరి ॥ ౨౬

దురుక్తులు - పనిగ వినువీనులును నాసిక - యును సుగంధం
బులకుఁ బోవదు - తనువుతోనిటు వశము గాకయ ॥ నర ॥

కలత నిట్లింద్రియ - ములఁ జిక్కి స్వపరాంగ - ముల
హితాహితబుద్ధులన్ - గనుచు - సలుపుచు జన్మనా - శము
లొందుసంసార - జలరాశిగర్భమునన్ - జేరి విలీన - ములగు
లోకంబులను - బ్రోచుట యి - మ్మల సృష్టిక్రమంబును -
నడపునీకు - నలఘుకర్తవ్యంబును - భవత్సేవ - కుల మైన
మాబోంట్లను - నీప్రియభ - క్తు లగునింద్రాదులను - బాలిం
చుట - యెలమిఁ గర్తవ్యంబును - భవత్పదా - ర్చనచింతన
సుధను - గ్రోలెడునే నీ - మలినసంసరణం బను - నలఘువైత
రణిభి - న్నాత్ములై తావకా - మలగుణస్తుతివిము - ఖులునై
యిహాసుఖభావ - ములను మోక్షము నొందనేరని - ఖలుల
దుష్పథరతుల మూఢా - త్ములను గని యెద వగతు వారల -
చెలిమిఁ గోరను నిన్ను మఱువను ॥ నరహరి ॥ ౭౯

మునులు స్వకామవి - ముఖులై విజనతలం - బునఁ
దపంబొనరింతురు - కామ - మును నైపకుండు స - జ్జనులు
నీకంటె శ - రణము లేదని నుతింతురు - కొందఱు లోక -
మున రిత్తసౌఖ్యంబును - బహుపక్షమై - ధునముఖసుఖములను -
గాంక్షించుచుఁ - దనియక కడపటను - దుఃఖింతురు - ఘన
మైననీకృపను - నిష్కాములై - నినుఁ గొల్తురు సుజనులును -
మౌనవ్రత - మును జపతపములును - నిజధర్మకీ - ర్తనశ్రుత
నుతములును - గైవల్యకా - రణము లింద్రియజయంబును -
విను లేనివారికి - విపులసుఖార్థములై - తనరువారికి జీ - వన

సదుపాయమై - కనఁగ డాంబికులకును వార్తా - కరములై
సఫలములు గాకుం - డును భవద్భక్తివిజ్ఞానం - బును ఘటిం
పదు లోకరక్షక ॥ నర ॥ ౮౦

అగుణుఁడ వరూపుఁడ - వగునీకు బీజాంకు - రగతిఁ
గారణకార్యము - లయ్యె - సగుణసదసద్రూప - యుగము
వికాసము - లగుసాకారద్వయము - నందు భక్తి - మిగుల
యోగంబునను - ధీమంతు లిం - పుగ మథనంబునను - దారు
వునం ద - గ్నిఁ గనుంగొన్నట్లుగను - శ్రీహరినిఁ జూ - డఁ
గనుంగొందురు వేడ్కను - భూతపంచ - కగుణతన్మాత్రలును -
ప్రాణహృషీ - కగణమతిహంకృతులును - ధీచిత్తము - లగుదు
వీ వనిశంబును - సగుణాభిమానులై - యొగి భవనాశంబు -
లఁగనుచుఁ దుదిమొద - లు గననివిబుధులు ని - న్నగణితో
పాధిరహితుఁ డని యె - ఱుఁగరు నీతత్త్వం బెఱుఁగుసా - ధు
గణములు సర్వమును విడి వి - శ్వగురుఁడని సేవింత్రు నిను
హరి ॥ నర ॥ ౮౧

ఎలమి నీకు మ్రొక్కఁ - డేని నీదివ్యనుం - గళనుతి
సేయఁడేని - నీయం - ఘ్రులను నిర్మలచిత్త - జలజుఁడై చిం
తించి - వలచి చిక్కఁడేని - నీయధీన - ములుగ నెల్లపనులను -
సేయఁడేని - నలఘుసంతోషమునను - వినఁడేని నీక - థలను
జెవులారను - నీకు సేవ - సలుపఁడేని నాత్మను - మోదముఁ
జెందఁ - గలఁడే యోగియైనను - మహాజ్ఞాన - కలితవేది
యైనను - గాన నీదా - నలఘుతరదాస్యంబును - లలి దయ
సేయు మి - ట్టుల నని ప్రణతుఁడై - యొలమిఁ బ్రహ్లాదుఁడు -

పలుకుసద్వచనం - బులకు మెచ్చియు నిర్గుణుండై - యలుక
మాని వచించె నీచరి - తలకు నానందించితిని నీ - కలఘు
భద్రము లొదవుగావుత ॥ నరహరి ॥ ౮౨

నీమనోభీష్టము - లేమేమొ కోరుము - ప్రేమ నిచ్చెద
నీకును - సకల - కామప్రదుండ న - న్నిమహిఁ గనువారి - కే
ముక్తి చేకూఱును - సమస్తసు - ధీమునీశ్వరు లెల్లను - భక్తి
యెలర్పఁ - గామార్థ మిమ్మంచును - గోరెద రిత్తు - నేమైన
మఱి నీకును - నంచుఁ బరం - ధాముఁ డసురనందను - మనో
భీష్ట - మేమొ తెలియుటకును - వచింప ని - ష్కాముఁ డగు
భక్తుండును - గావున మదిఁ - గామము భావింపను - భక్తికి
విఘ్న - స్తోమమని తలంచుచును - దామఱి యిట్లనె - స్వామి
నే నుత్పత్తి - యై మన్నదాదిగాఁ - గామ్యానుభవసక్తి - చే
ముదముఁగనునాకు వరములఁ - బ్రేమ నిచ్చెదనంచుఁ బలికితి-
వేమి గోరుదుఁ దలఁప సంసృతి - యే మనోబంధకారణ మగు
॥ నరహరి ॥ ౮౩

నెఱి కామాదులకు - వెఱచి నోమాసక్తి - పరుఁడనై
మేలుకొలుకు - భక్తి - స్ఫురణత భవదీయ - కరుణ నొందితిఁ
గళే - బరహృషీకంబులకు - ధృతి మతిప్రాణ - పరమధర్మము
లును - లక్ష్మియు సత్య - స్ఫురణ తేజంబులును - హీనంబు లి-
ద్ధర భటసంఘములును - నర్థకామా - తురత నరేంద్రులను -
సేవించును - నరవరుల్ భటులకును - నర్థము లిచ్చె - దరు నా
కీవిధమునను - గామము లేదు - వరదుఁ డయ్యెద వైనను -
నిష్కామత్వ - వర మిమ్ము దయతోడను - సరవి నిష్కాముఁడు -

హరితుల్యవిభవుఁడు - నరసింహపరమాత్మ - పురుషోత్తమా
యని - హరికిఁ గ్రమ్మఱ నార్తి మ్రొక్కిన - హరియుఁ బ్రహ్లా
దునకు నిట్లనెఁ - బరఁగు నీవంటివిజ్ఞానులు - వరము లెవ్వియుఁ
గోర రొల్లరు ॥ నరహరి ॥ ౨౪

విను ప్రహ్లాద నీవు - దనుజేంద్రభర్తవై - మను మన్వం
తర మెల్లను - లోక - మున సమస్తభోగ - మును భోగిం
పుచు సాధు - జనసమ్మతముతోడను - సద్బుద్ధితో - విను
మచ్చరితములను - భూతాళియం - దునఁ బూర్ణుఁడగునన్నును -
నీశ్వరునాత్మ - నునిచి కర్మచయంబును - దునిమి యీశా -
ర్పణముగఁ బూజలను - సల్పుము ; భోగ - మున వినాశముఁ
జెందును - బుణ్యము; పాప - మును బోవు వ్రతములను -
మఱి యాపిమ్మ - టను గాలరయమునను - గాయము విడిచి-
యును లోకాతీతంబును - ఘనదశదిక్పూర్ణ - మును నైన
కీర్తితో - డను ముక్తబంధుఁడవై - ననుఁ జేరవచ్చెద -వనుచు
నాయవతారగీతము - వినినఁ జదివిన నరుఁడు భవనాశనరహి
తుఁడై మోక్షమొందెడు - ననినఁ బ్రహ్లాదుఁ డిట్లనియెను
॥ నరహరి ॥ ౨౫

హరి! కిటివై సో - దరు హిరణ్యాక్షునిఁ - బరిమార్చినఁ
బగను - వైరి - తెఱఁగున లోకేశుఁ - బరము ననంతు ని -
న్నెఱుఁగక దాడిగను - నీదాసునకు - దురపకారముఁ జేసెను -
నీచే నతఁడు - పరలోకమును జెందెను - సమస్తదో - షరహి
తుండుగాఁగను - కేశవ! యిదె - వర మిమ్ము వేడెదను -
నావుడు వనజో - దరుఁ డిట్లానతి యిచ్చెను- నీవు నాస - త్క

రణ నొందుటచేతను - నీముయ్యేడు - తరములవా రెల్లను -
గృతార్థు లౌ - దురు విజ్ఞానంబునను - నురుసూక్ష్మభూతని -
కరములలో నిష్కామ - పరతంత్రు లగుచు నె - వ్వరు సేవిం
తురో వారు - గరిమతో మద్భక్తు లగుదురు - పరమయో
గ్యుఁడ వీవు తండ్రికిఁ - బరజగత్క్రియ లొనర్పుము మ - త్వర
ముగా సుగతి నతఁ డొందును ॥ నరహరి ॥ ౨౬

నరసింహదేవుఁ డా - నతి యొసంగిన నామో - దరతిఁ
బ్రహ్లాదుండును - దనుజే - శ్వరునకుఁ గ్రమముగఁ - బరలోక,
క్రియలు శ్రీ - హరిసమర్పణముగను - జేసెను ధరా - మర
సమ్మతంబుగను - నభిషిక్తుఁడై - యిరవొందె నయ్యేడను -
విరించి ని - ర్జరయుతుఁడై వేడ్కను - వినుతింప శ్రీ - నరసిం
హదేవుండును - దైత్యులకు ని - త్తెఱఁగున వరములను -
నీ వీయకు - మురగుల కమృతంబును - నిడినట్లనె - గరిమ
బ్రహ్మాదులును - సేవింపఁగ - నరహరి యంతటను - మఱి
తిరోహితుఁడైనఁ - దిరముగఁ బ్రహ్లాదు - వరదైత్యసామ్రాజ్య -
పతిగాఁ బట్టముఁగట్టి - వరుసగా నాశీర్వదించిన - హరునకును
బ్రణమిల్లి బ్రహ్మకు - శరణుచేసి సురేంద్రముఖని - ర్జరుల
కెల్లను నతు లొనర్చెను ॥ నరహరి ॥ ౨౭

సరసీజాసనుని ముం - దఱ నిడుకొని తమమం - దిర
ముల కేగుదెంచి - రమరు - లరుదుగఁ బంకజో - దరుపార్శ్వ
చరు లిరు - వుర మునులు శపించి - నందున నాది - హరివి
రోధు లగుచును - బుట్టినఁ గిటి - నరసింహమూర్తులను -
వారలఁ జంపి - మఱి ద్వితీయభవమునను - రావణుఁ దద -

నరజుని రామాఖ్యను - ద్రుంచెను, వెండి - ధర శిశుపాలుఁ గుజను - దంతవక్త్రు - నురుమాడెఁ గృష్ణాఖ్యను _ నిమ్మాడ్కి-ని - ధర జన్మత్రయముననను - వైరము మీఱి - హరిచేఁ జచ్చి వారును - దురితవిముక్తులై - హరిఁ బొందిరని శుకుఁ - డరయఁ బరీక్షిన్మ - హారాజునకుఁ జెప్పెఁ - బరఁగ నీకథ వినినఁ జదివిన - నరులకును మే లొసఁగు భద్రకు - ధరనివాసుఁడు హరియు; శేషయ - గురుకృపఁ బీర్దాసు నుడివెను ॥ నర ॥

ఓం శాంతి శాంతి శాంతిః

సర్వము సమాప్తము.

# మఙ్గళమ్

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు.

కాలే వర్షతు పర్జన్యః
పృథివీసస్యశాలినీ
దేశోఽయం క్షోభరహితో
బ్రాహ్మణా స్సన్తు నిర్భయాః.
అపుత్రాః పుత్రిణ స్సన్తు
పుత్రిణ స్సన్తు పౌత్రిణః
అధనా స్సధనా స్సన్తు
జీవన్తు శరదాం శతమ్.
మఙ్గళం కోసలేన్ద్రాయ
మహనీయగుణాత్మనే
చక్రవర్తితనూజాయ
సార్వభౌమాయ మఙ్గళమ్.

శ్రీ శ్రీ శ్రీ

గుంటూరు, చంద్రికా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడెను.

ఓమ్

# శ్రీ ఫిరోజి ఋషి గ్రంథావళి


పరిష్కర్త :

శ్రీ మహావాది వేంకటరత్నము, బి. ఏ.





ప్రచురణకర్తలు :

వేంకటేశ్వర అండ్ కో., గుంటూరు

౧౯౪౫

మూల్యము ౫ రూపాయలు

ఈ గ్రంథావళికి సంబంధించిన
విక్రయ ప్రచురణాది సర్వాధికారములు
సత్తైనపల్లి శ్రీ ఫిరోజి ఋషి మఠాధిపతులగు
శ్రీ పులహరి ఫిరోజిబాబుగారివి

ప్రథమ ముద్రణము
తారణ - మాఘము

శ్రీ ఈమని భీమశంకరముగారిచే
గుంటూరు, చంద్రికా ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

# శ్రీ ఫిరోజి ఋషి గ్రంథావళి ముద్రణమునకు ద్రవ్యసాహాయ్య మొనర్చినదాతలు

## మహారాజపోషకులు

౧. శ్రీ పొట్టి వీరేశముగారు, మాదల

౨. ,, దూపగుంట్ల లక్ష్మయ్యగారు, సత్తెనపల్లి

౩. ,, కూరపాటి రాఘవయ్యగారు, ,,

౪. ,, కూరపాటి లక్ష్మికోటిగారు, ,,

౫. ,, వేంపాటి లింగయ్యగారు, ఇరుకుపాలెము

౬. ,, ఇంటూరి సీతయ్యగారు, ఇరుకుపాలెము

## ప్రధానపోషకులు

౧. శ్రీ ఆత్మకూరి బాపయ్యగారు, సత్తెనపల్లి

౨. ,, అన్నం వేంకటనారాయణసోదరులు, సత్తెనపల్లి

౩. ,, కనుమూరు రామస్వామిగారు, నార్నెపాడు

౪. ,, జాగా బుచ్చిరెడ్డిగారు, కొమిరెపూడి

౫. ,, వేంపాటి కోటిరెడ్డిగారు, పెదమక్కెన

## పోషకులు

౧. శ్రీ మూర్తి సాంబయ్యగారు, సత్తెనపల్లి

౨. ,, బోళ్ళ రామానుజయ్యగారు, తెనాలి

౩. ,, త్రిపురమల్లు ఆంజనేయులుగారు, నందిగామ